# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూన్ 1961

సంపుటము 38 : : సంచిక 6

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1961





## గమనిక

ప్రచురింపబడని రచనలు తిరిగి పంపగోరువారు తగినన్ని తపాలాబిళ్ళలు జతపరచవలెను. రచయితలు తమ చిరునామా మార్పులు వెంటనే తెలియజేయ ప్రార్థితులు.

# కణాదుని త్యాగనిరతి

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

[కల్హణకవి రచించిన రాజతరంగిణి యీ కథకు మూలం. చంద్రాపీడ చక్రవర్తి న్యాయబద్ధంగా కాశ్మీరము పాలిస్తున్న పుణ్యకాలమది. ఒకనాడతనికి మహావిష్ణువు కలలో గాన్పించి కణాదుడనే హరిజనుని కుటీర ప్రదేశంలో ఆలయం నిర్మించి త్రిభువనస్వామి అనే పేరుతో తన్ను ప్రతిష్ఠింపుమని ఆదేశిస్తాడు. కణాదుని సమ్మతితో ఆ తావులో నాటి మధ్యాహ్నమే ఆలయనిర్మాణ కార్యం కొనసాగించండని ప్రభువు ఉద్యోగుల కాజ్ఞాపిస్తాడు.

తన యింటిని వీడటానికి అంగీకరింపని కణాదుణ్ణి నిందించి ఉద్యోగులు రాజసమక్షంలో వర్తమానం నివేదిస్తారు. చంద్రాపీడుడు వారి దుష్ప్రవర్తనాన్ని ఖండించి కణాదుణ్ని కలుసుకొని ముచ్చటిస్తాడు. కణాదుడు అధికారుల దౌర్జన్యాన్ని, గృహత్యాగంలోని కష్టాన్ని వెల్లడించి దైవకార్యంకోసం స్వాభిమానం విడిచి అర్థించిన ఆ ప్రభువుకు పరిహారద్రవ్యం తీసుకోకుండానే తన యింటిని ధారపోస్తాడు.

ఉద్యోగులు కణాదుడికి రాజాభిప్రాయాన్ని తెలపడంతో ఈ కథ ఆరంభించి అతడు తన యింటిని చక్రవర్తికి ధారపోసి సెలవు గయికొనడంతో అవసితమౌతుంది ]

"ఓరీ పుల్కస! సర్వపార్థివ కిరీటోదగ్ర రత్నప్రభా
రారాజత్పదపీఠుడైన మనచంద్రాపీడ భూజాని వి
స్ఫారశ్రీ సముపేతుగా త్రిభువనస్వామిం బ్రతిష్ఠింపగా
ప్రారంభింతురు తేపొమాపొ కనకప్రాసాద నిర్మాణమున్.

ప్రారబ్ధంబగు కర్మచే నొదవె బో పాపిష్ఠ జన్మంబు; నీ
కేరీ? భాగ్యవిశేషమందు సము; లాపృథ్వీశుడున్ దేవతా
గార క్షేత్రముగా భవన్నిలయమున్ గైకొంతలంపూనె; ఔ
రారా! బొందిని స్వర్గమేగితివి; గణ్యంబయ్యె నీపుణ్యమున్.

వారే శిల్పులు వాస్తుశాస్త్రనిపుణుల్; వారోరి! కార్తాంతికుల్
వీరల్ సూత్రముపట్టి శంకువును స్థాపింపన్ నృపాలాజ్ఞ; నీ
పూరింటిన్ దిగనాడి సుందరగృహంబున్ గట్టుకొమ్మోయి! స
త్కారుణ్యాంబుధి రాజశేఖరుడు విత్తంబిచ్చు నవ్వారిగన్.

ఇపుడే నీ కుటి గూల్పగావలయు; నీ కిద్దాని నెచ్చోటికేన్
శ్వపచా! చేకొనిపో దలంపగునొ ఆచందంబు గావింపు మీ
విపులాధీశ వినిశ్చితేతదభిజిద్వేళాతిపాతంబు మా
కపరాధం;"బను రాజపూరుషులతో నాతండిటుల్ వాకొనున్.

"ధరణీవల్లభు శాసనంబది శిరోధార్యంబు; అట్లౌట త
చ్చరణాబ్జంబుల నాశ్రయించి మను నస్మాదృగ్జనుల్ తెంపుమై
మఱి మాటాడగలారె? కాని అనుకంపా పూర్ణ చిత్తంబుతో
సరదారుల్! వినుడయ్య! మామకవచస్సందర్భముల్ వేడెదన్.

మును మాతాతలు తండ్రు లిందె జననంబుఁ బొంది; రిచ్చోటనే
కనులఁ మూసిరి; కష్టసౌఖ్యములకుఁ గారాబు కాణాచియై
చను నాయీకుటి గడ్డపల్గులకు ఏచందాన చేజేత న
ప్పనముం జేయుదు; నే నికెందు వసియింపంబోదు యోజింపుడీ!

జననియు జన్మగేహమును స్వర్గతలమ్మున కన్న మిన్నయౌ
ననియెడు పల్కు మీ రెఱుగనట్టిది గాదు; ధనాశ లేశముఁ
మనమున లే; దిలావలయనాథశిరోమణి కీ కణాదుపై
కనికర మేర్పడం బలికి కావుడు నన్నును నాకుటీరమున్.

ఇటు గాదందురయేని ఈయనద కుయ్యిఁ రాజదేవేంద్రు డు
త్కట కారుణ్య సుధార్ద్రచిత్తమున నాకర్ణించి రక్షించుతఁ
కటువాక్కుల్ సయిరించి భూపతి సభాగారప్రవేశంబు స
ల్పుట కంగీకృతిఁ జూపు"డం చతడు కేల్మోడ్చంగ వారుగ్రులై.

"పందికి గంధసార జలపావన మజ్జన మెట్లో నీ కటుల్
సుందర సౌధవాస మది చొప్పడ; దెండకు వాన కిందులో
మ్రందుట స్వర్గసౌఖ్యమని మా కెదురాడెదు; మాలబుద్ధి నే
మందుము? వేఁపి కెమ్మ రుచియౌ నటు లౌనొకో? యిక్షుఖండముల్.

శునకముకంటె హీనునకు సూనరికిఁ విభవామరేంద్రుఁ డౌ
జనపతి కొల్వులో మనవి సల్పగ నుత్తరువంట; నెత్తి కె
క్కినవి కనుల్! త్వదీయ కుటికిఁ మురవైరియె యాసజూపెఁగా
కనుపమ సద్మనిర్మితికి ఆనృపమౌళికి తావు లేదొకో?

ఇది మీతాతల సొత్తుగా దలతు వోరీ! తుచ్ఛ చండాలుడా!
పదరుల్ మాని కుటీరముఁ విడిచిపో వైళంబు; విత్తాశయే
మది లేదంటివి, మంచిదాయె; నిజకర్మం బిట్టులుండఁ ఫలం
బది యెట్లుండు?" నటంచు నేగిరి నృపాలాస్థానికిఁ వ్రేల్మిడిన్.

# క ణా దు ని త్యా గ ని ర తి

ప్రణతాశేష మహీశమండలుఁడు చంద్రాపీడదేవుండు పా
యని భక్తిన్ ధ్వజినీధవుల్ కవు లమాత్యప్రాడ్వివాకుల్ సుహృ
జ్జనముల్ గొల్వ నిజాధికృన్ముఖమునన్ సర్వంబు గొడ్డోలగం
బున నాలించి వచించె రూక్షరుష నిప్పుల్ కన్నులం గ్రక్కుచున్.

"అతి గర్హ్యంబు భవత్ప్రవర్తన మహో! అన్యాశ్రయం బిట్లు దు
ర్మతులై బల్మిని నాక్రమించెదరె? అస్మద్బాహు సంరక్షిత
క్షితిచక్రంబున పాపకార్యము నిటుల్ చేయంగ ఈగుండె లే
గతి గల్గెన్? సముఖమ్మునన్ నిలుతురింకన్ ? పొందు దూరమ్ముగన్.

నిలుపుం డింతట దేవతాయతనపున్ నిర్మాణకార్యంబు; అ
వ్వల వేఱొక్కయెడన్ తదుద్యమ మొనర్పం బోలుగా కిట్లు పే
దలయాధారము గూల్చి మామక శరద్రాకేందుశోభాసము
జ్జ్వల సత్కీర్తి కలంకితమ్ముగుట కోర్వంజాల ముమ్మాటికిన్.

అనయము మంచిసెబ్బరల నారయుచుండెడు మమ్మువంటి వా
రనయపథానువర్తనము నందిన ధర్మవిరుద్ధ కార్యముల్
పొనరుప జంకు గొంకులను బొందుదురే ? పరు"లంచు న్యాయశో
భనచరితుండు నాటికి సభన్ ముగియించె సదస్యులౌననన్.

ఆమఱునాడు సాంధ్యసమయంబున ఱేడు బహిర్విహార లో
లామలచిత్తుడై వెడలి యచ్చట దర్శన మిచ్చి, పంచమున్
ప్రేమ సుధారసప్రసృత దృక్కుల గాంచుచు పల్కు; ఓయి! మా
యీ మహితోద్యమంబునకు నిట్లవరోధ మొనర్ప నెంచితే ?

నీకుటి అంతరమ్యముగ నీకు గనంబడునేని అంతకున్
ప్రాకటభోగభాగ్య విభవంబున కాస్పదమైన హర్మ్యమున్
జేకొను మిత్తు; కాదని వచింతువ కొల్లగ రొక్కమిత్తు; నీ
కీ కొఱమాలినట్టి హఠమేలొకో ? మంచి దలంప వేలొకో?"

మనునిభుడైన క్షత్రకులమండను సత్త్వగుణ ప్రమాణమున్
గనుగొనుచున్నవాడో అనగా కయిమోడ్చి కణాదు డిట్లు వా
కొనియె; "ప్రభూ! మదాశయము కొంచియ మేలినవారి సన్నిధిన్
మనవి యొనర్తు; ఈసు నణుమాత్రము నాపయి నందబోకుడీ!

నరజాతిఁ జననంబు; జ్ఞానమున కన్నఁ హీనుడంగాను; భూ
వర సంఘంబున రాముకంటె ఘనదెవ్వాడెందునుఁ లేడు; మీ
నరదారుల్ 'శునకంబు గోరెడి నృపాస్థానప్రవేశంబు వ
హ్వారె'యంచుఁ నను గేలిసేయుటకు దేవా! కారణం బున్నదే?

సతముఁ సంసృతి ఘోరకాననమునఁ జన్మించు ఈ జంతుసం
తతి దుర్గర్వము స్వాభిమానమును మానం బోదు; కేయూరభూ
షితులుఁ కుండలహారమండితులు నా శ్రీవారికిం బోలె దు
ర్గతులౌ మాకును స్వీయకాయమున రాగద్వేషముల్ సాజముల్.

అంబరచుంబి సౌధచయహారిణియై తగు రాజధాని యె
ట్లింబు ఘటించు మీకు నటులే ఘటవక్త్రిగవాక్షమౌ కుటీ
రంబది మాకునుం బ్రియకరంబగు; మత్సుఖదుఃఖసాక్షి భూ
తంబగు నిల్లు నిల్వ్వ హతంబగుటెట్లు సహింపఁజాలుదున్?

జనముల్ తాము వసించుగేహములు నష్టంబైన కాలంబునఁ
మనమం దొందెడు దుర్వ్యథాభరము సామ్రాజ్యచ్యుతుండైన త్రే
డును, నాకంబుననుండి కూలు దివిజుండుంగాక అన్యుండు వ
ర్ణనసేయంగ వలంతియౌనె? నిజముఁ వాక్రుచ్చితిఁ సైపుడీ!

కాకమురీతి కక్షియగుగాక, అమాంసవపుర్విరూపు డౌ
గాక మదీయనందనుని కైవడి నింద్రసుతుండు సైతముఁ
నాకు ప్రియుండుగాడు; జననాథ! శతాయువు మత్కుటీరముఁ
గైకొని రాజ్య మిచ్చినను గల్గదు నామది హర్ష లేశమున్.

ఈవిషయం బిటుండె; జగతీశ్వరు లింటికివచ్చి దైవకా
ర్యావసరంబు; తావకగృహంబు నొసంగుమటంచుఁ గోరినఁ
భావము లోపలఁ నెగులువాసి ధనాదుల వేడఁబోక మో
దావహమైన చిత్తమున త్యాగ మొనర్చెద దేని నైననున్."

అత డీలాగున సాభిమానముగ మాటాడఁ ధరాపాలు డం
చిత శాంతంబున నాలకించి మది కించిత్కోపముం జెంద కా
తత సంతోషముతోడ కాలినడ నేత్రద్వంద్వహేముం జేరి త
త్కృత పూజల్గొని రెండు పల్కు లిటుపల్కెఁ సానురాగంబునన్.

# కణాదుని త్యాగనిరతి

"కలలో దర్శన మిచ్చి మాకు కమలాకాంతుండు నీయూరిటి
స్థలి నాత్మాలయ నిర్మితింజలుప నాజ్ఞాపించె; నీయింటి నిం
దులకై కోరితి; మస్మదీయులగు నుద్యోగుల్ మదోన్మత్తులై
కలఁతంబెట్టిరి నీమనం; బుడుగు మింకన్ సాధ్వసాయాసముల్.

అభిమానం బదియేల? భూభువన కల్యాణంబు గాంక్షించి త్వ
త్ప్రభవస్థానము వేఁడుచుంటి; భగవత్ప్రాసాద నిర్మాణ పు
ణ్యభరం బెల్లను నీదె యంటి; నిఁక భార్యాపుత్రపౌత్రమ్ముగన్
శుభసౌధమ్మును జేరి మాదు తలఁపున్ మోసెత్తఁగాఁ జేయుమీ!"

అవనీపాలవతంసు మంజుమధురవ్యాహారసారామృత
ప్లవమానాత్ముఁడునై కణాదు డిటులన్ వాక్రుచ్చెఁ గేల్మోడ్చి, "నా
యవివేకంబును, పల్కుతీండ్రమును దేవా! సైఁపు డీనాటికిన్
భవదీయానుపమాన మంగళగుణవ్రాతంబు దర్శించితిన్.

తొలి కౌలేయకరూపుఁడై యముడు తోడ్తో నేగుచున్ ధర్మని
ర్మలు ధర్మాత్మజు ధార్మికత్వమును నెమ్మాడ్కిన్ బరీక్షించె; నీ
యలఘుక్షాంతిని, ధర్మనిష్ఠతను నేఁ డస్పృశ్యుఁడై నేను న
ట్టులెగాదా పరికించినాఁడ? కయిమోడ్పుల్ నన్ను మన్నింపుమీ!

కాకుత్స్థాన్వయ రామభద్రవిభు నిక్కాలంబునం గంటి; నీ
వాకల్పాంతము రాజ్యలక్ష్మి నిజబాహాపీఠికాసీనయై
లోకామోదము గూర్ప వర్ధిలుము! చాలున్ కోటినిష్కాల యె
త్తౌ కల్యాణ భవద్వచస్సె; సెలవయ్యా! దీన కల్పద్రుమా!"

# మంత్రివర్గబాధ్యత

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

## ప్రభుత్వములు రెండురకములు

ప్రస్తుతకాలమున ప్రపంచమందలి ప్రభుత్వములు రెండు రకములుగ నున్నవి. బాధ్యతతో ప్రవర్తించవలసిన ప్రభుత్వములు మొదటి రకములోనివి. ఇవి శాసన బద్ధములై ప్రజలు గాని, ప్రజాప్రతినిధులుగాని, అడిగినదానికి జవాబు చెప్పవలసిన స్థితిలో ఉండునట్టివి. ఇవి చెప్పు జవాబు తృప్తికరముగ లేనియెడల ఉద్యోగమునుండి తొలగిపోవలసి వచ్చును. రెండవ రకములోని ప్రభుత్వములు బాధ్యతలేక ప్రవర్తించగలవి. అవి నిరంకుశ ప్రభుత్వములు. అవి ఎవరికిని జవాబు చెప్పవలసినది లేదు. వాటిని ఆక్షేపించుటకు ప్రజలకు గాని, మరి ఎవ్వరికి గాని అధికారము లేదు. అవి అధికారములోనికి వచ్చుటలో గాని, అధికారమునుండి తొలగిపోవుటలో గాని ప్రజల విశ్వాసావిశ్వాసముల ప్రసక్తి ఉండదు.

ప్రజాస్వామికప్రభుత్వము లన్నియు సిద్ధాంత దృష్ట్యా బాధ్యతతో కూడిన ప్రభుత్వములు (Responsible Governments). వాస్తవముగ ఇవి ఎంతవరకు బాధ్యతతో ప్రవర్తించుచుండునది ఆయా రాజ్యములలోని పరిస్థితులను బట్టి నిర్ణయ మగుచుండును.

మనది ప్రజాస్వామికప్రభుత్వము గల రాజ్యము. అందుచేత మనలను పాలించు ప్రభుత్వము బాధ్యతతో కూడినట్టిది. ఎవరు దేశమును పరిపాలించవలెనను దానిని ప్రజలు నిర్ణయించుచున్నారు. ఒక పర్యాయము అధికారములోనికి వచ్చినవారు బాధ్యతతో ప్రవర్తించని పక్షమున అయిదు సంవత్సరముల కొక పర్యాయము జరుగు సాధారణ ఎన్నికల సాధనమున వారిని అధికారమునుండి తొలగించి, వారి స్థానే ఇతరులను అధికారములో ఉంచుటకు ప్రజలకు హక్కు కలదు. ఇందుచేతనే మన పరిపాలకులు బాధ్యతతో ప్రవర్తించవలసిన వా రగుచున్నారు.

## పరిపాలనబాధ్యత మంత్రివర్గము

మన దేశమందు పరిపాలనా కార్యనిర్వహణమునకు రాజ్యాంగ మూలశాసనము (Constitution) ఒక అధ్యక్షుని ఒక మంత్రివర్గమును ఏర్పరచి ఉన్నది. ఇదేవిధముగ రాష్ట్రముల పరిపాలించుటకు ఒక గవర్నరు ఒక మంత్రివర్గము ఏర్పడి ఉన్నవి. కేంద్రమందు అధ్యక్షునికి గల స్థానమే రాష్ట్రములందు గవర్నరుకు కలదు. కేంద్రమందును, రాష్ట్రములందును మంత్రివర్గము లున్నవి.

"బాధ్యత" గురించి వివరించుటలో "ఎవరు ఎవరికి బాధ్యులు ?", "బాధ్యతను వహించువారు, వహించవలసినవా రెవరు ? ఆ బాధ్యతను అమలుపరుచువా రెవరు ? దానిని అమలు పరుచుటలో ఉపయోగింపబడు సాధనము లెట్టివి ? వాటి మూలమున ప్రయోజనము అనుకొన్న మేరకు లభించు చున్నవా ?' అను ప్రశ్నలు తలెత్తుచుండును. వీటికి సమాధానము చెప్పుటయే బాధ్యతను గురించిన వివరణము.

మన పరిపాలన విధానములో బాధ్యత వహించవలసినది అధ్యక్షుడా ? (గవర్నరా ?) లేక మంత్రివర్గమా ? అనునది మొదటి ప్రశ్న. దీనికి జవాబు : బాధ్యతను వహించవలసినది అధ్యక్షుడు కాడు. మంత్రివర్గమే పరిపాలన మంతటికి బాధ్యత వహించవలసి ఉన్నది.

ఇట్లనుటకు కారణము సులభముగ గ్రహించవచ్చును. రాజ్యాంగ మూలశాసనములోని (53) వ సూత్రము కార్యనిర్వహణాధికార మంతయు అధ్యక్షుని (President) యందు సంక్రమించినట్లు చెప్పుచున్నను (74)వ సూత్రము ప్రకారము అతనికి సహాయము చేయుటకును, సలహాల నిచ్చుటకున్ను ఒక మంత్రివర్గము తప్పక ఉండవలసి ఉన్నది. మంత్రివర్గము ఇచ్చు సలహాలను అతడు తప్పక స్వీకరించవలసి ఉన్నది. మంత్రివర్గము లోకసభయొక్క విశ్వాసమునకు పాత్రమైన దగుటచేత, అట్టి మంత్రివర్గము యొక్క సలహాలను కాదని స్వతంత్రముగ అధ్యక్షుడు పరిపాలనమును సాగించుట సాధ్యము కానిపని. అందుచేత దేశమును పాలించు అధికారము వాస్తవముగ మంత్రివర్గము వారిదే గాని అధ్యక్షునిది కాదు. అధ్యక్షుని అధికారము నామమాత్రమైనది. అతనిది అలంకారప్రాయమైన స్థానము. (దీనినిగురించి ఆంధ్రపత్రిక ప్లవసంవత్సర ఉగాది సంచికలో నేను వివరముగ వ్రాసిఉన్నాను. పాఠకులు ఆ వ్యాసమును చదువ ప్రార్థన)

పరిపాలనాధికార మంతయు మంత్రివర్గముయొక్క వశమం దుండుటచేత పరిపాలనములోని గుణదోషములకు బాధ్యతను వహించవలసినది మంత్రివర్గమే గాని అధ్యక్షుడు గాదు. పరిపాలనలో కనుపించు లోపములకు జవాబు చెప్పవలసిన బాధ్యత మంత్రివర్గము వారిది; అధ్యక్షునిది కాదు. దీనికి అనుగుణముగనే మనరాజ్యాంగము రూపొందించబడిఉన్నది. పరిపాలనములో ఎన్నిలోపములు కనుపించినను అధ్యక్షుడు అతని ఉద్యోగ కాలము అయిదు సంవత్సరములు పూర్తియగు వరకు ఉద్యోగమందుండును. అతడు లోకసభలో గాని, రాజ్యసభలో గాని హాజరై, సభ్యులు అడుగు ప్రశ్నలకు గాని, వారు చేయు విమర్శలకు గాని, ఆక్షేపణలకు గాని సంజా

యిషీ చెప్పవలసినది లేదు. పరిపాలనబాధ్యతను అతడు వహించినవాడు కాకపోవుటయే దీనికి కారణము.

దీనినిబట్టి "ఎవరు ఎవరికి బాధ్యులు" ? అను ప్రశ్నలో మొదటి భాగమునకు మనకు సమాధానము లభించు చున్నది. పరిపాలనమున కంతకు మంత్రివర్గమువారు బాధ్యులనుటయే ఈ సమాధానము. అధ్యక్షుడు బాధ్యుడుకాడు.

వీరు ఎవరికి బాధ్యులు ? అన్న ప్రశ్నకు మన మిప్పుడు సమాధానము వెదకవలసి ఉన్నది.

## మంత్రివర్గమువారు లోక్‌సభకు బాధ్యులు

దీనికి రాజ్యాంగ మూలశాసనములోనే సమాధానము చెప్పబడి ఉన్నది. అందులోని (75)—(3) సూత్రము, "మంత్రివర్గము లోక్‌సభకు సమష్టిగా బాధ్యత వహించవలెను." అని విధించుచున్నది. అనగా మంత్రుల చర్యలను పరిశీలించుటకు వాటిలోని లోపములను చూపెట్టుటకును, వారిని ఖండించుటకును, వారు ఇచ్చు జవాబులు, సమాధానములు, సంజాయిషీలు తృప్తికరముగ లేనప్పుడు ఉద్యోగము నుండి వారిని తొలగించి, వారి స్థానే ఇంకొక మంత్రివర్గమును ప్రతిష్ఠించుటకును లోక్‌సభకు అధికారము కలదు. ఇదియే ఈ 75—3 సూత్రమునకు అర్థము. బాధ్యత వహించువాడు, బాధ్యతను విధించి అమలు పరచువాడు—వీరిద్దరి మధ్య ఏర్పడు సంబంధము కొంతవరకు (పూర్తిగా కాదు) సేవక యజమానుల మధ్యనుండు సంబంధము వంటిది. ఎవరిని సేవకునిగా నియమించుట, ఎంతకాలము అతనిని ఉద్యోగములో ఉంచుట, ఉద్యోగమునుండి ఎప్పుడు ఏ పరిస్థితులలో అతనిని తొలగించుట అను విషయములలో పూర్తి అధికారము యజమానికి ఉన్నప్పుడే సేవకుడు అతనియెడల బాధ్యతతో ప్రవర్తించువా డగుచున్నాడు. ఇదేవిధముగ మంత్రివర్గమును నియమించుటలోను, దాని ఉద్యోగకాలమును నిర్ణయించుటలోను, ఉద్యోగమునుండి దానిని తొలగించుటలోను లోక్‌సభకు పూర్తి అధికార మున్నప్పుడే "మంత్రివర్గము లోక్‌సభకు సమష్టిగా బాధ్యత వహించవలెను." అను సూత్రము సార్థక మగుచున్నది. ఇట్టి అధికారము లోక్‌సభకు ఉన్నదని మూలశాసనము ప్రత్యేకముగను, స్పష్టముగను చెప్పకపోయినను బాధ్యతాయుత ప్రభుత్వములు గల ఇంగ్లండు, కనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశము లన్నిటి యందు ప్రజాప్రతినిధుల సభకు ఇట్టి అధికార ముండుట సంప్రదాయము గనుక మన దేశములో కూడ లోక్‌సభకు ఈ సంప్రదాయసిద్ధమైన అధికారము ఉన్నదని చెప్పుటయే సబబు.

లోక్‌సభయొక్క విశ్వాసమునకు పాత్రమై ఆ సభలో అధిక సంఖ్యాబలము (Majority) గల మంత్రివర్గము అధికారములోనికి వచ్చుట, అట్టి విశ్వాస ముండునంత వరకే అది అధికారములో ఉండుట, దానిని కోల్పోయినప్పుడు అది అధికారమునుండి తొలగిపోవుట అను సంప్రదాయమును అనుసరించియే మనదేశపరిపాలనము జరుగుచున్నది. ఇట్లు జరుగుటయే బాధ్యతాయుత పరిపాలనము.

## దీనికి ఆక్షేపణ

కాని దీనికి ఒక ఆక్షేపణ కలదు. ఏ మూలశాసన సూత్రము "మంత్రివర్గము లోక్‌సభకు బాధ్యతను వహించవలె" నని విధించుచున్నదో అదే సూత్రము (1), (2) క్లాసులలో, "ప్రధానమంత్రి అధ్యక్షునిచే నియమింపబడవలెను. ఇతర మంత్రులు ప్రధాన మంత్రియొక్క సలహాతో అధ్యక్షునివలన నియమింపబడవలెను. అధ్యక్షుని ఇష్టమైనంత వరకు మంత్రులు ఉద్యోగమం దుండవలెను" అని విధించుచున్నది. మంత్రులను నియమించు అధికారము, తొలగించు అధికారము అధ్యక్షునికి ఉన్నట్లు ఈ క్లాసులు చెప్పుచున్నవి. లోక్‌సభయొక్క విశ్వాసావిశ్వాసముల ప్రసక్తి (75) వ సూత్రములో ఎక్కడను కనుపించదు. గనుక లోక్‌సభయొక్క ఇష్టానిష్టముల బట్టి గాక తనకు ఇష్టము వచ్చిన వానిని అధ్యక్షుడు ప్రధానమంత్రిగా నియమించవచ్చుననియు, అదే విధముగ అతడు మంత్రివర్గమును తనకు ఇష్టమున్నంత కాలము అధికారములో ఉండవచ్చుననియు కొందరు అభిప్రాయపడవచ్చును. కాని యిది సరియైన అభిప్రాయము కాదు. ఇందులో కూడ వాస్తవాధికారము అధ్యక్షునిది కాదు. అది లోక్‌సభయొక్క అధికారము. అతనిది నామమాత్రాధికారము. లోక్‌సభయొక్క అభిప్రాయమును బట్టి అతడు మంత్రివర్గమును నియమించని పక్షమునను, తొలగించని పక్షమునను, పరిపాలన మంతయు స్తంభించిపోవును.

లోక్‌సభలో అధికసంఖ్యాబలము లేనట్టి (దాని విశ్వాసమునకు పాత్రము కానట్టి) మంత్రివర్గమును అధ్యక్షుడు నియమించినప్పుడును, అధికసంఖ్యాబలము గల మంత్రివర్గమును అతడు ఉద్యోగము నుండి తొలగించి దాని స్థానే తాను అభిమానించిన ఇంకొక మంత్రివర్గమును నియమించినప్పుడును పరిపాలనము సాగుటలో లోక్‌సభ మూలమున లభించవలసిన సహకారము అతని మంత్రివర్గమునకు లభించదు. ఆ మంత్రివర్గమునకు లోక్‌సభలో సంఖ్యాబలము లేకపోవుటయే దీనికి కారణము. ప్రస్తుత యుగములో పరిపాలనము సౌష్ఠవముగ జరుగుటకు విస్తార ద్రవ్యము, కొత్త కొత్త శాసనములు అవసర మగుచున్నవి. ద్రవ్యము సంపాదించుటకు ప్రజలపై విధింపబడుపన్నులు ప్రధానాధారములు. మన రాజ్యాంగములో పన్నులను విధించు అధికారము, వసూలైన ద్రవ్యము ఏయే పనులకై ఎంతెంతవరకు వినియోగించవలెనో నిర్ణయించు అధికారము, ప్రభుత్వ ఆదాయవ్యయములకు సంబంధించిన ఇతర అధికారములు ఒక లోక్‌సభకు మాత్రమే కలవు. లోక్‌సభయొక్క ఆమోదము లేక పరిపాలన ఖర్చులకు కావలసిన ద్రవ్యము ఏ మంత్రివర్గము కూడ సంపాదించుట సాధ్యము కాదు. అందుచేత

ఆ సభయొక్క విశ్వాసమునకు పాత్రముగాని మంత్రివర్గముతో అధ్యక్షుడు దేశపరిపాలనము సాగించలేడు. ఇంతేగాక క్రొత్త శాసనములను చేసి, తద్వారా దేశమందు అభివృద్ధికరములగు కార్యక్రమముల ప్రవేశపెట్టుట కూడ ఈలాటి మంత్రివర్గమునకు సాధ్యము కానివేని. శాసనముల చేయు అధికారము లోక్‌సభ, రాజ్యసభలతో కూడిన పార్లమెంటుకు మాత్రమే కలదు. లోక్‌సభయొక్క విశ్వాసమునకు పాత్రము గాని మంత్రివర్గము కోరు శాసనములను చేయుటకు పార్లమెంటు ఇష్టపడజాలదు. క్రొత్త సంస్కరణములను (వీటికి క్రొత్త శాసనములు ఆధారము) చేయుని మంత్రివర్గము ప్రజల ఆదరణను కోల్పోవును. ఇట్టిస్థితిలో పరిపాలన ప్రతిష్టంభనము తప్పదు. పార్లమెంటుయొక్క అనుమతిలేక తాత్కాలిక శాసనములను (Ordinances) చేయు అధికారము అధ్యక్షునికి ఉన్నను వాటివలన కొన్ని నెలల వరకు మాత్రమే పరిపాలనమును సాగించుటకు వీలుకలదు. దీర్ఘకాలము వాటి సాధనమున అధ్యక్షుడు దేశమును పాలించుట రాజ్యాంగ విరుద్ధము. కనుక మంత్రివర్గమును నియమించుటలోను తొలగించుటలోను అధ్యక్షుడు లోక్‌సభయొక్క అభిప్రాయమునకు భిన్నముగ ప్రవర్తించుట సాధ్యము కాజాలదు. వీటిలో అధ్యక్షుని ఆమోదము అప్రధానము. లోక్‌సభయొక్క ఆమోదము, విశ్వాసము ప్రధానములు.

పై వివరణమును బట్టి మంత్రివర్గము లోక్‌సభకు మాత్రమే బాధ్యత వహించవలసి ఉన్నదనియు, అధ్యక్షునికి బాధ్యత వహించవలసిన అవసరము లేదనియు స్పష్టమగుచున్నది. "మంత్రులు ఎవరికి బాధ్యులు" అను ప్రశ్నకు లోక్‌సభకు బాధ్యులనుటయే సరియైన సమాధానము.

కాని లోక్‌సభకు మాత్రమేనా మంత్రుల బాధ్యత ? ఇందులో రాజ్యసభ ప్రసక్తి లేనేలేదా ? మంత్రివర్గము వారా ప్రజలకు బాధ్యులు కారా ? అన్న ప్రశ్నలు కొన్ని ఉన్నవి. వాటినిగురించి కూడ ఆలోచించినగాని "ఎవరికి బాధ్యులు" అను ప్రశ్నకు పూర్తి సమాధానము లభించదు.

## మంత్రులు రాజ్యసభకు బాధ్యులా?

మన పార్లమెంటు లోక్‌సభతోపాటు రాజ్యసభతో కూడిన శాసనసభ. ఆదాయవ్యయములకు సంబంధించిన శాసనముల విషయమున రాజ్యసభకు ఏలాటి అధికారము లేకపోయినను తక్కిన శాసనముల విషయములో దానికి లోక్‌సభతో సమానమైన అధికారము కలదు. రాజ్యసభయొక్క ఆమోదములేక తక్కిన బిల్లులు శాసనములు కాజాలవు. లోక్‌సభలో ఏ రాజకీయ పార్టీకి సంఖ్యాబలము కలదో ఆ రాజకీయపార్టీకే రాజ్యసభలో కూడ సంఖ్యాబలమున్నప్పుడు ఏలాటి యిబ్బంది సంభవించదు. లోక్‌సభయొక్క ఆమోదమును పొందిన బిల్లులు రాజ్యసభయొక్క ఆమోదమును పొందగలవు. కాని, ఈలాగు కాక, లోక్‌సభలో ఒక రాజకీయ పార్టీకి (కాంగ్రెసు పార్టీకి) అధిక సంఖ్యాబలము, రాజ్యసభలో ఇంకొక పార్టీకి అధిక సంఖ్యాబలము ఉన్నప్పుడు మంత్రివర్గము లోక్‌సభలో ప్రవేశపెట్టిన బిల్లులు సమర్థింపబడడము, రాజ్యసభలో అవి తిరస్కరింపబడడము తప్పదు. అప్పుడు అవి శాసనములు కాజాలవు. అట్టిపరిస్థితిలో మంత్రివర్గము తలపెట్టిన కార్యక్రమములు కొనసాగుట సాధ్యము కాజాలదు. రాజ్యసభను రద్దుచేసి తిరిగి ఎన్నికలను జరిపించుట రాజ్యాంగ విరుద్ధము. తాను కోరిన శాసనములు లభించనందున మంత్రివర్గపరిపాలన సౌష్ఠవము కుంటుబడును. మంత్రివర్గము మూలశాసనము ప్రకారము లోక్‌సభకు మాత్రమే బాధ్యత వహించవలసినదైనను, రాజ్యసభయొక్క విశ్వాసము, ఆమోదము లేక పరిపాలనమును సాగించుట కష్టసాధ్యము. దాని విశ్వాసమును సంపాదించుట అనగా దానికి కూడ కొంత బాధ్యత కలిగియుండుటయే.

రాజ్యాంగ మూలశాసనమును రూపొందించిన రాజ్యాంగ పరిషత్తువారు ఈ విషయములో గొప్ప పొరబాటును గావించిరని చెప్పవలసి ఉన్నది. రాజ్యసభకు లోక్‌సభతో సమానమైన శాసనాధికారమును కల్పించుటయే ఈ పొరపాటు. మంత్రివర్గము రెండుసభలకు బాధ్యత వహించవలసినట్లు (తెలియకయే) వారు రాజ్యాంగ మూలశాసనమును రూపొందించిరి. గత పదకొండు సంవత్సరములలో లోక్‌సభ రాజ్యసభల రెండింటియందును కాంగ్రెసుపార్టీకే అధిక సంఖ్యాబలము ఉండినందున ఏలాటి చిక్కులు సంభవించలేదు. కాని ఇట్టి పరిస్థితి మారినప్పుడు చిక్కులు తప్పవు. మూలశాసనమును సవరించినగాని అవి తప్పుటకు వీలులేదు.

మంత్రివర్గము ప్రజలపట్ల బాధ్యత వహించియుండుట అవసరము కాదా అన్న ప్రశ్నకు జవాబు చెప్పుటకు ముందు, మంత్రివర్గమును అదుపులో ఉంచుటకును, దాని బాధ్యతను చక్కగా నిర్వహించునట్లు చేయుటకును, లోక్‌సభ ఉపయోగించుచుండు సాధనములగురించి ఒకటి రెండు మాటలు చెప్పవలసి ఉన్నది.

## మంత్రుల లోక్‌సభా సభ్యత్వము

మంత్రుల పరిపాలనమును విమర్శించుటలో లోక్‌సభకు అనుకూలముగ మంత్రివర్గనిర్మాణము జరుగునట్లు మూలశాసనము ఏర్పరచియుండుట ఈ సందర్భములో గమనించదగ్గది. పార్లమెంటులో సభ్యులుగ నుండువారు మాత్రమే మంత్రిపదవులకు అర్హులు. ఎప్పుడైన ఒకప్పుడు అలాటి సభ్యత్వము లేనివారు కూడ మంత్రిపదవులలో నియమింపబడవచ్చును. కాని వారు ఆరు నెలల కంటె ఎక్కువ కాలము మంత్రులుగ నుండుటకు వీలులేదు. పార్లమెంటులో సభ్యత్వమున్నవారే మంత్రులుగ నియమింపబడవలెనను సూత్రము మంత్రివర్గ బాధ్యతను అమలు పరచుటలో ఎక్కువ ప్రయోజనకారిగ ఉన్నది. లోక్‌సభ సమావేశమైనప్పుడు మంత్రులు కూడ అచ్చట హాజరగుచున్నారు. అందుచేత వారిని విమర్శించుట వారికార్యకలాపములలోని లోపములను చూపెట్టుట మొదలగు పనులు సులభము లగుచున్నవి. ఇదిగాక ఒక సభలో సభ్యులైన మంత్రులు పార్లమెంటుయొక్క రెండవ సభలో

హాజరై సభ్యుల ప్రశ్నలకు సమాధానము చెప్పుట కనుగుణముగ మన మూలశాసనసూత్రము లున్నవి. అందుచేత ఉభయసభలలో ముఖాముఖిని మంత్రులు, సభ్యులు వాడములతో పాల్గొనుటకు అవకాశము లభించుచున్నది. మంత్రులు లోక్‌సభయొక్క సమావేశములలో పాల్గొనుటచేత సభవారి అభిప్రాయములు ఏ వైపునకు మొగ్గుచున్నవో తెలుసుకొనుటకును, దాని కనుగుణముగ పరిపాలనను సాగించుటకును వీలు కలుగుచున్నది. వారి కార్యక్రమములగురించి సభ్యులలో ఉదయించు అపోహలను వెంటనే తొలగించుటకు కూడ ఈ సభ్యత్వము ఉపచరించుచున్నది.

## బాధ్యత విషయములో లోక్‌సభ ఉపయోగించు సాధనములు

మంత్రులు వారివారి బాధ్యతలను సౌష్ఠవముగ వహించునట్లు చేయుటలో లోక్‌సభలోని సభ్యులు అనేక సాధనములను ఉపయోగించుచున్నారు. వీటిలో ప్రథమమున పేర్కొనతగినది ప్రశ్నలు (Questions) దైనందినపరిపాలనలో ఉద్యోగులు అనేకపొరపాట్లు చేయవచ్చును. వాటిని మంత్రుల దృష్టికి తెచ్చుటకును, మంత్రుల మూలముగ వాటికి తగిన సంజాయిషీని సంపాదించుటకును, పరిపాలనలో ఎక్కువ జాగరూకతతో మంత్రులు మెలగునట్లు చేయుటకును ఈ ప్రశ్నలు ఉపయోగించుచున్నవి. పార్లమెంటు సమావేశమైన ప్రతి రోజున కొంతకాలము సభ్యులప్రశ్నలకు కేటాయింపబడుచున్నది.

ఇదిగాక మంత్రుల పరిపాలనోద్దేశ్యములను, ధోరణిని కార్యకలాపములను విమర్శించుటకును, ఖండించుటకును ఇతర సాధనములు కూడ కలవు. పార్లమెంటు తొలి సమావేశములో అధ్యక్షుడుచేయు ప్రసంగముపై కొన్ని రోజులు చర్చలు సాగుట ఒక సంప్రదాయము. ఆ చర్చలలో పాల్గొను సభ్యులు మంత్రివర్గము తలపెట్టిన విధానములను సంపూర్ణముగ విమర్శించెదరు. బడ్జెట్ (ప్రభుత్వ ఆదాయ వ్యయ పట్టిక) ప్రవేశపెట్టబడిన తర్వాత మరికొన్ని రోజులు ఈలాటి చర్చలు జరుగుచుండును. మంత్రివర్గము ప్రవేశపెట్టిన బిల్లులపై చర్చలు జరుగుచుండును. మంత్రివర్గము ప్రవేశపెట్టిన బిల్లులపై చర్చలు జరుగునప్పుడు కూడ అందులోని లోపములను చూపెట్టుటకు సభ్యులకు అవకాశము కలదు. అప్పటికప్పుడు పరిపాలన కార్యములలో విషమ పరిస్థితులు ఏర్పడినపుడు (సమ్మెలు, పోలీసు కాల్పులు, రైళ్ళ ప్రమాదములు మొదలైనవి) విరామ తీర్మానముల ద్వారా సభ్యులు చర్చలు సాగించుటకు వీలున్నది. ఇదిగాక మంత్రివర్గముపై ప్రత్యేక విశ్వాసరాహిత్య తీర్మానములను గూడ సభ్యులు సభలో ప్రవేశపెట్టి వాటిపైన చర్చలు సాగించవచ్చును. మంత్రులను బాధ్యతతో ప్రవర్తించునట్లు చేయుటలో ఈలాటి సాధనములు ఉపయోగింపబడుచున్నవి. మంత్రులు సుఖముగ నిద్రపోవుటకు వీలులేదు. వీరు లోకసభ సభ్యుల పర్యవేక్షణలో ప్రతిరోజు తమ కాలమును గడపవలసినవారై ఉన్నారు. జాగరూకులై వారు వేయు ప్రశ్నలకు, వారు చేయు ఆక్షేపణలకు, సమాధానము చెప్పవలసిన స్థితిలోనే వారిది. లోక్‌సభ పట్ల వారికిగల బాధ్యతను నిర్వహించుట వారి విధి అని ఈసాధనము లన్నియు వారి గుర్తుకు తెచ్చుచున్నవి.

కాని, బాధ్యతా నిర్వహణములో ఇవి ఎంతటి ప్రయోజనముకలవి? అను విషయమున కొంత సందేహము కలదు. దానికి కారణములను తెలుసుకొనుట అవసరము.

## రాజకీయపార్టీల ప్రాధాన్యము

ప్రస్తుత ప్రజాస్వామిక రాజ్యము లన్నిటిలో రాజకీయ పార్టీలు ప్రధానపాత్రను వహించుచున్నవి. రాజ్యాంగ రథమును నడుపు చక్రములు ఇవియే. సాధారణ ఎన్నికలలో ప్రజలు వారి వోట్లను రాజకీయ పార్టీలకే ఇచ్చుచున్నారు. అభ్యర్థులుగ నిలబడు వ్యక్తులశక్తిసామర్థ్యములకంటె వారు సభ్యత్వమును వహించిన పార్టీని బట్టియే వారికి వోట్లు లభించుచున్నవి. ఏ రాజకీయ పార్టీతోను సంబంధములేని స్వతంత్ర అభ్యర్థులు ఎన్నికలలో విజయము సాధించుట కష్టసాధ్యము. ఎన్నికల ఫలితముగ ఏర్పడిన లోకసభ కొన్ని రాజకీయ పార్టీలతో కూడుకొని ఉన్నది. ఏ రాజకీయ పార్టీకి అందు అధిక సంఖ్యా బలమున్నదో (Majority)ఆ పార్టీనాయకుడు ప్రధాన మంత్రియై తక్కినమంత్రులను నియమించుచున్నాడు. ఈ విధముగ ఏర్పడ్డ మంత్రివర్గముపై లోక్‌సభ విశ్వాస రాహిత్య తీర్మానము చేయుటయు దాని ఫలితముగ అది అధికారమునుండి తొలగిపోవుటయు సాధ్యముకానిసని. సభ్యులు ప్రశ్నలు వేయవచ్చు. చర్చలలో మంత్రివర్గమును తీవ్రముగ విమర్శించవచ్చు. వీటిలో అధికారపక్షసభ్యులు కూడ పాల్గొనవచ్చు. కాని సభలోని అధిక సంఖ్యాకులు మంత్రివర్గపక్షము వారగుటచేత మంత్రులయందు విశ్వాసములేదను తీర్మానమును సమర్థించజాలరు. అధికారపక్షములో ముఠాలు చీలికలు ఏర్పడినప్పుడు కూడ విశ్వాస రాహిత్యతీర్మానము నెగ్గుట కష్టసాధ్యము. అధికారపక్షములోనివారు కొందరు, ఆ పక్షమును వదలి ప్రతిపక్షముల వారితో కలిసినప్పుడే ఈలాటి ప్రమాదము సంభవించును.

ఆలాగు కలియుట ఆత్మహత్యవంటిదే. ఒక బలిష్ఠమైన రాజకీయపక్షమునువదలి ఇంకొక బలహీనమైన పక్షమును చేరు సభ్యులు పేరు ప్రతిష్ఠలు కోల్పోయెదరు. వారు స్థిరచిత్తులు కారన్నకారణమున ఏ పక్షమందు కూడ వారు మర్యాదను, గౌరవమును సంపాదించలేరు. వారింకొక పర్యాయము ఎన్నికలలో అభ్యర్థులుగ నిలబడకోరునపుడు వారి అభ్యర్థిత్వమును సమర్థించు రాజకీయ పార్టీ దొరుకుట కష్టము. పార్టీలకుగల బలమువలనను, ప్రభావమువలనను ఈ కాలములో ఒక పార్టీని వదలి ఇంకొక పార్టీని చేరువారి సంఖ్య బహు స్వల్పము. బహుశః అట్లు వదలువా రెవరైన ఉన్నయెడల వారు ఇతర పార్టీలను వదలి అధికార పక్షములో

చేరువారలేగాని, అధికారపక్షమును వదలి ప్రతి పక్షములో చేరువారుగ నుండరు.

## మంత్రివర్గముల స్థిరత్వము

ఒక సాధారణఎన్నిక జరిగిన తర్వాత అధిక సంఖ్యా బలముతో మంత్రివర్గముగ నిర్మాణమైన సాధారణముగ అయిదు సంవత్సరాల కాలము—తిరిగి సాధారణ ఎన్నికలు జరుగువరకు అధికారమం దుండగలరని చెప్పవచ్చును. గత పదకొండు సంవత్సరములుగ నెహ్రూ మంత్రివర్గము కేంద్రమందును, కాంగ్రెసు పార్టీకి అధిక సంఖ్యా బలము లభించిన ఇతర రాష్ట్రములందు కాంగ్రెసుమంత్రివర్గములును అంతరాయము లేక అధికారములో ఉండుట దీనికి తార్కాణము.

లోక్‌సభలో వేయబడు ప్రశ్నలు, చేయబడు ఆక్షేపణలు, ఖండనములు, అభిశంసనములు, విరామ తీర్మానములు, మంత్రివర్గమును అధికారమునుండి తొలగింపగలిగినవికావు. వీటిని మంత్రివర్గమువారు నిర్లక్ష్యభావముతో గ్రహించినను, వెంట వెంటనే వారికి కలుగు ప్రమాద మేదియులేదు. అందుచేత వారిని బాధ్యత వహించునట్లు చేయగలశక్తి వాటికి ఎక్కువగా ఉన్నట్లుతోచదు. అవి పూర్తిగ నిరర్థకములు కావుగాని వాటి మూలమున లభించు ప్రయోజనము ఏలాటిదో ప్రత్యేకముగా వివరించవలసి ఉన్నది.

## ప్రతిపక్షముల బలాబలములు

ఈ ప్రయోజనము విషయములో రెండు అంశములు గమనించవలసి ఉన్నవి. లోక్‌సభలో వేయబడు ప్రశ్నలలో అనేకములు, అక్కడ చేయబడు ఖండనములు మొదలైనవి ప్రతిపక్షములలోని సభ్యులు చేయునట్టివి. ప్రతిపక్షము బలవత్తరమైనప్పుడును, ఎన్నికలలో అది విజయము సాధించి అధికార పక్షముగ మారుటకు అవకాశమున్నప్పుడును మంత్రివర్గము వారు అది చేయు విమర్శలను ఎక్కువ లక్ష్యపెట్టెదరు. అట్టి అవకాశము లేదని వారికి దృఢనమ్మక మున్నప్పుడు వారు దానినిలక్ష్యపెట్టరు. ప్రస్తుతము లోక్‌సభలో ఇట్టిదియే పరిస్థితి. అధికారపక్షమైన కాంగ్రెసు పక్షమునకు ప్రతిపక్షములుగనుండు సోషలిస్టు, కమ్యూనిస్టు, జనసంఘ, స్వతంత్ర మొదలైన పక్షము లేవియు సంఖ్యాబలములేనివి. కొంతకాలము వరకు వాటిలో ఏదియు కూడ అధికార పక్షముగ మారు అవకాశములేదు. అందుచేతనే వారి విమర్శలను మంత్రివర్గము వారు ఎక్కువగ లక్ష్యపెట్టకున్నారు. ఈలాగుకాక, ఈ పక్షములలో ఒకటి అధికారపక్షముగ మారగల దన్న నమ్మకము కాంగ్రెసు మంత్రివర్గమునకు కలిగిన యెడల, అట్టి పరిస్థితి ఏర్పడినప్పుడు తాము ప్రతి పక్షములో ఉండుటయు, తమ విమర్శలను నూతన మంత్రివర్గము లక్ష్యపెట్టకపోవుటయు జరుగునను భయముతో వారు ప్రతిపక్షమువట్ల ఎక్కువ గౌరవముతో ప్రవర్తించెదరు. బలవత్తరమైన ప్రతిపక్షము లేనప్పుడు బాధ్యతతో ప్రవర్తించవలసినవారు బాధ్యతలేనివారి వలె ప్రవర్తించుట సర్వసాధారణము.

## లోక్‌సభ చర్చలకు ప్రజలపైగల ప్రభావము

లోక్‌సభలో ప్రతిపక్షమువారు చేయు విమర్శలు, అభిశంసనములు, మంత్రివర్గమును అధికారమునుండి అప్పటి కప్పుడు తొలగింపలేకపోయినను, మంత్రివర్గమువట్ల ప్రజల వైఖరిని మార్చుటయందును, తర్వాత జరగబోవు సాధారణ ఎన్నికలలో ప్రజలు ప్రతిపక్షమువారు నిలబెట్టిన అభ్యర్థులకు ఎక్కువ వోట్లు వచ్చునట్లు చేయుటయందును, కొంతవరకు ఉపకరించగలవు. ప్రస్తుతకాలమున పార్లమెంటులోగాని, తదితర ప్రజాప్రతినిధుల సభలలోగాని జరుగు చర్చలవలన కలుగు ప్రయోజనము ప్రజల అభిప్రాయములను మార్చుటయే. పార్లమెంటులో ప్రతిపక్షములవారు చేయు ప్రసంగముల మూలమున అధికారపక్షమువారి అభిప్రాయములు ఎక్కువగా మారుటగాని, అధికారపక్షము వారుచేయు ప్రసంగములవలన ప్రతిపక్షమువారి అభిప్రాయములు మారుటగాని కల్ల. కోర్టులో ఒక న్యాయాధిపతి ఎదుట వాది ప్రతివాదుల పక్షమున న్యాయవాదుల వాదములవంటివే ఈ ప్రసంగములు. వాటి ఉద్దేశము ఎదటిపక్షమందుండు న్యాయవాది అభిప్రాయమును మార్చుటకాదు. న్యాయాధిపతియొక్క అభిప్రాయమును మార్చుటయే వాటి ఉద్దేశము. శాసనసభలలో జరుగు ప్రసంగములు ఈలాటి ప్రయోజనము గలవి. అవి శాసన సభలకు వెలుపలనుండు ప్రజలను ఉద్దేశించి, వారి అభిప్రాయములను మార్చుటకై చేయబడునవి. ఈ రాజకీయపార్టీల వాద ప్రతివాదములలో ఓటుచేయు హక్కుగల ప్రజలు న్యాయాధీశుని స్థానమందున్నారు. శాసన సభలలో చేయబడు ప్రసంగములను వారు శ్రద్ధతో వినిన యెడల రాబోవు ఎన్నికలలో వారు ఏ రాజకీయపార్టీకి ఎక్కువ ఓట్లను ఇచ్చుట మంచిదో తెలుసుకొనగలవారగుదురు. రాజకీయములందు ప్రజలు విచక్షణతో కూడిన జ్ఞానము సంపాదించుటయే ఈ ప్రసంగములవలన కలుగు ప్రయోజనము. అందుచేతనే అవి నిరర్థకములు కావని చెప్పవలసి ఉన్నది. వాటి మూలమున మంత్రివర్గము వెంటనే అధికారమునుండి తొలగకపోయినను కాలక్రమేణ ప్రజాభిప్రాయముమారి ఒక మంత్రివర్గము తొలగి ఇంకొక మంత్రివర్గము సాధారణ ఎన్నికల ద్వారా అధికారములోకి వచ్చుటలో అవి సహాయపడుచున్నవి.

## మంత్రులు ప్రజలకు బాధ్యులు

మూలశాసనముప్రకారము మంత్రివర్గము లోక్‌సభకు బాధ్యతను వహించవలసిఉన్నను దాని బాధ్యత లోకసభకు మాత్రమే పరిమితమైనట్లు భావించరాదు. దూరమందుండి ప్రజలు దాని ప్రవర్తనను గమనించుచుండెదరు. వారి ప్రవర్తనలోని మంచి చెడుగులను లోక్‌సభలో జరుగు ప్రసంగముల సహాయమున అవగాహన చేసుకొని, పాత మంత్రివర్గము ఇంకొకపర్యాయము అధికారములో ప్రవేశించుటకు అర్హతకలదియా, లేనిదియా అన్న దానిని వారు తీర్మా

నించుకొనుచున్నారు. అందుచేత ఎవరు మంత్రులు కావలసినది, ఎవరు మంత్రివర్గమునుండి తొలగి పోవలసినది వాస్తవముగ నిర్ణయించువారు ప్రజలగుచున్నారు. మంత్రివర్గమువారు ఎవరికి బాధ్యులు అను ప్రశ్నకు, ప్రజలకు బాధ్యులు అన్న సమాధానములో ఎక్కువ సత్యమున్నది. వారు తాత్కాలికముగ లోక్‌సభకు బాధ్యులు, దీర్ఘకాల దృష్ట్యా ప్రజలకు బాధ్యులు.

## మంత్రివర్గము చేతిలోని వజ్రాయుధము

లోక్‌సభతో అధిక సంఖ్యాబలమును సంపాదించిన మంత్రివర్గము దరిమిలాను సాధారణ ఎన్నికలు జరుగువరకు విశ్వాస రాహిత్యతీర్మానము మూలముగ అధికారమును పోగొట్టుకొనకుండుటకు ఇంకొక ప్రబల కారణము కలదు. లోక్‌సభ యొక్క జీవిత కాలము అయిదు సంవత్సరములైనను, మధ్య కాలములోనే దానిని రద్దు చేయుటకును, సాధారణ ఎన్నికలు జరుపుటకును మంత్రివర్గమునకు హక్కు గలదు. (ఇవియే ప్రస్తుతము ఒరిస్సాలో జరుగుచున్నటువంటి మధ్యాంతర ఎన్నికలు) ఇది మంత్రివర్గము చేతిలోఉండు వజ్రాయుధము. మంత్రివర్గమును తొలగించు ఉద్దేశముతో అధికార పార్టీ నుండి చీలిపోయిన సభ్యులు ప్రతిపక్షసభ్యులు కలిసి విశ్వాస రాహిత్య తీర్మానముచేయప్రయత్నించినయెడల మంత్రివర్గము లోక్‌సభను రద్దు చేయవలసినదిగా అధ్యక్షుని కోరడము తప్పదు. సాధారణముగ అట్టి కోరికను మన్నించ వలసిఉన్నది. ఇట్టి ఆయుధమును మంత్రివర్గము ప్రయోగించుట సాధారణముగ లోక్‌సభలోని సభ్యులు ఇష్టపడరు. అయిదు సంవత్సరములు పూర్తియగువరకు సభ్యత్వ లాభమును పొందగోరినవారు మధ్యాంతరమున దానిని పోగొట్టుకొన సిద్ధపడెదరా? తిరిగి ఎన్నికలలో అభ్యర్థులుగ నిలబడుట అనిన ఖర్చుతోడను, శ్రమతోడను కూడుకొనిన పని. వాటిని లక్ష్యపెట్టక నిలబడినను విజయము లభించగలదను నమ్మకములేదు. ఇందుచేత లోక్‌సభలోని సభ్యులు మంత్రివర్గముపై విశ్వాసరాహిత్య తీర్మానమును చేయుటకు జంకుచుందురు. కొంతవరకు అది ఆత్మహత్యవంటిదే.

పై వివరణనుబట్టి (1) ప్రజాస్వామికప్రభుత్వము బాధ్యతతో కూడిన ప్రభుత్వమనియు, (2) మన పరిపాలన విధానములో బాధ్యతను వహించువారు మంత్రివర్గమువారనియు (అధ్యక్షుడు కాడనియు), (3) మూల శాసనదృష్ట్యా వారు లోక్‌సభకు బాధ్యులనియు, (4) కొంతవరకు వారు రాజ్యసభకు కూడ బాధ్యులనియు, (5) లోక్‌సభవారు ప్రశ్నలు, చర్చలు, విమర్శలు మొదలగు సాధనముల ద్వారా మంత్రివర్గమువారు బాధ్యతతో ప్రవర్తించునట్లు చేయుచున్నారనియు, (6) కాని ఈకాలపు రాజకీయ పార్టీల నిర్మాణవిధానము మూలమున ఇవి మంత్రుల ప్రవర్తనను వెంట వెంటనే మార్చగలవి కావనియు, (7) వీటి ప్రయోజనము ప్రజల వైఖరినిమార్చి, మంత్రివర్గమును ప్రజలకు బాధ్యులుగ చేయుట అనియు, (8) లోక్‌సభను రద్దుజేయగల మంత్రివర్గపు అధికారము ఈ సందర్భములో ప్రాధాన్యము వహించుచున్నదనియు స్పష్టమగుచున్నది.

## మంత్రులసమష్టి బాధ్యత

ఆఖరున ఇంకొక విషయమునుగురించి ప్రస్తావించ వలసి ఉన్నది.

మంత్రివర్గపు బాధ్యత సమష్టిబాధ్యత అనునదియే ఈ విషయము. మంత్రివర్గమున కంతకు ప్రధాన మంత్రి నాయకుడు. అతనిది కీలకస్థానము. తక్కిన మంత్రులందరు అతడు నియమించినవారు. అతనికి ఇష్టములేనివాడు మంత్రిగా ఉండుటకు వీలులేదు. అతని నాయకత్వము మూలమున మంత్రులందరు సమష్టిగా పని చేయుట వీలగుచున్నది. సమష్టి బాధ్యత అనగా, ఏ మంత్రితో లోపము కనుపించినను ఆ లోపమునకు తక్కిన మంత్రులు కూడ జవాబుదారిగా ఉండుట. వారిలో వారికి అభిప్రాయ భేదము లెన్ని ఉన్నను వారందరు కలిసి ఒక తీర్మానమునకు వచ్చినప్పుడు వారందరు దానిని సమర్థించవలసి ఉన్నది. సమర్థించలేనివాడు మంత్రిత్వమును వదలుకొనవలెను. సమష్టిబాధ్యత మూలమున మంత్రులందరు కలసికట్టుగా పనిచేయువారవుతున్నారు. వారిలో చీలికలు ఉన్నను అవి విషమరూపము ధరించవు.

## మిశ్రమ మంత్రివర్గములు

మంత్రివర్గ బాధ్యత అన్ని పరిస్థితులలో ఒకే విధముగ నుండదు. లోక్‌సభలో ఏ రాజకీయపార్టీకి అధిక సంఖ్యాబలములేక రెండు మూడు పార్టీలు కలిసిన పక్షమునగాని మంత్రివర్గనిర్మాణము జరుగనప్పుడు మంత్రివర్గ బాధ్యతలో కొన్ని మార్పులు రాక తప్పవు. మిశ్రమ మంత్రివర్గములకు శుద్ధ మంత్రివర్గములకుగల బలము, స్థిరత్వము ఉండవు. అట్టి మంత్రి వర్గములు అనుసరించు విధానములకు ఏ రాజకీయ పార్టీ ఎంతవరకు బాధ్యత వహించవలసిఉన్నదో ప్రజలు నిర్ణయించుకొనుట కూడ కష్టము. ఎన్నికలలో ఏ పార్టీని బలపరచుట మంచిదో వారు తీర్మానించుకొనలేని స్థితిలో ఉండెదరు.

ఇదిగాక మంత్రివర్గము బాధ్యతతో ప్రవర్తించుచున్నది లేనిది రాజకీయపార్టీలలోని గుణ దోషములబట్టియే గాక, ప్రజలలో ప్రజాస్వామిక విధానమందుగల గౌరవాభిమానములబట్టి, రాజకీయవిషయములందు వారికిగల శ్రద్ధాభక్తులబట్టి నిర్ణయమగుచున్నది. ఈ విషయములో మనమింకను వెనుకబడియున్నాము. ప్రజాస్వామికానుభవములో మనమింకను శైశవదశలో ఉన్నామనియే చెప్పవలసి ఉన్నది.

# వివాహంలో కలహం

## శ్రీ పోతుకూచి సాంబశివరావు

దయ పవనాలు చల్లగా వీస్తున్నాయి.

శేఖరం మగతనిద్రలో మంచంమీద దొర్లాడు.

తూతూ బాకాలు, బాజా భజంత్రీల రొదలు కలలో. కలలోంచి చెవుల్లో గింగురుమంటున్నాయి.

గుండె వేగంగా కొట్టుకుంటోంది. తలతిరిగింది— పెళ్ళి పందిరిలోంచి బయటికి వచ్చేశాడు. ఆ కంగారులో వీధి గుమ్మం తలకి తగిలింది. మెళుకువ వచ్చింది.

బద్ధకంగా లేచికూర్చున్నాడు. దురదృష్టకరమైన దినాలన్నిటిలో యీరోజు ముఖ్యమైంది అనుకున్నాడు శేఖరం.

కాలకృత్యాలు తీర్చుకుని, కాఫీ త్రాగి, మనసులోని బాధలు తెలియకుండా మామూలుగా ముస్తాబయి కొన్న పెళ్ళికానుక చేతిలో పెట్టుకుని వీధిగుమ్మంవైపు నడిచాడు.

గుమ్మందగ్గర ఎదురుగా సత్యవతి ప్రత్యక్షమయింది. శేఖరం ఆశ్చర్యపోయాడు.

ఎక్కడి సత్యవతి! ఎందుకు వచ్చింది! ముఖ్యంగా మనస్సు బాగులేని యీ సమయంలో—శేఖరం ఆవేదనతో అలజడి చెందాడు.

ఒకరూ మాట్లాడలేక మౌనంగా నిలుచున్నారు ఒక నిమిషం.

‘ఎక్కడినుంచి యీరాక?’

శేఖరం పలకరించాడు.

‘నీకోసం.....నేను ఉండలేకపోయాను, యింటిదగ్గర.— ఎన్నాళ్ళు యీ బాధలు భరించడం.....రెండేళ్ళు గడిచిపోయాయి నిన్ను చూసి!

‘నీ ఉ...ద్దేశ్యం నాకు బోధపడటంలేదు. నా పరిస్థితి అంతా నీకు ఏనాడో చెప్పాను.... యిలా పారిపోయివస్తే....మీ వాళ్ళు ఏమనుకుంటారు?

‘ఏమన్నా అనుకోనీ.....నేను నీ పాదాలదగ్గరే ఉండి పోతా.....’సత్యవతి అమాంతంగా పెల్లుబికి ఏడ్చి, చేతిలోని బట్టలసంచీ క్రిందకు జారవిడిచి, శేఖరం పాదాలమీద వాలి పోయింది.

శేఖరానికి మానసిక సంఘర్షణ మరింత హెచ్చింది.

ఆశించిన వనితకు వివాహమవుతోంది.

ఆశించని వనిత తన్ను వెన్నంటింది.

‘నువ్వు యిలా రావడం నాకిష్టంలేదు.....తిరిగి వెళ్ళిపో మీ యింటికి’ శేఖరం మొండిగా కూకలేశాడు.

‘నీకోసం....అన్నీ తెగించి—యిలావస్తే.....యిదేనా మాట్లాడడం.....నీ హృదయంలో కనికరంలేదా.....మిమ్మల్ని చూసినప్పటినుంచి......’సత్యవతి రోదనస్థాయి పెరిగింది.

శేఖరం చికాకు హెచ్చయింది.

‘నేను పనిమీద వెళ్ళిపోతున్నాను....ఆ తర్వాత నీ యిష్టం.’ శేఖరం ఒకడుగు ముందుకు వేశాడు.

‘బతిమాలుతున్నా మిమ్మల్ని ఉండమని....నేను యింటికివస్తే మీరు వెళ్ళిపోతారా. ఇది న్యాయమేనా....!’

‘క్షమించు సత్యవతీ....నేను నీతో మాట్లాడే స్థితిలో లేను....’శేఖరం తలుపులు తెరిచి, యిల్లు సత్యవతికి వదిలేసి వేగంగా నడిచి రోడ్డుమీదకు వచ్చాడు.

ఇంటి దాసి పనులు పూర్తి చేసుకుని మూలగా ఏడుస్తూ కూర్చున్న సత్యవతివైపు వింతగా జాలిగా చూసింది.

‘మీరుంటారా అమ్మ.....తాళం యిదిగో’ అందిచ్చి దాసి నిష్క్రమించింది.

ఆ నిర్జనగృహం తలుపులు బంధించింది సత్యవతి. కాళ్ళీడ్చుకుంటూ పడక గదిలో చాపమీదకువాలి ఒరిగి ఏడ్చింది. ‘‘ఏమిటీ మనస్తత్వం’’ మథనపడింది సత్యవతి.

‘సత్యవతీ! నువ్వంటే నాకు ఎంతో జాలి.....నీ జీవితం చూస్తోంటే గుండె తరుక్కుపోతుంది.... నాకే దైవం శక్తి యిస్తే నీలాంటి అబలలను జీవితమంతా కాపాడతాను’ శేఖరం అన్నమాటలు సత్యవతి నెమరువేసుకుంది.

ఆనాడు తన యింట్లో వరండాలో వెన్నెల వెలుగుల్లో తన తల్లిముందు వితంతువుల కష్టాలగూర్చి చెబుతూ శేఖరం అన్న మాటలు సత్యం కాదేమో అని అనుమానపడింది. తల్లిని విడిచి, తమ్ముడిని లెక్క చెయ్యక, అతనికోసం వస్తే, తనకేమీ తెలియని వనిత ఎవరో వచ్చినట్లు చూస్తే ఏమనుకోవాలి....

‘ఎప్పుడైనా మా వూరు రా...నీకు స్వాగతం!’ అన్న గంభీరమైన శేఖరం మాటలు ఏమైపోయాయి.

శేఖరం చూపులో ఆత్మీయత, జాలి కనిపించడంలేదు.

ఏదో పిచ్చి, ఆవేదన వ్యక్తమవుతున్నాయి.

‘తన్ను శేఖరం ప్రేమించలేదు. కాని శేఖరాన్ని వదలలేని అభిమానం పెంచుకుంది తను’ సత్యవతి కళ్ళు చెమ్మగిల్లాయి. ఉబికివచ్చే దుఃఖంతో గట్టిగా ఏడ్చింది.

శేఖరానికి ఏర్పడిన సన్నివేశం గందరగోళంగా ఉంది. తలలో ఏవో అగ్నిగోళాలు బ్రద్దలవుతున్నాయి.

# వివాహంలో కలహం

''చదువులేని పల్లెటూరి సత్యవతి....మొండి...చెపితే అర్థం కాదు......మోటు అభిమానం....తన్ను ఎందరో అభిమానించారు.....కాని తనకు స్నేహభావం తప్ప మరొకటిలేదే!' శేఖరం తనలో తర్కించుకున్నాడు.

బస్సుఎక్కి, ఆగినచోట దిగి, రిక్షాఎక్కి, పెళ్ళి పందిర చేరాడు శేఖరం... యంత్రంలా నడిచాడు....పెళ్ళి పందిర హడావిడిగా ఉంది.....పెళ్ళివారు వచ్చే అతిథులకు స్వాగతం చెప్పారు... అందరితోపాటు శేఖరానికీ.—ఆమె తప్ప ఎవరూ తనకు తెలియదు.... ఆమెకు వివాహమవుతోంది.....తెచ్చిన పెళ్ళికానుక స్వాగతం చెప్పిన తెలియనివ్యక్తి చేతిలో జార్చాడు.....మౌనంగా పోయి కుర్చీలో కూర్చున్నాడు. పెళ్ళి పందిరకు వ్రేలాడుతున్న మామిడి తోరణాలు కంటిముందు భూతవైద్యుని వేపకొమ్మల్లా ఆడుతున్నాయి. తూతూబాకాలు, బాజాలు, గుండెల్లో మారు మ్రోగుతున్నాయి. పందిరకు వ్రేలాడే కాగితం రంగు బుట్టలు గిర్రున తిరుగుతూ వూగుతున్నాయి. సముద్రం మధ్య సుడిగుండంలోని పడవలా.....మంత్రాల ఉచ్చారణలు మనస్సులో దిమ్ము ఎక్కువ చేస్తున్నాయి. ఎవరో ఎరుగున్నవారు శేఖరానికి నమస్కరించారు....యాంత్రికంగా చెయ్యెత్తి అభినందన చెప్పాడు శేఖరం—లేచాడు ఏదో ఆలోచనతో పెళ్ళి పూర్తి కాకుండానే...నడుస్తున్న అతని చేతిలో తాంబూలం పెట్టారు పెళ్ళివారు. మతిచెడినవాడిలా బయటికి వచ్చేశాడు శేఖరం. ఎదురుగా బిచ్చగాడు అరిచాడు.....

''బాబయ్యా.......తమ దయ!'

చేతిలోని తాంబూలం ముష్టివాడి. గిన్నెలో వేశాడు శేఖరం. బిచ్చగాడు అరిటిపండు తింటూ వెళ్ళిపోయాడు.

ఆనాటితో మూడు సంవత్సరాలు గడిచాయి. మొగ్గగా లేచిన వూహ, విచ్చుకున్న ఆశ, పువ్వులా పరిణమించిన లోని ప్రేమ, నేడు వాడిపోయి, రాలిపోయాయి.

'నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంది.' అన్న శేఖరం మాటలకు 'నా నుంచి ఏమీ ఆశించకండి' అంటూ ఆమె పకపక నవ్వింది. ఆ నవ్వు ప్రతిధ్వనించింది. అతని గుండె గోడలుతాకి బెల్లులు వూడకొట్టింది. ఇప్పటికీ ఆ నవ్వు గుండెల్లో ప్రతిధ్వనిస్తోంది.

'స్త్రీ కోరిక ఏమిటి? ఎందుకు పురుషుణ్ణి నిరాకరిస్తుంది. పిరికితనం, హోదాలేమి, దారిద్ర్యం, తెలివితక్కువ—ఇవన్నీ కారణాలు కావచ్చు, స్త్రీ పురుషుణ్ణి చులకనగా చూడటానికి....కాని శేఖరంలో యిదేమీలేదే! కాని ఆమె నిరాకరించింది శేఖరాన్ని. అనుకోని ఆ సంఘటన శేఖరం దర్పానికి ఒక గొడ్డలి పెట్టు.

ఒకప్పుడు శేఖరం పెళ్ళిచూపులకు వెడితే మర్నాడు పెళ్ళికూతురు తండ్రి వచ్చి వివరించాడు! 'అతన్నితప్ప యింకోరిని వివాహం చేసుకోనంటోంది ఆ పిల్ల' అని. శేఖరం లెక్క చెయ్యలేదు. ఆపిల్ల కొన్ని ఏండ్లు పెళ్ళి చేసుకోలేదని వినికిడి.

చదువుకునే రోజుల్లో వనజ ప్రేమించి, వివాహం చేసుకోమని అర్థిస్తే, శేఖరం నవ్వేశాడు. ఆమె కన్నీరు కార్చింది.

లత స్నేహితురాలు కమలను పెళ్ళి చేసుకోనంటే ఆమె మాట్లాడ్డమే మానేసింది.

తన్ను పెళ్ళిచేసుకోనన్న ఆమెనుగురించి తనేమి చేయాలి! పెళ్ళికూతురు వనజ, కమల.....వారి క్రోధం, క్షోభ, అసూయ, ఆవేదన......తన్ను చుట్టుముట్టినట్లు బాధపడ్డాడు శేఖరం. ఈ పరిస్థితికి పరీక్షగా సత్యవతి రాక! శేఖరం యిల్లు చేరాడు.

సత్యవతి తలుపు తీసింది.

శేఖరం గబగబ రెండడుగులువేసి, మేజాసొరుగులోని కొన్ని కాగితాలు, ఫైల్సు తీసుకుని మళ్ళీ బయటికి బయలుదేరాడు.

'ఇదేనా మీ ప్రవర్తన'

రుసరుసలాడింది సత్యవతి.

'లేకపోతే ఏంచెయ్యమంటావు'

'కోరి యింతదూరం మీకోసంవస్తే—మాటేనా లేకుండా వెళ్ళిపోవడం—న్యాయమేనా?'

'నా పరిస్థితి బాగా లేదు—నా మనస్సు బాగులేదు. ఇంట్లో వుండలేను.....బయట తిరగలేను......ఆఫీసుకు పోలేను.....ఏం చేయాలో తోచక ఎక్కడికో పోతున్నాను.'

'అంత ఉపద్రవం ఏం వచ్చింది'

'అది నీ కనవసరం'

శేఖరం వెళ్ళిపోయాడు వీధిలోకి.

సత్యవతి నిర్ఘాంతపోయింది.

'ఏమండీ' కేకపెట్టింది సత్యవతి.

ఆ కేక ప్రతిధ్వనించి, ప్రక్కయింటివారి పరిశీలనకు గురియై, గాలిలో కలిసిపోయింది.

సత్యవతికి ఆత్మాభిమానం దెబ్బతింది. తాను ఎందుకు వచ్చినట్లు?

అన్న, వదినె, పెట్టేబాధలు భరించలేక చచ్చిపోదామనుకుంది. చిన్నప్పుడే పెండ్లిఅయిన భర్త చనిపోవటంతో తమకు బరువైపోయిందని సత్యవతిని వదినె దుమ్మెత్తిపోసేది. తల్లిమాట వినని కొడుకు సత్యవతి, భార్య మధ్య కొట్లాటలు చూస్తూ వూరకునేవాడు. తల్లి వోరిమి వహించి యింట్లో ఉండిపోయింది కొన్నాళ్ళు......

శేఖరం ఒకరోజు వచ్చాడు సత్యవతిఅన్నగారిని కలుసుకుందుకు. అక్కడే బసచేశాడు. ఒక సాయంత్రం వదినె, సినీమాకు పోయింది. అన్నయ్య ఆఫీసునుంచి యింకా రాలేదు. ఆ రోజల్లా శేఖరంతో గడిపింది. శేఖరం కబుర్లు చెప్పాడు. ఆమె కష్టాలు విని జాలి చూపాడు. ఇటువంటి కష్టాలు పడేకంటె పెళ్ళి చేసుకుని హాయిగా బ్రతకాలన్నాడు. తాను సాయం చేస్తానన్నాడు. అవసరమైతే తనే వివాహం చేసుకుంటానన్నాడు......సత్యవతి ఆనందించింది....చిన్నప్పుడు శేఖరాన్ని బాగా ఎరుగును....అతనంటే ఎక్కువ యిష్ట పడేది......కాని

మనస్సులోని కోరికలు తీరలేదు..... ప్రక్కవేసినప్పుడు కాఫీ యిచ్చినప్పుడు.....సత్యవతి సిగ్గు పడింది.....శేఖరం చుంబించాడు.....సత్యవతి ఆ సన్నివేశం కోరింది, శేఖరాన్ని దగ్గరకు చేర్చింది. తియ్యటి మాటల్లో విషంలాంటి మాయ ఉంటుందనుకోలేదు—సత్యవతి గొల్లున ఏడ్చింది.

శేఖరం తిన్న కంచం వంటింట్లో కాళీగాఉంది' నీళ్ళతో... కూర, అన్నం, గిన్నెలు మూలగాపడి ఉన్నాయి. అన్నం వండుకు తిందామనుకుంది. కాని మనస్కరించలేదు. రైలు ప్రయాణంలో నలిగిన దుస్తులు విడిచి, స్నానంచేసి, బరువుగా నిట్టూరుస్తూ పడుకుంది.

'శేఖరం మనస్సు ఎందుకు బాగులేదు!.....ఏం కష్టాల్లో ఉన్నాడో, అడగడానికి బదులు తాను బలవంతపు అతిథిలా యింట్లో చొరబడడం సమంజసంగా లేదు అనుకుంది సత్యవతి. అయినా సాయంత్రం యింటికి వచ్చాక మనస్సు చల్లపరుచుకుని తనతో సాఫీగా మాట్లాడవచ్చని ఆశించింది ఆమె.

శేఖరం ఆఫీసులో అడుగుపెట్టాడు. ఆలస్యమయిందేమని ఆఫీసరు ప్రశ్నించాడు ముఖం చిట్లించి. తల ఒంచుకుని ఫైళ్ళు తీశాడు. రాశాడు.....బుర్ర ఉపయోగించడంలేదు..... ఆ పనికి బుర్ర అనవసరం అని శేఖరం ధీమా.....రోజూ చేసే పనే.....ఎటొచ్చీ అక్షరాలు వేరు.

ఆఫీసులో పనిచేసే ఊర్మిళ పలకరించింది. ఎక్కడో చూస్తూ వెర్రి నవ్వు నవ్వాడు శేఖరం.

'ఈవేళ పరధ్యానం చిత్తగిస్తున్నారు. ఒక సిగరెట్టు కాల్చకూడదూ' సిగరెట్ల ఏజంటులా పూర్ణిమ దగ్గరగాజేరి శేఖరంచెవిలో ఊదింది.

గడియారం టిక్కు టక్కుమని కదిలింది. అయిదు దాటింది.

శేఖరం బూట్లు కూడా టిక్కు టక్కుమంటూ బయటికి నడిచాయి.

ఇంటికి వెళ్ళాడు.

సత్యవతి నేలమీదపడుకుని దొర్లుతోంది ఏడుస్తూ.

'వచ్చారా'

'రాక చస్తానా' శేఖరం అరిచాడు.

'నన్ను నిజంగా పొమ్మన్నారా....అయితే రైలు ఎక్కించండి' సత్యవతి బెదిరించింది.

శేఖరం సిద్ధమైనాడు.

సత్యవతి సంచీ పట్టుకుంది.

శేఖరం గుమ్మంవైపు నడిచాడు రైలు స్టేషనుకోసం. సత్యవతి అతని ప్రవర్తనకు ఆశ్చర్యపోయింది.

'ఒక్కరాత్రి నన్నిక్కడఉండనివ్వరూ?' ప్రాధేయపడింది.

'వీల్లేదు'

'మరి నన్ను ఎందుకు తాకారు ఆరోజు?'

'బుద్ధిలేక'

సత్యవతి గొల్లుమంది. సంచీ యింట్లోకి విసిరివేసింది. మంచంమీద ఒరిగి ఏడ్చింది.

'మీకు వండి పెడతా' సత్యవతి లేచింది.

'నేను భోజనం చెయ్యను.'

'ఎందుకు?

'ఆకలి లేదు'

శేఖరం కర్కశత్వం విచిత్రంగా తోచింది. ఎప్పుడూ మందహాసంతో కనిపించే శేఖరం రాయిలా నిలుచుని మాట్లాడడం చాలా బాధ కల్గించింది.

సత్యవతికి కోపం వచ్చింది.

'నేను యీ యింట్లోంచి చచ్చినా కదలను' అరిచింది మూర్ఖంగా.

'నువ్వు కదలకపోతే—నేను కదిలిపోతాను'

శేఖరం దుస్తులు మార్చుకున్నాడు.

వీధివైపు బయలుదేరాడు.

'మీరు బయటికి వెడితే నేను చచ్చినంత ఒట్టు.'

'మరీ మంచిది' శేఖరం రుసరుసలాడుతూ బయటికి వెళ్ళిపోయాడు.

సత్యవతి ఉక్రోషంతో తల తలుపునేసి కొట్టుకుంది. ఆ శబ్దంవింటూ తన కేమీ సంబంధం లేదన్నట్టు నిష్క్రమించాడు శేఖరం.

సత్యవతిని ఆకలి దహించేస్తోంది.

గుండె మండిపోతోంది.

కళ్ళు దుఃఖంతో ఎర్రబడ్డాయి.

శేఖరం తత్వం అర్థంకాలేదు...

సత్యవతి మనస్సు సర్దుకుని, లేచి వంట చేసింది. చెల్లాచెదురుగాఉన్న యిల్లంతా శుభ్రం చేసింది. పుస్తకాలు, బట్టలు, అన్నీ పొందికగా అమర్చింది. కుర్చీలు, మేజాలు తుడిచింది. పక్కమీద క్రొత్త దుప్పటి పరిచింది. గడియారం చూసింది. రాత్రి తొమ్మిది దాటింది.

తలుపు చప్పుడైంది.

శేఖరం వచ్చాడు. సత్యవతి సంతోషించింది. తాను చేసిన వంట చూపించింది.

ఇల్లంతా అలంకరించబడిఉంది.

శేఖరం పేలవంగా నవ్వాడు.

'ఇలా నన్ను ఆకర్షిద్దామనా? ఈ జన్మలో యింక ఎవరూ నన్ను యింక ఆకర్షించలేరు.!

చొక్కా విసిరేసి, వరండాలో చాప పర్చుకుని పిచ్చి పాటలు మొదలుపెట్టాడు.

# వివాహంలో కలహం

సత్యవతికి అర్థమయింది శేఖరం త్రాగివచ్చాడని. ఆశ్చర్యం కలిగింది.

జాలిగా దగ్గరకు చేరింది.

శేఖరం ఆమెను గెంటేశాడు.

'శేఖరం!' అనునయంగా పిలిచింది సత్యవతి.

'చచ్చాడు' అరిచాడు శేఖరం.

మళ్ళీ అతని ఒడిలోకి చేరింది సత్యవతి.

ఆశగా ఆలింగనం చేసుకుంది.

బలవంతంగా నేలమీదకు తోసేశాడు శేఖరం.

సత్యవతి వదలకుండా గింజుకుంది—ఏడ్చింది. శేఖరం ఆమె చంపపైన ఛెళ్ళున కొట్టాడు.

నీరసంతోఉన్న సత్యవతికి కళ్ళు తిరిగాయి.

ఒళ్ళు జలదరించింది.

ఉక్రోషం, అసూయ ఆమెలో తాండవించాయి. మనిషిలోని మోటు స్వభావం రెచ్చింది. శేఖరాన్ని అల్లరిపాలు చెయ్యాలనుకుంది కసిగా.

గొంతెత్తి ఏడ్చింది—కేక వేసింది—శేఖరం ఆ పరిస్థితి చూశాడు.....వీధిలోకి నిష్క్రమించాడు. ఆమెవైపు ఏభయి రూపాయలు విసిరి 'నా యింట్లోంచి తక్షణం పో' ఉరిమాడు శేఖరం నిష్క్రమిస్తూ.

సత్యవతి కేకకు ప్రక్కయింటి జనం పోగయ్యారు. ప్రశ్నలకు సత్యవతి సమాధానం యివ్వలేదు ఏడ్వడం తప్ప.

కాస్సేపు గడిచాక తలుపులు మూసి వీధిలోకి నిష్క్రమించింది సత్యవతి.

రిక్షా ఎక్కింది......రిక్షా నడుస్తోంది.

వెన్నెల రాత్రి......

చల్లటి గాలి....

'ఎక్కడికి' అడిగాడు రిక్షావాడు...

'నడు....' సత్యవతి ముభావంగా మూలిగింది. తలకు కొంగు కప్పుకుంది పరదాగా......రిక్షా రెండు గంటలు వీధిలో నడిచింది.....,సత్యవతి ఆగింది. రిక్షాకు రెండు రూపాయలు యిచ్చి పంపింది.

బజారులో అరుగువార కూర్చుంది ఏడుస్తూ.

.....వీధిలో ఏవో కూనిరాగాలు.....పాటలు....తూలుతూ నడుస్తున్నాడు శేఖరం

తన చుట్టూ వీధి పడుచులు అల్లరిగా నిలుచున్నారు... శేఖరం ఆ వైపు వచ్చాడు.

వీధి పడుచులు శేఖరందగ్గరికి చేరారు....

'మీరుకాదు.....ఆపిల్ల'

సత్యవతి మేలి ముసుగు సవరించుకుంది—ముఖం కనిపించకుండా.......

ఇద్దరు రిక్షా ఎక్కారు.

శేఖరం మితిమీరితాగిన మైకంలో తూలుతూ పేలుతున్నాడు.......

దారిలో రిక్షాను వదిలేశాడు....ఇద్దరూ నడుస్తున్నారు. ఒక సందులో—మలుపులో వెన్నెల నీడలో....ఇద్దరూ కలిసిపోయారు.....

శేఖరం మరుక్షణంలో మారిపోయాడు. ఆమె జ్ఞాపకం వచ్చింది......సత్యవతిని. తిట్టాడు.....కొట్టాడు...

సత్యవతి ఏడ్చింది.....అరిచింది.....

డ్యూటీ పోలీసు గస్తీ కాస్తూ వాళ్ళని చూశాడు.....

'ఏమిటని' ప్రశ్నించాడు.

శేఖరం తూలుతూ పేలాడు.

ఒక ఈలకు మరికొందరు పోలీసులు.....ఒక కారు....

ఇద్దరికీ బేడీలు తగిలించాడు, బీటు పోలీసు.

అంతా చిత్రంగా తిరుగుతోంది. శేఖరం దృష్టిలో. గింజుకున్నాడు శేఖరం.

పోలీసు లాఠీతో నెత్తిమీద కొట్టాడు. శేఖరం ఒరిగిపోయాడు.

..........................

తెల్లవారింది.....కిటికీ ఊచల్లోంచి సూర్య కిరణాలు తొంగిచూస్తున్నాయి. శేఖరానికి మెలకువ వచ్చింది. కళ్ళు తెరవగానే ప్రక్కనే సత్యవతి.

ఎదురుగా జైలు గోడలు.

సత్యవతి కంటి కొలకుల్లో వేడి కన్నీరు నిలిచింది.

'నేను వెళ్ళిపోతాను శేఖరం! శిక్ష పూర్తయ్యాక.

శేఖరం నిశ్చేష్టుడై నిలుచుండిపోయాడు.

ఒక క్షణం నిశ్శబ్దం.

గత దినంనాటి పెళ్ళిబాజాలు చెవుల్లో గింగురుమన్నాయి.

'నానుంచి మీరేమీ ఆశించకండి' ఆమె పకపక నవ్వు శేఖరం గుండెల్లో గునపం పోట్లు పొడిచింది!

# సూఫీ వేదాంతి శర్మద్ షహీద్

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

ఇహమునకు హేమవిద్య, పరమునకు బ్రహ్మవిద్య అంటారు పెద్దలు. మనము ఈ రెండు పరస్పర విరుద్ధము లైనవని అనుకుంటాము. కాని తెలిసినవారు చెప్పు ప్రకారము, ఈ రెండు ఒకే వస్తువు రెండు ముఖాలు. వీటిలో ఒక ముఖం శివుడైతే, రెండవ ముఖం శక్తి అవుతుంది. శివుడు పురుషుడు, శక్తి ప్రకృతి. పురుషుడు బ్రహ్మజ్ఞానం, ప్రకృతి హేమశక్తి. శక్తిని హిరణ్మయి అని, హిరణ్యప్రాకార అని అన్నారు. శివుడు అర్ధనారీశ్వరుడు. సగంభాగం పురుషుడు, సగంభాగం స్త్రీ—ఇట్లే బ్రహ్మవిద్య. హేమ విద్య. బ్రహ్మవిద్య తెలిసిన వానికి హేమ విద్య కూడా కరతలామలకం కాగలదు. నాగార్జునాచార్యులు, సదాశివేశ్వరుడు, వేమన్న ఇట్టివారే. వారికి బ్రహ్మవిద్య ఎంత అనుభవమో, హేమ విద్య కూడా అంతే అనుభవం. కాని బ్రహ్మజ్ఞానులు, హేమమునకు పాల్పడరు. బ్రహ్మవిద్యకు, హేమ విద్యకు విధాన మొకటే. ఈశావాస్యోపనిషత్తు 16 వ మంత్రంలో 'హిరణ్మయేన పాత్రేణ సత్యసాపిహితం ముఖం?' అని ఉన్నది. ఈ మంత్రమునకు అనేకులు అనేకమయిన అర్థాలు వ్రాశారు. యోగు లీ అర్థం పైకి వెల్లడించలేదు. హిరణ్మయపాత్ర అనుదానికి షట్చక్రములలోని చక్రమని నా అభిప్రాయము. కబీరు ఒకచోట కనక కోఠరీ అని వాడాడు షట్చక్రములకు. కనక కోఠరీ, హిరణ్మయ పాత్ర, హిరణ్మయప్రాకారం ఒకటే అర్థం కలిగి ఉన్నవి. కుండలినీ యోగం ముఖ్యోద్దేశ్యం స్థూలమును సూక్ష్మములోనికి మార్చుట. పంచభూతాలను సూక్ష్మంలోనికి మార్చడం ఇది. భూమిని నీటిలోనికి, నీటిని అగ్నిలోనికి ఇట్లా మార్చుకుంటూ పోవుట. కుండలిని ఆగ్నేయ శక్తి. ఈ అగ్నివల్ల వస్తుపరిణామం జరుగుతున్నది. యోగిఒకరు ఒక కుష్ఠరోగినిచూచి కనికరించి ఒక రాగిడబ్బు, కడివెడుపెరుగు, మజ్జిగ తెచ్చుకోమన్నాడు. ఆరాగి డబ్బును తామ్రంచేసి సూదిమొనంత రోగికి ఇచ్చి, తతిమ్మాది మట్టిలో కలిపివేశాడు. తామ్రం సేవించిన కుష్ఠరోగికి అపరిమితమైన దప్పిక అయింది. ఆ కడివెడు పెరుగు, మజ్జిగ త్రాగివేశాడు. అతని జబ్బు నయమైంది. ఈ తామ్ర విద్యవంటిదే హేమ విద్య. ఈ విద్య తెలిసిన మహాత్ములు స్వప్రయోజనానికి వినియోగించుకోరు. వారు గంజాయికి పైసాకోసం ఇతరులను ఆశ్రయించవలసిందే. అటువంటివారి హస్తాల్లో ఉన్నవి బ్రహ్మ విద్య, హేమ విద్య. వారు బ్రహ్మ స్వరూపులు. బ్రహ్మానందంలో మైమరచి తన్మయులై ఉండే సిద్ధపురుషులు వారు. బ్రహ్మానందంముందు మానవానందం సహస్రాంశం కూడా వుండదంటారు అనుభవజ్ఞులు. వారి జన్మ ధన్యం. వారి జీవితము మన కొక వెలుగు. ఇటువంటి వారిలో శర్మద్ షహీద్ ఒకరు. తన తలతీయ వచ్చిన కటికవానిలోను, వాని హస్తంలోని కరకు కరవాలంలోను ఈశ్వర దర్శనం పొందిన సాధకుడు. వ్యక్తావ్యక్త జ్ఞానములలోఉండి తన ప్రియదర్శనం చేసుకుని మధుర గానం చేసిన మహనీయుడు. మెడమీద కత్తివుంచి, చెప్పినట్లు వినమన్నా భయపడని వీరుడు! సమస్త మత పుష్పసౌరభం గ్రోలిన మధుమూర్తి. అక్కన్న మాదన్న రామదాసులనాడు ఆంధ్ర భూమిలో సంచరించిన అమరమూర్తి. పుట్టినది ఎక్కడో ఇరాక్ దేశంలో. మెట్టినది సింధు రాష్ట్రంలో. ఊపిరి విడిచినది ఢిల్లీ పట్టణంలో. పుట్టినది యూదు మతంలో. చదివినది క్రిస్టియన్ మతాన్నిగూర్చి, చేరినది ముసల్మాన్ మతం, ఆచరించినది సమస్త మతసారం!

## జీవిత చరిత్ర

శర్మద్‌షహీద్ జన్మభూమి ఇరాక్ అజీం. ఇతడు సుక్షేత్రమైన యూదు కుటుంబంలో 1628 సంవత్సరంలో జన్మించాడు. నాడు షా అబ్బాస్ రాజ్యం చేస్తున్నాడు. శర్మద్ పూర్వీకులు ఉత్తర ఇరాక్ రాష్ట్రం అర్మీనియాలో వుంటూండేవారు. వారి వృత్తి వ్యాపారం. నాడు కషాన్ పట్టణం వ్యాపారమునకు ప్రముఖ కేంద్రము. వ్యాపారం వృద్ధి చేసుకోదలచి ఆయన తండ్రి కషాన్ పట్టణం వచ్చాడు. ఇక్కడ మన కథా నాయకుడు జన్మించాడు. ఇతని ప్రాథమిక విద్య స్వచ్ఛమైన యూదు మత సిద్ధాంతములమీద జరిగింది. షహీద్ చిన్ననాటినుండి విద్యలో సాన పట్టిన వజ్రం. ఇతని విద్యా దాహం తనివి తీరనిది. దానికి అంతు లేదు. కొద్ది కాలముననే ఇతడు యూదు వేదాంత పండిత విద్యకు ప్రవేశార్హత సంపాదించుకొన్నాడు. చిన్ననాడే యూదుల వేదము మోసెస్ గ్రంథము కంఠతా పట్టాడు. ఇంత శక్తి యూదులలోనే అరుదయింది.. యూదు మతగురుస్థానీయులయిన రబ్బీ కాగల అర్హత ఇతను పొందాడు. కాని విద్యా దాహం తీరలేదు. తేనెటీగ ఏ పుష్పంలో ఎటువంటి మధువున్నదో అని ప్రతిపుష్పము తిరిగినట్లు తిరిగాడు. తర్వాత క్రిస్టియనుల నూతన నిబంధనలు ఇంకా కొన్ని మత గ్రంథాలు చదివాడు. మహమ్మదీయుల కురాన్ గ్రంథం పఠించాడు. కురాన్ గ్రంథ పఠన కాలంలో, ఇతనికి మహమ్మదీయ మత ప్రఖ్యాత పండితులతో స్నేహం కలిసింది. ఆనాడు షిరాజు పట్టణంలో ముల్లాసద్రా అని పిలవబడిన సద్రుద్దీన్ అనే పండితశ్రేష్ఠుడు, అబుల్‌ఖాసింఫందారోస్కి అను పండిత ప్రముఖుడు ఉండేవారు. ఈ పండితు లిద్దరు మత విషయంలో చాలా విశాల స్వతంత్రభావములు కలిగినవారు. వీరంటే సనాతనులయిన ముల్లాలకు అరికాలిమంట నెత్తికెక్కేది. ఇటువంటి వారితో

పరిచయం కల్గింది మన శర్మద్‌కు. వారివల్ల మతంలో అనేక విశాలభావములను ఆకళించుకొన్నాడు. దానితో ఇతనిలో మహత్తరమైన మార్పు వచ్చింది. తన పూర్వీకుల యూదు మతాన్ని వదలి, మహమ్మదీయ మతంలో ప్రవేశించాడు. ఈ విషయమై ఒక గేయం రచించాడు.

'అవిశ్వాసమును ఇస్లాంగా మార్చావు శర్మద్
పేరు ప్రఖ్యాతులు పొందావు శర్మద్'

సాహిత్యము మతము రెండు రెండునేత్రములు శర్మదుకు. మత గ్రంథములతోపాటు, అరబ్, పర్షియ సాహిత్యాలు చదివాడు. వీటిలో అనేక గ్రంథాలు వ్రాశాడు. అనేక రకాల పద్యాలు, గేయాలు రచించాడు. ఇతడు ఏక సంథాగ్రాహి. ఫర్‌హాటన్ నజిరిన్ మనశర్మద్ బైబిలు పాతనూతన నిబంధనలు కంఠతః అప్పజెప్పగలడని వ్రాశాడు. శర్మద్ అనేక భాషలలో పూర్ణపాండిత్యం గడించాడు. తర్వాత ముస్లిం మతం పుచ్చుకుని తన పట్టణం ఖాసాలో, వంశ వృత్తి వ్యాపారం కొనసాగించాడు. వ్యాపారంలో మునిగి తేలుతున్నా, విద్యాభ్యాసం మాత్రం వదలలేదు. అనేక గేయములను ఈకాలంలో వ్రాశాడు. వృద్ధాప్యంలో కూడా వ్రాశాడు కొన్ని గేయములు. కాని అతని యౌవనంలో చెప్పిన గేయములంత మధురముగా తర్వాత చెప్పినవి లేవు. అతనే అన్నాడు ఈ మాట గేయంలో

"చెప్పవలసిందేదో చిన్నప్పుడు చెప్పాను.
చెప్పలేను చిన్నప్పటివలె ఈనాడు"

## భారతదేశ ప్రయాణం

నాడు భారతభానుడు ప్రచండతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. ధనం దోసిళ్ళ కొలది ఆర్జించా లన్నా, భారత దేశమే! విద్య తనివితీర క్రోలవలెనన్నా భారతదేశమే! ముఖ్యంగా ఆధ్యాత్మిక విద్యలో పరిపూర్ణత్వం పొందాలంటే భారత భూమి ఋషి వాటికయింది. మన శర్మద్‌కు విద్యా ధనార్జనలలో తనివితీరటమనేది ప్రకృతిలోలేదు. వ్యాపారంచేసి సంచులు నింపుకు రావచ్చని నలుగురితోబాటు భారత దేశమునకు సముద్రంమీద ప్రయాణమైనాడు. ఒక ఓడనిండా వాణిజ్యపుసరుకు నింపుకుని భారతదేశం వచ్చాడు. నాడు సింధు రాష్ట్రమునకు ముఖ్య పట్టణం తట్టా. ఇది ఓడ రేవు పట్టణం. ఇక్కడ దిగాడు శర్మద్.

దీనితో శర్మద్ జీవితనాటకంలో ఒక తెర మారింది. భారత ప్రకృతి ఆధ్యాత్మికము, శర్మద్ ఒకనాడు తట్టాపట్టణ రాజవీధులలో వెడుతూ ఉన్నాడు. ఆ దారిలో ఒక బాలుని చూచాడు. ఈ బాలుడు దివ్య సుందర మోహన మూర్తి. ముఖంలోని తేజస్సు, పున్నమనాటి జాబిల్లి అందమును వెక్కిరిస్తున్నట్లుంది. అందులో సూదంటురాయికున్న ఆకర్షణ శక్తి వున్నది. శర్మద్ రసలోలుడు. ఈ పిల్లవాని ముఖపద్మంచూచి, అక్కడే నిలబడిపోయినాడు. ఆ ముఖం ఇతనిని తాళ్ళు పెట్టి కట్టి పడవేసింది. తన్మయుడైనాడు. మైమరిచాడు. అక్కడే పడిపోయినాడు. సౌందర్యమధుసేవ మితిమించిపోయింది. ఒళ్ళు తెలియక బజారులోనే వుండిపోయినాడు. శర్మదును మోహింపచేసిన పిల్లవానిపేరు అభయచందు. తాగిన వానికి ఒంటిమీద గుడ్డ, చేతిలో డబ్బు ఉండవు. అతని ఆనందమే ఆనందం. ఇట్లే శర్మద్ తన సమస్తమయినఆస్తి బీదలకు ఇచ్చివేశాడు. పైపంచ కూడా దానం చేశాడు. ఇతని స్థితిచూసి కనికరించి అభయచందు తండ్రి శర్మదును ఇంటికి తీసుకువెళ్ళి కొంతకాలం పోషించాడు. శర్మద్ సమాధిసిద్ధుడైనాడు. ఈ పరిణామం వచ్చింది తట్టాలో కాదంటారు కొందరు. రియాధుల్ అజిజిక్, పర్షియనుండి శర్మద్ మొదట దిగింది శరతు ఓడ రేవులోనని వ్రాశాడు.

మౌలానాఅబద్ శర్మద్ జీవితమునుగురించి వ్రాశారు. అందులో ఈ సన్నివేశము జరుగలేదని వ్రాశారు. కాని ఈ సన్నివేశమునకు నమ్మతగిన అనేక ప్రమాణాలున్నవి. అయితే అభయచందు శర్మద్ శిష్యుడేనని ఒప్పుకుంటాడు. ఈ సన్నివేశంవల్ల శర్మదుకు అపవాదు వస్తుందని అజాద్ అభిప్రాయ పడివుంటారు. ఇటువంటి సన్నివేశములు చరిత్రలో అనేకం ఉన్నవి. అభయ్ చందు ముఖం చూచి ప్రేమప్రవాహంలో కొట్టుకుపోయినాడంటే, అది పశు ప్రేమకాదు. ఇది మధుర భావం. మధురభక్తి. క్రైస్తవ, సూఫీ, హిందూ, ముసల్మాన్ మతాల్లో వున్నది. సాధకుడు పరిపూర్ణత్వం దగ్గిర చేరినవాడై వుండాలి. అట్టి వానికి కనుపించిన సౌందర్యం క్రమక్రమంగా అపరిమితమై సాధకుని ముంచి వేస్తుంది. శాక్తేయులు స్త్రీ రూపము ధ్యానిస్తారు. ఇట్టివారు ఆదర్శమునకు ఒక చక్కని అందమైన, చంద్రబింబంవంటి స్త్రీముఖం చూసి, ఆ మూర్తిని ధ్యానిస్తారు. స్త్రీ మూర్తికి బదులు పురుషమూర్తిని ధ్యానించుట గ్రీకులలో వుంది. దీనిని పర్షియవారు గ్రహించారు. వీరినుండి సూఫీలు గ్రహించారు. అమీరు ఖుస్రూ, ఫక్రుద్దీన్ ఇరాకీ, మధులాల్ హుస్సేన్‌వంటి సూఫీ సాధకులందరు ఇట్టి ఆదర్శ సాధన చేసినవారే. ఈ విషయమై వారు కొన్ని కారణాలు చెప్తుంటారు.

యువకుని శరీరం, యువతి శరీరంకన్నా పరిపూర్ణమైనట్టిది. చిత్రకారుడు తన చిత్రమునకు ఒకరిని నమూనాగా కూర్చోపెట్టి చిత్రిస్తాడు. ఇట్లే సూఫీలుయువకునిమూర్తి చూచి తమ ప్రియుని పరమేశ్వరుని ముఖంగా ధ్యానిస్తారు.

ఈశ్వరుని పురుషుడుగా భావిస్తాము. అతను అంటాము, కాని ఆమె అని అనం. కనుక ఆతనిని దివ్య మోహన పురుషుడుగా ధ్యానించుట శ్రేయస్కరం. మానవుడు స్వభావసిద్ధంగా బలహీన ప్రకృతి కలవాడు. స్త్రీ ధ్యానం సాధకుడు భ్రష్టుడవుటకు కారణం కావచ్చు.

ఇట్టి పురుషధ్యానము మనలోను ఉంది. శ్రీరామచంద్రుని ముఖపద్మంచూచి ఋషులు తన్మయులైనారు. శ్రీకృష్ణుని మోహనస్వరూపంచూచి అనేక భక్తులు, గోపికలు తరించారు.

మన హృదయం అద్దం వంటిది. మనం బయట చూచునది హృదయఫలకంలో ప్రతిబింబిస్తుంది. కొందరు పూర్ణ

త్వం పొందినవారు అట్టి ప్రతిబింబంవల్ల యెన్నో నవ్య భావములను పొందారు. ఆపిల్‌చెట్టునుండి ఆపిల్ పండ్లు ఎన్ని సారులు రాలలేదు. కాని న్యూటన్ అదిచూచి, నూతనభావం కనిపెట్టారు. శోకిస్తున్న క్రౌంచపక్షిని చూచి వాల్మీకి శ్లోకం కనిపెట్టాడు. దిగంబరిగావున్న స్త్రీని చూచి వేమన్న బ్రహ్మజ్ఞానియైనాడు. నలిగిన పుష్పంచూచి టెనిసన్ కావ్యం వ్రాశాడు. ప్రకృతిసౌందర్యంతో పులకించి వర్డ్సువర్తు రసమయ కావ్య సృష్టి చేశాడు. ఇట్లే మన శర్మద్ అభయచంద్‌ను చూచి సమాధిసిద్ధి పొందాడు. దీనితో శర్మద్ ఆధ్యాత్మికసాధనలోను, సాహిత్య రచనలలోను పెద్ద పెద్ద అంగలు వేశాడు. మనస్సు అంతర్ముఖమయింది. బాహ్య జగితితో అవసరం తీరింది. సన్యసించాడు. అభయచందుకు ప్రబలమైన విద్య లెన్నింటినో చెప్పాడు. అభయచందు గద్య పద్యములు ఎన్నో వ్రాశాడు పర్షియ భాషలో. పాత నిబంధన పర్షియ భాషలోనికి అనువదించాడు. ఈ గేయం అభయచందుదని అంటారు.

'యతి గురువు ఫర్గాన్ శిష్యుణ్ణి నేను!
యూదులరబ్బిని, విగ్రహారాధకుణ్ణి, ముసల్మాన్ నేను!'

గురువువలె శిష్యుడు విశాల స్వాతంత్ర్య భావాలు కలవాడే! శర్మద్ తనను తాను మరచి వుండేవాడు. అతనికి ఏ ప్రదేశంతోగాని, ఎవ్వరితోగాని ప్రయోజనంలేదు. ఏ దేశము, ఏ మానవుడు అతనిని ఒకచోట నిలబెట్టలేవు. ఉన్నట్టుండి తట్టా పట్టణంనుండి అదృశ్యమైనాడు. చాల సంవత్సరముల వరకు అతను ఎక్కడున్నాడో ఎవరికి తెలియదు.

## హైదరాబాద్ ఆగమనం

1646 సంవత్సరంలో మీర్జాముషిన్ శర్మదుని దక్కన్ హైద్రాబాదులో చూచాడు. గోల్కొండ నవాబు మంత్రి షేక్ ముహమ్మద్‌ఖాన్ శర్మద్‌ను ఎంతగానో ఆరాధించేవాడు. నాడు మన రాజ్యమునకు ముఖ్య పట్టణం హైదరాబాదు. ఈ విధంగా శర్మద్ మన మధ్య కొంతకాలం ఉన్నాడు. రామదాసుగారు శర్మద్‌ను చూచివుంటారని నా భావము. నాటి నైజాం ప్రభువు శర్మద్‌ను ఆరాధించాడు. శర్మదుకు రాముడు, మహమ్మదు ఒక్కటే. ఈ భావమే నాటి నైజాం ప్రభువు, అతని మంత్రులు, ప్రజలు అంగీకరించారు. మహమ్మదీయ ప్రభువు భద్రాద్రి రాముణ్ణి సేవించాడు. ఈవిధంగా శర్మద్ ప్రభావం ప్రజలలో పాకిపోయింది.

ఇందుకు ముఖ్య కారణము అతని ఆధ్యాత్మిక ప్రభావం. ఇంకొకటి సాహిత్య సంపద. ఇష్టమైనప్పుడు, అడగకుండానే జ్యోతిషం చెప్పేవాడు. ఇవి జరుగుతుండేవి. శర్మద్ షేక్ మహమ్మదును ఎంతో ప్రేమించాడు. ఈ జ్యోతిష విద్య కూడా అతని ప్రతిష్ఠకొక కారణమే.

షేకు మహమ్మదునుగురించి జ్యోతిష్యం చెప్పాడు. ఈ విషయమై 1648 సంవత్సరంలో మీర్జాఫానీ వ్రాశాడు. శర్మద్ మిత్రుడు మంత్రియైన షేకు మహమ్మద్ చనిపోతాడని, అతని స్థానంలోనికి మీర్‌జుమ్లా వస్తాడని చెప్పాడు. శర్మద్ ఈ రెండు విషయాల్లోనుఎంత చెప్పాడో అంతా జరిగింది. ఇతని పేరు ప్రఖ్యాతులు ముఘలు సామ్రాజ్యం అంతట వ్యాపించినవి. భారత సామ్రాజ్య ముఖ్య నగరమైన ఢిల్లీ ప్రజలు శర్మద్ దర్శనంకొరకు ఎదురు చూస్తూండేవారు.

## ఔరంగజేబు ఆగ్రహము

నాటకంలోని పాత్రధారివలె ఒకనాడు శర్మద్‌యోగి ఢిల్లీ రాజవీధులలో ప్రత్యక్షమైనాడు. ప్రజల సంతోషం పరవళ్లు వారింది. శర్మదును ఒక దివ్య పురుషుడుగా ఆరాధించ మొదలుపెట్టారు. దారాషికొ సూఫీప్రియుడు. శర్మద్ సూఫీ *సిద్ధుడు. స్వభావసిద్ధంగా ఇద్దరి మధ్య ప్రేమబంధం ప్రబల*మయింది. దారా తన రాజదర్బారులో శర్మదును గౌరవించాడు. 1658 సంవత్సరంలో షహజహాన్ పాదుషా జబ్బుపడి ఆగ్రాపట్టణంలో ఉన్నాడు. ప్రియురాలి సమాధి తాజమహల్‌ను చూస్తూ అసువులు వీడాలని అక్కడ కాలం పుచ్చుతున్నాడు. దీనిఫలితంగా దేశంలో సింహాసనం కొరకు యుద్ధం ప్రజ్వరిల్లింది. ఇందులో ఔరంగజేబు విజయుడై, సింహాసనం అధిష్ఠించాడు. శర్మద్ బాహాటంగా దారా న్యాయంగా సింహాసనానికి వారసుడని చెప్పేవాడు. ఇది ఔరంగజేబుకు భరించరానిదయింది. శర్మదుకు ప్రజలలో పలుకుబడి ప్రబలమయింది. ఇందువల్ల తనకు చేటు రావచ్చని శంకించాడు ఔరంగజేబు. తన దారిలో ఈ కంటకమును ఏరివేయవలెనని సంకల్పించాడు. ఇందుకు ఒక పన్నుగడ ఆలోచించాడు. పర్యవసానంగా శర్మద్ దైవ రాజద్రోహి అని ప్రకటించాడు. ఇందుకు షరియతు అను మత న్యాయస్థానము ఏర్పరిచాడు. తనకు అనుకూలురు, శర్మద్‌కు వ్యతిరేకులు అయిన ముల్లాలను న్యాయమూర్తులుగా నియమించారు. ఇందుకు శర్మదుమీద ఆరోపించి నేరము లివి :

1. శర్మదు కలేమా మొదటి భాగమే అంటాడు. అనగా లాఇల్లా అని అంటాడు. దీని అర్థము దేవుడు లేడని. ఇది దైవద్రోహం.

2. శర్మదు ఒక గేయం చెప్పాడు ఈ విధంగా.

'సత్య రహస్యాలను సాధించిన నీవు
విశాల స్వర్గంకంటె విశాలుడవవుతావు
స్వర్గంవద్దకు అహమద్ వెళ్ళాడంటాడు ముల్లా
స్వర్గమే అహమ్మదు వద్దకు వచ్చిందంటాడు శర్మదు'

ఈ గేయంవల్ల శర్మదుకు మహమ్మదు ప్రవక్తమీద నమ్మకం లేదు.

3. శర్మద్ దిగంబరిగా తిరుగుతున్నాడు. ఢిల్లీ రాజధాని ముఖ్య నగరం. ఇట్టి నగర రాజవీధులలో దిగంబరిగా తిరుగుటవల్ల రాజును ప్రజలను ఎదిరించినవాడైనాడు. ఇది రాజద్రోహం.

# సూఫీవేదాంతి శర్మద్ షహీద్

ఈ న్యాయస్థానంలో ముల్లా అబ్దుల్ ఖావీ అనే ఒకన్యాయ మూర్తి ఉన్నాడు.ఇతనికి శర్మదుమీద ప్రత్యేకంగా పగ వుంది. శర్మద్‌వల్ల ఈముల్లా ప్రజలలో పేరులేనివాడైనాడు. కనుక విచారణ తంతు జరిపి, శర్మద్‌నేరం బుజువైందని, ఇది సహించ రాని నేరమని, ఇందుకు శిక్ష తల తీయుటని తీర్పు చెప్పాడు. ఔరంగజేబుకు కావలసిందే ఇది. కాని శర్మద్ తన తప్పు ఒప్పుకో లేదు. ఇందుకు ఈ కారణాలు చెప్పాడు. దేవుని ముఖం నాకు కనుపించనప్పుడు కనుపించలేదని అన్నాను. అతను కనుపించి నప్పుడు ఉన్నాడని అంటాను. దిగంబరనేరంగురించి, అది యూదులలో నేరం కాదన్నాడు. యూదుల ప్రవక్త ఏసయ్య అతని అంత్య కాలంలో వస్త్రాలను వేసుకోలేదు. ఇస్రాయీలు లలో దిగంబరత్వం నేరమని చెప్పబడలేదు. ఇందుకు ఒక గేయం పాడి వినిపించాడు.

'మధుర మోహన విగ్రహం నన్ను మభ్యపరిచింది!
అతని మత్తెక్కిన నయనాలు నన్ను మాయ చేసినవి!
ఆ దొంగ నాలోనే వున్నాడు, తెలియక దేశాలు తిరిగాను
ఆ విచిత్ర తస్కరుడు పైబట్ట అపహరించాడు'

## ఉరి శిక్ష

శర్మద్‌వాదన ఎవరిచెవిలోను జొరబడలేదు. నిద్రపోవువానిని లేపగలంకాని, నిద్ర నటించేవాణ్ణి లేపలేం. శర్మద్‌కు ఒక వృద్ధ స్నేహితుడున్నాడు. ఇతనిపేరు అసాదుల్లా. ఇతను శర్మ దును ఒప్పించి శిక్ష తప్పించాలని ప్రయత్నించాడు. శర్మద్‌ను కలేమా పూర్తిగా పఠించమని, వస్త్రధారణ చేయమని బతి మాలాడు. ఇందుకు శర్మద్ ఒప్పుకోలేదు. ఇట్లా అన్నాడు ఒక గేయంలో.

''మన్సూర్ మాటలు నోరుదాటి చాలా కాలమైంది
మన్సూర్ మాటలు మళ్ళీ అనడు
మన్సూరు ఉరిమానెక్కి ఉరి ప్రదర్శిస్తాడు.''

ఉరిశిక్ష అమలు జరుపుటకు ఢిల్లీలోవున్న జుమ్మా మసీదు ముఖ్య ద్వారం పక్కన ఒక పెద్ద వేదిక ఏర్పాటు చేశారు. ఉరితీయునాడు శర్మదును సాయుధులైన సైనికులు, ఎర్ర కోటనుండి ఉరిమానువద్దకు తీసుకువచ్చారు. తీసుకువచ్చునప్పుడు ప్రజల గుంపు పోగయింది. ఇంకొక నిమిషానికి తల తీస్తాడు. కాని శర్మద్ ముఖంలో భీతి లేదు. మామూలు ముఖంతో ఏమీ జరగనట్టు నడిచి వచ్చాడు. దారిలో అనేక గేయాలు మధురంగా పాడాడు. ఆహా బ్రహ్మజ్ఞానివన్న నీవే శర్మదూ! బ్రహ్మజ్ఞానికి కత్తి, పూలదండా సమానములే. ఎంత సాధన చేశా డు శర్మదు! నిశ్చల ప్రశాంత నిర్వికార నిర్మమకార ముఖంతో ఎక్కివచ్చాడు ఉరిమాను మీదకు. పాదుషానుకాని, పగవారినిగాని ఒక్క పొల్లుమాటనలేదు. ఉరిమాను ఎక్కి తన తలను ఉరి మొద్దుమీద పెట్టి అన్నాడు ఒక గేయంలో.

'ఎవడు రాజ్య సింహాసన మిచ్చాడో నీకు
వాడు క్లేశ బాధ ప్రసాదించాడు నాకు
వాడు పాపులకు పాపాలపై కప్పుకొనుటకు పంచెలనిచ్చాడు.

వాడు పాపంలేని వారికి దిగంబరత్వం ప్రసాదించాడు'

వినాశకాలే విపరీత బుద్ధి: ఔరంగజేబు పగ తీరింది. శర్మద్ తనతల తీయవచ్చిన వానిలోను, ఆతనికరుకు కరవాలంలోను ఈశ్వ రునే సందర్శించాడు. ఆ సమయంలో దఫిస్తానల్లీ తాను విన్నట్లు ఇట్లా వ్రాశాడు: శర్మద్ తలను ఉరిమానుమీద పెట్ట గానే కటికవాడు కత్తి తీసుకుని గొడ్డుతల నరికినట్లు నరి కాడు. దెబ్బతో మొండెం, తల రెండైనవి. ఆ సమయంలో శర్మద్ పెదిమలనుండి కలేమా వినిపించింది పూర్తిగా. 'ఇల్లా ఇల్లుల్లా' అనే మాటలు దగ్గర ఉన్నవారు విన్నారు. దీని అర్థము అల్లా తప్ప ఇంకో దేవుడు లేడు. ఉరితీయబడ్డచోటనే అతనిని సమాధి చేశారు. ఈ సమాధి నేటికీ ఉన్నది. నేటికి భక్తులు, సాధ కులు, యోగులు వేనకు వేలు ఈ సమాధిని సందర్శిస్తారు. ఇది ఔరంగజేబు సింహాసనం ఎక్కిన మూడు ఏండ్లకు 1661 సంవ త్సరంలో జరిగింది. ఔరంగజేబు ఏమాత్రం సహనం వహిం చినా శర్మదుకు ఇంత పేరు ప్రఖ్యాతులు వచ్చిఉండ వేమో. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని ప్రఖ్యాతికి తోడ్పైనట్లు శర్మద్ పేరు చరిత్రలో నిలచి ఉండుటకు ఔరంగజేబు తోడ్పైనాడు. కాలం సమీపించునప్పటికి ఇటువంటి దుర్బుద్ధులు బయలు దేరతాయి. ఎందరు యోగులు చెప్పినా చెవికెక్కవు, రావణా సురునికి విభీషణుడు చెప్పినబుద్ధులు చెవికెక్కనట్లు. సిక్కు గురువును కైదు చేయించాడు ఔరంగజేబు. కైదీలో జనానా వంక చూస్తున్నాడని నేరం చెప్పారు ఔరంగజేబుకు ఈ గురువు మీద. గురువుని పిలవనంపి అడిగాడు. దానిమీద 'నేను మీజనా నావంక చూడగా, సముద్రంనీదనుండి తెల్ల ముఖాలు దేశంలో జొరబడి, నీజనానాపర్దాలను చించివేస్తున్నట్లు చూచా'నని చెప్పాడా గురువు. యోగులకు తెలియనిది ఏదీలేదుకదా! ఔరంగ జేబు నాటికి మొఘలు సామ్రాజ్యం బలవత్తరంగానే వుంది. అట్టి కాలంలోనే సిక్కులగురువు సత్యాన్ని దర్శించాడు. అతను ఎంత చెప్పినాడో అంత జరిగింది. ఆనాడు ధర్మం నశించింది. ఎందరు సత్పురుషుల చంపించి ఔరంగజేబు తన హస్తములను రక్త సిక్తం చేసుకొన్నాడు! ఇది తన రాజ్య రక్షణ అనుకున్నాడు. కాని ఇది పాపపు పంట. ప్రబలమై తన సామ్రాజ్యాన్ని దగ్ధంచేస్తుందని గ్రహించలేకపోయినాడు. సత్యము నకే జయమని శర్మదు చరిత్ర బుజువు చేసింది. శర్మద్ రచ నలు మధురాతి మధురమైనవి. గవర్నరు శ్రీ బూర్గుల రామ కృష్ణరావుగారు ఇవి కొన్ని అనువదించారని తెలుస్తున్నది.

## శర్మద్ రచనలు

శర్మద్ పండితుడు, దేశ సంచారి, యోగి. అనుభవంలో చదువులో, యోగ సాధనలలో ఎంతో విజ్ఞానం ఆర్జించాడు. జ్ఞానము రెండు విధాలు. అవ్యక్తజ్ఞానము, ఇంద్రియ జ్ఞానము,

అసలైన విజ్ఞానము అవ్యక్త జ్ఞానము. ఇదే సత్యం. ఇదే జ్ఞానం. ఇదే ఆనందం. ఇంద్రియజ్ఞానము హేతుయుక్తమైనది. ఇది సత్యమైనది కాకపోవచ్చును. భయంతో తాడు చూచి పాముసుకుంటాము. ఇది ఇంద్రియజ్ఞానము. ఇది నేర్పు కుంటేవచ్చేది. అవ్యక్తజ్ఞానము సమాధిసిద్ధులు పొందేది. శర్మద్ ఈ రెండు జ్ఞానములు ఆకళించుకొన్నాడు. ఈ రెండు జ్ఞానములతోను రచన చేశాడు. తన ప్రియ పరమేశ్వరుని దర్శనం పొంది, తన ప్రియునితో ఐక్యమైపోయేవాడు. అప్పుడు జీవ బ్రహ్మైక్యం పొందేవాడు. ఇట్టి స్థితిలో ఆతనికి శరీర భావనలేదు. ఆ ఆనంద సముద్రంలో తేలుతూ తన్మయుడై గానం చేసేవాడు. ఈ గేయాలు ఎంతో విజ్ఞాన రహస్యాలు కలిగి, మధురాతిమధురంగా ఉన్నాయి. ఇంద్రియ జ్ఞానంలో వున్నప్పుడు కొన్ని రచనలు చేశాడు. ఇంద్రియ జ్ఞానంలో ఉన్నప్పుడు క్రుంగిపోయివుండేవాడు. తనకు తనప్రియునికి మధ్య ప్రపంచం ఒక అడ్డు గోడగా కసుపించేది శర్మదుకు. ఇతను అన్ని రకాల పద్యాలు, గేయాలు వ్రాశాడు. ఇవి ఒక్క సంపుటిగా మనకు దక్కలేదు. ఈ రచనలల్లో చాలా రచనలు కాల ప్రవాహంలో అంతు లేకుండా మాయమైనవి. ఇందుకు వివిధకారణాలున్నవి. ఇతడు ఒక్కచోట ఉండలేదు. దేశ సంచారి. ఎక్కడ చెప్పింది అక్కడే పోయింది. నాటి రాజకీయ కారణాలు, అతని మానస స్థితులు వీటికితోడైనవి. మనకు దొరికిన వాటిల్లో సామాన్యులకు అర్థం కానివి వున్నవి. ఇతడు తన ప్రియదర్శనంపొంది మైమరచి చేసిన గానములలో అనేక రహస్యాలున్నవి. అవి శర్మద్‌వంటి సిద్ధునికిగాని అర్థం కావు. ఈ విషయాన్నే మర్మకవి గెటే అన్నాడు. 'కవులను అర్థం. చేసికోవాలంటే, కవుల దేశంలోనికి వెళ్లాలని' మనలో కాళిదాసు వంటివారే కాళిదాసును అర్థం చేసుకోగలరంటారు పెద్దలు.

## ప ర్షి యా క వు లు

పర్షియాకవులు ఈశ్వరుని ఏకత్వమును గురించే వ్రాశారు. వారి ఉద్దేశ్యంలో ఈశ్వరుడు అనేక విధాలుగా ప్రత్యక్షమవుతున్నాడు. మానవుడు ఈశ్వరాంశయే. ప్రతి మానవుని జీవిత లక్ష్యము తన మూలస్థానమైన ఈశ్వరునితో చేరుటయే. మానవుని జీవి బ్రహ్మంలోనుండి వచ్చింది. బ్రహ్మ సాక్షాత్కృతి మానవ గమ్యం. పర్షియ కవిశ్రేష్ఠులైన రుమీ హఫీజ్, జామి, ఉమర్‌ఖయ్యాంవంటి వారంతా వారు రచించిన గజెల్, ఖటాన్, చతుష్పదులలో ఈ జీవబ్రహ్మైక్యమే ప్రస్తావించారు. తర్వాత అబుసైద్‌బిన్ అబుల్‌ఖయార్‌వంటివారు నాటినుండి ఆధ్యాత్మిక తత్వములను చెప్పుటకు ప్రత్యేకంగా చతుష్పదులు (నాలుగు పాదాలు కలవి) రచించారు. ఇందులో ఆధ్యాత్మిక భావములకు, సంకేత భాష వాడారు. ఇట్లా వ్రాయటం నేటికీ మన తత్వాల్లో ఉన్నది. తెలిసినవారుగాని మన తత్వాల్లో అసలర్థం గ్రహించలేరు. సూఫీల రూపకాలంకారములలో రెండు రకాలున్నవి. (1) మధువునుండి సేకరించినవి. (2) ప్రేమనుండి సేకరించినవి. సూఫీల భక్తి ముఖ్యంగా మధుర భక్తి. వారు ప్రియదర్శనం కొరకు కాంక్షిస్తుండేవారు. ఎప్పుడో మెరుపు మెరిసినట్లు మెరిసేది ప్రియుని మోహన ప్రకాశం. అది సహస్రభాను భానమానంగా ఉండేది. కాని వచ్చి, వెంటనే అదృశ్యమయ్యేది. కొంతకాలంవరకు అది సాధకునికి కనుపించక పోయేది. దీనితో సాధకుని, భక్తుని బాధలు ప్రారంభమవుతవి. ఒక్కసారి ఆతని ఆనంద స్వరూపం దర్శించినవారు ఆతనిని మరచిపోలేరు. రాత్రింబవళ్లు ఆతనికై మరులుకొంటారు. ఈ మధురభక్తి కృష్ణునియందు రాధ, గోపికలు అనుభవించారు. మధుర భక్తి భాగవతంలో పోతన్నగారు ఎంతో చక్కగా వర్ణించారు. ఆయన చెప్పిందంతా యథార్థమయినది. గోపికలు శ్రీకృష్ణుని కొరకై చెట్టు పుట్ట వెతికినట్లు సాధకుడు వెతుకును. పోతన్నగారు అనుభవమును చెబుతున్నట్లుంటుంది. శర్మద్ ఇట్టి స్థితిలోనే ఉండేవాడు. అప్పుడు ఆతనికి ఎక్కడా ఆశారేఖ కనుపించేదికాదు. తన నిస్సహాయ స్థితికి విలపించేవాడు. తన మనస్సుకు ఇక అందని చోటు ఎక్కడో ఉన్నట్లు గేయాలలో ఆక్రోశించేవాడు:

'అడవులు కొండలు తిరిగినావే మనసా
ఆతనిని గుర్తించలేకపోతివే మనసా!
ఆతనిని సామాన్యంగా గుర్తించలేవే ఓ మనసా
ఆతని హృదయ నేత్రంతో కనలేవే ఓ మనసా'

శర్మద్ భగవానుడు తనకు ఇట్లా దూరమవుటకు తన పాపాలే కారణమని, నెపంతనమీద వేసుకునేవాడు. తాను అటువంటి పాపాలు చేసినందుకు ఎంతో సిగ్గుపడేవాడు. నొచ్చుకునేవాడు. అక్కడినుండి తన పాపాలు క్షమించమని వేడుకునేవాడు. ఇవి సాధన కాలంలోవుండే భావములు. అప్పుడు అతను పొందిన భావములను కొన్ని గేయములుగా చెప్పాడు.

'ప్రతి ఉదయము సాయంకాలములందు
చేసిన పాపాలకు పరితపిస్తాను నేను.
నాస్థితిని తలచి గుండె పగిలి సిగ్గుపడతాను నేను
వీటి ఫలితాలు ఎటు నెట్టినను
వాని భావంలోనే వుంటాను నేను'
'నీ దయలేనిది నా కష్టాలు గట్టెక్కవు
సంతత దుఃఖాలు నా హృదయ శాంతి నీయవు
నా హృదయం పంట పండించు నీవు!
శాంతి ధామం చేరునట్లు దయతలచు నీవు!'
ఆతని దయా సముద్రం అంతులేనిది
నోరు హృదయం విప్పి చెప్పలేనిది'
'పాపాలు గంపలతో వున్నా
పాపసాగరంలో తేలియాడుతున్నా'
ఆతడు చేయును పాపముల నన్నిటి సున్నా!'

# సూఫీవేదాంతి శర్మద్ షహీద్

కటికవాడు పదునైన కత్తి తీసుకొని శర్మద్ తల తీయ వచ్చాడు. అతని కత్తిని చూచి ఇట్లా పాడాడు ఒక గేయంలో.

'కరకు కరవాలమైన మిత్రుడు వచ్చాడు.'

ఏ రూపంలోవున్నా అతనిని శర్మదు గుర్తించాడు. తనను నరకవచ్చిన కత్తిలో కూడా తన ప్రియదర్శనం పొందిన సాధకుడు శర్మద్.

తాను బాధలు అనుభవిస్తూ, ఇతరులయందు జాలి గొనేవాడు. వారు అజ్ఞానంలో వున్నారని బాధపడేవాడు. ప్రపంచ వ్యాపారములను వదులుకోమని ఇతరులకు చెప్పేవాడు. ఈ ప్రపంచం అశాశ్వతమైనది. మూణాళ్ళ ముచ్చట! శాశ్వత మైనది భగవానుడు. ఆతని చేరుటకు ఎన్ని కష్టాలకైనా వెరవ వద్దనేవాడు.

''ప్రపంచ దుఃఖాలపాల పడవద్దని చెప్పితిగా మనసా
అడవులు కొండలు విహారముల ఆనందించవద్దంటినిగదా మనసా!
ప్రపంచమంతా ఏమిలేదు, ఎండమావని చెప్పితిగదా మనసా!
సంసారం సముద్రంమీద తేలె బుగ్గని అంటినిగదా మనసా''

ప్రజలు అమాయకులు. కపట గురువులుంటారు. వీరిలో వంచన, దురాశ, క్రూరత్వం గడ్డకట్టుకుంటవి. ఇటువంటి స్వాములనుండి దూరంగా వుండని భక్తులను హెచ్చరించేవాడు ఇట్లా ఒక గేయంలో

'అత్యాశాపరులనుండి బైట పడలేవు నీవు
అశాంతినుండి బైటపడనివ్వరు వారు'
'పూలు వస్త్రంలోపల సమస్త పాపములు దాగి వున్నవి
వంచన, కపటము అపాయాలు అందులో మూగి వున్నవి'

కొత్త శిష్యులకు ఇంకా అనేక బుద్ధులు బోధించేవాడు. స్వార్థము పరార్థమునకు వ్యతిరేకమైనది. కనుక స్వార్థం వీడాలి. దురాశ, గర్వం, కోపము వదులుకోవాలి. ఇందుకు ఒక మందు చెప్పాడు—అది తృప్తి—తృప్తిని నెమ్మదిగా, బహు జాగ్రత్తతో సాధన చెయ్యాలి. తృప్తి సిద్ధికి దగ్గర దారి. ఒక్కొ సారి శర్మద్ ఆనందంచేత మైమరచేవాడు. ఇది మధుపాత్ర నిండగా, పొర్లిపోయినట్లుండేది. అప్పుడు తన ప్రియుని స్పర్శ అనుభవించేవాడు. అట్టి సమయాల్లో ప్రియుడు తక్క ఏమి కనుపించేదికాదు. అప్పుడు ఆతని నోరు ఆతని అదుపు మిగిలిపోయేది. అప్పుడు చెప్పిన గేయాలు

'రాజులకు రాజును నేను
నీవంటి దిగంబరిని కాను నేను
ప్రతిభాగం పగిలివున్నా, పదిలంగానే ఉన్నానేను
ప్రతిమారాధకుణ్ణి అవిశ్వాసిని నేను
ముసల్మాన్‌కాకయే మసీదుకు వెళ్ళాను నేను'

అట్టి శర్మదుకు అన్ని మతాలు ఒకటే! కాబా, దేవాలయము ఒకటే. రాముడు మహమ్మదు ఒక్కరే. ప్రతిదీ ఈశ్వరుని స్వరూపమే. ఈ విషయమై ఆతని గేయం

''కాబాకు వెళ్ళినా, కాశికి వెళ్ళినా అందులోవున్నవి వానివే
కాబాలోవున్న నల్లరాయీ వానిదే
కాశిలోవున్న విగ్రహమువానిదే
విశ్వమంతట వ్యాపించివున్నది వానిదే!''

ప్రియదర్శనంకాక చెప్పరాని బాధలు, భరించరానికష్టాలు అనుభ వించేవాడు. ఈ బాధల మధ్య ప్రియదర్శనం కలిగేవి. అప్పుడు మన శర్మద్ అనుభవించు అనుభవం వర్ణించరానిది. అట్టిది, అది అనుభవించిన మహాత్ములకు తప్ప ఇతరులకు తెలియదు. గోటే ఈ విషయమై చక్కగా చెప్పాడు. అనుభవజ్ఞుడుకాని, వాటి అనుభూతులను గ్రహించలేడు అని అన్నాడు. అట్టి దర్శనము పొందినప్పుడు శర్మదు చెప్పిన గేయము లివి:

'అంతట భగ్గున మంటలు మండుట చూస్తిని
అదే అన్ని వైపుల వ్యాపించుట చూస్తిని
వెలుగు నాటకం ఆడుట చూస్తిని
దాని మూలం నేనే వున్నట్లు చూస్తిని!'

'ప్రియుని ప్రేమ పొందితి నేను
అర్హతనుబట్టి ఆతని వాత్సల్యం పొందితి నేను
పుట్టిన మొక్క పెరిగి పంట పండగనే
ప్రేమారామంలో ప్రేమ పుష్పం పొందితి నేను?

శర్మద్ గాథలో సాధకుడు అనుభవించే బాధ, అనుభవ పూర్వకంగా వర్ణించబడ్డది. తీవ్రసాధకునికి రాత్రులందు నిద్ర వుండదు. పగలు విశ్రాంతి వుండదు. రామదాసుపడ్డ బాధలు ఈ దశ చక్కగా చెబుతున్నవి. శర్మద్ జీవించినది ముప్పదిమూడేండ్లు. ఇంత కొద్ది కాలంలో అనేక మత గ్రంథాల నాకళించుకొన్నాడు. వ్యాపారం చేశాడు. అధ్యాత్మిక సాధన చేశాడు. రాజుల మర్యాదలు పొందాడు. చివరకు పరమేశ్వరుని ప్రియసందర్శనంపొంది ధన్యుడైనాడు. శర్మద్ జీవితంలో అనేకాదర్శాలున్నవి. ముఖ్యంగా అన్ని మతాల్లో వున్నది ఒక్క దేవుడేనని, అన్ని మతగ్రంథాలు చూచి సాధనచేసి చెప్పాడు.

# అమ్జద్ రుబాయీమాల

శ్రీ యస్. సదాశివ

స్వర్గమున దాటె నా యదృష్టంపు నిడివి
ముగిసె నా ప్రయాణము కేంద్రమునకువచ్చి
నీపదమ్ములపయిఁ దల నిల్పి నంత
నాపదమ్ములఁ దల నిల్పినది జగమ్ము!

పోవనిమ్ము సుమము రంగుతావి మిగుల,
పోవుగాక శిరమ్ము విభూతి మిగుల,
నేను లేకున్న నీ యున్కి నిశ్చితమగు,
పోవుదును గాక ఈ 'నేను' నీవు మిగుల!

అరయ ఈ శరీరంబు నా దగుట యెట్లు?
దీనివృద్ధిక్షయాలు నా వేని యెట్లు?
అవును, నా భావన యె మూల మన్నిటికిని;
అయిన నా భావనయును నా దగుట యెట్లు?

నీవు నా సమక్షంబున నిలుచు టెట్లు
నేను నీవు సంభాషించుటైన నెట్లు?
కనులుగాంక్షించు నీ రూపుగాంచుకొఱకు,
అట్లు కనులు గాంచినది నీ వగుట యెట్లు?

దాగుకొనుట కిదొక విచిత్రమగు తెఱగు,
అహాహా! ఎన్నియుపాయంబు లవధరించి
తనదు తెర లేమి గప్పికో దలఁచినాకు
కనుల మీఁదనె తెరలను గట్టినాఁడు.

జీవితం బెంత కాలమో చావె యెఱుఁగు,
తను విదేమగునో వినాశనమె యెఱుఁగు,
వచ్చుచును బోవుచును ప్రతిశ్వాస యనును,
"పోవుచుంటి; వచ్చుట యిఁక దేవుఁడెఱుఁగు."

ఈశరీరాస్తికతఁ దూల్చనేని, యనుము
అనుము, మాయాంధకారంబు నణచవేని
నీవు నాతోడఁ గలియవేని, సరి, లెమ్ము
నన్ను నీవుగా మార్చలేకున్న, ననుము

నేను నాహారంబెట్టులైన మానఁజాల,
హృదయ మింకొకచోట నర్పింపఁజాల,
ద్వారమతఁడెత్తనీ మూసివైవనిమ్ము
వేరుద్వారంబు కడ కేఁక వెళ్లఁజాల.

ఎందుఁదలఁచిన నియమించె నందు నన్ను
ఒకట రంజించె నొకచోట వికలు జేసె
వాని శక్తి నెన్నఁడు నమ్మువాఁడఁ గాను,
కాని నాయశక్తత నమ్మకము గుదిర్చె

అతఁడు తననివాసము దెల్పఁడయ్యె నెపుడు
ఎఱుఁగఁజాల నాతనిఁగూర్చి యేవివరము
ఎడద చప్పుడడుగుల నవ్వడినిఁ బోలు,
కనుఁడు, విచ్చేసె నేమొ నాకడకతండు.

నేను నీవహమను సురాపానమత్త
చిత్తులము, బ్రదర్శనము గాంక్షించువార
మెటులు పొసగెడు నస్తిత్వ మిర్వురకును,
నేన లేను కాదేని నీవైన లేవు!

# భామాకలాపం శ్రీగదితమే

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

ఆంధ్రదేశములోని నాట్యకళను ప్రాచీన తమిళ గ్రంథములు మువ్విధమైన 'మయ్' నాట్యములోని ఒక రకముగా 'దేశి' అని అభివర్ణించినవి. నాట్యశాస్త్రమున భరతుడుకూడ దీనిని పేర్కొన్నాడు. అంతేకాక తక్కిన దాక్షిణాత్య నాట్యములవలెనే ఈ సంప్రదాయము కూడ ఏడవ శతాబ్ది నుండి వచ్చుచున్నది. కన్నడ కవి నృపతుంగుడు కావేరి కుత్తరముగా నేటి సాగరాంధ్రప్రాంత కీవలి దేశమున నొక నాట్య సంప్రదాయ మున్నట్లు పేర్కొన్నాడు.

ఏమైనను కూచిపూడి నాట్యము సాధారణముగా భారతీయ నాట్యసంపదకు ముఖ్యముగా భరతనాట్యశ్రీకి ఆంధ్రులు చేసిన దోహదభాగము. కూచిపూడి సాగరాంధ్రమున కృష్ణాజిల్లాలోని పల్లెటూరు. ఇచటి బ్రాహ్మణ కుటుంబములవారు కలాపమని పిలువబడు ఈ నాట్యమును ప్రత్యేకముగ సాధించి తరతరములుగా నిలుపుచు వచ్చినవారు. ఈ కలాపములలో సత్యభామా కలాపము, గొల్ల(భామా) కలాపము అనునవి చాల ప్రసిద్ధములు. జనసామాన్యము వీనిని వీధినాటకము లనుట గూడ కద్దు. ఇవికాక కూచిపూడి వారు చోడిగాని కలాపము, ప్రహ్లాద చరిత్ర, సారంగధర చరిత్ర, జలక్రీడలు మొదలగు వానిని గూడ అభినయింతురు.

ఈ కలాపములు పదునారవ శతాబ్దినుండి యున్నట్లు చారిత్రక నిదర్శనము లున్నవి. సిద్ధేంద్రయోగి యను నొక మహాత్ముడు వీనిని సృజించి కూచిపూడి వారి పూర్వీకుల కిచ్చినట్లు సంప్రదాయము. సత్యభామా కలాపములోని కొన్ని పాటలలో ఆయన పేరుగల ముద్ర లున్నవి. కూచిపూడివారు విజయనగర రాజగు వీరనారాయణుని దర్శించినట్లు ఉపలబ్ధమైన చారిత్రక సాక్ష్యమే ఉన్నది.

ఈ నాట్య సంప్రదాయ మెన్నో హెచ్చు లొచ్చులకు లోనైనది. మొన్నటిదాక స్థానికులైన జమీందారుల లేదా సంపన్నుల ప్రాపున 'మేళము' లనబడు నట సంఘము లాడుచుండెడివి. ఆంధ్రదేశమున వివిధప్రాంతములం దెందరో రూపఱుచున్న ఈ కళ నాదుకొని బాగుపరచి కావలసిన దోహద మొనర్చిరి. కలాప 'గ్రంథము' లలో దీనిని ఋజువుచేయుటకు కావలసినంత సాక్ష్య మున్నది. కూచిపూడి నటు లీనాటి వరకును తమకు కులవిద్యగా పరిణమించిన ఈ అభిమాన విద్యను చేవిడువక విశ్వాసముతో సేవించినారు. నాట్యమును బట్టియే కాక ఆంధ్రదేశమున ఇవే కలాపములాడు పలు మేళములు గూడ దీనినే తెలుపుచున్నవి.

సిద్ధేంద్రయోగి కాక ఇంకను వంకాయల బలరామభక్త, చేపూరి ఎరకయ్యదాసు, సరస్వతుల సుబ్బయ్యదాసు, తెన్నేటి వెంకటదాసు, బొంతలకోడు కేశవదాసు, ముట్నూరి నరసింహశాస్త్రి, మంగు జగన్నాథము గారి పేర్లు ముద్రలుగా వివిధ 'గ్రంథము' లందు కనబడుచున్నవి. ఈ జాబితాలో అధికార్ల సూర్యనారాయణగారు మరొక్కరు. ఇందు చేరదగిన నరుకూరి నారాయణకవిని ఆయన గ్రంథమును అనేక కారణములచే వేరుగా చూడవలసి యున్నది.

మేలట్టూరు మొదలైన చోట్లగల భాగవత మేళముల పుట్టుకకు కూడ కూడిపూడినాట్యమే కారణము. అవి ఆయాచోట్ల ప్రత్యేకముగ విలసిల్లుచుండగా కూచిపూడివారు కలాప నాట్యమున సిద్ధహస్తులైరి. భాగవత మేళములు చాలవరకు ఆలయ ప్రాంగణముల కంటుకొని యుండి దివ్యత మెఱియగా పవిత్రమైన గాంభీర్యముతో నొప్పారును. ఇంక కూచిపూడి నటు లన్ననో నిలుకడైన ప్రాపులేక తమ నాట్యమును వృత్తిగ చేసుకొనిరి. అందుచేత కాలక్రమమున ఈ నాట్యము సహజ గాంభీర్యమును, తీరును కోల్పోయినదని ఒప్పుకొనక తీరదు. అయినను శాస్త్రనిర్దుష్టత సడలజేసి క్రొత్త పోకడలు పోవునట్లు చేయుటకు తల మునుకలైన ఆకర్షణ యొకటి యుండగా వీ రీనాటికిని సంప్రదాయమును నిలిపి శాస్త్ర చోదితముగ నభినయించుచుండుట ఆశ్చర్యము గొలిపెడు విషయము.

తక్కిన నాట్య ప్రస్థానముల వలె ఈ నాట్య పంథ సముచితోన్నతికి రాకయుండుట విచారకరము. నాట్యమును గూర్చి వ్రాసిన కొందరు గ్రంథకర్త లీ ప్రస్థానమును గమనించనే లేదు. మరికొందరు దీని కన్యాయమే చేసిరి. ఈ వ్యాసమున సత్యభామాకలాపమును గూర్చి యించుక వ్రాయుటకే నా ప్రయత్నము.

కలాప మనునది అచ్చపు నృత్యము గాని, అచ్చపు రూపకముగాని కాదు. నృత్య రూపక మనుటకు గూడ వీలు లేదు. ఇందులో సమవ్యాప్తమైన కథ లేదు. ఉన్నది పూర్వ గ్రాహ్యమై శ్రీకృష్ణునకు ఆయన దేవేరియు గరువపు

చానయు నగు సత్యభామకు నడుమ జరిగిన ప్రణయ కలహముకు సంబంధించినది. అంతయు విప్రలంభ శృంగార విస్ఫురణమే. కైశికియు, భారతియు ముఖ్యవృత్తులు.

## కలాప ప్రయోజనము

కనీసపు కథా నేపథ్యముతో దశవిధ లాస్యాంగముల అభినయమున కవకాశము కల్పించుట ఈ భామా కలాపమునకు ప్రయోజనము. లాస్యమున పదము పాడుట, అభినయించుట అను రెండును ఉన్నవని గమనింపవలెను. నటి ముఖ్యపాత్ర. నటు డామెకు సహాయకుడు. దశవిధ లాస్యాంగములను ప్రదర్శించుటలో నాట్యశాస్త్రమును కచ్చితముగ ననుసరించినను నటీనట లక్షణములు, పదాభినయము మొదలగువానికి అభినయదర్పణమునే ఆధికారిక గ్రంథముగ స్వీకరింతురు.

ఈ ప్రదర్శనకు ప్రాణభూతమైన కథా విషయ మిది: ఒకసారి శ్రీకృష్ణునకు ఆయన దేవేరియు, అభిమానవతియు నగు సత్యభామకు ఎవరి యంద మెక్కువ యను వివాదము తటస్థించెను. దూరదృష్టిలేక వెనుక ముందు లాడక ఆమే తానే సౌందర్యవతి నని చాటి చెప్పెను. (ప్రణయ కలహము). ఇది యెక్కడనో అంతఃపురమున జరిగినను ఆ కృష్ణ పరమాత్మ డామె వినీతురాలివలె నుండకుండుట కిచ్చ మెచ్చక ఆమెను వీడిపోయెను. (మానము). అప్పుడు గాని సత్యాదేవికి తన తప్పు తెలియలేదు. ఏమైనను కృష్ణుడు కొంతకాలము ఆమెను చూడరాలేదు. సత్యాదేవి ఆ యెడ్బాక మనుభవింప వలసి వచ్చెను. (విరహము). ఈ నాగరకమైన శిక్ష ఆమె పూర్తిగ అనుభవించి చివరకు తాళలేక స్వామిని రమ్మని కోరుచు ఒక దూతిని పంపును. (దౌత్యము). చిట్టచివరకు కృష్ణుడు తిరిగి ఆమెను చూడవచ్చును. (సంగమము).

రుక్మిణియో, రాధయో ద్వితీయ పాత్రగా ఇతివృత్తమున కొక ఉపశాఖ కల్పించి చేర్చుటయు ఉన్నది. సత్యాదేవి విరహమును ప్రదర్శించెడి అసలు నృత్య మారంభ మగుటకు ముందే విదూషకుడు రాధనో, అథవా రుక్మిణినో సిగ్గుల పెండ్లికూతురుగా శ్రీకృష్ణుని కప్పగించుటను ప్రదర్శింతురు. ఆ తర్వాతనే సత్యాదేవి విరహప్రదర్శనము. చివరకు శ్రీకృష్ణుడు తిరిగి వచ్చినపుడు ఆయన వెంట రాధ, రుక్మిణి వచ్చి కనుపింతురు. సవతుల కయ్యము నడచును. ఈ సవతుల కయ్యము పండిత పామరరంజకమైనది. ఇరువురు దేవేరులు స్వామి కిరువైపుల జేరుటతో కథ ముగియును. (మంగళాంతము).

ఇతివృత్తములోని ఈ ఉపశాఖకు ఫలము సత్యభామ అనుభవించెడి సుమాళమైన ఆ శిక్షకు ఈర్ష్యాసమిధ యొకటి రగులుకొలిపి ఆమె విరహమును నుద్దీపింప జేయుట.

ఈ విదూషకు డొక చిత్రమైన పాత్ర. ఆటలో బోలెడు హాస్య మొలకబోయును. రాధ, రుక్మిణిని శ్రీకృష్ణున కప్పగించు ఘట్టమున అప్పగింతల పెద్దమనుష్యు డితడే. అనీద సత్యభామ 'దూతి'యు అగును. శ్రీకృష్ణునకు నర్మ సచివుడు అగును. శ్రీకృష్ణుడు వానిని 'మాధవా' అని పిలుచును. సత్య 'మాధవీ' అనును. వీడు తృతీయాప్రకృతియని అందరకు అర్థమగు విషయము. ముఖ్యముగా రంగస్థలమున పాత్రల సంఖ్య తగ్గించివేయుట కిట్టి సంవిధానము నాశ్రయించినారు. పైగా ఈ విదూషకు డొకసారి పురుషుడుగా ఒకసారి స్త్రీగా రూపు మారినట్లు కనబడుచుండుట సామాజికుల వినోదమునకు చక్కిలిగింత పెట్టినట్లుండును. సత్యభామకు దూతిగా సంచరించెడు సమయమున ఈ మాధవి వేషము శ్రీకృష్ణునితో సరాగాలకు దిగినట్లు చూపుట గూడ ఒక్కొక్కప్పుడు కద్దు. రాధ, రుక్మిణి ప్రవేశమున కేది ఫలమో దీనికి గూడ అదే ఫలము. సత్యభామ విరహము నుద్దీపింపజేయుట.

ఈ కలాపమును 'పారిజాత'మని పిలుతురు. కాని ప్రసిద్ధమైన పారిజాతాపహరణ కథకు ఈ కథతో నేపథ్య మాత్రముగా నైన ఎట్టి సంబంధమును లేదు. పారిజాతాపహరణ కథకు సత్యభామ స్వయంసంసర్గము ప్రసిద్ధమగుటవలన జనరంజకమైన ఊహగా ఇట్టి యభిప్రాయ మేర్పడియుండుట సాధ్యమే. మరికొన్ని కలాప గ్రంథము లీ పారిజాతాపహరణ వృత్తాంతమును స్వప్నవృత్తాంతముగా అంకెవేసి చూపుట గూడ యథార్థమే. కాని యిచ్చట గూడ సత్యభామ విరహము నుద్దీపింపజేయుటయే దీనికి ఫల మనియు, నోటి మాటలుగా జెప్పు ఆ కథాకథనము కొన్నినిముషములకంటె నెక్కువ యుండదనియు చెప్పవలసి యున్నది.

బహుశః జనసామాన్యమున గల పై అభిప్రాయమును జూచి పొరపాటు పడికాబోలు నరుకూరి నారాయణకవి అను కలాపగ్రంథకర్త పారిజాతాపహరణ వృత్తాంతముతో సమగ్ర గ్రంథమునే తయారు చేసినాడు. ఇది అర్వాచీన గ్రంథముకి ప్రాచీన కలాపగ్రంథములనుండి దండిగ విషయగ్రహణ మొనర్చినది. నారాయణకవి దా కలాపస్వరూపమును మార్చెడి సమగ్ర రూపకమునకు దారితీసెడి ప్రయత్న మనవలెను. ఏమైనను ఈ గ్రంథ మెక్కడను ప్రదర్శింపబడుట లేదనుట నిశ్చిత విషయము.

'మహా' అయినచో దాని నొక ప్రత్యేక యక్షగానముగ గ్రహింపవచ్చును.

## పూర్వరంగము: ఆముఖము

సాధారణముగ కలాపమునకు ముందు సుదీర్ఘమైన పూర్వరంగ ముండును. ప్రదర్శనమే తెలతెలవారుదాక నడచును గనుక పూర్వరంగము సొడవగుటలో వింత లేదు. నాట్యశాస్త్రమును తూ. చ. తప్పకుండా అనుసరించుటవలన పూర్వరంగ విధి యంతయు చెక్కుచెదరక నిలచినది. ఈ పూర్వరంగ విధిని క్రమముగా నాట్యశాస్త్ర మిచ్చిన పేర్లతో గూడ నించుక వివరింతుము.

1. కథాకళి నాట్యమున చండవాద్యమును వలెనె చాటింపునకై ఒకటి గాని, రెండు గాని మర్దళములు అవిరామముగా కొంతసేపు వాయింతురు. (ప్రత్యాహారము).

2. మార్దంగికుడు తాళగాడు రంగస్థలమున అవతరింతురు. (అవతరణ).

3. మర్దళము శ్రుతి జేయుట. (ఆరంభము, ఆశ్రవణము).

4. తొలి ప్రార్థన పదము. అంబాస్తుతి గాని, వినాయక స్తుతి గాని. (వక్త్రపాణి).

5. మంగళ కలశములు మామిడాకులు పట్టుకొని నృత్తముతో బాలగోపాల వేషముల ప్రవేశము. (పరిఘట్టన).

6. ఇంద్రపూజ చేసి టెంకాయ కొట్టుట. పూర్వము ఇంద్ర, అర్ధనారీశ్వరవేషములు రంగముమీద కవతరించెడివి. ఈ సంప్రదాయమున కవశిష్ట చిహ్నములుగా నిప్పుడు స్తోత్రములు చదువుట నిలిచియున్నది. సూత్రధారుడు పారిపార్శ్వకుని అథవా స్థాపకుని సాహాయ్యముతో ఇంద్రధ్వజము నిలిపి పూజింపవలెనని భరతుడు విధించినాడు. కర్ణాటక దేశమందలి బయలాటలో ఈనాటికిని ఇది నిలిచియున్నది. జండా ఎత్తి మంగళకలశములోని పవిత్రజలమును దానిపై ప్రోక్షించి టెంకాయ కొట్టుదురు.

7. పారిపార్శ్వకుడు ధ్వజ సహితము నిష్క్రమించును. (మార్గాసారితము).

8. సూత్రధారుడు రంగస్థలాగ్రభూమికి వచ్చును. (ఆసాంతము).

సాధారణముగ బాలగోపాల వేషముల నృత్తముతో గూడ ఈ పూర్వరంగ మంతయు తెరచీర వెనుకనే నిర్వహింపబడును. ఒక్కొక్కప్పుడు తెర లేకుండను జరుగుట కద్దు.

తర్వాత విధివిధానముగ మరియొక దశాభాగమునకు తెర ఎత్తబడును. మునుపటి కార్యకలాపముల కంటె నిది కొంచె మాసక్తికరముగ నుండును. ప్రార్థన, నాంది, పాత్ర పరిచయము—అయా పాత్రలే తమ తమ పేరు ప్రఖ్యాతులు వెల్లడి చేయుదురు—కథాసూచన అనునవి పది భాగములుగా విభజింపబడిన ఈ దశలోని ముఖ్యాంశములు.

1. ప్రార్థన—ఒక పాట. (గీత విధి).

2. నటి (స్త్రీవేషము) తెరచీర వద్దకు వచ్చుట (ఉత్థాపన).

3. తెరచీర వెనుకనుండి తెర యెత్తు వరకు స్త్రీవేషము నృత్యము ప్రదర్శించుట.

4. నటిగాని, పారిపార్శ్వకుడు గాని సాహాయ్యపడగా సూత్రధారుడు నాంది నిర్వహించుట.

5. స్త్రీవేషమున నున్న నటి తన పేరు ప్రఖ్యాతులు వెల్లడి చేయుచు పాట పాడుట. (ధ్రువ—ప్రావేశికి ధ్రువ).

6. సూత్రధారుడు స్థాపకుడుగా మారి పారిపార్శ్వకునితోనో, నటితోనో కథను స్పృశించుచుగాని, నాయికను గూర్చి గాని సంభాషణ నెరపుట. (రంగద్వారము).

7. నృత్యగతులతో మాధవి వేష ప్రవేశము. (చారి).

8. ఆ నృత్యమే సాడిగింపబడుట. (మాధవి).

9. మాధవి వేషము పాడుచు పారిపార్శ్వకునితో హాస్యప్రలాపమున బడుట. (త్రికము).

10. కథాసూచన. (ప్రరోచన).

## ప్రదర్శనకు ప్రాణభూతమైన విషయము

ఆపైని కృష్ణవేషము వచ్చును. సిగ్గుల పెండ్లికూతురైన రాధనో, అథవా రుక్మిణినో శ్రీకృష్ణుడు పరిగ్రహించుచున్నట్లు కల్పింపబడిన ఇతివృత్తోపశాఖ మాధవుడని పిలవబడుచున్న మాధవి వేష సాహాయ్యమున అభినయింపబడును. ఈ మాధవవేషము అటు సుదీర్ఘమైన పూర్వరంగమునకు ఇటు భామవేషము విరహాభినయమునకు మధ్య హాస్యముతోడి విరతిని కల్పించును. కృష్ణుని, రాధను, రుక్మిణిని గేలిచేసి కృష్ణు నొక అనాకారి యగు గొల్లవాడుగను పెండ్లికూతురును గయ్యాళి గంపగను తేల్చును.

భామ వేషము వచ్చుట ఈ ప్రదర్శనముననే ఒక ప్రధాన విషయము. దానికి చాల తంతు ఉన్నది. కథాగతిని అనుసరించుచు బోయి వచ్చినచోట దానిని వివరింతుము.

భామ వేషము ప్రవేశికధ్రువ పాడుచు రంగమునకు వచ్చును. ఆమె వెంట మాధవి వేషమును వచ్చును. అట్టు

తర్వాత సత్యాదేవి విరహాభినయము. మదనోపాలంభ చంద్రోపాలంభ మలయమారుతదూషణ లొకదాని తరువాత నొకటి చక్కని పదములతో అభినయముతో నడచును. మాధవి వేషము కృష్ణుని రూపరేఖావిలాసముల గూర్చి భామను ప్రశ్నలడుగుచు వచ్చును. ఈ సన్నివేశమును దశావతారాభినయమున కుపయోగింతురు. సత్యాదేవికి కలిగిన ఎడబాటు విరహముల కారణము తెలియజెప్పుట, ఆమె విరహమును మూర్ఛావస్థ వరకు ప్రదర్శించుట జరుగును. తరువాత సత్య మాధవిని దూతిగా పోయి తన నాధుని కొనితెమ్మని వేడును. మాధవి అంగీకరించి ఆ పనిమీద పోవును. (ఆయనవద్ద ఇంచుక సరాగము లాడును.) అటుపిమ్మట మూడు చక్కని సంవాదములు నడుచును. మాధవీ సత్యల మధ్య, సత్యా కృష్ణుల నడుమ, మరి చివరకు సత్యా రుక్మిణిలకో, అథవా రాధకో జరుగునది. చివరకు అందరు సమాధానపడి కలిసిపోవుటతో కథ మంగళాంత మగును.

ఇది ఈ ప్రదర్శనమునకు ప్రాణభూతమైన భాగము. ఇందున్నదంతయు లాస్య ముఖమున విప్రలంభ శృంగార విస్ఫురణము చూపుట. భరతుడు పది విధములైన లాస్యాంగములు చెప్పినాడు. (1) గేయపదము లేదా పాఠ్యము. (2) స్థిత పాఠ్యము. (3) ఆసీనపాఠ్యము. (4) పుష్పగండిక. (5) ప్రచ్ఛేదకము. (6) త్రిగూఢకము. (7) సైంధవము. (8) ద్విగూఢకము. (9) ఉత్తమోత్తకము. (10) ఉక్త ప్రత్యుక్తకము. బహుశః ప్రచ్ఛేదక మొక్కటి తక్క తక్కిన ఈ అంగములన్నియు జాగ్రత్తగా సంవిధాన నైపుణ్యముతో ప్రదర్శింతురు. కడపటిదైన ఉక్త ప్రత్యుక్తకము ప్రసిద్ధమైన సవతుల కయ్యమే.

మొదటినుండి చివరిదాక మాధవి వేషము జాతివార్తికమైన హాస్య మందించుచునే ఉండును. ఇట్లీ కలాప ప్రదర్శనము రసానందమున కాకరమైనది.

కేరళదేశపు కథాకళి, కర్ణాటక దేశపు బయలాట లందు వలె వాచకాభినయమును వెనుకకు నెట్టకుండుట భామాకలాపమున గమనింపదగిన విషయము. నటులు ముందు పాడి పిదప అందలి రస భావముల నభినయించు చుండగా వంత పాట పాడువారు వెనుక పాడుచునే ఉందురు. కథాకళి బయలాటలలో వలె గాక తెలుగుకలాపమునందు సూత్రధారుడు చాలవరకు అభినయ వ్యాసంగము లేక రంగమున నుండి నటి అభినయమును తీర్చుచు అందించుచు నడపును. నటు డిట్లభినయ నేతృత్వమును వహించుటను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయి పడగలు' లో చక్కగా వర్ణించినారు. ఒక్కొక్కప్పుడు విదూషకుడే ఈ నేతృత్వము వహించుట కూడ కద్దు. దీనికి ప్రత్యక్ష ఫల మేమనగ రంగమున ఒక నటుడు ఒక నటి మాత్రము నిలచి పాత్రబాహుళ్యమును కనీస పరిమితికి దెచ్చుట.

ఈనాటి భరతనాట్య ప్రదర్శనములలో అలరింపు, జతిస్వరము, వర్ణము, పదము, తిల్లానా అని అయిదంశము లుండుట అంద రెరిగినదే. భామా కలాపమున గూడ తిల్లానా తప్ప తక్కిన ప్రదర్శనాంశము లన్నియు నున్నవి—తెర వెనుకనో, తెర లేకుండనో రంగమున చూపెడు నృత్యగతులు అలరింపే. ముందు సూచించినట్లుగా భామ వేషము తెర బయలుదేరుట పెద్ద తంతు. దానికి మూడుఘట్టము లున్నవి. మొదట భామ వేషము తెరమీదినుంచి తొంగిచూచి ముఖదర్శనము చేయించి కొన్ని రేచకములు, అఙ్గహారములు ప్రదర్శించును. (అలరింపు). నడుముదాక పట్టిన తెర వెనుక నిలబడి రెండవ ఘట్టమున భామ వేషము ప్రావేశిక ధ్రువ పాడును. సాధారణముగ నిది జతిస్వరము. అసలు ప్రదర్శనము ఆరంభమై రంగస్థలమునకు వచ్చునప్పుడు వర్ణ మెత్తుకొనును. సత్యాదేవి విరహాభినయమున ఎన్నో పదములు వాని అభినయము నున్నవి. తిల్లానా ఒక్కటి మాత్ర మిందు లేదు. అదిగూడ ఎందుకనగా నాయిక కలహాంతరిత యగుట చేత నిషిద్ధమైనది. దానికి బదులుగ సవతుల కయ్యము రూపమున ఉక్త ప్రత్యుక్తక మున్నది.

కథాకళి బయలాటలలో తాండవము ప్రధానము కాగా మన తెలుగు నాట్యప్రస్థానమున లాస్య మంగీకృతమై కృతియైనది.

భామాకలాపములోని మరియొక ప్రధాన లక్షణమేమనగా భరతుడు విధించిన ధ్రువాగానమును వదలక పాటించుట. ప్రతి పాత్రయు తన ప్రావేశికీ నిష్క్రామికీ ధ్రువలు పాడును. సవతుల కయ్యమున ఆక్షేపకీ ధ్రువ యున్నది. అత్యంత విరహాకులయై సత్యాదేవి మూర్ఛిల్లు ఘట్టమున అంతరధ్రువ యున్నది. సత్యాదేవి మాధవి వేషమును దౌత్యమునకు పంపు చోట ప్రాసాదకీధ్రువ యున్నది. దీనికి సుదీర్ఘమైన ఆలాపన చేయుదురు. సాధారణముగా రాగమాలిక పాడుదురు.

సంగ్రహముగా చెప్పినచో సత్యభామాకలాపము లాస్యముచేత చాక్షుషక్రతు వగుటయే కాక నేటి దాక్షిణాత్య భరత నాట్యములోని ఐదంశములలో నాలుగింటిని పొదివికొని ఆ భరతనాట్య ప్రదర్శనములలో లేని దశావతారాభినయము నొకదాని నెక్కువగ చూపించుచున్నది. ఈనాటి అవసరమును బట్టి కొంత కత్తిరించి సొగసు గూర్చుటకైనను సుదీర్ఘమైన పూర్వ రంగమును మానుకొన్న బాగుండునని ఈ సందర్భమున సాహసించి సూచించుచున్నాము. విసుగుగా పూర్వ

రంగము నంతటిని నిర్వహించుటకు మారుగ బాలగోపాల వేషములతోనే ప్రదర్శన మారంభింపవచ్చును.*

ఉన్న దున్నట్లుగ చూచినచో సత్యభామా కలాపము లోని ప్రత్యేకలక్షణము లిట్లు చెప్పవచ్చును : పూర్వ రంగ మును సమగ్రముగ, నిర్దిష్టముగ నిర్వహించుట మొదటిది. ధ్రువాగానము రెండవది. పాత్రలు, పాటలు మాటలు తావే చెప్పుచు వాచికాభినయము చేయుట మూడవది. లాస్యాంగ ముల ప్రదర్శనము నాలుగవది. ఐదవది నృత్త నృత్య భేదముల నిర్దుష్ట వినియోగము. ఆరవది నటి, నటుడు ప్రదర్శనమం దంతయు తమ తమ విధులకు కట్టుబడి నిలుచుట. రంగ లక్షణము పాటించుట ఏడవది.

## శ్రీ గ ది త ము

ఈ రచన చూచి కొందరు పండితులు ఇది శారదా తనయుడు తన భావప్రకాశలో చెప్పిన పారిజాతకమను ఉప రూపకమని అభిప్రాయపడినారు. ఈ రూపకమునకు సత్య భామా రుక్మిణి కృష్ణుల సంగతి ఉన్నందున జనసామాన్యము దీనిని పారిజాతమని వ్యవహరించుట యథార్థమే. కొన్ని గ్రంథ ములలో రచయితలు పారిజాత వృత్తాంతము స్వప్న విషయ ముగ జొనిపియుండుట కూడ దీనికి నిర్ణాయకముగ పనిచేసి యుండవచ్చును. కాని పారిజాతక లక్షణ మిట్లున్నది :

పారిజాత లతైకాంక ముఖనిర్వహణాన్వితా
వర్ణమాత్రా ఖండతాలవతీ గాథా సమన్వితా
వీరశృంగార భూయిష్ఠా దేవక్షత్రాది నాయకా
కలహాంతరితావస్థా నాయికోదాత్తనాయకా
అథవా భోగినీ స్వీయగణికా నాయికాన్వితా.
తాః స్ఫురస్తౌ చతస్రః స్యుర్దండరాసక నర్తనాః (?)
సాపసారత్రయా చిత్రకథాగేయ సమన్వితా
క్వచి ద్విదూషక క్రీడా పరిహాస మనోహరా
పారిజాత లతాసేయం యథా గంగాతరంగికా
పారిజాతక మిత్యేవ కైశ్చి దేషాభిధయతే.

(భావప్రకాశనము)

దీనినిబట్టి ఈ రూపకము పారిజాతకము కాదనుట కీ యుపపత్తు లున్నవి. వీరము లేకుండుట మొదటిది. పాత్ర బాహుళ్యములేక మిక్కిలి పరిమితమైన పాత్ర సంఖ్య—చివరి వరకు భామవేష మొక్కటే ప్రముఖపాత్ర—ఉండుట రెండ వది. దండరాసకము లేకుండుట మూడవది. విదూషకక్రీడ ఇందులో స్వల్పముగా గాక 'బోలె' డుండుట నాలుగవది.

అంతేకాదు. పారిజాతమున ముఖ, నిర్వహణసంధులు రెండు మాత్రమే ఉండవలెనని విధింపబడినది.

సత్యభామాకలాపమున ఈ రెండే కాక ప్రతిముఖసంధి కూడ నున్నది. నిజమున కిది శ్రీగదితమను ఉపరూపకము గాని పారిజాతము కాదనుట స్పష్టము. శ్రీగదిత లక్షణ మిట్లు చెప్పబడినది :

అథ శ్రీగదితం విద్యా త్ప్రసిద్ధోదాత్తనాయకమ్
భారతీవృత్తి బహుల ముదాత్త వచనాన్వితమ్
గర్భావమర్శ సంధిభ్యాం శూన్యం ప్రఖ్యాత నాయకమ్
ఏకాంకం విప్రలంభాఖ్య రసప్రాయం క్వచిత్ క్వచిత్
యస్మిన్ కులాంగనాపత్యుః శౌర్య ధైర్యాదికాన్ గుణాన్
సఖీనా మగ్రతోవక్తి తానుపాలభతేఽథవా
విప్రలబ్ధాచ తేనైవ యది తత్సంగమాశయా
ఆసీనా యత్ర లలితం* ప్రియాభోగవిభూషితమ్
ఉత్కంఠితా పఠేద్గాయే త్పాఠ్యం వా గీతమేవ వా
ఏవం విధం శ్రీగదితం రామానందం యథోకృతమ్.

(భావప్రకాశనము).

శ్రీగదితమున ఒకటే అంకము. కథ ప్రసిద్ధమైనది. నాయకుడు ఉదాత్తుడు. నాయిక ప్రఖ్యాత. శ్రీవేష ముండునుత్త గర్భవిమర్శ సంధులు గూడ వినియోగమునకు వచ్చును. హేమ చంద్రసూరి చెప్పినట్లుగ ఇది పదవర్ణాభినయపూరితము. సత్యభామాకలాప మీ లక్షణమునకు కైతొడుగున చేయి యొదిగిన ట్లొదుగుచున్నదని గమనించుట కష్టముకాదు. వ్యాఖ్యాత చెప్పి నట్లుగ ఇచట శ్రీవేష మనగ లక్ష్మీ వేషధారిణి అనగా రుక్మి ణియో, రాధయో యని చెప్పుటకంటె నెక్కువగ సమన్వ యింపవలసిన దేమియు లేదు.

---

* ఈమధ్య అక్టోబరులో మదరాసులో కూచిపూడివారి భామాకలాపము ప్రదర్శింపబడినపుడు బాలగోపాల వేషముల తోనే ప్రదర్శన మారంభ మగుట ముదావహము. ఈ సూచన తొలిసారిగ 1957 లో చేయబడినది.

* యాత్రాసీనా చ లిఖితం.

# సరిహద్దులు

## 'శ్రీపతి'

ప్రియుని ఆలింగనంలో చీకటిచిన్మయానందాన్ని పొందుతోంది. వెన్నెలరేడు చీకటిని తనలోదాచుకొని పరవశంగా చూస్తున్నాడు. ఉత్తరపవనం ప్రేమసందేశాలని గొంతువిప్పి పాడుతూ పోతూంది. మాతృత్వవాంఛతో వరిపైరు ఆ అహ్లాద వాతావరణానికి మైమరచి నృత్యంచేస్తోంది. దూరాన కొండలు ప్రోగులుగా పడ్డ కారుమేఘాల్లా నల్లగా పడివున్నాయి. చెరుకు తోటల్లోని కాపలాకుర్రాళ్ళచేత అనేక రాగాలు తీయిస్తోంది రాత్రి. సముచిత జంత్రసమ్మేళనంలా రాత్రి పిట్టల కూతలు, నక్కల అరుపులు, చెరుకు తోటల్లో సవ్వడి చేస్తున్న మారుతం, పైరుపాట అన్నీ సమకూడాయి.

గ్రామానికి దక్షిణాన, ఫర్లాంగ్ దూరాన, ఆ చుట్టుపక్కల పొలాలకు పదడుగుల యెత్తున మెరకమీద, పలచగా పెరిగిన చెట్లమధ్య, ఆ బహుళజ్యోత్స్నలో మెరుస్తున్న పూర్ణకుండం ఓ దేవీ ఆలయానికి నిదర్శనంగా వుంది. ఆప్రక్కనే గదిలో పూజారి.

ఆ సమయం, వాతావరణం, పరిసరాలు అన్నీ సూరన్న తాతకి కొత్త. అలాంటి సమయంలో ఆ ప్రదేశానికి రావాల్సి వుంటుందని జీవితంలో యేరోజూ కలగనలేదు. ఆ ఉదయం సంఘటన కల్పించిందలా.

ఆ శరీరం మూడు పాతికలు దాటిన అనుభవాలని ధ్రువపరుస్తోంది. చేతిలోని కర్ర టిక్కు టిక్కుమని భూమిని, కాలాన్ని వెనక్కి నెట్టుతోంది. సూరన్నతాతముందు దృఢంగా యింకో ఆకారం దారిచూపుతోంది.

ఆలయానికి చేరువయారు. గుడిమంటపంలో రెండు నీడలు స్పష్టంగా చూస్తేకాని అనుమానించటానికి ఆధారాల్లేవు. అవి కదులుతున్నాయి. సూరన్న తాతకి అంత పరీక్షతో చూసే దృష్టి పోయింది. ఆ ప్రాంతంలోని భయం ఊహించి చూడలేదు రెండోవాడు. గుడికి చేరువయారు. హేమంతం కావలించుకొని గజగజలాడిస్తోంది. సూరన్నతాత అప్పటికే విసుగుచెంది 'యిదేనా?' అని అడిగాడు.

'ఆ!' అని అవ్యక్తి ఆలయానికి ఉత్తరానవున్న గది ముందు, పూల మొక్క దగ్గర నిల్చొని 'నూకయ్‌గారూ' అని పిలిచాడు.

ఆలయమంటపంలోని నీడలు కదిలాయి—బయట వ్యక్తులను చూసినట్టు.

నూకయ్యగారు లేచి తలుపు తెరచుకొని 'యెవరు?' అన్నారు గంభీరంగా. అప్పటికింకా ఆయన నిద్రపోవడం లేదు. కొండగాలికి జడిసి తలుపు వేసుకొని లోపల కూర్చొని ప్రార్థన చేసుకొంటున్నారు. ఇంతలో బయట కేక—

'మేష్టారికోసం యీ తాతొచ్చారు—'

'అలాగా? సరే రండి లోపలికి. మేష్టారు యింతలోనే వస్తారు—' అని ఆహ్వానించారు.

'నే నెళ్తానండీ నూకయ్‌గారూ—' అని ఆయన వెన్నెల్లో నీడయి మాయమయాడు అక్కడినించి.

సూరన్నతాత లోపలికి వచ్చాడు. కోడి గుడ్డు లాంతరు వెలుగుతోంది. చిన్న గది. ఓ పక్కన మంచం. ఒకటే ద్వారం పశ్చిమాన. దక్షిణాన కిటికీ. తూర్పు గోడపక్క వంటపాత్రలూ, పెట్టెలూ, డబ్బాలూ. ఉత్తరగోడకి ఐదడుగుల యెత్తున నాలుగడుగుల బల్లమీద పుస్తకాలు అందంగా అమర్చబడివున్నాయి. మంచంపక్క పరచబడివున్న పరుపులో కూచోమన్నారు నూకయ్యగారు. సూరన్నతాత కూచున్నాడు—ఆదినం పడ్డ ఆవేదనకి నిట్టూరుస్తూ, కర్రని ఆప్రక్కనే పెటుతూ.

*　　　*　　　*

'అవును. మాతాతే!'

'ఎందుకొచ్చారు?' అంది. ఆ పలకటంలో ఆకర్షణ వుంది. ఆమె ఒరియా ఉచ్చారణ లేవో తెలుగుని అందం చేస్తున్నాయి.

'ఒక్కసారి పాత కథ గ్యాపకం తెచ్చుకో—యెందుకొచ్చారో అర్థమవుతుంది.'

'మీ రూహించినట్టే—'

అతను కింద మెట్లపై కాళ్ళు పెట్టుకొని కూచున్నాడు. అతని ఒడిలో ఆమె తల పెట్టుకొని అతని కళ్ళనీ, తారకలనీ తరచు చూస్తోంది. ఆమెని నిమురుతున్న అతని కుడిచేయి వ్రేళ్ళని తన రెండు చేతులతోనూ పట్టుకొని, పెదాలని మరోసారి తడుపుకొని—

'అయితే—' అని సహజమైన సంశయాన్ని స్త్రీ హృదయంలోని భయంతో కలిపి జార్చింది.

క్రింది మెట్టుకి పదిగజాల దక్షిణాన సమాధి. ఆ చుట్టూ పూల మొక్కలు. మందారాలు మాత్రం దట్టంగా పొదలు పొదలుగా వున్నాయి. ముఖ్యంగా టమాటో మొక్కలు బరువుగా నిండుగా వున్నాయి. అవి యెన్నో రకాల ఆకులు. ఆ

వెన్నెల్లో రంగుల భేదం తెలీకుండా వుంది. తెరలుతెరలుగా సుగంధాలు ఆత్మల్ని పవిత్రం చేస్తున్నాయి.

'ఏంవుందీ?' తన ఆస్తి నెవరో దోచుకొనేందుకు వచ్చారనే బాధే అంతర్గతం అని తెలుసుకొని అభయంగా వీపు తట్టాడు—మూర్తి.

అసంతృప్తికరంగా, భయంగా వుందా సమాధానం —ఆమెకి.

'ఇపుడు నువు కనిపించావంటే యెలా వుంటుందో తెలుసా?' అన్నాడు.

ఆశ్చర్యంగా కనుల్లోకి చూస్తోంది. జారిపోతోన్న వేళ్ళని గట్టిగా పట్టుకొంటూ.

'భరించలేరు. శత్రువుని చూసినట్టు చూస్తారు. ఎక్కడో, యెవరో పాడుపని చేసేశారని అనుకొంటారు. సనాతనాచారాలక్రింద నలిగిపోయిన వీరికి యీ కాలం అంతా విరుద్ధంలా వుంటుంది. ఈ చదువుకోడాలూ, హరిజనసేవా, హోటల్ భోజనాలూ, కులాంతర్వివాహాలూ, ఆడా మగా నిర్భయంగా తిరగటం యివేవీ కిట్టవ్. అందుకే వాళ్ళు బాధపడిపోతారు.'

ఇంతలో నూకయ్‌గారు బయటికి వచ్చారు. పొయ్యి వెలిగించుతున్నట్టుంది. పక్కసాలలో వెలుతురు. పడుకొన్న దండాశి నూతివేపు వెళుతున్నాడు. గుడికి వాయువ్య దిశలో పొతికగజాలలో నుయ్యి వుంది.

'భోజనం లేదుగాబోలు వంట యేర్పాటులు చేస్తున్నట్టున్నారు—' అందామె లేచి కూచొని. గాజులు గలగలలాడినాయి. అరికిన్‌లాంతరు వెలిగించి సాలలో పెట్టారు.

'నే వంట చూస్తా—తాతగారిని కలుసుకొండి' అని లేచి నిల్చొంది.

ఈసడించే సవతితల్లి, నియంతృత్వ ధోరణిలో ఆత్మని బోధించే తండ్రీ, యేవిధంగానూ ప్రేమించలేని సవతి బిడ్డలూ, అంతవరకూ అసహ్యించుకొనే బంధువులు, పంకిలమయమైన సంసారజీవితం అతని స్మృతిలో కదిలింది.

చీర సర్దుకొని, జుత్తు ముడివేసుకొని కదులుతోంటే—'చూడుకారుణ్యా—తాతగారు ఉద్రేకంలో యేమన్నా పట్టించుకోనని మాటియ్యి—' అని చేతులు పట్టి ఆపి, అతి వినయంగా కోరాడు. ఆమె వినిపించని నవ్వు నవ్వింది.

సుమసుగంధాలు శీతల సమీరాన్ని పెనవేసుకొన్నాయి.

'కారుణ్యా—' అని భావప్రకటనకు తడుముకొన్నాడు. 'యీ కష్టాలన్నీ చెపితే అర్థమౌతాయంటావా? అందుకే నేనేమీ మాట్లాడదలంచలేదు. ముఖ్యంగా తాతయ్యతో—' సమీరం విడిపోయింది. పరిమళం విరహం భరిస్తోంది. వెన్నెల ఆనందంలా ప్రకృతిని ఆవరించింది.

గదితలుపు తోసుకుని లోపలికి వచ్చాడు. సూరన్నతాత. మొహం తిప్పి చూశాడు. పెద్ద పొటాకుచుట్ట కాలుస్తున్నాడు. ఆ వెలుగులో నుదుట గీతలు నీడల్లా తయారయాయి. కళ్ళు దూరాన వెలుగుతున్న జ్వాలల్లా మిణుకుమిణుకు లాడుతున్నాయి.

కిటికీలోంచి లోపలికి చూసింది కారుణ్య. అదీ సంఘటన!

'మీరు వెళ్ళి కూచోండి నూకయ్‌గారూ. యింత ఉత్సాహం ఆదేవి యెలా యిచ్చేసిందో, యీ ముసలితనంలో—' అంది అతని చేతిలోని బియ్యం కడగటానికి తీసుకొంటో.

'మూర్తి లోపలికి వెళ్ళాడా?' అంటూ కిటికీలోంచి చూశారు నూకయ్‌గారు.

విధిగా వేస్తున్న కుశలప్రశ్నలు వినిపించాయి. ఎవరూ మాటలు పొడిగించడంలేదు. సూరన్నతాత అలసిపోయినట్టు ఉన్నాడు. పట్టించుకొని వినేశక్తి కోల్పోయినట్టుంది ముఖ భంగిమ.

మూర్తి రాబోయే ప్రతి క్షణమూ భయంకరమైన విపత్తుగా భావిస్తున్నాడు. కాని తాతయ్యంటే జాలిగావుంది. ఓసారి తనకథ చెబుతూ సూరన్నతాతగురించి చెప్పిన విషయాలు కారుణ్యస్మృతుల్లోంచి లేచాయి. దగాపడిన తమ్ముడు సూరన్నతాత!

నూకయగారు సమాధివేపు వెళ్ళారు. టమాటాలు తెచ్చేందుకేనేమో! మూర్తిలో భయం, సాహసం దంద్వయుద్ధం చేస్తున్నాయి. యింతవరకూ చేసిన నూతన సాహసం యీనాడు వో వృద్ధునిముందు వీగిపోవాల్సిందేనా? తాతమీదవున్న గౌరవం కొద్దీ తను వేసుకొంటున్న కొత్తబాటనుంచి తిరోగమించాలా? అనురాగాలూ, ఆదర్శాలు అతనిలో భీకర మారణ యుద్ధం చేస్తున్నాయి.

అతని కళ్ళల్లో, కదలికల్లో అంత బాధా చూసి తెగిన ఆకులా రెపరెపలాడి రాలిపోతోంది కారుణ్య హృదయం. ఇంకోసమయంలో అయితే పిలిచి యెన్నో కబుర్లు చెప్పేదే—కాని—యే సరిహద్దునో అతిక్రమించలేకపోతోంది.

తాతయ్య యింకో పరిస్థితిలో వస్తే యెంతో అప్యాయత ఒలకబోసేవాడు మూర్తి. సంఘంలో తన స్థానాన్నీ ప్రయోజకత్వాన్నీ చూపించుకొని గర్వపడేవాడు. కాని యీ సందర్భంలో విలువలేదు. అందుకే అక్కడ యింక నిలవలేక బయటికి వచ్చేశాడు. సూరన్నతాత కాల్చిన చుట్టముక్కని పారేసి లేవబోయాడు.

'మీరు వెళ్ళి మాట్లాడండి నూకయ్‌గారూ—నే నీ పని చూస్తా'నంటూ అతని చేతిలోని టమాటాలు అందుకొని కారుణ్యముందు కూచున్నాడు బల్లపై.

కొంతసేపు చిలిపి చిలిపి ప్రశ్నలువేసి నూకయగారు చివరికి 'మూర్తిగారు యిక్కడ రెండేళ్ళనించి వుంటున్నారు గదా? మీరు—' అని అడగబోతున్న ప్రశ్న అంతం కాకుం

డానే జోక్యంచేసుకొని, 'ఆఁ.....అలా అన్నారా స్వామీ—' అని సూరన్నతాత కొంత ఆలోచించాడు.

తాతయ్య సంభాషణలు తరచు ఉపమానాలతో ఆరంభ మవడం మూర్తికి బాగా గుర్తు. మాటలు, ఉపమానాలు సరిగ్గా పెట్టుకొనేందుకు కొంతసేపు మౌనం.

'ఆబోతు—స్వామీ వింటున్నారా? ఆబోతు వయసు లోనికి రాగానే తండ్రి ఆబోతుని యేం చేస్తుంది స్వామీ?' మెల్ల మెల్లగా స్పష్టంగా ముగించి, మౌనం వహించి నూకయ్య గారి కళ్ళల్లోకి సూరన్నతాత చూడడం—చూసిన కారుణ్యకి తన స్వేచ్ఛ గాలానికి తగులుకొన్నట్టయింది.

'అవును' అని ఊరుకొని పూర్తివాదాన్ని వినేందుకు అతనివేపు చూస్తున్నారు నూకయగారు.

'అది పశువ్ గుణం—అవునంటారా స్వామీ?'

'ఆఁ అయితే?'

'మనం మనుషులం. అలాగే వినండి స్వామీ—అలాగే ప్రవర్తిస్తే మనకీ వాటికీ భేదం యెక్కడ?'

ఆ మాటలు విన్నపుడు సమాధానాలు పడగ విప్పాయి. పశువులకున్న చాలా సుగుణాలు మనుషులకు లేవని చెప్పాలను కొంది. ఇంతలో పొంగొచ్చి నిప్పు 'సుయ్' మంది. పిడుగు పాటుకు తట్టుకొంటూ వింటూన్న మూర్తిలో పశ్చాత్తాపం పెరుగు తోంది. తను తండ్రిని మోసం చేశాడా? ఆబోతులా రంకె వేసి కాలు దువ్వాడా?

'స్వామీ—వినండి—యీనాడు నా కూతురు—చచ్చి స్వర్గాన్నుంది—'

అమ్మ మూర్తి మదిలో మెదిలింది.

'దాన్ని యీనాడు నా అల్లుడు—వింటున్నారా? కాకి గూట్లో కోయిల గుడ్లుపెట్టింది కాబట్టి—బాగా వినండి స్వామీ— ఆ కోయిలపిల్ల ఈ కాకిని మోసంచేసి వెళ్ళిపోయింది అని నిందిస్తున్నాడు. స్వామీ—నాకు తెలుసు—బావంటే దాని—కెంత గౌరవమో?'

నూకయగారు ఆ మాటల్లోని కథంతా వూహిస్తున్నారు. బయట కుక్క యెవరో దారిపోయేవారినిచూసి అరుస్తోంది. దండాశి కల్పించుకొని పనులు చేస్తున్నాడు. స్త్రీపై సహజంగా రుద్దే మాలిన్యపుదుర్గంధానికి తట్టుకోలేకపోతోంది. కారుణ్య. మూర్తి జడుడయాడు. తన తల్లి పవిత్రత గురించి చాలమంది శ్రేయోభిలాషులనోట విన్నాడు. చనిపోయిన తన తల్లి అంటే అతనికి యీ విశ్వం. తట్టుకోలేక విరుద్ధ రస భావభరితుడై, ఉగ్రుడయ్యాడు మూర్తి.

వెన్నెల క్రమంగా హెచ్చుతోంది. దూరాన జనం గోల. చెరుకుతోటల్లో యెలుగుబంటి ప్రవేశించినట్టుంది. ఆ గోల క్రమంగా దగ్గరౌతోంది.

నూకయగారు బయటికి వచ్చి చూసి, లోపలికిపోయి తలుపు మూసి మంచంమీద కూచున్నాడు. సూరన్నతాత పరీక్షతో అతన్ని చూస్తున్నాడు. చలిగాలి హెచ్చుతోంది.

'స్వామీ యింకొక మాట చెబుతాను వింటారా? మా పెద్దమ్మ కొడుకు ఒకడుండేవాడు. వాడంటే వూళ్లో అందరికీ భయం. ఎవరినీ కష్టపెట్టేవాడుకాడు—ఎవరు తప్పుచేసినా ఒప్పుకొనేవాడుకాడు. అంతటి మనిషి కూడ—స్వామీ—చెపితే నమ్మరు—మందెట్టేసింది—ఓకులట—అప్పటినించి ఆ గడప దాటి క్షణం బయటికి వచ్చేవాడు కాడు—'

ఏవేవో చచ్చాడన్నవరకూ చెప్పి నీతులతో కథ పొడిగిస్తున్నాడు సూరన్నతాత. కారుణ్య అమృతహృదయంలో విషశరం గుచ్చుకొంది. మరణవేదనతో ఆమె కనుల్లోంచి అశ్రువులు రాలుతున్నాయి. మందెట్టేసింది ఓకులట—మరీ మరీ వచ్చి నాటుకొంటున్నాయి ఆ మాటలు! ఇంతకుముందే యిలాంటి దెబ్బలు కొన్ని తగిలిన కారణంగా ఆమెలో కొంత ఓర్పు మిగిలింది. మూర్తి ఆకులట అనబడే స్త్రీగురించి ఊహిస్తున్నాడు. ఆమె యెంత గొప్ప కళాహృదయో? రూపవతో? ఆమె పలుకుల్లో ఏతత్వం విన్నాడో? ఏ గానం బంధించిందో? ఏమో! ఊహ వాస్తవికతను అందుకోవడం లేదు.

'స్వామీ—కొమ్ము లొచ్చాయని యీనాడు—' మాట పూర్తిచేయకుండా మౌనం వహించాడు. మూర్తి కోపం కొమ్ములు విప్పింది. ఇక్కడా తన ఆత్మకి శాంతి లేదు. జీవితాలని వ్యర్థంచేసే యీ బంధుత్వాలని క్షాళనచేసేయాలనే తన పట్టుదల పునః పునః పీగిపోతోంది. యిన్ని నీతులు బోధించే తాత తన ఒక్క కొడుకుని యెందుకు రక్షించుకోలేక పోయాడు? సన్యాసుల్లో చేరిపోతే యేమన్నా చేయగలిగాడా? తమ్ముడు సంసారం ఒలకబోసే పగలూ, ద్వేషాలూ భరిస్తూ నీచజీవితాన్ని గడిపే ఓ వ్యక్తి తత్వబోధచేస్తే సహించే వోర్మి మూర్తిలో శూన్యమౌతోంది.

'నేడు నా అన్ననాళ్ళని దూరంచేసుకొని—నా కెవరూ లేరనుకొంటే—' మళ్ళీ మౌనం. నిర్మలసాగరంలో రాళ్ళు పడి వలయాలు పెంచినట్టు మూర్తిలో ఆ మాటలు అనురాగాల నన్నిటినీ తట్టి లేపుతున్నాయి. సూరన్న తాతకి తెలుసు యీ తన సంభాషణంతా యెవరిపైనో, దాని ఫలితం యెలాంటిదో?

వంటయింది. నూకయగారు వడ్డనకి లేచారు. భోజనానికి తీసుకొచ్చేందుకు మూర్తి సూరన్నతాతవద్ద కెళ్ళాడు. ఆ ముసలాయన తిండి కనీసం తినాలంటే తను కొంచం దూరంగా ఉంటం అవసరం. అది గ్రహించి ఆమె మండపంవేపు పోబోతోంది. బయట అడుగుపెట్టిన సూరన్నతాత అదిచూశాడు. వెన్నెల్లో వేలాడుతున్న పూలమాలలా కన్పించింది.

భోజనం అంతసేపు నిందితునిలా నిశ్చేష్టితుడై నిల్చొని చూస్తున్న మూర్తివేపు కారుణ్య దృష్టి అంతా. నూకయగారి ఆదరణ, వర్ధన కొత్త ప్రేమలని పెంచుతోంది ఆత్మల్లో.

రొజ్జగారి విజృంభించి తలుపు తట్టుతోంది వేగంతో.

అన్నయ్యతో కటక్‌లో చదువుకొన్న దినాలు, వదిన రాకతో అన్నయ్య ప్రవర్తనపై విసుగెత్తడం, విశాఖలో మామయ్యవద్దకు వెళ్ళడం, అప్పట్లోనే తెలుగు నేర్చుకోవడం, కాలేజీ చదువుకొంటున్న మూర్తితో పరిచయం, ఉద్యోగం కోసమని బరంపురం రావడం, పై ఆఫీసర్ అహంకారంతో ఉద్యోగం వూడడం, ఒంటరి బతుకుపై విసుగెత్తి తన పల్లెటూరిలోనే వుండిపోదలంచడం, రెండు నెలల క్రితం చనిపోయిన తల్లీ— అన్నీ జ్ఞాపకాలూ, పొగల్లారేగి మానసికరోదసిని ఆక్రమించాయి—కారుణ్యలో.

భోజనం అయ్యాక లోపలికి వచ్చి మరో పెద్ద చుట్ట పక్క జేబులోది తీసి వెలిగించాడు సూరన్నతాత. శాలువ కారుణ్య కిచ్చి పొయ్యి పక్కన పక్కవేసుకొని మేను వాల్చాడు దండాశి. నూకయగారు ప్రార్థనచేసుకొంటున్నాడు.

చాలసేపు కూచొన్న సూరన్న తాత పరుపుమీద సాగిల బడ్డాడు. కారుణ్య దండాశినిలేపి తనపక్క సాలలోకి తెప్పించుకొంది. సాలబయటికి మూర్తి పిలిచి 'కారుణ్యా! యింకా చాలా రకాల మాట లొస్తాయ్! నువు వినీ విననట్టు పడుకో. అదే నా యీనాటి కోరిక. లేకపోతే చాలా బాధపడతాను—'అని కళ్ళనీళ్ళ పర్యంతరమై బ్రతిమాలాడు.

ఇంతలో వారికి పాతిక గజాల దూరాన భయంకరమైన కేక. కారుణ్య తుళ్ళిపడింది. నూకయగారు చాల తేలిగ్గా తీసుకొన్నారు. సూరన్న తాత ఏమిటో అని ఆలోచిస్తున్నాడు. మూర్తి ఎవరో వ్యక్తి పడిపోవడం చూసి పరుగెత్తుకు వెళ్ళాడు. తెల్లగా సామాన్యమైన పొడవరి. పాతికేళ్ళ వయస్సు. సన్నగా వున్నాడు. అతనిగురించి వూర్లో చాలా మంది చెడ్డవాడుగా మాట్లాడుతారు. పాము కాటు వేసిందట! నూకయగారు మంత్రించారు. కారుణ్య గుండెలు భయంతో కొట్టుకొన్నాయి. ఏ దుర్బుద్ధితో వచ్చాడో? ఏ పగ సాధించడానికో? 'వెళ్ళిపో! అలా యెప్పుడూ రాకూడదు' అని చిన్నపిల్లవానికి నచ్చచెప్పినట్టు నూకయగారు చెప్పడం ఆ బాధలోకూడ కారుణ్యకి నవ్వు తెప్పించింది.

జరిగిన కథవిని సూరన్నతాత ఆశ్చర్యపోయాడు. ఈ మనుష్యుల్లోని యీర్ష్యాసూయలు అశాంతిని రేకొల్పాయి అతనిలో. నిద్ర పోబోయాడు. కాళ్ళు పీకుతున్నాయి. బస్ చెడింది. ఆరుమైళ్ళు నడిచి వచ్చాడు. కుర్రతనంతో యిరవై క్రోసులు సులభంగా నడిచేవాడు. కానీ యిపుడు చాలా మారిపోయాయి! ఏం చేయడం తోచక తనని తనే నొక్కుకోవడం చూసిన కారుణ్య గదిలోకి వచ్చింది. మూర్తి ఆశ్చర్యపోయాడు. తాత దృష్టికి దూరంగానే వుంచాలనుకొన్నాడు ఆమెని. కాని ఆమె యీ సాహసంతో కాలు కాలిన పిల్లిలా అవుతున్నాడు.

ఆకుపచ్చని శాలువా నిండుగా కప్పుకొని వుంది. సన్నంగా పొడవుగా ఉంది. సూరన్నతాత కాళ్ళముందు కూచొని కాళ్ళు నొక్కడం మొదలు పెట్టింది. తాతయ్య తిన్నగా పడుకొని 'ఎవరు నువ్వు?' అన్నాడు. అతని కడకాళ్ళపై గాజులు కిలకిల నవ్వుతున్నాయి.

తనెవరో యెలా చెప్పడమో తెలీక తికమకలాడుతోంది. రెండోసారి తాతయ్య ప్రశ్న కఠోరంగా తట్టింది.

'చెపుతాను తాతా' అని కొంత తడుముకొంది. తన నిశ్చయాన్ని బలపరచుకొని చివరికి, 'నీ మనుమరాలిని—' అని ముగించింది.

వికటంగా 'ఆ?' అని ఏ జాతి?' రెండో ప్రశ్న.

నూకయగారు, మూర్తి వింటున్నారు ఆ గదిలోని ప్రతి చిన్న సవ్వడినికూడ.

'మానవజాతి—' చాల సహృదయంగా ఆ మాటలు వినిపించినప్పటికీ సూరన్నతాతకి అసహ్యంలా ఐ 'ఆ?' అన్నాడు కటువుగా. 'హిందూస్త్రీని' అని కారుణ్య ముగించింది.

ఆ జవాబుతో చాలసేపుమాట్లాడే శక్తి కోల్పోయాడు సూరన్న తాత.

'తాతగారూ—మీరు పశువులుగురించి యింతసేపూ మాటాడారు గదా? ఆ పశువులకున్న మంచిగుణాలు యీ మనుషులకున్నాయా తాతగారూ?' అంది మాటలకు తడుముకొంటూ.

సూరన్నతాత ముసుగులోంచి కాళ్ళవేపు చూశాడు. నీడలో దాగిన ఆమె ముఖంమీద, దీపంవెలుతురు రేఖ గీసింది. సన్నని పొడవాటి ముక్కు. ఎత్తయిన నుదురు.

'ఏ పశువన్నా తనిచ్చిన పాలు, తన సేవా ఖరీదుకట్టి ఋణం తీర్చమన్నదా తన పిల్లలని? తాతగారూ?'

మూర్తికి భయం. ఆమె సాహసం, ఆ ప్రశ్నలూ వణికిస్తున్నాయి. ఎందుకు? ఆ పూర్వాపరాలు అడిగేంలాభం? తనకి నాన్న అన్న వ్యక్తి లేడని, తనని నమ్మిన ఓ వర్తకుడే యీలోకంలో తన నిన్నాళ్ళూ పెంచాడనీ, ఆ ఋణం తీర్చుకొనే శక్తి రాగానే తీర్చేయాలనీ అనుకొంటున్న మూర్తికి యీ ప్రశ్నలన్నీ తీగలాగి పొద కదుపుతున్నట్టయింది.

'తాతగారూ! నడి వీధిలో నలుగురి స్నేహితుల్లో ఆయనగారు వున్నప్పుడు వాళ్ళ నాన్న ఏమన్నారో మీకు తెలుసా? ఆ మాటలే—మీరే—మీ నాన్న నోట వినివుంటే—ఏమనేవారు? మీరేకాదు—ఎవరన్నా ఏమనేవారు?'

తాత వింటున్నాడు. మౌనం. ఏమిటా మాటలని ప్రశ్నించలేదు. కాని ఆమెకు తాత ప్రశ్నిస్తున్నట్టయింది—ఆ చూపుల్లో.

'ఇలాంటివాడిని యేదన్నా, ఎవరి చేతన్నా చేయించే యాలనిపిస్తుందండీ' అన్నారట! ఏం చేస్తారు? చంపించేస్తారు! అంతకంటే యింకేం చేయగలరు? కాని తాతగారూ, ఏ పశువూ తన బిడ్డలని, చంపించేస్తాననీ చంపేస్తాననీ, అనదు. ఆమె అనలేక అంటోందామాటలు. కాళ్ళు నొక్కుతూనే వుంది.

సూరన్నతాత జవాబేమీ చెప్పలేదు. ఆలోచిస్తున్నాడు. కొంతసేపటికి చాల్లే అని కాళ్ళు ముడుచుకొన్నాడు. కారుణ్య లేచి తలుపు మూసికొని వెళ్ళిపోయింది. ఆమెమాటలతో తాత ఆలోచనలు పెరిగాయి.

అప్పటికే చంద్రుడు నడినెత్తిమీదకివచ్చి శీతలానికి వణుకుతున్నాడు.

'అవన్నీ యెందుకు? అడగాల్సిన అవసరమేమిటి?' అని నొచ్చుకొంటూ కారుణ్యని ప్రశ్నించాడు. 'ఎలా జరిగితే అలా జరగనీ—వాడొచ్చాడు—దుర్బుద్ధితోనో కాదో—అనుభవించాడు. మనం చెడు చేస్తే అనుభవిస్తాం—మంచి చేస్తే భగవంతుడు మేలు చేస్తాడు' అని ముగించి కూచున్నాడు.

ఆ మాటలు ఆ నిశ్శబ్దంలో మెల్లగా వినిపించాయి సూరన్న తాతకి. అప్పటికే నూకయ్యగారు, దండాశి సుఖ తమ నిద్రలో వున్నారు.

* * *

తెల్లవారిందని తెలిసి చంద్రుడు తెల్లబోయాడు. సూర్యోదయం కాలేదు. కాని వెలుతురు. మంటపెట్టుకొని దండాశి నీరు వేడి చేస్తున్నాడు. మూర్తి నిద్రలోంచి లేవలేదు. తల నిండా దుప్పటి కప్పుకొని పడుకొని వున్నాడు. నూకయగారు తోటలో తిరుగుతున్నారు. పావురాలు మూలుగుతున్నాయి. సూరన్నతాత వేణ్ణీళ్ళతో ముఖం కడుగుకొంటున్నాడు. రొజ్జగాలి చివరితీవ్రత ప్రదర్శిస్తోంది. కాకులు కఠోరంగా అరుస్తున్నాయి. ఆ అరుపు విని నూకయగారు భయంకొద్దీ పావురాలని పిలిచి వెతుకుతున్నారు. ఏదో దెబ్బ తిన్నదని అనుమానం.

మూర్తి లేచాడు. లేస్తూనే తన జీవితాన్ని అసహ్యించుకొన్నాడు. తనకి చక్కని సంసారజీవితం కావాలి. సాయంకాలం యింటికి వచ్చేసరికి ఆత్ర పడే తల్లి, కొడుకు ప్రయోజకత్వంతో మురిసిపోయే తండ్రీ, కోరికలన్నీ కోరే చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ, ఓరచూపులతో పూలపాట్లాం వెదికే భార్యా, మునిమనుమలతో కనులుపండువుగా ఆడుకొనే తాతయ్యా, అందరూ వుండే నిండు సంసారం తనకి కావాలి. కానీ—

కళ్ళు బరువుగా యెత్తి చూసేసరికల్లా కారుణ్య స్నానంచేసి పవిత్రంగా వస్తోంది. లేతాకురంగుచీర ఆమె అవయవాలకు అంటుకొంది. 'ఇంత చలిలోనా స్నానం! అబ్బ!' అని గొణిగాడు. ఆమె నవ్వుకొంది. ఆ నవ్వు చాలు తన జీవితానికి! దానితో సంతృప్తిపొందే హృదయం చాలు అతని సంతృప్తికి.

తాతా, రాత్రీ—జ్ఞాపకం! తాత తెచ్చిన సమస్యలు. ఆ సమస్యలకు తన సమాధానం ఒకటే! కుమారుడు తండ్రి యొక్క ఆస్తి, హక్కు కాకూడదు. అలా సంఘం నిర్మించి వుంటే ఆ సరిహద్దులు విశాలం చేయడమే' తన లక్ష్యం! తమ సంతతి అనుభవిస్తున్న సౌఖ్యాలకి ఆనందించాలి. గర్వపడాలి. అదే తమ ఆస్తిగా భావించాలి. జీవితాలని, హృదయాలని, అనుభవాలని సంకుచితపరచే జాతి, నీతి, మతాలతో పెనవేసుకొన్న సాంఘికాచారాలు పునః సృజించబడి కొత్త విలవలతో విశాలత సాధించాలి. ఆ ఆశయంకోసం సిద్ధపరచిన తన అసువులు యింకో విధంగా దుర్వినియోగం చేయలేడు.

సూర్యకాంతితో లోకం నిండిపోయింది. మూర్తి తన మనోభావాలు జంకు గొంకు లేక చెప్పేయాలనుకొని వీగిపోతున్నాడు. కారుణ్య జాలిగా చూస్తోంది. కాఫీ చేసి అందరికీ యిచ్చింది. దండాశి మందారాలతో నిలువెత్తు హారం దేవికోసం గుచ్చాడు. రక్తధారలావుంది మాల. దేవిని చూడాలని తహతహలాడుతున్నాడు సూరన్నతాత.

నూకయగారు వచ్చి 'చూశారా? ఆ తెల్ల పావురం పిల్లని డేగ పొడిచేసింది. ఏం చేశాయీ పావురాలన్నీ? రక్షించ గలిగాయా? తమప్రాణాల కెక్కడ ప్రమాదమోనని బాధపడ్డాయి. యిపుడు వాటి పనుల్లో అవి మునిగిపోయాయి. అది అందంగా తిరిగితే—అన్నీ దానివెంట పడేవే—కాని—అల్పజీవి! అంతే నండి యీజీవితం' అని ముగించి ఆలయంలోకి వెళ్ళిపోయారు.

సూరన్నతాత చాలసేపు ఆలోచించాడు. తను యీ విశ్వంలో జీవించిన దినాలన్ని జీవితాలు చూశాడు. అవి బోధించిన సత్యం యేమిటో—అతని కళ్ళల్లో అశ్రువులు నిండడం కారుణ్య చూసింది. తనే ఆ వృద్ధుని కన్నీటికి కారణమని చివుక్కుమం దామెహృదయం. బాధతో ఆమె కనుకొలకుల్లో నీరు సుళ్ళు తిరిగింది.

సూరన్న తాతలో సముద్రమంత అశాంతీ, ఆకాశమంత నిరాశా అలుముకొన్న క్షణాల్లో సూర్యకాంతివంటి సౌందర్యం, హృదయాలని బంధించే సంగీతంలా మూర్తి, కారుణ్యా కన్పించారు.

వెళ్లిపోతానని తొందరచేసిన తాతయ్య యెవరాపినా, బ్రతిమాలినా ఆగలేదు. ఆలయంలోని దేవికి తొలి సారిగా, ఆఖరిసారిగా వందనంచేసి బయటడుగుపెట్టి నూకయ్యగారితో 'నీవే అన్నీ స్వామీ—' అని తిరుగుదారి పట్టాడు. మలుపు తిరిగేసరికి దూరాన కొండల వెనక మహేంద్రగిరి నీలంగా, నిశ్చలంగా ప్రకాశిస్తూ కన్పించింది. ఇంతలో ఓ బస్‌వచ్చి సూరన్న తాతని యెత్తుకు పోయింది గమ్యం వేపు.

# చైనా ప్రాచీన రూపకాలు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

భారత చీనా దేశములు రెండును బహుకాలమునుండి పరస్పరము శ్రద్ధ వహించుకొనుచున్న ఇరుగు పొరుగు దేశములు. ఒకరి మత ధర్మముచేత మరియొకరు ప్రభావితులగుట ఎన్నడో జరిగిన విషయము. ఒకరి కొకరు పంచశీల ప్రాతిపదికగా ప్రమాణములు చేసికొనుట నిన్న మొన్నటి విషయము. రాకపోకలు, విప్లవ కాంక్షలు, స్వాతంత్ర్య పిపాస, సుహృన్మార్గావలంబనము, ధర్మవర్తనము నిన్నమొన్నటిదాక ఇరువురికిని సమాన లక్షణములే. ఏ తత్కారణమున ఈ రెండు దేశముల వారును తమ తమ సంప్రదాయములు, జీవన విధానము, భాషల గురించి పరస్పరము తెలియజేసికొనవలసిన అవసరము ఇను మిక్కిలిగా గలదు. చీనా దేశీయులకు భారతదేశము, భారత జీవనము, భారత ధర్మము, సంస్కృతము పూర్వమే పరిచితములు. కాని చీనా మాత్రము మనకు బూర్తిగ అపరిచితము. కావుననే, ప్రథమ యత్నముగ ఈ వ్యాసమునందు చీనా భాషయందు గల నాటకములగురించి, నాటక రంగస్థలములను గురించి, తల్లక్షణములను గురించి రేఖామాత్రముగ వివరించుటకు యత్నించితిని. శ్రద్ధాళువులు ఈ యత్నమును కొనసాగింపవలయును.

అన్ని దేశములలో వలెనే చీనా దేశమునందు గూడ దృశ్య కావ్యము, మతధర్మము నాధారము చేసికొనియే పెంపు గాంచినది. ఆంగ్లదేశమున క్రైస్తవమతము, భారతదేశమున హైందవము, చీనా దేశమున బౌద్ధ కన్‌ఫ్యూషియన్ ధర్మములు, నాటకములు రచియింపబడుటకును, ప్రదర్శింపబడుటకును ప్రథమమున దోహదము చేసినవి. కాని, ప్రపంచమునందలి పెక్కు భాషలలో నాటకము ఎటుల పుట్టినదన్న ప్రశ్నకు సమగ్రమగు సమాధానము లభింపనట్లే, చీనా దేశమున గూడ మొట్టమొదటి నాటకములనుగురించి తెలియజేయు సమాచారము చాల తక్కువ. గాఢమగు నిర్ణయములకు వచ్చుట కష్టసాధ్యము. పెక్కు సందేహములు అసూర్యంపశ్యలు. అంతమాత్రమే కాదు. చీనా దేశమున మొదట మొదట, నాటకములు వేసెడివారన్నను, నాటకములు వ్రాసెడివారన్నను బహు హీనముగ తలచెడివారు. వేశ్యలకయినను గౌరవము లభ్యమయ్యెడిది కాని, నటులకు, నాటక రచయితలకు మాత్రము గౌరవము లేదు. గద్య పద్య మిళితమైన కావ్యరచనమే కవిత్వమని అనాటి చీనాదేశపు పండితుల అభిప్రాయము. కావుననే అనాటి నాటక రచనముల గురించి, ఆధునికులకు లభింపదగు ఆధారము లన్నియు దరిదాపు మృగ్యమైనవి.

కాని జానపద గాథల నాధారము చేసికొనినచో, నాటక ప్రదర్శనములు క్రీ. పూ. 1122—255 మధ్య రాజ్యము చేసిన 'చౌ' వంశము వారి కాలమున ఆరంభింప బడినవని తెలియనగును. క్రీ. త. 8 వ శతాబ్దమున 'టాంగ్' వంశీయుడైన 'మింగ్ హువాంగ్' చక్రవర్తి లలితకళలను, నాటకములను, వాని ప్రదర్శనములను ప్రోత్సహించువాడని బహుధా ప్రశంస లందినాడు. ఏమయినను క్రీ. త. 1280—1368 కాలమున రాజ్యము చేసిన "యువాన్' వంశీయులు దరిదాపు నూరు, నూటయేబది నాటకములను భద్రము చేయుటచే వానివలన గ్రుడ్డిలో మెల్లగా కొన్ని సంగతులు దెలియుచున్నవి. వీనిలోని ఒక వంద నాటకములు 1600 వ సంవత్సరమున "నూరు యువాన్ నాటకములు" అను సంకలనముగా ముద్రింపబడినవి. ఈ నాటకములన్నియు జాతి జీవనాడికి దూరమైనను బౌద్ధ ధర్మావేశసంభరితములు.

తదుపరి వచ్చిన నాటకములకు, జనుల మెప్పు బడయుట మాత్రమే ఏకైక లక్ష్యము. నాటకములు, దృశ్యకావ్యములన్న స్ఫురణ నశించినది. ఈ 'కున్‌ఛూ' అనబడు నాటకములలో జానపదరీతులు ప్రవేశించి "పీకింగ్ ఒపేరా" అనబడు నొక క్రొత్త రచనా పద్ధతి బయలుదేరినది. అయిన నిక్కడ నొక సంగతి జ్ఞప్తియం దుంచుకొనవలయును. యువాన్ నాటకములు దృశ్యప్రధానములు గావు. చదువుకొనుటకు మాత్రమే ఉద్దేశింపబడినవి. "పీకింగ్ ఒపేరా" పూర్తిగా దృశ్యప్రధానమైనది. పఠనమునకు ఉద్దేశింపబడినట్టిదిగాదు. యువాన్ నాటకములలోని భాష, వాని రచనా విధానము ఆధునికులకు అపరిచితములు. కఠిన పరిశ్రమ చేతనే గ్రాహ్యములు. 'పీకింగ్ ఒపేరా' ఆధునిక జీవనమునకు, నాగరికతకును ప్రత్యక్ష ప్రతినిధి. అంతియేకద ఏ దేశమునందైనను. "ఆంగ్లమున "వోల్డు ఇంగ్లీషు, మిడిల్ ఇంగ్లీషు పుస్తకములు, భారత దేశమున "సంస్కృత ప్రాకృత గ్రంథములు" ఆధునికులకు అంతగా వంట బట్టునవి గావు. ఆధునికులకు, సాహిత్య లక్షణములు, ప్రయోజనములే మారినపుడు ప్రాత యొక క్రొత్తగా కన్పడుట వింతగాదు.

## చైనా నాటకరంగము

మనకు చీనాభాషలోని నాటకములకన్న, ఆ నాటకములు ప్రదర్శింపబడిన రంగస్థలములు, వాని రచనా విధానము ఉత్సుకతను గల్గించును. వారి నాటకశాల, 16, 17 శతాబ్దము

లలో ఇంగ్లండులో ఉన్న నాటకశాలల నిర్మాణ పద్ధతుల బోలి యుండును. రంగస్థలమునకు మూడువైపుల యందును ప్రేక్షకులు కూర్చుందురు. సాధారణముగ, పురుషులు 'నేల'' మీదను, స్త్రీలు వారికోసము ప్రత్యేకముగ కట్టిన 'గదులలో' వారికన్న కొంచెము ఎత్తుగను కూర్చుందురు. రంగస్థలము మీద నటులకు వెనుకప్రక్కగా, ఎత్తుగా దరిదాపు ప్రేక్షకుల లోనికి చొచ్చుకుని వచ్చునట్లుగా, రంగ, గృహోపరిభాగము. దేవతా పాత్రధారులు, తత్సంబంధీకులు వచ్చి నటించుటకు ప్రత్యేకింపబడిన స్థల మది. రంగస్థలమునకు వెనుకప్రక్కన ఎట్టి అలంకరణ విధానమును ఉండదు. కొట్టవచ్చినట్లు, ముదురు రంగులో నుండు నొక యవనిక మాత్రము వ్రేలాడు చుండును. నవరసభరితమగు నటన మంతయు ఆ యవనిక ముందు జరుగవలసినదే.

చీనాభాషలోని రంగస్థల విశేషములలో చెప్పుకొన దగినది యొకటే యొకటి గలదు. నటులు నటించు చున్నప్పుడు, వారికి కావలసిన వస్తువులు అందించుచుండుట కును, అక్కరలేనివి తీసికొని పోవుటకును ఒక మనిషి సర్వదా సిద్ధమై రంగస్థలము మీదనే తారట్లాడుచుండును. అతనికి నాటకములోని కథా గమనముతో ఎట్టి సంబంధమును లేదు. అతని రాకపోకలకును, నటుల ప్రవేశ నిష్క్రమణములకును, అతని సంభాషణమునకును నటుల ఆంగిక వాచికాది అభినయ ములకును ఎట్టి సంబంధమును ఉండదు. పాత్రధారుల కుహనాయుద్ధములకు ఖడ్గముల నందించుట మొదలు, నటుల నిష్క్రమణము తదుపరి రంగస్థలము మీద మిగిలిన చిల్లర మల్లర వస్తువులను లోనికి గొంపోవుట వరకు అతడే చూచు కొనవలయును. అనగా దీని యర్థము చీనా ప్రేక్షకులకు వాస్తవికతతో బనిలేదు. వారి కది అనవసరము మాత్రమే గాదు, అనభిలషణీయము గూడ. ఆ 'పరిచారకుని' అనవసరపు రాకపోకల వలన, సమస్త ప్రదర్శనము ఆలోచనాజనితమైన ఆనందమును గల్గించునదే గాని, దృశ్య సంబంధమగు అవస్థ మీద ఆధారపడినది గాదని తేలుచున్నది. సమస్తమును, ప్రేక్ష కుడు, మానసవీథిలో పరికించుకొనవలసినదే. ఊహ చేయంగ గల ప్రేక్షకులు వారు.

ఈవిధముగ ప్రేక్షకుల కల్పనాశక్తికి, ప్రదర్శన మందలి చాల భాగమును వదిలివేయుట వలన, ప్రదర్శనములు సులభ తర మగుటయే గాక, నటుల అభినయమునందు గూడ చాల మార్పులు గలిగినవి. ఉదాహరణకు, రంగస్థలమునకు వెనుకనో, ప్రక్కనో, ఎచటనో ఒకచోట ఒక కొయ్యబల్లను గనుక ఉంచినట్లయిన, దానిని ప్రేక్షకులు ఒక మహా పర్వతముగ హిమాలయ పర్వత సదృశముగ భావించుకొందు రన్నమాట. రంగురంగుల తివాచీని రంగస్థలము మీద పరచిన, అది వివిధ ములగు వృక్షసంతాలములచే కన్నులవిందొనర్చుచున్న ఉద్యాన వనము. ఈ విధముగనే, అనూచానముగ అనుసరింపబడుచు వచ్చుచు నున్న అనేకములగు సంకేతార్థములు రచనకు పటిమ లేకున్నను, నటులకు సౌలభ్యము లేకున్నను, ప్రదర్శనమునకు కల్గించు చున్నవి. ఉదాహరణకు ఒక నటుడు ఒకానొక మహా సముద్రమును దాటుచున్నా ననుకొనుడు. అతడు రక్తవర్ణ మత్స్య భాసితమైన కేతనమును చేత బట్టుకొని, రంగమున పయనించును. అతడే అశ్వారోహణము చేయుచున్నా డను కొనుడు. అపు డాతడు దీర్ఘముంగు అంగలు తీసికొనుచు, చేత కొరడా నొకదానిని బట్టుకుని నటించును. చీనాలోని మహానటు లందరును, వాస్తవికతను అనుసరించుటకన్న సంప్ర దాయ సహజమైన ఒకానొక సంకేతము ననుసరించుట ద్వారా, ప్రేక్షకులకు వాస్తవికత యొక్క పరిజ్ఞానమును కల్గింతురు.

వీనికి తోడుగా రంగస్థలముమీద కన్పించు పాత్ర లన్ని యును నాలుగు ముఖ్యముగు తరగతులుగ విభజింపబడినవి: 1. భూస్వామి, 2. గాయకుడు, 3. యజమాని, 4 విదూష కుడు. ఈ నాలుగు రకముల పాత్రధారులకును కొన్ని కొన్ని ప్రత్యేక లక్షణములు గలవు. సంభాషణము, నుచ్చరించు పద్ధతి, భావనా ప్రకటన పద్ధతి, వీ రందరకును విశిష్టములు. 'టాన్' (అనగా పెళ్లిగాని స్త్రీ లేక కన్య) తన నడకలో, తన నట నలో, తన దేహ చలనములో ప్రదర్శించుచునే ఒక విచిత్ర మగు చంక్రమణమును జూపును. కాని ''లావోటాన్'' (అనగా వృద్ధురాలు) అదే భావప్రకటనమునకు, దేహమును కుంచించి, కంఠమున గాద్గద్యమును తెచ్చుకొని, వంగిపోయి, నడవలేక నడచుచున్నట్లు, పలుకలేక పలుకుచున్నట్లుండును. నాయక పాత్రధారి నటన మొక పద్ధతి, ఉప నాయకుడు, దుష్ట నాయకుడు మరియొక విధము.... ఇట్టి వివిధములగు నటనాభేదములచే, నటుడు రంగస్థలము మీదకు రాకమున్నే అతని అంగచలనము ద్వారా నాయకుడనో, ఈతడు ఉప నాయకుడనో, లేక దుష్టపాత్ర యనియో తెలియనగును.

నాటక మేదియైనను 'చౌ' కాలమున, ప్రేక్షకులు గాని, నటులు గాని వస్త్రధారణ మెట్లుండవలయునని సిద్ధాంత రాద్ధాంతములు పెద్దగా చేసినవారు కారు. మొగములకు పూసుకొనెడి రంగు ఎంత నసహ్యముగ నుండెడిదన ఒకొక్కపరి 'నటులు తమతమ మొగములకు వికృతాకారము లగు ముసుగులు తగిల్చికొనిరేమో' అన్న భ్రాంతి గూడ ప్రేక్ష కులకు కల్గుచుండెడిది. నాటకములలో పాత్రల వయః పరి మాణము, పాత్రల భావనాబలము, మనస్థితి వీని కనుగుణముగ దరిదాపు రెండు వందల రకముల అలంకరణ పద్ధతులు ఆ కాలమున అములలో నుండెడివి. అలంకరణమున నొక సన సన్నని రేఖా వైవిధ్యము, నొక వంకరగీత, విస్పష్టముగ ఒక ప్రత్యేక భావమును తెలియజెప్పెడిది.

## నాటక రచనా పద్ధతి

ఇంక చీనాలోని దృశ్య కావ్యములను గురించి. ప్రపంచము నందలి వివిధ భాషలలోని నాటకములతో చీనావారి నాటకము లను పోల్చి చూచినచో, అవి పాశ్చాత్యుల ''ఒపేరా'' కు దగ్గ రగ నుండును. విషాదాంత లేక సుఖాంత నాటకములలోని సంభాషణ విధానమునకును—ఆ సంభాషణలు వచనమున నున్నను లేక గీతికారూపమున నున్నను—చీనా నాటకముల

లోని సంభాషణల పద్ధతికిని పరస్పర సమన్వయము కుదరదు. తెరవెనుక నుండి వినవచ్చు సంగీతము, నాటకశాల కప్పు లెగిరిపోవునట్లుండును. నటుల మానసిక స్థితి ప్రళయకాల మహోదధి చందమైనచో, వెనుక నుండి విన్పించు సంగీతము గూడ నాతి భయంకరము. పాత్రధారు లందరును పూరుషులే. దీర్ఘములగు అభిభాషణములు. అప్పుడప్పుడు ఏకపాత్రాభినయము. ఒకానొక దృశ్యమున, వాచిక మంతయు ఒక్క పాత్ర చేతనే జరుపబడును. ఒకొక్కపరి సంభాషణములు వచన మందుండిన నుండవచ్చును గాక. గీతికలకు మాత్రము ప్రాధాన్యము మెండు. సంస్కృత నాటకములలో వలెనే, చీనావారల నాటకములలో గూడ ఆనందము, విషాదము పాలలోని నీళ్ళు. అయినను సంస్కృత నాటకములలో గన్పించు రస దృష్టి, సంస్కృతమైన రచనా విధానము, చీనా నాటకములలో గన్పించదు. కరుణము, విషాదము ఆ నాటకముల గాఢములు. హాస్యము, అపహాస్యము, శృంగారము పచ్చితనమును పోసికొన్నవి.

సామాన్యముగ సుఖాంతములగు చీనీ ప్రజల దృశ్య కావ్యములు వరుసన కొన్ని రోజులపాటు బ్రదర్శింపబడుచుండును. ఒకే నాటకమున పెక్కు విభాగములు; మన కాశీమజిలీ కథ వోలె, టార్జాన్ చలన చిత్రము విధమున.

ఉదాహరణకు : ''హ్సీ హిసియాంగ్ ఛి'' అను నాటకము యథార్థముగ అయిదు నాటక కథల సంపుటి. ఇందులో మిక్కిలి ఆసక్తిజనకమైనవి రెండు కథలు. 1. వాంగ్ పావో ఛమూ. 2. హోయీలన్‌కియా. ఈ రెండు నాటక కథలు ''ఎస్. ఐ. హిసియాంగ్ చేతను, ఎథెల్‌వాన్ దీర్‌వార్'' చేతను ఆంగ్లములోనికి అనువదింప బడినవి. రెండవ కథకు బైబిలు గ్రంథములోని సొలమన్ చక్రవర్తి కథ ఆధారము.

## హోయీలన్ కియా

సూక్ష్మముగ నీ నాటక కథను మనము పరిశీలించిన కొంతవరకు వారి నాటక కథల మార్గము తెలియనగును. హై—టాంగ్ సౌందర్యవతి. కొన్ని రోజుల వరకు చంద్రుడు ఆమెను చూచి, లజ్జపడి ఉదయించుట గూడ మానివేసినాడు. ఆయనను ఆ నగరమున చీకటి తలయెత్తుకొనలేక పోయినది. అంతటి అందమయినది. అయిన నేమి, యౌవనమున ప్రథమార్థ మంతయు భయంకరమగు బాధలలోననే గడుపవలసి వచ్చినది. చివరకు ఎట్టులో మా ఛూన్—షింగ్ నకు రెండవ భార్య అయినది. ఈ షింగ్ మొదటి భార్య ఒక పిశాచి. 'ఛావో' అను ప్రియునితో గలసి మా చూన్‌ను విష ప్రయోగముచేత జంపినది. 'ఛావో' ప్రభుత్వములో బని చేయుచున్న నొక చిన్న గుమాస్తా. అందువలన తన సుఖ జీవితమునకై ఆమె యొక పన్నాగమును బన్నినది. తను మా చూన్—షింగ్ యొక్క ఆస్తి నంతటినీ గాజేయవలె. ఎట్లు ? హై—టాంగ్‌నకు ఒక మగబిడ్డడు. వానిని తాను తన బిడ్డడనే ప్రకటించినది. సాక్షులకు లంచములు బోసి దన పక్షమున న్యాయస్థానమున బల్కించుకొన్నది. షౌ—సున్ అను గవర్నరునకు బాగుగా ధనమిచ్చి తన పక్షమున కాగితమును దెచ్చుకొన్నది. పాపము హై—టాంగ్‌ను నిర్బంధములో నుంచినారు. ఈ సమయముననే విజ్ఞానమూర్తి యనదగు పావో—చింగ్ న్యాయమూర్తిగ నరుదెంచినాడు. అత డా స్త్రీల ప్రవృత్తిని బాగుగ నర్థము జేసికొనినాడు. ఒక బల్లమీద సుద్ద ముక్కతో గుండ్రముగ నొక గీత చుట్టించినాడు. ఆ బాలుని అందు గూర్చుండబెట్టుమని ఆజ్ఞాపించినాడు. అంతట ఆ ఆడువారివేపు దిరిగి, బాలుని రెండు రెక్కలను చెరి ఒకరును బట్టుకుని, తమ దిక్కునకు లాగుకొమ్మనినాడు. హై—టాంగ్ రెండు పర్యాయములును భంగపడెనది. ఆ బాలుని లలిత లలితమైన హస్తము నామె స్పర్శింపబోవును. ఆమెను విషాద మావరించును. ఆమె భంగపడును. పావో—ఛింగ్ నిజము నెరిగి, ఆమె మాతృహృదయము నెరిగి, హై—టాంగ్‌నకు ఆ పిల్లవాని నిప్పించివేయును. 'చావో' నిర్బంధమున కంపబడెను. షౌ—సున్‌నకు అధికార భంగము జరిగినది·

స్థూలముగ నియ్యది కథ. ప్రతీ పాత్ర గూడ, రంగస్థలము మీదకు బ్రవేశించుచునే తన నామమును బ్రకాశ మొనర్చుకొనును. తన తలిదండ్రులు, తన జీవనము, తన ప్రస్తుత ప్రవర్తనము, అంతటిని ఎరిగించుకొనును. తనకు గల సమస్యఎద్దియో,దీర్ఘమగు నొక భాషణమున తెలియజెప్పుకొనును. దుష్టపాత్రలు, ప్రేక్షకులకు తమ తను ఆంతరంగ సంకల్పముల దెలిపికొనుటకు సందేహించవు. కాలము పరుగులు వోవును. స్థలభేదము, క్రొత్తపాత్రల ప్రవేశము అంతయు యాంత్రికముగ జరుగును. సంభాషణలు బహు నెమ్మది. గద్యము, పద్యము, పాత్రలకు ముఖస్థము. గద్యములో మాటలాడుచునే పాత్రధారి గీతిక నందుకొనవచ్చు. ఉదాహరణకు హై—టాంగ్. తన వివాహము తదుపరి చెప్పిన ఈ క్రింది గద్యమును, గీతికను బరిశీలింప వచ్చును.

వచనము : నా పేరు హై—టాంగ్. నా యజమాని 'మా' కును, నాకును వివాహం జరిగి అయిదు సంవత్సరాలు దాటింది. మా అమ్మగారు స్వర్గస్థురాలై కొన్ని దశాబ్దాలైంది. అన్నగారి సంగతి సరేసరి. ఏ దూర దేశాలకు వెళ్ళిందీ, ఇంతవరకూ ఎవ్వరికీ తెలియదు. ఏమిటో! పుట్టిల్లూ, అత్తిల్లూ సర్వమూ ఇదే నాకు. చిన్నవాడు షీ—లంగ్‌ని చూసుకునే బ్రతకవలసి వస్తున్నది. ఇవ్వాళ వాడు పుట్టిన రోజు పండగ. అంచేత, వారూ, మా అక్కగారూ కలిసి వాణ్ణి తీసుకుని, గుళ్ళోకి వెళ్ళారు, ధూపదీపములు సమర్పించడానికి. భగవంతుడు 'ఫ్యూ' ను దర్శించడానికి. అవును .... వాళ్ళు ముగ్గురూ వచ్చే వేళయింది. వెళ్ళి 'టీ' తయారుచేసి, పొయ్యిమీద ఇన్ని బియ్యం పడేయాలి .... ఎంత అదృష్టవంతురాల్ని ! 'మా' ను పెళ్ళి చేసుకోవడం మూలాన్న ఈ మాత్రం సుఖమైనా దొరికింది.

గీతిక :

కిటికీ నీడల్లో నిల్చుని
వట్టిపోయిన తెరల మార్గాన

చల్లని గాలుల స్పర్శల్లో
చలచల్లని చంద్రుణ్ణి చూస్తున్నా.
*     *     *

కోరిక తీరని ప్రియుడిలాగ
విరియలేని పువ్వమ్మ పోలె
పూలతెరల ఎద ప్రతి
ఫలించెను వాడు !
*     *     *

నల్లని చీకటి ముసుగున దాగిన
నలనల్లని పట్నంలా
నల్లని మబ్బుల ముసుగుల్లో
ఉలికిపడే అష్టమి చంద్రుడు.
*     *     *

నే తిరిగిన ఆ వీధులు
మాట్లాడిన మనుష్యులు
పాముకాటు లాంటి గతం
మలినపడిన మనసులోకి
గరళంలా వస్తే
ఎల్లా బ్రతకను నేను ?
అందాన్ని పణముగ బెట్టి ఆ
నందమును పొందలేను.
ఎవ్వరినీ వంచించలేను.
మనిషిలోని మనసును చంపలేను !!

వచనము : హాయిగా సంసార సుఖము అనుభవించాలని నా కోరిక .... ఎప్పుడో అది .... ఇంకా రావడం లేదు వారు .... కొంచెం ముందుకు వెళ్లి నేనే వారిని కలుసుకుంటాను ....

మన సంస్కృత నాటకములకును, వీనికిని ఒక ముఖ్య భేదము గలదు. చీనావారల నాటకముల గాఢత, రసదృష్టి చాల తక్కువ. ఆభౌతికము మీద నమ్మకము చాల తక్కువ. భౌతిక సుఖము, ప్రస్తుత జీవనము వీనిని మించిన చర్చలు వారికి లేవు. దుఃఖము, కన్నీళ్లు, బీదరికము ఎక్కువ కథల నాక్రమించును.

తదుపరి కాళిదాసులోని గాఢమగు కవితాశక్తి గాని, అనుకంపనము గాని చీనా నాటక రచయితలలో గానరాదు. ప్రతిపద రసోదయము వారికి అననుభూతము. నాటక ప్రదర్శన మంతయు ఏక ఖండము వారలకు. ఏ సన్నివేశమున కా సన్నివేశము ప్రత్యేక వ్యక్తిత్వము గలది గాదు.

ఏమయినను 'హోయాలన్ కియా' ఆధారముగ నొక నిర్ణయమునకు వచ్చుట అపాయకరము. గృహచ్ఛిద్రములకు సంబంధించిన విషయములు మాత్రమే గాక, తదితరము లనేకములు వారిచేత చర్చింప బడినవి. చారిత్రక నాటకములు ప్రధానస్థాన మాక్రమించినవి.

పాశ్చాత్యప్రపంచమునకు దెలిసిన మొట్టమొదటి చీనా నాటకము 'ఛావో షీహ్ కూ ఎర్హ్' ఈ విధమగు చారిత్రక నాటకమే. ఈ నాటకమును ఆధారమును జేసికొనియే ఓల్టైర్ మహాకవి 'లో ఆర్ఫెలిన్ డీలా చీనే' ను వ్రాయగలిగినాడు. ఈ నాటకము నందును గృహచ్ఛిద్రమునకు సంబంధించిన విషయము లేకపోలేదు. కాని ముఖ్యమగు సంఘటన మాత్రము చరిత్రాత్మక మైనది. ఆ నాటకమున "తూ అంఖూ" అను నొక క్రూరుడు 'ఛావో' కుటుంబమును మొత్తము ఉరిదీయించును. అదృష్టవశమున ఆ కుటుంబములోని ఒక చిన్న కుర్రవాడు, ఒక ఆశారేఖ, బ్రతికి బట్టకట్టి తూ అంఖూ మీద పగ తీర్చుకొనును. ఇదియ అందలి ఇతివృత్తము.

ఇటువంటి తరగతికి జెందిన నాటకమే "హాన్ కూంగ్ ట్సూ" గూడ. తార్తారుల నాయకుడు హాన్‌చెన్‌యూ ఇందు కథానాయకుడు. హాన్ వంశమునకు చెందిన యువాంటీ చక్రవర్తితో రాయబారమునకు ఆతడు వచ్చినాడట. రెండవ దృశ్యమున దుష్టుడగు "మావో యెన్‌షౌ" మంత్రితో మనకు పరిచయము కలుగును. ఆ మంత్రి ఎంతటి దుష్టుడనగా, తన చక్రవర్తిని రాజ్యకార్య విముఖుని చేసి జారునిగ తయారుచేయు నంతటి దుష్టత్వ మాతనిది. రాజ్యమున గల సుందరీమణులను నయముననో, భయముననో చక్రవర్తికి సమర్పించుచు ఆతడు తన ప్రధాన మంత్రిత్వమును నిలుపుకొన్నట్టివాడు. మూడవ దృశ్యమున ఆతడు సుందరీమణుల సంపాదనకై చేయు భగీరథయత్నములను మనము గాంచగలము. తదుపరి ఆ దుష్టబుద్ధి ఒక సుందరియొక్క ఒకానొక సుందరతరమైన పటమును రూపహీనము చేయుచుండు దృశ్యము. ఆతడు ఛావో—ఛున్ అను చిన్నదానిని అంతిపురికి చేర్చినాడు. కాని చక్రవర్తి కంట బడనీయలేదు. చక్రవర్తి కది తెలిసినది. ఆమెను గలిసినాడు. దుష్టుల సంకల్ప మెరింగినాడు. మంత్రిని వధించుటకు ఆజ్ఞ లిడినాడు. రెండవ రంగమున మరల మనము హానుని కలిసికొందుము. తనకును, చక్రవర్తికిని సంధి కుదరలేదని ఆతడు స్పష్ట మొనర్చును. అప్పుడే మావో తప్పించుకొని వచ్చి, హానుని కలిసికొని, ఛావో చున్ యొక్క అందచందములు వర్ణించి, ఆమె పొందు నందుమని బోధించును. ఈ సంగతి యువాంటీకి తెలిసినది. ఒక వంకన ప్రేమబంధనము. మరియొక ప్రక్కన తార్తారులవలని భయము చివర కాతడా చిన్నదానిని తార్తారు నాయకునికి సమర్పించుకొనుటకు నిశ్చయించును. కాని ఆ చిన్నది, సౌందర్యంపు మొలక. అందు కొడబడదు. ఆ ఉత్తమ యిల్లాలు ఆత్మహత్య చేసుకొనును. నాల్గవ రంగమున చక్రవర్తి దుఃఖము. ఈవిధముగ విచిత్రములగు కథల నెన్నియేని ఉదాహరణల క్రింద చెప్పుకొనవచ్చును. కాని ఒకటి మాత్రము నిజము. ఒకే నాటకమునకు అనేకములగు పేర్లు నుంచుకొనుట వారికొక వినోదము. పరాజముచేత తిరస్కరింపబడిన అభాగ్యులు మరల సమాజమునే తిరస్కరించుట వారి నాటక

ములలో సహజముగా కన్పించును. ఒకానొక కుటుంబమున ఎవ్వడేని ఒక వ్యక్తి తప్పు చేసిన ఆ కుటుంబమునందువా రెల్లరు బహిష్కరింపబడుదురు. అంతట ఆ కుటుంబము లిరుగుబాటు జరుపును. ఇందుకు 'హిసియో యెన్' అను నాటకము చక్కని ఉదాహరణ. బెస్తవారల బాధల బ్రతుకు లను ఈ నాటకము హృదయవిదారకముగ చిత్రించును.

కాని ఇచట ఒక విషయమును మాత్రము జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఆధునిక యుగము మొదలిడిన తరువా తనే చీనా నాటకములు బలమును పొసికొన్నవి. మహాకవులగు కువాన్ హాన్—ఛింగ్, వాంగ్ షీఫ్యూ, మాఛీయున్, కానోమింగ్, టాంగ్ హోషియున్—ట్సూ మొదలగువారు వ్రాసిన నాటకము లన్నియు యువాన్ యుగమునకు జెందినట్టివి. వీరిలో కొందరు భారతీయ రచయితలచేత గూడ ప్రాభావితులు. దక్షిణ చీనాలోని రాష్ట్రములలో సంస్కృతభాష ప్రభావము నేటికిని కన్పించును. ఈ రాష్ట్రములకే చెందిన కౌవామింగ్ వ్రాసిన పీపాచీ అను నాటకము కాళిదాస మహాకవి వ్రాసిన 'శకుంతల' కు దగ్గరి లనువాదము. కావోమింగ్ అనుయా యుల నాటకములలో మను 'సూత్రధారులు' గూడ కన్పిం తురు. ఉత్తర రాష్ట్రములయందు 'ప్యూ' ప్రభావ మెక్కువ.

ఇంక ఆధునిక యుగమునుగురించి రెండు మాటలు. 1860 నుంచి చీనాలోని సాహిత్య మంతయు పాశ్చాత్య భావనాభాసితమై పోయినది. రాజకీయ ఆర్థిక, సాంఘిక పరిస్థితులలోని దాస్యము సాహిత్యమున గూడ ప్రతిఫలించినది. కాని 1917 నుంచి ఒక పునరుజ్జీవనము కన్పించుచున్నది. వ్యవహార భాష, సాహిత్యమున ఉపయోగింపవలయు నన్న ఆకాంక్ష ప్రబలమగు చున్నది. కాని ఇంకను ఈ ఆకాంక్ష నాటకముల వైపునకు బాగుగా మరలలేదు.

అందుచేత నేటికిని వారి నాటకములలో మనకు నాట కీయత కన్న, ఆవేశముపాలు ఎక్కువగ గోచరించును. అవి, వారి దృక్పథము ప్రకారము స్వీకార్యములు గావచ్చు గాక! ప్రపంచ దృష్టిలో ముఖ్యముగ భారతీయుల సాహిత్యపు విల వల ప్రకారము, అంత గొప్ప నాటకములు గావు. ప్రదర్శన ములు విజయవంతము లైనను, రచనలయందు భావనాశక్తి తక్కువ.

# నీ ఆకృతి

శ్రీ మాదిరాజు రంగారావు

గుండె లోతులనుండి త్రవ్వుకొని వచ్చు
సౌందర్య రసాపగాఽవిష్కారము నీ ఆకృతి
చైతన్య కళాశక్తి మూర్తీభవించిన శిల్పము
నాస్మృతి నాక్రమించుకున్న నీవెరుగని విస్మృతి.

నిశ్శబ్దం, నిద్రావస్థనుండి మేల్కాని
నైల్యస్థితి దాటిన సమయం—
నామనో రోదసి ప్రాభాతమయం చేయు
మహోదార జ్యోతిస్సాహితీ పుంజం.

వాడిన కనుచూపులు పెనవైచుకొని
ఏ పురాజన్మరహస్యాలనో స్మరింపజేయు
శరన్నీల గగనరేఖలు బింబించుకొన్న
సరశ్శోభా తరంగము లుబికి వచ్చుకన్నులు

ఒక అనుభూతి వెలుగు ఊహాల సాగుదలవలె
ఒక గాలి కదలిక, విసరుకు పరవశమై
ఎదపై మసృణవలాహక హస్తము హత్తుకొన్న
దిగంతరేఖా కిర్మీర ప్రశాంత మహాకాశము

ఎంతకాలం నుండో, హిమ శిలవలె బిగిసిపోయి
ఎంత లోతుననో అట్టడుగున దిగబడి ఉన్న
నన్నొక్కమారు వెలుగు గడ్డ కెత్తుకొని పోయి
నిర్ఝరివలె ప్రవహింపజేయు వైహాయసచరదరుణమూర్తి.

నా మనఃచక్షువునకు నీరూప మెంత దగ్గర అంటే,
నారూపానికీ నీడకు మధ్య ఎంతదూరమో అంత
అవిచ్ఛిన్న కాలగమన స్వరూప వ్యాఖ్యాన మతులు
రవికీ శశికీ గల సంబంధం మనకుగలబాంధవ్యం.

సంధ్యాసమయం సమాసన్న మయ్యేవరకు నిత్యం
లజ్జారుణ భావ రమ్యహాసన్ముఖ దీపశిఖవలె
వెలుగు రెక్కలతో ఎగిరివచ్చి; విప్పారోల్పడ కన్నులు
నాలో లీనమైన నీరూపం మరలినట్లే తెలియదు.

ఈ అనిర్ణీతప్రపంచపరిధి, మానవతామ్మ్రదు జన్మవెత్తి
ఏదో ప్రవృత్తి, మిడుకుచున్న నాకెన్ని జన్మలకోకలిసి
బ్రతుకు లోతులు స్పృశించి, వెలుగులు త్రవ్వి తలకెత్తునీవు
ఒక మంచుగాలివి, నావెంటనే సాగిరావు?, అనలమూర్తిని నేను

మలి సంజవోలె వ్రాలిపోవు నాకనురెప్పలలో
తొలి సంజలందు వెల్గువోలె దూకు నీఆకృతి
ఉదయాకాశంవలె విప్పారెడి నా కనురెప్పలలో
అనురణించు దృగ్రేఖాతీతమైన నీ భావన

ఇంతవరకు ఈసంకీర్ణ ప్రపంచంలో మసలుతూ
ఏ వర్ణపు దుస్తులు, ఏ రాగధ్వని ఎరుగని
నా నగ్న మనఃప్రకృతిస్థితి, సూక్ష్మాతిసూక్ష్మంగా
మలగిన, ఒక సుందర శివరూపము నీ ఆకృతి!

# జాతీయ శబ్దరత్నాకరం

## స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

పిఠాపురంలో వేంకటరామకృష్ణకవుల దగ్గిర చదువు కుంటున్నా న్నే నప్పుడు. 1910 వ సంవత్సరం అది. దినమ్మూ మధ్యాహ్నం కోటకు వెళ్ళి, గురువులు, మహారాజులుంగారికి ఆముక్త మాల్యద పాఠం చెబుతున్న రోజులవి. రాత్రి భోజనానంతరం రామకృష్ణశాస్త్రిగారు నాకున్నూ పాఠం చెబుతున్నా రది.

ఒకనాటి సాయంకాలం చాలా ఉత్సాహంగా వచ్చారు గురువు లింటికి. నడుస్తూనే మాట్టాడుకోడం—మధ్యమధ్య ఆగి నేదో కూడబలుక్కోడం—పక్కవాటుగా కిందుగా చూస్తూ ఏదో ఆలోచించి, నిశ్చయాత్మకంగా తల యెగరవేసుకోడం—తరవాత కొంతవరకూ గబగబా నడవడం—ఇలా చాలా వ్యగ్రంగా వుంది వారి ఉత్సాహం.

వారి రాక యెదురుచూస్తూ వీధి అరుగుమీద కూచుని వున్నా న్నేను. రావడం తడవుగా వారున్నూ అరుగుమీదే కూచు న్నారు. దుస్తులు మార్చుకోలేదు. మంచితీర్థం అయినా పుచ్చుకోలేదు, లోపలికివెళ్ళి.

రామకృష్ణశాస్త్రిగారు నన్ను సంబోధించా రవ్యవధానంగా.

"మన తెనుగుగ్రంథాల్లోను అంతకంటే యెక్కువగావాడుక లోనూ యెన్నో పలుకుబళ్ళున్నాయి. సామెతలున్నూ వున్నాయి వేనవేలూ, లక్షోపలక్షలున్ను. అవన్నీ ఒకచోట కూర్చడం అగత్యం అని తోచింది నాకు. మాబావ (వెంకటరామశాస్త్రిగారు) కూడా యిందు కంగీకరించారు. పలుకుబళ్ళూ, సామెతలూ కూర్చినంతమాత్రాన చాలదు, వాటికి వివరణలున్నూ యివ్వాలి. సాధ్యమైనంతవరకున్ను, ఇదే మొదట కాదుగాని సాధ్యమైనంత త్వరగా పూర్తిచెయ్యాలి. ఇది ఒక గ్రంథంగా ప్రకటించాలి. ఆ గ్రంథానికి "జాతీయ శబ్దరత్నాకరం" అని పేరుకూడా నిర్ధా రణ చేశా న్నేను. నే నాముక్తమాల్యద పుచ్చుకుంటాను. మా బావ పాండురంగమాహాత్మ్యం పుచ్చుకుంటా నంటున్నాడు. ఈ సందర్భంలో మీ సహకారం కూడా కావాలి నాకు. మరి మీరేమి పుచ్చుకుంటా?"రని అడిగారుకూడా వారు నన్ను.

అప్పటికి నేను విజయవిలాసం చదువుతున్నాను, పరిశీల నగా, స్వబుద్ధితో సమీక్ష కూడా రాస్తున్నాను, దానిమీద. వారి కిద్దరికీ తెలుసు ఈసంగతి. "అదిగో ఆ విజయవిలాసం పుచ్చుకో" మన్నారు వెంకటరామశాస్త్రిగారు నన్ను.

పని ప్రారంభించాం.

వినివున్నవీ, వింటున్నవీ పలుకుబళ్ళూ, సామెతలూ కాగి తాలమీద యెక్కించసాగాం ముందు. ఎవరితో మాటాడే టప్పుడైనో దొరుకుతాయవి, కాస్త గమనించడం పెట్టు కుంటే. పాతబడ్డవీ వెనకబడ్డవీ కాక, జనవ్యవహారంలో సజీవంగా వున్నవి సంకలనం చెయ్యడం జరుగుతుం దిలా చెయ్యడంవల్ల. గ్రంథస్థాలు మెల్లిగా చెయ్యవచ్చు ననుకున్నాం.

పొరుగూరు కావడంవల్ల వేరే తాపత్రయా ల్లేవు కనక, నాకదే పనయిపోయింది. గురువులతో చెప్పి నా ఊహా కందిన వివరణలున్నూ రాసుకో సాగా న్నే నెప్పటికప్పుడు.

గురువులకు మాత్రం అలా సాగలేదు. అటు కలపానికి సంబం ధించిన విమర్శలూ, రచనలున్ను, ఇటు ఇష్టాపూర్తిగా—స్వబుద్ధి ప్రేరణతో ప్రారంభించిన రచనలు. ఇవి తప్పనిసరి వారికి. దిన మ్మూ మధ్యాహ్నం కోటకువెళ్ళి మహారాజులుంగారికి పాఠంచెప్పడం—తరుచు తమ దగ్గిరికివచ్చే సాహిత్య రసికులతో గోష్ఠి. సంసారాలు సవరించుకోడం—పులిమీద పుట్రలాగ నాకూ, మరికొందరికీ శిష్యు లకు పాఠాలు చెప్పడం, క్రమం తప్పకుండా—తరుచు దివాను మొక్కపాటి సుబ్బారాయుడుగారియింట సాహిత్యచర్చలు సాగిం చడం—ఇదిగో యిన్ని —ఇంకో మరికొన్ని వ్యావృత్తుల్లో మునిగి పోడం—ఇలాంటి కారణాలవల్ల ఉత్సాహం యెంత వ్యగ్రంగా వున్నా గురువు లీపని చురుగ్గా సాగించలేకపోయారు.

నాపని (విజయవిలాసం చదవడమూ, అందులోవున్న పలుకు బళ్ళూ, సామెతలూ గుదిగుచ్చుకోడమూ కూడా) పూర్తి అయి పోయింది. చదువు చాలించుకుని యింటికిన్నీ వెళ్ళిపోవలసి వచ్చింది, కొన్నాళ్ళకు నేను.

అయినా, తరుచు పిఠాపురం వెడుతూనే వచ్చాను. కాని అక్కడ గురువుల పని సాగకపోవడంతో నాకున్నూ ఆశ్రద్ధ తగ్గి పోయింది.

నాసేకరణ అంతా విడి కాగితాలమీద జరిగింది. కాని వాటిలో కొన్ని గుదిగుచ్చడం పడలేదు. ఎన్నో పలుకుబళ్ళూ, ఎన్నో సామెతలూ అప్పటికప్పుడుగా వాటికి తోచిన వివరణలూ కాగితం పీలికలమీద రాసుకోడం సంభవించేది. దీనివల్ల వాటిలో కొన్ని అప్పుడప్పుడు జారిపోతూ వచ్చాయి.

దీనికి సాయం, ఇటీవల రాజమహేంద్రవరం గోదావరి వరద పాలుకావడం అందరికీ తెలుసు. అప్పుడు వెయ్యి రూపాయల వెల గల నా ప్రచురణలూ, నా సొంత గ్రంథాలయంతాలూకు గ్రంథాలు కొన్ని—అయిదారు వందలవీ, నా గంధర్వ ఫార్మసీ తాలూకూ, నాకలాభివర్ధనీపరిషత్తు తాలూకూ పాత రికార్డ్సు వాటితోపాటు ఈ బాపతు విడికాగితాలు కొన్నీ గంగపాలయి పోయాయి.

అయినా, నేను సేకరణచేస్తూనేవున్నా నిప్పటికీ. జ్ఞాపకం వున్నంతవరకూ సోయినవిన్నీ మళ్ళీ రాసుకుంటూనే వున్నాను.

ఒకనాడు ప్రసంగివశాన, నాకు బాగా జ్ఞాపకంవున్న సామెతలు కొన్ని మిత్రులు శ్రీ సంపత్కుమారాచార్య గారి కిచ్చాను. వారవి ఆంధ్రప్రదేశ్ అకాడమీ ప్రకటించిన తమ తెనుగుసామెతల గ్రంథంలో చేర్చుకుని వున్నారు.

మొన్న మొన్ననే ఆ అకాడమీవారి, తెలుగుసామెతలూ పదబంధపారిజాతాలూ బయటికి వచ్చాయి. అసంపూర్ణంగా అయినా, అవి చూడ్డంతోనే నాకు నా గురువుల సంకల్పమూ, పూనికా బాగా జ్ఞాపకంవచ్చాయి. పాతకాగితాలు తిరగవేసి చూశేటప్పటికి నాకు, వాటిలో కొన్ని కొన్ని అయినా కొంచెం కొంచెం పత్రికాముఖాన ప్రకటిద్దామని తోచింది.

ఈ జాతీయ శబ్దరత్నాకరం అన్నది నా గురువులు నిర్ధారణచేసిన పేరు. పలుకుబళ్ళూ, సామెతలూ—వీటికి జాతీయోక్తులని వ్యవహారంలో వుండడం అందరికీ తెలుసు. ఆ జాతీయోక్తుల సంకలనం కనక యిది 'జాతీయ శబ్దరత్నాకరం.'

నా గురువుల చేతిమీదుగా ప్రకటించబడివుండవలసిన గ్రంథం యిది. అదే జరిగివుంటే ఇది సర్వాంగసుందరం అయి వుండేది. బతికివుండినందుకు ఫలితంగా, వారి సంకల్పం వెల్లడి చెయ్యడమూ, ఈవిధంగా ఆ గ్రంథంపేరు స్థిరపరచడమూ, వెల్లడించడమూ కూడా నాకు విధికృత్యం అని తోచింది.

నా గురువుల ప్లానూ, నేను పనిచేసిన పద్ధతీ యిక్కడ చూపిస్తాను. ఇందు కిదే మార్గం అనను. ఎందరికో యెన్నో మార్గాలు తోచవచ్చు. నా ప్రయత్నం అందుకైనా ప్రోద్బలకం అయితే చాలు, నేను కృతకృత్యుణ్ణే.

ఎందరు పూనుకున్నా యిది సమగ్రంకాదు. వాడుకలో వుండినవైనా ఎన్నో కొన్ని మిగిలిపోతూనే వుంటా యెప్పటికీ.

*　　　*　　　*

1. లంగిట బెల్లమూ, ఆత్మ విషమున్ను.

పైకి ఎంతో తియ్యగా ఎంతో ఆపేక్ష వున్నట్టున్నూ మాట్లాడతారు కొందరు కొన్ని సందర్భాల్లో, కొందరితో. వారి మనస్సుల్లోమాత్రం చాలా కుళ్ళు పేరుకుని వుంటుంది. ఎన్నో దురూహలూ, దుశ్చింతలూ, దుస్సంకల్పాలూ కూడా వుంటాయి వారి మనస్సుల్లో. అదిగో ఆబాపతువారిని చెప్పవలసి వచ్చినప్పుడు వాడే సామెత యిది.

2 ఏగాలి కా చాప.

పడవ, తెరచాప యెత్తుకుని ప్రయాణం ప్రారంభిస్తే, మెరకలు తగులుతాయి. సుడిగుండా లడ్డుకుంటాయి. గాలి విసురులున్నూ విషమా లవుతూ వుంటా యప్పుడప్పుడు. అయినా, ప్రయాణం తప్పదు. ఆగిపోడానికి వీలుకాదు. కనక, నిరాఘాటంగా ముందుకి వెళ్ళాలంటే ఒక్కొక్కప్పు డెడమకూ ఒక్కొక్కప్పుడు కుడికీ తెరచాప మార్చుకుంటూ వుండాలి.

ఏదయినా పని ప్రారంభించేవారికి ఏవేవో అడ్డంకు లేర్పడ లాయి మధ్య మధ్య. ఆపని మానడానికి మాత్రం వీలుండదు. మానడమూ మంచిదికాదు. కనక, ఎప్పటి కప్పుడు తగిన ప్రతిక్రియలు చేసుకుంటూ, ఓపిగ్గా పని సొంతం చేసుకోవాలి కర్త. ఇలాంటి సందర్భాల్లో ఉపయోగించే సామెత యిది. "ఏ యెండ కా గొడుగు" అన్నదిన్నీ యీ జాతికి చెందినదే సామెత.

3 చెవినిల్లు కట్టుకుని పోరడం.

ఒకడి కొక డేదో చెబుతాడు. అది సలహా కావచ్చు, నిషేధం కావచ్చు, ఉపదేశమున్నా కావచ్చు. అవతలి మనిషి తాను చెప్పినట్టు నడుచుకోవాలని ఆ చెప్పేవాడి వుద్దేశం. అతణ్ణి చెరచడానికీ సంకల్పించుకోవచ్చు, ఆ మనిషి, బాగుపరచడానికీ పూనుకోవచ్చు, కనక, మళ్ళీ చెబుతాడు. కనపడ్డప్పుడల్లా చెప్పడం కాదు, ఇంటికి వెళ్ళి చెబుతాడు మళ్ళీ మళ్ళీ. అంతటిలో తృప్తిపడ్డామనిషి. వాడి చెవిలోనే మకాం వేస్తాడందులో యిల్లు కట్టుకుని. చెబుతూనే వుంటాడు కూడా. దూరస్థితి సహించడు. ఈ పలుకుబడిలో, సామీప్యమూ, సాతత్యమూ, దీక్షా, ఏకాగ్రతా, ఆత్రమూ కూడా స్ఫురిస్తా యీ మనిషివి.

4. ఏకయివచ్చి మేకయి బిగిసినట్టు.

ఏకంటే దూదికి కల్పించే ఒక రూపం అది. నూలు వడికే సాధనాల్లో ఒకటది. కనక! దూదిలాగ మెత్తగానే వుంటుంది. మేకంటే ఇనుమూ—ఉక్కూ—ఇత్తడీ—ఇలాంటి లోహాలతో చేసే ఒక సాధనం. గోడలకూ, దూలాలకూ, వాసాలకూ—ఇలాంటివాటికి దిగకొట్టేటందుకు ఉపయోగిస్తుందది. కనక, చాలా గట్టిగా వుంటుంది. ఒకమాటు దిగకొడితేమాత్రం మళ్ళీ వూడ తియ్యడం పోపట్టాన సాధ్యపడదు.

ఏకు మృదుత్వానికీ, మొగమాటానికీ పరమావధి అయితే, మేకు కాఠిన్యానికీ, పట్టుదలకూ పరాకాష్ఠ.

ఒక డొకడిదగ్గిర చేరుతాడు. ఏమీ పని లేనట్టూ, ఏమీ తోచక అన్నట్టూ, కాలక్షేపాని కన్నట్టూ చేరుతాడు. కాలూను కుంటాడు. మాటలు కలుపుతాడు. వ్యవహారాలు పెల్లగిస్తాడు. వింటున్నట్టు నటిస్తాడు. వింతపడుతూ, సరదాకోసం అన్నట్టు వివరా లడుగుతాడు. సావధానుణ్ణి చేసుకుంటాడు. మాటవరస కన్నట్టుసలహాలు చెబుతాడు. చెప్పమని అడిగించుకుని కూడా చెబుతాడు. వ్యవహారం ముదరబెడతాడు. ఇక దానికి పట్టూ విడుపూ కలగనివ్వడు. చెప్పినట్టు వినకపోతే యెదురు తిరుగుతాడు. ముంచేస్తాడు కూడా చివరికి. ఇదిగో, యిలాంటి సందర్భాల్లో, యిలాంటి మనిషిని గురించి చెప్పడాని కీ పలుకుబడి.

5. గాలీ వానా వస్తే కథే పోయిందన్నట్టు.

అనగా అనగా ఒక రాజు. కథలంటే మహాయిష్టం ఆ రాజుకి. తనని బాగా మెప్పించాడా, ఆ కథకునకు, ఆ రాజు, వెయ్యి

న్నాట పదహోర్లిచ్చేవాడు. మడిమాన్యాలిచ్చేవాడు. అగ్రహారాలే యిచ్చేవాడు. భవంతు లిచ్చి తన పట్నంలో ప్రవేశపెట్టుకునే వాడు కూడా.

ఎక్కడెక్కణ్ణుంచో కథకులు రాసాగారు. రాజుని ఆనంద ముగ్ధుణ్ణి చేసెయ్యసాగారు. ఇందువల్ల ఆ రాజు బొక్కసం తరిగిపోసాగింది.

దివాను కిష్టం లేదిది.

కులాని కతను కంసాలి. రాజకార్యాల్లో చాలా శ్రద్ధ అత నికి. సహజంగా స్వామిభక్తుడతను. అగత్యం అయితే, తన ప్రాణాలే యిచ్చేస్తాడు రాజు కతను.

కనక, రాజు అభ్యుదయం కోరి రాజ్యం, భద్రత కూడా కోరి, అత నిది మంచిది కాదని హితబోధ చేశాడు రాజుకి. "రాజ్యం అన్నప్పుడు ప్రజల కెన్నో సదుపాయాలు కలిగించాలి. శత్రు రాజులు దండెత్తి రావచ్చు. వారితో యుద్ధం చెయ్యవలసిన అగత్యం యేర్పడవచ్చు, తప్పనిసరిగా. ఎందుకయినా చాలా డబ్బు కావాలి. అందుకోసం బొక్కసం అంతా బాగా నిండుగా వుండేటట్టు చూసుకోవాలెప్పుడూ. రాజ్యం తరవాతివి కళలు" అని అనేకవిధాల చిలక్కి చెప్పినట్టు చెప్పాడు రాజు కతను.

కాని లాభం లేకపోయింది. రాజు, తనపద్ధతి మార్చుకో లేదు. నిజాని కీ కథల వ్యసనం తప్ప మరో దుర్గుణం లేదు రాజు దగ్గిర.

దివాను ఆలోచించాడు. ఒక పథకం వేసుకున్నాడు. తాను కూడా కథలు వినసాగాడు, ఆబగా, రాజు పక్కని కూచుని.

కథలు తనకి కొత్త. అవి అర్థంచేసుకోడమూ, ఆనందించడమూ తన కింకా అలవాటులేదు. ఇలా చెప్పి, అతను, ఏమిటేమిటో ప్రశ్న లడగసాగాడు, అమాయకత్వం నటిస్తూ, వికట ప్రశ్నలే వెయ్యసాగాడు, వెర్రిమొగం పెట్టుకుని.

ఇది కథకునకు ధార తెంపేసేది. ఉత్సాహం పోగొ ట్టేది. విసుగు కలిగించేది. ఏమిటేమిటో తికమకపెట్ట సాగింది. చివరికి, కసురుకోడందాకా వెళ్ళింది కథకుని అవస్థ.

ఫలితం కథలు చప్పబడిపోసాగాయి. కథకులు అసమర్థు లనిపించుకోసాగారు. కథలు వినడానికి విసుగు పుట్టసాగింది, అతనికి. ఆ విసుగు—"తగుదునమ్మా అంటూ వచ్చి కథకులు మంచి కథలు చెప్పలేకపోతే—అవిధంగా తన కాలం అంతా వ్యర్థంగా గడిపేస్తే, ఆ కథకుల తలలు కొట్టించి కోట కొమ్మలకు వేలాడగట్టిస్తా"నని శపథం తాల్చేశాడు రాజు.

కథకులు రావడమే మానుకున్నారు. తనకి ఆశాభంగం కలిగినట్టూ, నిద్రాహారాలు సయించకుండా వున్నట్టూ, మంచి కథకులకోసం దేశదేశాలు వర్తమానం చేస్తున్నట్టూ నటించ సాగాడు దివాను. కథలు వినపడక మతి పోసాగింది రాజుకి.

ఉండగా వుండగా ఒక బ్రాహ్మడు దివాను కుట్ర గ్రహించాడు. బయలుదేరి వచ్చాడు, దానికి విరుగుడు కల్పిద్దా మని. వద్దన్నాడు దివాను. "లాభం లే" దన్నాడు. రాజు శపథం కూడా చెప్పేశాడు చివరికి. "అస్తమానమూ కథలు వినడమే పెట్టుకోడంవల్ల రాజు గొప్ప సాహిత్యవేత్త అయిపోయా" డనీ, "అతణ్ణి మెప్పించడం యెవరికీ సాధ్యంకా"దనీ—ఇలాంటి భావాలు నూరిపోశాడు.

కాని బ్రాహ్మడు వినిపించుకోలేదు. తాను కథ చెప్ప వలసిందే అన్నాడు. "అర్థం చేసుకోగలిగితే, పండితుడైన వాడికి అగ్రహారం యివ్వడం యెంత గౌరవప్రదమో, తల కొట్టెయ్య డమూ అంత గౌరవప్రదమే" అని గట్టిగా వాదించాడు.

కథ ఏర్పాటుచెయ్యడం తప్పనిసరి అయింది దివానుకి. మధ్యాహ్నం మూడుగంటలవేళ కోటకి రమ్మన్నాడు కథకు ణ్ణతను. తల యిచ్చెయ్యడానికిన్నీ సిద్ధపడి ఒక కథకుడు వచ్చా డనేటప్పటికి జనం విరగబడిపోయింది.

"అంతా సిద్ధం అయిం"దని రాజుకి విన్నవించుకున్నాడు దివాను. కత్తులూ, కటారులూ తాళ్ళూ తెప్పించి రాజు ఎదట పెట్టించా డతను, అప్పుడయినా కథకుడు భయపడి పారిపోవా లనుకుంటూ. "మొదలు పెట్టవచ్చు" నన్నాడు రాజు. "ఆపురా వురు" మంటున్నాడు పాపం అతను మరి.

కథకుడు ముందుకి వచ్చాడు. గొంతుకు సవరించు కున్నాడు. "తలారులను సిద్ధంచేసుకోవచ్చు మీరు" అన్నాడు దివానుతో. "ప్రభూ" అన్నాడు రాజు కేసి తిరిగి. "నాకో వ్రతం వుంది. నేను కథ చెప్పాలంటే ముందు నా వ్రతం తీరాలి మరి" అని మనవి చేసుకున్నాడు, చేతులు జోడించుకుని. "తీరుస్తాను ఏమిటూ వ్రతం?" అని అడిగాడు రాజు. "నిస్సంకోచంగా కోర వచ్చు ప్రభువు అవశ్యమూ తీరుస్తారు మీ కోరిక" అని చెప్పాడు దివాను కూడా.

కొంచెం మొగమాటం నటించాడు కథకుడు మొదట. "నేను కథ చెప్పేచోట కంసాలి వుండగూడదు మహాప్రభూ!" అన్నాడు చివరికి తప్పనిసరి అయినట్టు.

ఇది అసందర్భం అని రాజుకి తెలుసు. కాని కథలకోసం తాను మొగంవాచిపోయి వున్నాడు, మరి. కనక "నీ కోరిక అంగీకరిం రించా"నన్నాడు కథకునితో. "మరేమీ అనుకోకండి రాజుగారి కున్నట్టే కథకునిక్కూడా వ్రతాలుండవచ్చు. కనక, వారి విష యిం యెవరూ అపార్థం చేసుకోవద్దు" అని చెప్పాడు దివాను కూడా సభకేసి చూస్తూ.

రాజు చెప్పగా, సభలోవున్న కంసాలివారందరూ బిలబి ల్లాడుతూ వెళ్ళిపోయారు, ధుమధుమలాడుకుంటూ. అటు చూసి యిటున్నూ చూసి దివాను కూడా బయలుదేరాడు, రాజు చెప్పకముందే. కాని, వెడుతున్నట్టే నటించి, యుక్తిచేసి సింహాసనంకింద నక్కాడు, వెనక వైపు నుంచి వెళ్ళి.

"ప్రారంభించవచ్చు" నన్నాడు రాజు.

"హరిః ఓ"మ్మన్నాడు కథకుడు.

"అనగా అనగా ఒక మట్టిబెడ్డ. దానికీ ఒక రావి ఆకుకీ ప్రాణస్నేహం. క్షణం అయినా విడిచివుండలే వవి. వాటి స్నేహం యెంత దృఢమైనదంటే? గాలి వస్తే, మట్టిబెడ్డ రావిఆకుమీద కూచుంటుంది వెళ్ళి, అది యెగిరిపోకుండా. వాన వస్తే రావిఆకువెళ్ళి మట్టిబెడ్డమీద కప్పుకుంటుంది, అది తడిసి పోకుండా—"

ఆ యెత్తుగడ చూసి శ్రోతలందరూ మంత్రముగ్ధులన్న ట్లయిపోయారు. రాజు కూడా బొమ్మ అన్నట్లయిపోయాడు. కాని దివాను నూరుకోలేకపోయాడు. యుక్తి కెళ్లించిందతణ్ణి. "మరి, గాలీ వానా వస్తేనో?" అంటూ అడ్డుప్రశ్న వేసేశాడు వెంటనే అతను, సింహాసనం కిందినుంచే.

శ్రోతలకేకాదు. రాజుకీ తెలిసిపోయింది దివాను సంగతి. అతని కుట్ర కూడా అర్థం అయిపోయిం దందరికీ. ఇది గుర్తించి "గాలీ వానా వస్తే కథ పోయిం"దనేశాడు, కథకుడు., ఒక్కటే మాట.

6. వెతికి వెతికి వెయ్యి బళ్ళమీద వంటలక్కను తీసుకు వస్తే, తగిలేని, మిగిలేని తోటకూరకు తొడలోతు ఎసరుపెట్ట నన్నట్టు.

ఒకరికి వంటలక్క కావలసి వచ్చింది. లోకం అంతా గాలించారు వారు. ఎంతో దూర దేశాన ఒక మహా నిపుణురా లుందని తెలిసింది. కష్టపడి వెళ్ళి పట్టుకున్నారు. రమ్మని ప్రార్థించారు. ఎన్నో విధాల నచ్చచెప్పారు. హిరణ్యాక్షవరాల కన్ని టికీ తల నూపారు. కష్టపడి వెయ్యి అంచెబళ్ళమీద తీసుకు వచ్చారు ఎలాగో.

అలిసెక్కగా వచ్చి ఛార్జీ పుచ్చుకుం దావిడ. మొదటి పూటే తోటకూర కూర కావలసి వచ్చిం దింటివారికి. అవిడ వంట చేయిస్తుంది గాని, స్వయంగా చెయ్యదు, మరి, వంట నాయ కురాలు కనక. మామూలువంటమనిషివచ్చి తోటకూరకు ఎస రెంత పెట్టాలనడిగింది, ఆవిణ్ణి. దానిమీద తన నైపుణ్యం బయట పెట్టిం దా వచ్చినావిడ. "తగిలితే తగులుతుం"దంది. "అదంతా తరవాత చూసుకుందాం" అంది. "తొడలోతు ఎసరుపెట్ట"మనేసింది దర్జాగా.

తోటకూర అసలే నీటిబుగ్గ. అది తరిగి గిన్నెలో వేసి, చిలకరిస్తారు కసిన్ని నీళ్ళు, వేడి తగిలిందంటే అక్కడికే అది నీరూరిపోతుంది. ఉడికాక ఆ నీరు పారవంచేస్తారు, తాలింపు పెట్టడానికి ముందు. అది చాలక వేడి తగ్గాక బాగా పిడి చేస్తారు. కూడా.

ఏదో చూసి, యెందుకో పసందుచేస్తారు కొందరు, కొందరి నెందుకో. ఆ యెవరివో ప్రణాళిక లిలా వుంటాయి. ఒక్కపనీ సానుకూలంకాదు. పనీపడదు. అదిగో, అలాంటి సంద ర్భాల్లో వాడే సామెత యిది.

7 "దాని కళ్ళు గూట్లో పెట్టినట్టున్నాయి"

అవిడ కళ్ళు గుంటకళ్ళు అన్నమాట. కొందరివి గుంట కళ్ళూ, కొందరివి మిడిగుడ్లూను. రెండూ అంద వికారాలే. గుంటకళ్ళు చూడ్డానికేమీ అభ్యంతరం కలిగించవు. అవి చురు గ్గానే చూస్తాయి. అవి చూసేవారికే కొంచెం అంద వికా రంగా కనపడతాయి. ఇదిగో, యిది స్ఫురిస్తుం దీ పలుకుబడివల్ల.

8 "తిన్న అన్నం అంతా పెట్టెలోపెట్టినట్టుంది"

తిన్నది తిన్నట్టుంది. ఏ కొంచెమున్నా అరగలేదు. "పెట్టెలో పెడితే ఎంత భద్రంగా వుంటుందో అంత భద్రం గానూ వుంది నాకడుపులో" అనడానికి వాడే పలుకుబడి యిది. 'ఆకలి లేదు.' అని దీనికర్థం.

9. అశ్వత్థ ప్రదక్షిణాలు చేస్తూ కడుపు తడుముకున్నట్టు.

ఒకామెకి సంతానంలేదు. నూటఎనిమిది అశ్వత్థ ప్రదక్షిణాలు చేస్తే గర్భం నిలుస్తుందని యెవరో చెప్పారామెకి.

మంచి ముహూర్తం చూసుకుని ఒకనాడు మొదలు పెట్టిందామె. అయితే, ప్రదక్షిణాలు జరిగినకొద్దీ కడుపెంత యెదిగిందో తెలుసుకోడానికి మాటి మాటికీ తడుముకోసాగింది కడుపామె. ఫలితంకోసం తప్పుదారిలో ప్రయత్నం చేసేవారి సంగతి చెప్పడాని కుపయోగపడే సామెత యిది.

10. కూతురికి బు—దో—రం—శ—నో—రం—కోడలికి దీరికి దీరికి.

ఒక యిల్లాలి కొక కూతురు ఒక కోడలూను. అయితే, కూతుర్ని చూసినట్టు కోడల్ని చూడ దామె. కాని కూతుర్ని కంటే కోడల్నే యెక్కువగా చూస్తున్నట్టు నటిస్తుంది.

మరో యిల్లా అడిగిందామెని "నీ కూతురి కెన్నాళ్ళకో మాటు తలంటుతా"వని. "బు—దో—రం—శ—నో—రం" అంటూ సాగదీసుకుందా యిల్లాలు, కళ్ళూ తలా తిప్పుకుంటూ. "చాలా రోజుల కోమాటు" అని స్ఫురించేటట్టు అక్షరాలూ శబ్దాలూ కూడా ఆగి ఆగి సాగదీసుకుంటూనూ పలుకుతుంది, స్వప్రయత్నంగా. "మరి! నీ కోడలికో?" అనడిగింది ఆ మరో ఆవిడ మళ్ళీ. అంటే, "దీరికి దీరికి" అనేసిం దా యిల్లాలు "వెంట వెంటనే" అని స్ఫురించాలని ఆమె ప్రయత్నం. అందుకోసం, అక్షరాలూ శబ్దాలూ కూడా కలిసిపోయేటట్టు త్వరత్వరగా పలుకుతుందామె, తలకూడా త్వరగా యెగరవేసుకుంటూ.

అంటే, ఆవిడ, కూతురికి వారానికి రెండు మాట్లు— బుధవారమూ, శనివారమూ తలంటుతుంది. కోడలికి మాత్రం సంవత్సరాని కోమాటే. మా తూర్పు గోదావరి జిల్లాలో వెలమ్లూ, కమ్మవారూ, కాపులూ.మరికొందరూ కూడా స్త్రీలు "దీపావళికి" అనడానికి "దీరికి" అంటారు. అత్తగార్ల గడుసుదనం వెల్లడించే సామెత యిది.

ఆదిలో మా గురువులు సంకల్పించుకున్న—కొంత కొంతగా, అప్పుడప్పుడు నేను సమకూర్చిన జాతీయ శబ్దరత్నాకరాని కిది మచ్చుముక్క.

గ్రంథాల్లోనూ, జనుల వాడుకలోనూ దొరికే యిలాంటి పలుకుబళ్ళూ సామెతలూ అసంఖ్యాకాలు. వాటి కన్నిటికీ ఇలాగ కూర్చిపెట్టడమూ, వివరణ లివ్వడమూ చాలా అగత్యం.

అయితే, యివి పూర్తి చెయ్యడం యెవరికీ సాధ్యం కాదు. వివరణ లివ్వడం కూడా అంతే. అయితే, యెంతవరకూ యీపని చెయ్యగలిగితే అంతా భాషకూ వాఙ్మయానికీ గూడా పుష్టే. కూర్చడం మంచిదే. కాని అంత మాత్రమే చాలదు. వివరణ లిచ్చినప్పుడే ఉపయోగం.

ఆంధ్ర జాతి కీ ప్రయత్నం పెన్నిధి అవుతుంది.

# కవిహృదయం

## శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రి

| | |
|---|---|
| విజయరామప్రభువు | మహారాజు |
| రంగరాయలు | దివాన్ |
| లక్ష్మణకవి | |
| రామశాస్త్రి<br>కామశాస్త్రి | లక్ష్మణకవికుమాళ్లు |
| శరభయ్య<br>రామావధాన్లు<br>సోమయాజులు | రేగులపాడు గ్రామం<br>శ్రోత్రియందార్లు |
| అప్పలరాజు | దివాను సేవకుడు |
| వెంటన్న<br>పారన్న | ఆస్థానవిదూషకులు |
| మంగమ్మ | లక్ష్మణకవిగారి భార్య |

రాజోద్యోగి, రాజసేవకులు, తురుపులు, పాటకజనం.

### ప్రథమాంకం

1. స్థలం రేగులపాడు గ్రామంలో లక్ష్మణ కవి గారి యింటిలో ముందు వసారా.

సమయం—ఉదయం ఝాముస్నర వేళ.

(వసారాలో ఒకవైపున తివాసీమీద నేల డస్కు. డస్కు మీదా క్రిందా, ఈవైపూ, ఆవైపూ కాగితాల కట్టలు, తాళగ్రంథాలు, విరివిగా పడిఉంటవి. సమీపంలో వ్యాసపీఠం మీద కొన్ని గ్రంథాలు ఉంటవి. పంచలనిండా ముడి తాటాకుల కట్టలు,—డస్కు మీద సిరాబుడ్డి, కలాలు, ఘంటాలు, ఇసుకతో ఉన్న కర్రపెట్టె—

లక్ష్మణకవి వయస్సు 50, 60 ఏళ్ల మధ్య ఉంటుంది. తల, గడ్డం కొద్దిగా నెరిసి ఉంటవి. ఎర్ర జీరలతో నిండిన పెద్ద కళ్లు. విభూతి రేఖలతో నిండిన విశాల ఫాలం. బక్కపలుచని చామన చాయ శరీరం. నీరుకావి దోవతి కట్టి భుజంమీద తుండుగుడ్డ వేసుకొని ఉంటాడు.)

లక్ష్మ : శివశివా ! నేడు నిజంగా దుర్దినమే. గ్రామంలో శుచీ శుభ్రతా సన్నగిల్లుతున్నది. ఏటిలో పారుతున్నది ఒకే చిన్న పాయ. పూరి కశ్మలమంతా ఇందులోనేనా ? ఎంత మనస్కరించకపోయినా, ఏరు గనక ఎలాగో స్నానమైందనిపించుకున్నాను. కాని—అర్ఘ్యప్రదాన మిత్తామంటే—(చిన్నగా నవ్వుతూ) అన్ని విఘ్నాలే.

(వ్రాస్తూ వ్రాస్తూ తిరిగి చిరునవ్వు నవ్వుతాడు.)

వేళావిశేషం ! ఒక్కొక్కప్పుడు అనుకోకుండానే పద్యాలొకదానివెంట ఒకటి ప్రవాహంగా వచ్చేస్తాయి.

(మంగమ్మ లోపలినించి వచ్చి గుమ్మంలో నిలబడుతుంది. పచ్చని దబ్బపండుఛాయలో పుష్టి అయిన శరీరం. పసుపు రాసిన కుదురైన ముఖం. నుదుట పెద్ద కుంకుమబొట్టు.)

మంగ : ఒంట్లో వేడిచేసిందంటున్నారు. ఈ పూటైనా వెందరాళే ఇంత చారూ అన్నం తింటే—

లక్ష్మ : (వ్రాసుకుంటూనే) అప్పుడేనా ? ఇంకా ఆకలి గా లేదు.

మంగ : పద్యాలతోటే కడుపు నిండిపోతూంటే మరి భోజన మెందుకు ?

లక్ష్మ : (చిరునవ్వు నవ్వి వూరుకుంటాడు.)

మంగ : ఒళ్లలిస్తే ఆకలేస్తుంది. మానాన్న మీకంటె ఎంతో పెద్ద. అయినా మీకంటె పదేళ్ల చిన్నవాడిలా కనబడతాడు. కండలు తిరిగిన శరీరం. ఐదారు కోసులు అలికలేకుండా నడుస్తాడు. ఏతాం వేస్తాడు. పారతో తవ్వుతాడు. మొత్తంమీద కూర్చొని స్వయంగా బండి తోలుతాడు. తనకేం లేదనా పోదనా ? ఇరవై గరిశల ధాన్యం వచ్చే స్వంత సేరీ. నేను చెప్పొచ్చేది—వొళ్లలిస్తే ఆకలి పుడుతుందని. మా నాన్న అడ్డెడు బియ్యం అన్నం తక్కువ తినడు—పప్పూ, పులుసూ, పచ్చళ్లూ, కూరలూ, గేదె పెరుగుతో సహా.

లక్ష్మ : ఎవరి అదృష్టం వారిది. మీ నాన్న తినడానికి పుట్టాడు. నేను పద్యాలు వ్రాయడానికి పుట్టాను.

మంగ : వ్రాయడమంటే ఇలాగలాగా ? కట్టలు కట్టలు కాగితాలు—పట్టెడేసి తాటాకు పుస్తకాలు. కడుపు నిండినట్టా, కాలు నిండినట్టా ? ఏవో శతకాలనీ, దండకాలనీ, కావ్యాలనీ, ప్రబంధాలనీ, ఇవనీ, అవనీ—ఎవరి కోపికుంది ఇవన్నీ చదవడానికి ?

లక్ష్మ : ఒకరి తృప్తికి కాదు నేను వ్రాయడం, నా ఆనందానికే. ఒక రాక్షేపిస్తారన్న భయమంతకంటే లేదు.

డేగ పొంచుందని కోయిల కూయక పూరుకోగలదా ? మేకలు మేస్తున్నా, పురుగులు పుప్పిచేస్తున్నా పుష్ప వృక్షం పూయకపోతుందా ?

మంగ : అదంతా అడివి కాచిన వెన్నెలే. ఏంజేసి ఏం లాభం ? ప్రతిఫలం లేని పనికి ప్రయోజన మేమిటి ? ప్రజలకి పద్యా లక్కర్లేదుగదా ? కావలసినా వాళ్లెప్పుడూ ఓకు కుండలేగదా ? ఎప్పుడో, ఏ రాజో చూడడమంటూ ఉంటే—బావుందంటే—మన అదృష్టం కలిసొస్తే— ఏ తృణమో, ఫణమో ముట్టజెప్పుతాడు. అంత మాత్రంచేత మన దరిద్రమేం తీరేని ? .... ఆ తరువాత ఆ గ్రంథాలన్నీ ఏ చెదలకో, బూజం పురుగులకో ఎలకలకో బలికావలసిందే !

లక్ష్మ : ఏమి చెయ్యను—ఇది అనాదిగా వస్తున్నదే. కవితకి చిక్కిన కవి ప్రవాహంలో పడి కొట్టుకు పోవాల్సిందే !

(తిరిగి లక్ష్మణకవి వ్రాయడం మొదలుపెడతాడు) —(పెద్ద చప్పుడుతో వీధి తలుపు తోసుకుంటూ రామశాస్త్రి హడావిడిగా లోపలికి వస్తాడు.)

రామ : (బిగ్గరగా) నాన్నగారూ !—నాన్నగారూ !

మంగ : అంత హడావిడేమిట్రా పెద్దవాడా !

రామ : గుర్రమెక్కి వస్తున్నారమ్మా ! ఎవరో రాజోద్యోగిట ! గ్రామ చావిట్లో ఉన్నాడు—నాన్నగారి కోసమే నటమ్మా !—వింటున్నావా—విద్యానగర సంస్థానం నించట !!

లక్ష్మ : (తలెత్తి) ఏమిటోయ్ సందడి ?

మంగ : విద్యానగర సంస్థానంనించి మీకోసం ఎవరో రాజోద్యోగి వచ్చి గ్రామచావిట్లో ఉన్నాడట.

లక్ష్మ : (ఆశ్చర్యపడుతూ) ఏమిటీ ! రాజోద్యోగా ? నాకోసమా!

మంగ : ఏమో ! ఈనాటికేనా మీ రేఖ బయటపడకూడదా ?

(వీధిలో మనుష్యుల కోలాహలం.)

రామ : అడుగో వస్తున్నాడు. రాజోద్యోగే !

(వీధిగుమ్మంలోంచి కొందరు అగ్రహారీకులు, పాటక జనం లోపలికి వస్తారు. వారి మధ్యను రాజోద్యోగి ఉంటాడు. రాజోద్యోగి వసారాలోకి వస్తాడు.)

రాజో : నమస్కారం లక్ష్మణ కవిగారూ. విద్యానగర సంస్థానాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ విజయరామ ప్రభువుల నుండి తమ కాహ్వాన పత్రం తీసుకు వస్తున్నాను. స్వీకరించండి.

లక్ష్మ : (లేఖ అందుకొని చదువుతూ ఉంటాడు.)

రాజో : తమరిని దగ్గిరుండి తోడ్చుకురమ్మని మహారాజులుంగారి శలవైంది. సవారీ, జోడు మషాల్చీలూ గ్రామ చావడి పక్కనే ఉన్నాయి.

లక్ష్మ : మహారాజుల ఆదరణకి కృతజ్ఞుడిని. కాని—ఏమిటో.

రామ : ఏమిటి నాన్నగారూ—ఆహ్వానం దేనికి ?

లక్ష్మ : అదేనోయ్—మహారాజుగారు నాకు సన్మానం చేయడానికి దర్బారులో సన్నాహాలు చేస్తున్నారట. — నాకెందుకోయ్ ఈ పటాటోపమంతా ?

(ఏట్లో స్నానంచేసి తడి బట్టలతో కామశాస్త్రి ప్రవేశిస్తాడు.)

రామ : విన్నావురా తమ్ముడూ ? నాన్నగారికి రాజాస్థానంలో సన్మానం చేస్తారట. అదుగో రాజోద్యోగి—నాన్నగారిని తోడ్చుకువెళ్లడానికి వచ్చారు.

కామ : సన్మానమా ? నాన్నగారికా ? రాజ దర్బారులోనా ? (చిన్న నవ్వు) నాన్నగా రొప్పుకుంటే కద ?

లక్ష్మ : అదేరా కామన్నా. నా కెందు కీ సన్మానాలూ అవీ అంటున్నాను.

రామ : (కోపంగా) ఒరే కామిగా ! నువ్వవతలికి వెళ్ళు ! పెద్దవాళ్ళు మాట్లాడుతూ ఉంటే తెలిసీ తెలియకుండా పానకంలో పుల్లలా అడ్డొస్తావ్ ! అవతల రాజుగారేమో నాన్నగారిని అందల మెక్కిస్తారని మే మందరం పొంగిపోతూవుంటే !—నాన్నగారి వైరాగ్యం ఉండనే ఉంది—మన మందరం కలిసి నాన్నగారిని సమాధాన పర్చి పంపించాలి గాని—

రాజో : లక్ష్మణ కవిగారూ, నేను మనవిచేసింది వినండి. తమరు పెద్దలు, వయోవృద్ధులు, జ్ఞానులు, తమకి తెలియని దేముంది ? మన మందరం రాజాజ్ఞ శిరసావహించవలసిన వాళ్లమే గదా ? అంచేత తమరు రాజదర్శనం చేసుకోండి. తమ అభిమత మేమిటో ప్రభువుల సమక్షంలోనే మనవి చేసుకుంటే మీకూ మాకూ అందరికీ మంచిది.

లక్ష్మ : అయ్యా ! ఇందులో రాజధిక్కరణ ప్రసక్తేముందండీ ? తరతరాలనుండి మా పూర్వులు నాలాగే జీవితాలు వెళ్లబుచ్చినవాళ్లే. ఈశాశ్రయం కోరిన వాళ్లేగాని రాజాశ్రయం అపేక్షించలేదు. విద్యాధనులే గాని నిర్ధనులే—అంటే శారదాకటాక్షమున్నా, లక్ష్మీ కటాక్షం లేదు. ఏ నదీతీరాన్నో అజ్ఞాతంగా, నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానంతో, తపోనిష్ఠతో కాలం గడుపుతూ, కవితను కులదైవంగా కొలుచుకుంటూ వచ్చారు. మా వంటివాళ్లను రాజదర్బార్ల కీడ్చడం సెలయేటి ప్రక్కను కొండరాళ్లలో పుట్టి పెరిగి పుష్కలంగా పూచిన మందారాన్ని వేళ్లతో పెళ్లగించి రాజాంతఃపురోద్యానవనంలో నాటడం వంటిది కాదా?

రాజో : ఈ విషయాలన్నీ తమరే స్వయంగా రాజసన్నిధిని మనవి చేసుకోవచ్చునుగదా ?

మంగ : (లోగుమ్మంలోంచి) వా రలాగు మరీమరీ చెపుతూ ఉంటే మరేమీ ఆలోచించకండి. మహారాజు మీ విషయంలో ఎంతో సుముఖులుగా ఉన్నారట గదా. అదృష్టం రెండుసార్లు పట్టదు. ఈ అవకాశం మళ్ళీ

వస్తుందా? మీరు వెంటనే వెళ్లి రాజదర్శనం చేసుకోండి.

రామ : వెళ్లండి నాన్నగారూ వెళ్లండి. సిరిరా మోకా లొడ్డకండి. ఈనాటికి మీ తపస్సు ఫలించింది. మీ కవితా శక్తి రాజదృష్టి నాకర్షించింది. మన పూర్వులలో ఎవరికీ పట్టని అదృష్టం మీకు రాబోతున్నది.

కామ : నాన్నగారి కవిహృదయం ఎవ్వళ్లూ అర్థం చేసుకోలేదు.

రామ : ఏడిశావ్‌లే! అక్కడికి నీ కంతా తెలిసిపోయినట్టు!

కామ : నే ననేది—నాన్నగారు.

మంగ : పూరుకో చిన్నవాడా! నువ్వేం మాట్లాడకు.

రామ : నాన్నగారు రాజదర్బారులో సన్మానాలు పొందాలనీ, వారిని మహాకవులుగా రాజూ లోకమూ గుర్తించి కీర్తించాలనీ—

కామ : ఆ కీర్తికాంతిలో ఉపగ్రహంలా నువ్వూ ఓ వెలుగు వెలగాలనీ—

రామ : ఇదేమీ జరగకుండా రాహుకేతుల్లా నువ్వడ్డురావాలనీ—

కామ : నాన్నగారు కలివితాకన్య నమ్ముకొని డబ్బు తేస్తే ఆ కన్యాశుల్కంతో నువ్వు దర్జా చెలాయించాలనీ—

ఒక అగ్రహారీకుడు : మీ పుణ్యముంటుంది, ఊరుకోండ్రా నాయన్లాలా! .... లచ్చన్నమామా, మరాలోచించకు. ఈ మహదవకాశం జారవిడవకు. రాకరాక వచ్చింది. ఈ గౌరవం నీకే కాదు, మన కుల మంతటికినీ—గ్రామ మంతటికినీ—

2 వ అగ్ర : లే, లే, తొందరపడు. ఆలస్య మమృతం విషం.

3 వ అగ్ర : లచ్చన్న బాబాయ్ అందల మెక్కితే చూతామని ఆడవాళ్లందరూ వీధి గుమ్మాల్లో నిలబడి చూస్తున్నారు.

రాజో : తమరు వెంటనే ప్రయాణ సన్నాహం చెయ్యడం మంచిది. లేకుంటే సకాలంలో విద్యానగరం చేరుకోలేరు.

లక్ష్మ : ఇందరూ చెపుతున్నా—నా మనసేమో—

రామ : మీరు బయలుదేరి తీరాలి నాన్నగారూ.

అనేక గొంతుకలు : వెళ్లాలి—వెళ్లాలి.

లక్ష్మ : విధివిలాస మెంత చిత్రంగా ఉంది! వ్రాద్దామని సంకల్పం కలిగితే—ఏవేవో గ్రంథాలు ఎప్పుడెప్పుడో వ్రాసిపడేస్తూ వచ్చాను. అవి బాగుంటాయనీ—ప్రభువు దృష్టిలో పడతాయనీ వూహించనైనా లేదు. నాకు కీర్తి తెస్తాయనీ అనుకోలేదు. .... రాజదర్శనం!—అదదరూ అవునంటున్నప్పుడు—నే నొక్కడినీ.... సరే. ఈశ్వరేచ్ఛ—

రాజో : తమ నిశ్చయం దివ్యంగా ఉంది. శుభస్య శీఘ్రం. మీరేమీ సంకోచించకండి. మహారాజులుంగారు తమర్ని గౌరవప్రపత్తులతో పూజిస్తారు. ఇంక లేచి భోజనం చెయ్యండి. నా కొరకు గ్రామంలో విందేర్పాటైంది.

(కామశాస్త్రి, రామశాస్త్రి వెంట రాగా, అగ్రహారీకులతో కలిసి రాజోద్యోగి నిష్క్రమిస్తాడు.)

మంగ : (గుమ్మంలోంచి వసారాలోకి వస్తూ, సంతోషంగా.) నే ననుకుంటూనే ఉన్నాను, మీ కీ యోగం పడుతుందని. మీ శ్రమ ఊరికే పోతుందా?

లక్ష్మ : కీర్తికీ డబ్బుకీ కవిత్వ మమ్ముకుంటున్నాను. పతితుడనై పోయానేమో!

మంగ : అదేమిటండీ! శ్రమపడి గ్రంథాలు వ్రాశారు. శ్రమకి తగ్గ ప్రతిఫలం ఉండొద్దుటండీ? పెద్ద పెద్ద పేరు పొందిన కవులే రాజుల్నాశ్రయించి బాగుపడ్డారు. నిజానికి రాజులనించి కవులూ, కవులనించి రాజులూ ప్రసిద్ధికి వచ్చినవారే గదా!

లక్ష్మ : నువ్వూ అదేమాటా?

మంగ : అహ! తప్పకుండా అంటాను. అదే ముమ్మాటికీ నిజం.

లక్ష్మ : సరే. మీ అందరిమాటే కానియ్యండి. భగవదిచ్ఛ ఎలా ఉందో! ఇక వద్దన కానీ (లేస్తాడు).

తెర

2 స్థలం. విజయరామ ప్రభువుల దర్బారు.

సమయం—ఉదయం.

(మహారాజు సింహాసనంపై ఆసీనులై ఉంటారు. ప్రక్కనే మరొక ఆసనం అమర్చబడి ఉంటుంది. పండితులు, కవులు, వేదాధ్యయనపరులు, గాయకులు, ఉద్యోగులు, ఇతరులు నేల పరచిన తివాసీలపై కూర్చొని ఉంటారు. సింహాసనానికి సమీపంలో దివాన్ రంగరాయులు నిలబడి ఉంటాడు. దర్బారు హాలు గుమ్మంలో కొందరు రాజసేవకులు నిలబడి ఉంటారు.)

రాజసేవకుడు : (లోపలికి వచ్చి వంగి చేతులు జోడిస్తూ లక్ష్మణ కవిగారు దయచేస్తున్నారు.

మహా : సంతోషం, సంతోషం. దివాంజీ! లక్ష్మణకవిగారిని సగౌరవంగా తోడ్కొని రండి.

దివాన్ : చిత్తం చిత్తం. (బయటికి వెళ్లి లక్ష్మణకవినీ కుమాళ్ళు రామశాస్త్రినీ, కామశాస్త్రినీ, కొందరు అగ్రహారీకులనూ వెంటబెట్టుకొని తిరిగి లోపలి వస్తాడు.)

మహా : (సింహాసనంమీద నించి లేచి, నాలు గడుగులు ముందు నడిచి హసన్ముఖులై, చేతులు జోడిస్తూ) సుస్వాగతం మహాకవీ! సుస్వాగతం. (సింహాసనం ప్రక్కనే అమర్చిన ఆసనం చూపుతూ) ఇలాగు .... ఈ ఆసనం అలంకరించండి.

(లక్ష్మణకవి మహారాజును వేదోక్తంగా ఆశీర్వదించగా మహారాజు ముకుళిత హస్తాలతో స్వీకరిస్తారు. మహారాజు, లక్ష్మణకవి కూర్చుంటారు. ఇతరులు తివాసీలపై కూర్చుంటారు.)

మహా : (మందహాసం చేస్తూ) మహాకవీ, మాకెంతో ఆనందమైంది. మీ గ్రామంలోనే మీ దర్శనం చేసుకోవాలని ఎన్నాళ్ళనుండో అనుకుంటూ వచ్చాం. కాని—రాజదర్బారులోనే, మీ ఘనతకు తగినట్టుగా సన్మానం చెయ్యడమే ఉత్తమమని నిశ్చయించి ఇప్పుడే ఏర్పాట్లు చేశాం.

లక్ష్మ : (లేచి) మహారాజుల ఔదార్యానికి సర్వదా కృతజ్ఞుడను. ప్రభువులు పండితపక్షపాతులని లోకమంతా ఎరుగును. నా కిచ్చిన ఈ సన్మానం ఈ పండితు లందరిదీ కదా !

(సభలోని పండితు లందరికీ నమస్కారం చేసి లక్ష్మణకవి కూర్చుంటాడు.)

మహా : లక్ష్మణకవీ ! ఓ విధంగా చూస్తే మీ రింతకాలమూ అనాఘ్రాతపుష్పమై పోయారు. మీవంటి మహాపురుషులు మా రాజ్యంలోనే ఉన్నారని మాకు తెలియనే లేదు. ఒకనా డొకకవి ప్రసంగవశాత్తూ ఒక పద్యం చదివాడు—మాకు బాగా జ్ఞాపకం ఉంది—

గీ. మురళి ప్రణవంబు, గోపికల్ ముక్తజనము,
గోగణంబు చిరంతన గోగణంబు,
రాధ మూలప్రకృతి, లక్ష్మి బ్రహ్మవిద్య,
కృష్ణ డానందమయ తత్త్వ మిదె నిజంబు.

పద్యం చిన్నదే—కాని భావంలో బ్రహ్మాండమంతా ఇమిడిఉంది. ఆ కవికి ధన్యవాదాలు తెల్పబోగా అతడే చెప్పాడు. ఈ పద్యం లక్ష్మణకవి గారిదని. మాకెంతో కుతూహలం వేసింది. మీ విషయం భోగట్టా చేసి అన్ని సంగతులూ తెలుసుకున్నాం.

లక్ష్మ : ప్రభువుల అభిమాన మటువంటిది.

మహా : మీరు మహాకవులే కాదు, సంస్కృతాంధ్రములలో మీ పాండిత్య మపారమని తెలిసింది. మీరు సౌమ్యులనీ, తపోనిష్ఠులనీ విన్నాం. మీ పూర్వులందరూ పండితులో, కవులో, గాయకులో, శ్రీవిద్యోపాసకులో అనీ తెలుసుకున్నాం. మీ రాకవల్ల మా సంస్థానానికి నూతన శోభ వచ్చింది. నిజానికి మిమ్మ సన్మానించడం మమ్మను మేము సన్మానించుకొనడమే .... దివాంజీ !

(మహారాజు దివాన్ వైపు సాభిప్రాయంగా చూస్తారు. దివాన్ రాజసేవకులచేత కొన్ని వెండి పళ్ళెరాలు పట్టించుకు వస్తాడు.)

మహా : (పళ్ళెరాల్లోంచి వస్తువులు పైకి తీస్తూ) ఈ నవరత్నఖచిత కంకణాలు మీ చేతుల నలంకరించనివ్వండి.

(లక్ష్మణకవి చేతులకు కంకణాలు తొడుగుతారు.)

ఇదుగో చందనం .... అత్తరు .... పన్నీరు .... (కవి దేహానికి చందనం రాసి, అత్తరు పూసి, పన్నీరు జల్లుతారు.) ఈ పీతాంబరాలూ .... శాలువలూ .... స్వీకరించండి. (పళ్ళెరాలు అందిస్తారు.) మీరు మహనీయులు—ఏదో—యథాశక్తి—ఈ దక్షిణ తాంబూలాలు స్వీకరించి అనుగ్రహించండి. (వెయ్యినూటపదార్లు, తమలపాకులు, వక్కలు వగైరా ఉంచిన పళ్ళెరం కవి చేతికి అందిస్తారు.)

లక్ష్మ : (గాభరాగా లేవడాని కుద్యుక్తుడవుతూ) ప్రభువులు నన్నుక్కిరిబిక్కిరి చేసివేస్తున్నారు. ఇంత ఉదారతకు నే నెంతమాత్రం తగనని మనవి చేస్తున్నాను.

మహా : (మందహాసం చేస్తూ) కూర్చోండి. కూర్చోండి. మీ జీవితమంతా కవిత్వానికి అంకితం చేశారు. మేము మీ కిచ్చినది స్వల్పమే. మీకు దివాన్ హోదా యివ్వదల్చుకున్నాం. పని అంతంత మాత్రమే. రెగులపాడు ముఠా శ్రోత్రియాలు వసూలుచేసి దివాణానికి జమ కట్టాలి—

పెంటన్న : బేషో లచ్చన్నబావా ! నీ రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాటే !

పారన్న : నేతిలో కాదు నీట్లో.

పెంట : నీట్లో కాదు ఏట్లో.

పార : ఏట్లోకాదు బురదలో.

పెంట : బురదనీటి ఏట్లో.

పార : చోడి చేనులో వరిమొక్క.

పెంట : గంజాయి వనంలో తులిసిమొక్క.

పార : పీకి పారేస్తారు.

పెంట : ఘాటుకి కమిలి పస్తుంది.

పార : ఘూలితో దీపం.

పెంట : ఘనమైన ఉరుకుంటుంది.

దివాన్ : (కోపంగా) ఇంక చాలించండి. శ్రుతి మించిపోతూంది.

పార : ఇంకా రాగాన పడలేదు గదూ ?

మహా : (నవ్వుతూ) వాళ్ళ నలాగ వాగనివ్వండి. అడ్డువస్తే మరీ రెచ్చిపోతారు. వాళ్ళ కలాంటి స్వేచ్ఛ ఇచ్చాం గదా ! .... లక్ష్మణకవీ, మీపని కేవలం నామమాత్రమే. మీ కుమార్లే చూసుకుంటారు. ప్రతిఫలంగా దివాణమిచ్చే తబ్జీకాక సవారీ, జోడు మషాల్చీలు, రోజుకి ఆరు రూపాయలు దిన వెచ్చం—దివాంజీ !

దివాన్ : చిత్తం. ఇదిగో— (లక్ష్మణకవి చేతిలో రాజశాసనం కాగితం ఉంచబోతాడు. లక్ష్మణకవి కాగితం అందుకోకుండా మతి పోయినట్లు అలాగే చూస్తూ ఉంటాడు.)

రామ : కాయితం పుచ్చుకోండి నాన్నగారూ. ఈ అవకాశం మరి రాదు.

ఒక అగ్ర : తీసుకో. తీసుకో.

2 వ అగ్ర : అందుకో. అందుకో.

అనేక గొంతుకలు : స్వీకరించండి. రాజ శాసనం స్వీకరించండి.

మహా : ఏ మాలోచిస్తున్నారు మహాకవీ ?

లక్ష్మ : నేనో పల్లెటూరి ఛాందసుడిని. రాచకార్యాలేవీ తెలియని వాడిని. ఈ ఉద్యోగవిధులన్నీ సక్రమంగా నిర్వహించ గలనో లేదో—

మహా : భయపడకండి. మా అండదండ లెప్పుడూ మీకు ఉండనే ఉంటవి. మిమ్మ చిక్కులలో పెట్టడం మా ఉద్దేశం కాదుగదా ?

లక్ష్మ : శాసన మిప్పించండి. (వణుకుతున్న చేతులతో అందు కుంటూ) మహారాజాజ్ఞ శిరసావహిస్తున్నాను.

(శాసనం కళ్ల నద్దుకుంటాడు. సభలో ఆనంద కోలాహలం.)

మహా : బేష్ ! మా కిప్పుడు పరమ సంతోషంగా ఉంది. (లేస్తూ) దివాంజీ ! లక్ష్మణకవిగారిని గౌరవ లాంఛనాలతో వారి స్వగ్రామానికి అంపకం పెట్టండి !

(మహారాజు అంతఃపురం వైపు నడుస్తారు.)

తెర

3\. స్థలం—దివాన్ రంగరాయలుగారి లోగిట్లో చావడి. సమయం—రాత్రి.

(చావిట్లో సోఫాలూ, కుర్చీలూ అమర్చి ఉంటాయి. గోడలమీద తైలవర్ణ చిత్రాలు వ్రేలగట్టి ఉంటాయి. గుమ్మానికి ఎదురుగా పెద్ద పులి తలలూ, దుప్పి తలలూ మేకులకు తగిల్చి ఉంటాయి. ఒకవైపు గోడకి కవచమూ, ఇరుప్రక్కలడాలులూ, ఖడ్గాలూ. కత్తులూ తగిల్చిఉంటాయి.)

(అప్పలాజు హుక్కా సరంజామా పట్టుకొని లోపలి నించి వస్తాడు. అటూ యిటూ చూసి, హుక్కా గొట్టంలోంచి నాలుగైదు దమ్ములు పీల్చి మీదికి పొగ వదుల్తాడు. హుక్కా చేత్తో పట్టుకొని మధ్య మధ్య పీలుస్తూ, అడుగులు వేస్తూ పాడు తాడు.)

వావ్వరే ! మజారే ! హుక్కా !
రాజ్యమేలు రాజుగారు—
రాజుభార్య రాణిగారు
దివాన్‌గారు దివానమ్మ
నవాబులూ బాబులూ
తక్తుమీది గొప్పవోళ్లు తాగినట్టి హుక్కా
అప్పలాజు హుక్కా తాగే
గొప్పోడై పోతాడో !
వావ్వరే అప్పలాజూ! మజారే అప్పలాజూ !
వావ్వరే హుక్కా !
మజారే హుక్కా !

(మంచి గంధం చల్లిన చుట్ట కాలుస్తూ దివాన్ ప్రవేశిస్తాడు. అప్పలాజు తుళ్లిపడి, వెంటనే జల్దు కుని, ఏమీ యెరగనట్టు హుక్కాను సోఫాపక్క ఉంచు తాడు.)

దివాన్ : అప్పలాజూ !

అప్ప : అయ్యా !

దివాన్ : ఏదీ, రెండు కొత్త చుట్టలు పట్రా ! ఇది కాల కుండా ఉంది.

అప్ప : హుక్కా ఉందండయ్యాగారు.

దివాన్ : వెధవ హుక్కారా—చప్పగా పథ్యపు కూరలా—ఘాటా ఏడుపా—చవకమచ్చు పూదొత్తుం పొగ వాసన కొట్టు కుంటూ ! .... తే—చుట్టలు తే !

అప్ప : చిత్తమండయ్యాగారూ (లోపలికి వెళ్లి చుట్టలు తెచ్చి యిస్తాడు.)

దివాన్ : (కొత్త చుట్ట ముట్టిస్తూ) అప్పలాజూ !

అప్ప : అయ్యా !

దివాన్ : ఏం జేస్తున్నావ్ ?

అప్ప : నలుల్లులపాలండి—అటి పని పట్టకపోతే—

దివాన్ : నల్లులూ, బాపనోళ్లూ—

అప్ప : బాపనోళ్లా !

దివాన్ : నువ్వు నల్లులు పని పడితే నేను బాపనోళ్ల పని పడ తాను.

అప్ప : బాపనోళ్లే !

దివాన్ : బాపనోడు పంచాంగం చెప్పడానికీ, పనసలు వల్లించ డానికీ, పద్యా లల్లడానికీ, పాటలు పాడుకుందికీ—

అప్ప : బిచ్చ మెత్తుకుందికీ—

దివాన్ : భేషో ! బిచ్చ మెత్తుకుందికీ పనికొస్తాడు గాని—

అప్ప : పనికొత్తాడు గాని—

దివాన్ : బాపడికి ఉద్యోగ మిమ్మని ఎవడు చెప్పాడ్రా ? బాపర్లు తమతినా లేరు, ఒకర్నికి పెట్టాలేరు— ఒకళ్లు తింటే చూడలేరు.

అప్ప : మరి తద్దినాలండయ్యాగారూ ?

దివాన్ : తద్దినాలకి బోలెడు పాత్తర్లూ, దక్షణ్లూ, వాళ్ల మొహాన కొడుతున్నాం కద్రటా ? (మీసం నులు పుతూ). నా హయాంలోనా ! ఏ ఉద్యోగంలోను బాపన పురుగంటూ లేకుండా ఏరి పారేస్తాను .... అప్పుడే దివాణంలో ఆరంభించాంలే. ఇంక రాణాలవని పట్టాలి.

అప్ప : అయ్యా బాబోయ్ !

దివాన్ : బాపర్ల బుద్దెప్పుడూ వక్రించే ఉంటుంది. వాళ్లంటే మన రాజకీయ తంత్రాలు పారవు. సమయా సమ యాలూ, అదును పదున్లూ తెలియకుండా, అయిన దానికీ కానిదానికీ, నీతులనీ, ధర్మాలనీ ఆఘోరిస్తూ ఉంటారు. ఎప్పటికప్పుడు ఎత్తుకి పైయెత్తు వేస్తూ, సామదాన భేదదండోపాయాల్తో ఎలాగో ఒకలాగు పని చెయ్యనిపించుకోవాలి. ఇలాంటివాటికి మనోళ్లే ఘటికులు గదరా ?

అప్ప : మనోళ్ళకి యాటంటే యెర్రండయ్యగారు.

దివాన్ : ఇప్పుడు కావలసింది జంతువుల వేట కాదురా— మనుషుల వేట ! .... నే నెంత మొత్తుకుంటే ఏం లాభం ? రేగులపాడు ముఠా మున్సొబుదారీ ఉద్యోగం మా తమ్ముడు వెంకట్రాయల కిప్పించమని మారాజుతో మూడుసార్లేనా చెప్పుకున్నాను. మా రాజేం చేశారు ? ఎవడో వెర్రిబాగుల బాపనోడు—లక్ష్మన్న ఆ ఉద్యోగం కాస్తా తన్నుకుపోయాడు. ఇప్పుడేం చెయ్యాలి ?

అప్ప : ఎత్తుకి పై యెత్తెయ్యాల్సిందే !

దివాన్ : భేష్షో భేష్షో ! సిసలైన సలహారా ! అనక జ్ఞాపకం చెయ్యి—రెండు కొత్త చుట్టలు ఇనామిస్తాను.

అప్ప : మూ డిప్పించం డయ్యగారు. మూడు పూట్లకీ మూడు.

దివాన్ : చూతాంలే.

అప్ప : మా రాజుకి బాపనోళ్ళంటే యిట్టమెండయ్యగారు.

దివాన్ : అంతే కాదురా. మహారాజుకి రాత్రిలేదు, పగల్లేదు, ఎప్పుడూ ఏవో గానాబజానాలట, నాట్యాలట, పండిత గోష్ఠులట, కవి సన్మానాలట, ఇవట ! అవట ! వాళ్ళ మొహాన వందలూ, వేలూ కుమ్మరిస్తాడు. వెయ్యితే— రెండువేలు తే అంటూ ఖజానాకి కబురు. ఎక్కడినిండి వస్తుంది డబ్బు ? శిస్తులు బకాయి, శ్రోత్రియాలు బకాయి—ఖజానా ఖాళీ.

(వీధిగుమ్మం అవతల నించి) : దివాంజీవారు లోపలున్నారా ?

దివాన్ : ఎవర్రా అది ? అప్పల్రాజా! వెళ్ళి చూడు.

(అప్పల్రాజు బయటికి వెళ్ళి తిరిగి వస్తాడు.)

అప్ప : బాపనోళ్ళయ్యగారూ. శరబయ్యా—రామావొదాన్లూ. ఇంకా అదేవు ళ్ళెవుళ్ళో—

దివాన్ : లోపలికి రమ్మను.

(అప్పల్రాజు బయటికి వెళ్ళి శరభయ్య, రామావధాన్లు, మరికొందరు శ్రోత్రియందార్లను వెంట బెట్టుకుని లోపలికి వస్తాడు. అందరూ దివాన్‌కి నమస్కరిస్తారు. )

దివాన్ : (నమస్కారా లందుకుంటూ) అలా .... అరివాసీ మీద కూచోండి .... అప్పల్రాజా ! ఆకులూ, వక్కలూ పళ్ళెంలో వేసి పట్టా .... మజ్జిగతేట తెప్పించమన్నారా ? మాలోగిట్లో చిలికింపించిందే—చిక్కటి మీగడపాలు ! మా కమ్మగా ఉంటుంది.

శరభయ్య : ఎందుకు బాబూ—అప్పుడే మా భోజనా లైపోతేనూ!

దివాన్ : పోనీ—పానకం పుచ్చుకోండి. ఖర్జూరంలాంటి బెల్లం మా స్వంత సేరీలో వండింపించిందే.

రామావధాన్లు : ఏమీ వద్దు బాబూ. తమరు శ్రమపడకండి.

దివాన్ : మొత్తానికి మీరేగులపాడు గ్రామంకి మంచి అదృష్టం పట్టింది. మీవాడు లక్ష్మన్నకి దివాన్ హోదా వచ్చింది గదా ?

శర : ఏమదృష్టంలెండి. ఎవరి కే ఉద్యోగం వచ్చినా ఏం లాభం ? మా దరిద్రం మమ్మల్నొదల్దుగదా !

దివాన్ : (తనలో) గాడ్దె కొడుకులు ! వీళ్ళని ఇరుకున పెట్టి, వీళ్ళ కళ్ళు వీళ్ళచేతే పొడిపించాలి. (ప్రకాశంగా) దివాణంకి రావలసిన డబ్బు ఎప్పటికప్పుడు చెల్లించేస్తున్నంత కాలం మీకేం తక్కువయ్యా ?

రామా : అదేనండి చిక్కు. మా గ్రామంలోనే కాదు, మా ముఠా అంతటా చాలామంది ఒకటీ, రెండూ ఏళ్ళూ, కొందరు మూడేళ్ళూ శ్రోత్రియాలు దివాణంకి చెల్లించలేదు.

శర : ఈ సంగతులు ముందే తమ చెవిని వేసేస్తే, తమరు కటాక్షించి మాకేదో ముక్తిమార్గం చూపిస్తా రన్న ఆశతో ఇలా వచ్చాం.

దివాన్ : (తనలో) చబాష్ ! పడ్డాయిరా పిట్టలు వలలో ! (బిగ్గరగా) ఏమిటేమిటీ ! ఇదా మీరు చేస్తున్న తంత్రం ? అగ్రహారం భూముల ఫలసాయం మీరు తినెయ్యడమే కాకుండా—దివాణంకి చెల్లించవలసిన శ్రోత్రియాలు కూడా ఎగ్గొడుతున్నారా ? ఎంత సాహసం ! దివాణంకి ద్రోహం తలబెడి ఏమవుతుందో తెలుసా ?

శర : (భయంతో) తండ్రి వంటివారు, తమరే ఆగ్రహిస్తే మూవంటి దీనులకి గతేమిటండి.

దివాన్ : (కర్కశంగా) రేపే కనుక్కుంటాను—ఎవరెవ రెంత బాకీ ఉన్నారో. దివాన్ రంగరాయలు తడాకా కాస్త రుచి చూపిస్తాను.

రామా : (రెండు చేతులూ జోడిస్తూ) తమరు కటాక్షించక పోతే మా అగ్రహారీకుల మందరం నల్లుల్లా మాడి పోతాం.

దివాన్ : (కోపంగా) లేదు లేదు—మీరు చేసిన ద్రోహానికి మిమ్మల్నేం జేసినా తప్పులేదు.

శర : (నిలబడి, దివాన్ రెండు చేతులూ పట్టుకుంటూ) ఇవి చేతులు కావు, కాళ్ళనుకోండి. తమరు కనికరించకపోతే మే మందరం సకుటుంబంగా నాశనమైపోతాం.

దివాన్ : (బిగ్గరగా) ఏం జేశారయ్యా శ్రోత్రియాల డబ్బంతా ?

శర : చిత్తం చిత్తం—

దివాన్ : తినేశారన్నమాట—అంతేనా ?

రామా : చిత్తం చిత్తం—కుటుంబాలు పెరిగిపోయాయి. తిండికే చాలకుండా ఉందండి.

దివాన్ : కాదు కాదు. కుల కర్మలు ఎగ్గొట్టారు. దుర్వ్యసనాల్లో పడ్డారు. దుర్వ్యాపారాల్లోకి దిగారు. హీనకులంవాళ్ళతో సంపర్కాలు పెట్టుకున్నారు. మీ తాతలు పండితులు నిజమే—మీరో ? మీరేం బ్రాహ్మలయ్యా ? మీవంటి వాళ్ళనించి మొత్తం బ్రాహ్మణజాతికే కళంకం వచ్చింది.

శర : తమరన్నది అక్షరాలా నిజం. ఏం జేస్తాం—లౌక్యానికి దిగి బ్రహ్మకర్మలు వెనకబెట్టాం. ఉభయభ్రష్టుల మైపోయాం. ఇప్పుడేమనుకుంటే ఏం లాభం ? జీవచ్ఛవాలమైపోయాం. మమ్మల్ని నాశనం చెయ్యకండి. మా పిల్లల్ని రక్షించండి.

దివాన్ : (దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు నటిస్తూ) ఘట్టి చిక్కే వచ్చిందే ! ఇదెలా విడతియ్యడం ?

శర : తమరే మాకు తోవ చూపాలి.

దివాన్ : (తల తాటిస్తూ) ఈ చిక్కుల్లోంచి బతికి బైట పడాలంటే ఒకటే మార్గం ఉంది.

రామా : తమరేం చెయ్యమన్నా చేతులు కట్టుకు చేస్తాం.

దివాన్ : శరభయ్యా ! నువ్వేమంటావ్ ?

శర : తమ శలవెలాగైతే అంతేనండి.

దివాన్ : మరి—వీళ్లమాటేమిటి ?

అగ్రహారీకులు : అందరం తమ అజ్ఞలకి బద్ధులమే.

దివాన్ : నా మాటప్రకారం నడుచుకుంటామని—అదుగో—ఆ రాములవారి పఠం దగ్గిర ప్రమాణం చెయ్యండి. (అందరూ పఠం దగ్గిరికి వెళ్లి ప్రమాణాలు చేస్తారు.)

దివాన్ : అందరూ ఆ గదిలోకి వెళ్లి మరోమారు బాగా ఆలోచించుకొంటూ ఉండండి. నేనూ ఇప్పుడే వస్తాను. (అగ్రహారీకు లందరూ గదిలోకి వెళతారు.)

దివాన్ : అప్పరాజూ !

అప్ప : అయ్యా !

దివాన్ : చూశావా నా తడాకా ? 'ఏకక్రియా ద్వ్యర్థకరీ !'

అప్ప : తెనుగులో చెప్పం డయ్యాగారూ !

దివాన్ : దెబ్బకి రెండు !

అప్ప : దెబ్బకి రెండే !

దివాన్: అంటే లక్ష్మన్న పని లా!—మా వెంకట్రాయలు పని హాం

అప్ప: ఆ ? .... హా—! .... ఆహా !!!

(దివాన్ గదిలోకి వెళుతుండగా)

తెర

## ద్వి తీ యా ం క ం

1. స్థలం—రేగులపాడులో గ్రామచావడి.

సమయం—ఉదయం.

—పొగాకు రెక్కలూ, పొడుం కుంజీ, దుడ్డు, వెదురుబద్ద, బొగ్గు కుంపటి వగైరా సరంజామా పట్టుకొని రామావధాన్లు ప్రవేశిస్తాడు. పై మీది తుండుగుడ్డతో ఓ మూల దులిపి, సామాన్లు దింపి, తుండుగుడ్డ పరిచి కూర్చుంటాడు.)

రామా : దిక్కుమాలిన కొంప ! పొడుం నూరుకుందికి అడిగెడు జాగాలేదు. ఎక్కడపడితే అక్కడ చింకి బొంతలు, పాత గుడ్డలు, కుక్కి మంచాలు—'పథీ పథి లుంఠిత దధిభాండం' అన్నట్టు, అడుగేస్తే ఏ బోకు బిందో, గిన్నో తగుల్తుందన్న భయమే ! ఊరు దరిద్ర మంతా మా కొంపలో మూర్తీభవించినట్టుంది.

(పొగాకు ముక్కలు తుంపి వెదురుబద్దతో పేర్చుతాడు.)

శరభయ్య : లోపలికి వస్తూ, కుంపట్లో అగ్గి చూసి, బొంటి నుండి చుట్ట పైకి తీస్తూ (రక్షించావురా రామావధాన్లూ ! పొద్దుటినించీ బుక్కేడు పొగకోసం వాచిపోయాను. నోరంతా చప్పగా అయిపోయిందనుకో !

రామా : అబ్బబ్బ ! దిక్కుమాలిన చుట్టరా శరభయ్యా ! ఆ కాల్చడ మేమిటో ఇంటిదగ్గరే యాడవక, నలుగురూ వచ్చే పోయే గ్రామ చావిట్లో యేమిట్రా ?

శర : ఏడిశావ్ ! ఇల్లూ, ఒళ్లూ, గుడ్డలూ పొడుం కంపు కొట్టుకొంటూ, వీధీ, వాకలీ చీది ఖరాబు చేస్తూ—రోతరోత ! పొడుందాసుడివి నువ్వా ఆక్షేపించడమేనా ?

రామా : హారి అజ్ఞానుడా ! పొడుం సభాపూజితమైన నాసాభూషణంరా ! రాజాధిరాజులచేత చెయ్యి చాపిస్తుంది, ఏమనుకున్నావో !

(సోమయాజులు హడావిడిగా ప్రవేశిస్తాడు.)

సోమ : ఇద్దరే ఉన్నారే ! తక్కినవాళ్లేరీ ?

శర : ఏమో !

రామా : ఎవడి కెరికె !

సోమ : ఏడిసినట్లే ఉంది—'బ్రాహ్మణానా మ నేకత్వం' అన్నట్టు. అవతల కొంపలు మునిగిపోతూ ఉంటేనూ ! దివాంజీ వారేం చెప్పారు, మనమేం చేస్తున్నట్లు ?

శర : ఏదో ఒహ టవకపోతుందేమిట్లేరా ! ముందు మా తగువు తీర్చు.

సోమ : (విసుగ్గా) ఏమిట్రా అది ?

రామా : చుట్ట గొప్పదా, పొడుం గొప్పదా ?

సోమ : రెండూ ఒకటే. రెండూ ధూమపత్రజన్యాలే ! ధూమపత్రంకంటె గొప్పది జ్ఞానపత్రి. మన కాశీగవాయీ వెంకన్న నడుగు, చెపుతాడు. వెంకన్న నిత్యం కామేశ్వరీదేవతారాధన జ్ఞానపత్రితోనే చేస్తాడు. జ్ఞానపత్రి కషాయంతో అభిషేకం చేసి, ఆ పత్రితోనే ధూపం వేసి, మదనకామేశ్వరీ మోదకం నైవేద్యం పెట్టి—ఆ ధూమమే ఆఘ్రాణిస్తూ, కషాయం తీర్థంగా పుచ్చుకుంటూ, మోదకం ప్రసాదంగా స్వీకరిస్తాడు.

శర : ఓరి వీడిల్లు బంగారంగానూ ! వెంకన్న గంజాయి చిలుం పీల్చి, భంగు తాగి, మాదుం కూడా తింటాడట్రా ! కల్లు కూడా తాగుతాడు కాబోలు !

సోమ : వాళ్ళే అనడ మెందుకు ? ఆ పని మన గ్రామంలో ఎందరు చెయ్యలేదు ? తాతల ధర్మమా అని ప్రతి వాడికీ అర్ధవిసో్తు, పావు పరకో భూమి ఉంది. పంటలు పండుతున్నాయి. తిండికి తడుముకో నక్కర్లేదు. అయినా ఏం ప్రయోజనం ? ఒకడికేనా డొక్క చీర్చితే అక్షరం ముక్కుందీ ? తాతలనాటి పాండిత్యాలే వల్లకాట్లో కలిశాయో ! తిన్న తిండి అరగడానికి ఎవడి అరుగుమీదో ప్రతివాడూ చేరి, అందరూ కలిసి చిలిపి ఖజ్జాలు పెట్టుకొని కాట్లాడి కొట్టుకుంటారు. లేకపోతే గంజీఫా, దశావతారాలు చదరంగం, పులిబోను, పచ్చీసుపాళీ, వామనగుంటల వంటి వేవో ఆటలాడుకుంటూ కూచుంటారు. ఒకడికీ ఓ కాణీ ఆర్జించే శక్తి లేదుగాని, చేతులో ఉన్నది కాస్తా తగలెయ్యడానికి ఘటికుడు.

శర : పాపం ! నువ్వొక్కడివే మడికట్టు క్కూచున్నావు !

సోమ : అందర్నీ కలిపే అంటున్నానురా.

రామా : మరింకేం ?

సోమ : మూడేళ్లనించీ శ్రోత్రియాలు తినేస్తున్నాం. లక్ష్మన్నబాబు ఎన్నిసార్లడిగినా ఏం చేశాం ? అయనతో నానా అబద్ధాలూ ఆడి మన తప్పంతా వెళ్లబోసుకున్నాం. ఆయన ధర్మరాజు గనుక, మన మాటలు నమ్మి, మనసు కరిగిపోయి, ఏ యేటి కాయేడు శ్రోత్రియాలు మాపుచేస్తూ వస్తున్నాడు. ఇప్పుడు దివాంజీవారు తఖరారు చేసేసరికి ఏ సమాధానం చెప్పలేక మెన్మెమ్మె అంటూ కళ్లు తేలేస్తున్నాం.

శర : ఒరే సోమన్నా ! నువ్వు వాలోవాడివై ఉండీ ఇలా అనడ మేం బాగాలేదు సుమీ ! ఇలాంటప్పుడు మనమేం చిన్న పొరపాటు చేసినా కొంప లంటుకోగలవు జాగ్రత్త ! మనం చిక్కుల్లోంచి బయటపడడానికి దివాంజీవారో మంచి సలహా యిచ్చారు. అలా చేస్తామని వారి దగ్గర ప్రమాణాలు చేశాం. మనమందరం కలిసి కట్టుగా ఉండ దివాంజీవారు చెప్పినట్టు నడుచుకోవాలిగాని—

రామా : నీలా ధర్మపన్నా లేకరు పెట్టడం కాదు.

సోమ : నాకు మాత్రం తెలియదట్రా ? అయినా—మహర్షిలాంటి లక్ష్మన్నబాబుని ఇందులో ఇరికించడమంటే—

శర : సోమన్నా ! తెలిసీ తెలియనట్టు మాట్టాడకు ! చూశావ్, ప్రతివాడు తన పీకల మీదికి వచ్చేసరికి—అవతలివాడేమైపోయినా సరే—తన ప్రాణం కాపాడుకుందికే చూస్తాడు.

రామా : ఇది చావుబతుకుల సమస్యరా సోమన్నా. ఇందులో ధర్మం అధర్మం అన్న ప్రశ్న లేనేలేదు.

సోమ : మీరంతా ఆంతరంగిక కూటంవాళ్లు. అసలేం జరిగిందంటావు ?

శర : రహస్యం సుమీ, జాగర్త ! పైకెక్కడా పొక్కనివ్వకు. మన అగ్రహారాల్లో అందరం శ్రోత్రియాలు బకాయీలతో సహా లక్ష్మన్నగారికి దఫాలవారీగా చెల్లించేశాం. ఆ డబ్బు లక్ష్మన్నగారు దివాణంకి జమ కట్టకపోతే మనమేం చేస్తాం ? మొన్న దివాంజీవారు వచ్చినప్పుడలాగే వ్రాసియిచ్చేశాం.

రామా : అదొక్కటే మార్గం. అలా చెయ్యకపోతే మన మందరం గ్రామాలు వదులుకొని దేశంమీద అడుక్కుతినవలసిందే !

సోమ : ఇంత గ్రంథం నడిచిందేం ! ఈపాటికి కాగితాలు దివాంజీవారి కందిఉంటాయి.

శర : ఆహా ! మనవాడే ఒహడు స్వయంగా దివాంజీవారి చేతికే అందించాడు.

సోమ : ఇంక మన మిప్పు డేం చేయాలి ?

రామా : ఏం చేయాలో దివాంజీవారే చెప్తారు. అంత వరకూ మనమందరం గ్రామంలోనే వేచిఉండాలి.

సోమ : ఇంతకీ భగవదిచ్ఛ ఎలాగుందో ! ఏదిరా రామావధానుృవో చిత్తా (పీలుస్తూ) ఒహోహో ! ఏం ఘాటుగా ఉందిరా ! (నకిలిస్తూ తుమ్ముతాడు.)

తెర

2. స్థలం—రాజప్రాసాదంలో ఒక గది.
సమయం—రాత్రి.

(గోడలమీద నిలువుటద్దాలు, తైలవర్ణ చిత్రాలు వ్రేలగట్టి ఉంటవి. గుమ్మానికి ఎదురుగా మహారాజు తైలవర్ణ చిత్రం నిలువు సైజుది కనబడుతుంది. గదిలో రెండు మూడు సోఫాలు, పట్టు బాలీసులు ఉంటవి. గదిలో అక్కడక్కడా మేజాలపై దంతము, వెండి వగైరాలతో చేసిన విగ్రహాలు అమర్చి ఉంటవి.—

మహారాజు అనిశ్చితంగా గదిలో పచార్లు చేస్తూ ఉంటారు. తరువాత సోఫామీద చేరగిలబడి నిట్టూర్చుస్తారు. హుక్కా గొట్టం తీసి రెండు గుక్కలు పీల్చి, అర్ధనిమీలితనేత్రులై క్రమంగా కళ్ళు మూసుకుంటారు.)

మహా : (కళ్ళు విప్పి) ఆరుదినాలైంది, అదే అలక. ఎంత వూహించినా అంతు దొరకదు. మహారాణివారి మనసులోని భావ మేమిటో మా కింతవరకూ తెలియదు. స్త్రీలకిలాగే మాకూ ఆరో జ్ఞానేంద్రియ ముంటే బాగుండును—మనసులోని భావాలు పసికట్టడానికి. మహారాజు ! హుం ! మాకంటె కష్టపడి జీవించే కూలివాళ్లే నయం. ఒక్క మాటతో, ఒక్క దెబ్బతో ఇలాంటివి సరిదిద్దుకో గలరు .... మనసు చికాకుగా ఉంది. కొద్ది రోజులపాటు తాలూకాల్లో సంచారం పెట్టుకుంటే .... చిరుతపులుల బాధ అధికంగా ఉందని కొండ గ్రామాలవాళ్లు గోల పెడుతున్నారు. ఆ ప్రాంతాల్లో షికా రేర్పాటు చేస్తే .... ఎవరక్కడ ?

(రాజసేవకుడు లోపలకు వచ్చి వంగి నమస్కారం చేస్తాడు.)

మహా : పెంటన్ననీ, పోరన్ననీ తక్షణం తీసుకురా. (సేవకుడు వెళతాడు.)

లక్ష్మణ కవిగారు వయోవృద్ధులు. వారి నిక్కడికి రప్పించడం భావ్యంకాదు. నాలుగు రోజులపాటు మేమే వారి గ్రామంలో మకాం పెట్టి వారి గ్రంథాలన్నీ వారి ముఖతః వింటే తప్పక మనశ్శాంతి కలుతుంది.

రాజసే : (లోపలికి వస్తూ) పెంటన్న, పోరన్న వచ్చారు.

మహా : లోపలికి రమ్మను.

(పెంటన్న, పోరన్న లోపలికి వస్తారు.)

మహా : (నవ్వుతూ) మిమ్మల్ని చూస్తేనే నవ్వొస్తుంది.

పెంట : అదే గమ్మత్తు—సాత్వికులకు నవ్వు, రాజసికులకి ధుమధుమ, తామసికులకు ఏడ్పు.

మహా : భేష్ ! విశేషా లేమిట్రా ?

పెంట : ఉన్నవాళ్లొకలితో చస్తే లేనివాళ్లు దుబారాతో బతుకుతున్నారు.

మహా : (నవ్వుతూ) ఓరి మీ యిల్లు గుల్లగానూ !

పోర : ఇదివరకే అయిపోయింది. మేం లేనివాళ్లలో జమ కదా !

మహా : పెంటా ! ఎందుకురా అలా అన్నావు ?

పెంట : ఉన్నవాళ్లు ఉన్నది తరిగిపోకుండా పొదుపుకోసం కడుపులు కట్టుకుంటున్నారు. లేనివాళ్లెలాగూ లేదని ఉన్నది కాస్తా ఊర్చుకు తినేస్తున్నారు.

మహా : యుక్తి బావుంది. ఇంకేం విశేషాలు. ?

పెంట : రాజ్యతంత్రం తంత్రాల్లో తగులుకుంది !

మహా : ఆ ! ఎంచేత ?

పోర : వేటగాడు మెత్తనై పోతే—

పెంట : లేడి మూడు కాళ్లమీదే నడవదా ?

మహా : ఎవ్వడ్రా మెత్తన ? ఎవడ్రా లేడి ?

పెంట : ప్రభువులు నాలుగురోజులపాటు శలవు దయ చేస్తే తీర్థయాత్రలు చేసుకుంటాం.

మహా : దేవాలయాలు సందర్శిస్తారు కాబోలు.

పెంట : ఏం లాభం ? దేముడిచ్చిన వరాన్ని పూజారి తన్నుకు పోతాడు.

మహా : దేవుడొట్టి సపనై పోతే మరే మవుతుందిరా ?

పోర : వరాలిచ్చేవాళ్లు దేవుళ్లే కాదు—రాజులూ ఇస్తారు.

పెంట : ఈ సూత్రం వాళ్లకీ నప్పుతుంది మరి.

మహా : (నవ్వుతూ) హోరినీ—! మీ మనస్సుల్లో ఏదో ఉందిరా. సరే—శలవిస్తాం. మేం కమాను వెళుతున్నాం. మే మెక్కడుంటే అక్కడ కలియండి.

రాజసే : (లోపలికి వస్తూ) దివాంజీవారు దర్శనానికి వేచి ఉన్నారు.

మహా : (ఆశ్చర్యంగా) దివానా ? ఈవేళప్పుడా ! .... సరే. రమ్మను .... పెంటా ! మీరింక వెళ్లండి.

పెంట : చిత్తం. శలవు.

(బయటికి నడుస్తారు.)

పెంట : (దివాన్‌ని చూసి, వంకదండాలు పెడుతూ) నమోన్నమః !

దివాన్ : (అయిష్టంగా) హోరి దౌర్భాగ్యుల్లారా ! మీకు వేళా పాళా లేద్రటా ?

పెంట : మీ కున్నట్టు !

దివాన్ : అధికప్రసంగం చెయ్యకండి. జాగర్త !

పెంట : అధిక ప్రసంగం మాదికాదు. మేం ఒక్కముక్కే అన్నాం.

దివాన్ : (కోపంగా) రాజు ధైర్యం చూసుకొని ఇష్టం వచ్చినట్టు పేల్తున్నారు.

పోర : ఎవరి ధైర్యం వారిది. ఒకరు రాజు ధైర్యం చూసుకు పేలితే ఒకరు ఉద్యోగ ధైర్యం చూసుకొని ఇష్టం వచ్చినట్టు చేస్తున్నారు.

దివాన్ : ఛీ ! వదరుబోతులు—మీతో మాట్లాడడం తప్పు. పొండి—బయటికి పొండి.

పెంట : (వెక్కిరింపుగా) చిత్తం. 'రాయి గుద్దనేల—చేయి నొవ్వనేల'—వెళ్లండి. తమరు లోపలికి వెళ్లండి.

(నిష్క్రమిస్తారు—దివాన్ లోపలికి నడుస్తాడు).

మహా :—(దివాన్ చేసిన నమస్కారాలందుకుంటూ, అతడి చేతిలో ఉన్న కాగితాలుచూసి) దివాన్‌జీ! ఏమిటి విశేషం?

దివాన్ :—మన రేగులపాడు ముఠా వ్యవహారం ఏమీ బాగాలేదు.

మహా :—తొందరేం? రేపు దర్బార్లో పరిశీలించకూడదూ?

దివాన్ :—తమ ఆజ్ఞ. కాని—నాకు తెలిసిన వెంటనే ప్రభువులతో మనవి చేసేస్తే—తక్షణ చర్య తీసుకొనడానికి ప్రభువులనుజ్ఞ ఇస్తారేమో అని—

మహా :—ఏమిటో టూకీగా చెప్పండి.

దివాన్ :—రేగులపాడు ముఠా శ్రోత్రియాలు మూడేళ్ళనించీ బకాయి పడ్డాయి.

మహా :—అంతేగదా! మన లక్ష్మణకవిగారికి కబురు పంపండి. వారే వసూళ్లు చేస్తున్నారుగదా.

దివాన్ :—అదేనండి చిక్కు. నేనింతకాలం పస్తాయించి వూరుకున్నాను. తమ రనుజ్ఞ యిస్తే విషయమంతా మనివి చేస్తాను.

మహా :—ఏమిటది?

దివాన్ :—దివాణం చిట్టాలు తణికీ చెయ్యడం నా విధులలో ఒకటి. రేగులపాడు ముఠా చిట్టాతణికీ చెయ్యగా శ్రోత్రియాలు మూడేళ్ళ బకాయి పడినట్టు నాకు కనపడింది. లక్ష్మణకవిగారు పెద్దలు. వారికి శ్రమ కలిగించడం ఇష్టంలేక నేనే స్వయంగా దాఖలు తీసుకోనదలిచి, అగ్రహారీకులందరూ తమ తమ బాకీలన్నీ తక్షణం దివాణంకి చెల్లించవలసిందని తాకీదులు పంపాను. వాళ్లందరూ చెప్పినదేమంటే—

మహా :—ఏమంటారు వాళ్ళు?

దివాన్ : తమతోఎలా మనవి చెయ్యాలో తెలియకుండా ఉంది. అయినా ప్రభువుల దగ్గిర నిజం దాచడానికి వీలులేదు. గదా? అగ్రహారీకులు చెప్పుకున్నదేమంటే—తమ శ్రోత్రియాలు ఏ ఏటి కా ఏడు లక్ష్మణకవిగారికి చెల్లించి వేస్తూ వస్తున్నామనీ, ఆ డబ్బు సర్కారుకు జమ కట్టకుండా లక్ష్మణకవిగారే తినేసిఉంటారనీ—ఇందులో అగ్రహారీకులకు పూచీ ఎంతమాత్రమూ లేదనీ—(మహారాజు చేతికి కాగితాలు అందిస్తూ) ఇది నేను పంపిన తాఖీదు—ఇవి అగ్రహారీకుల సంతకాలతో మహజర్లు—

మహా : —(కాగితాలు చూడకుండానే సోఫా మీదికి విసిరేస్తూ) లక్ష్మణకవిగారే ఈ పనిచేసిఉంటారా ?

దివాన్ :—అగ్రహారీకుల మహజర్లలాగే చెపుతున్నాయి.

మహా :—అసంభవం (లక్ష్మణకవి మహనీయుడు—తపశ్శాలి—వారీ పనిచేసి ఉంటారని మేము నమ్మలేం. ఇదేదో కుట్ర—కుతంత్రం (చప్పున ఏదో స్ఫురించి) తంత్రం! .....తంత్రం...

దివాన్ :—దివాణం చిట్టాలు అబద్ధాలుకావుగదా? అగ్రహారీకులు లక్ష్మణకవిగారికి చెల్లించేశామనే అంటున్నారు. మనం తక్షణ చర్య తీసుకోకపోతే రేపు తక్కిన ముఠాల వాళ్ళూ ఇలాగే చేస్తారు. బకాయీలుండిపోతే.... ప్రస్తుతం ఖజానాలో కూడా అంతంత మాత్రమే రొక్కముంది.—

మహా :—నిజమే......అయినా—లక్ష్మణకవిగారు....వారంటే మాకు విపరీతమైన గౌరవముంది.....(తనలో) అనుకున్నట్టే లక్ష్మణకవిగారి దర్శనం వారి గ్రామంలోనే చేసుకోవచ్చును. (ప్రకాశంగా) దివాంజీ!

దివాన్ :—చిత్తం.

మహా :—మీరూ మేమూ వస్తున్నట్టు రేగులపాడు వాళ్ళకి తాకీదులు పంపండి. తక్కిన విషయాలు రేపు మాట్లాడుకోవచ్చును. (లేచి అంతఃపురంలోకి వెడతారు)

దివాన్ :—(సంతోషంగా నవ్వుతూ) వహవ్వా తడాఖా! ఉచ్చులు తగిలించేశాం. ఇంక పిట్ట పడడ మెంత సేపు?

(నిష్క్రమిస్తాడు)

తెర

3 స్థలం—లక్ష్మణకవి యింటిలో ముందు వసారా. సమయం ఉదయం.

(లక్ష్మణకవి తివాసీమీద డస్కుముందు కూర్చొని మనసులో ఏదో గొణుగుకుంటూ వ్రాస్తూ ఉంటాడు. సమీపంలో కామ శాస్త్రి కూర్చొని, చిన్న రాగవరసతో ఏదో గ్రంథంలోని పద్యాలు చదువుతూ ఉంటాడు.)—

లక్ష్మ :—ఏమిటోయ్ ఆ గ్రంథం?

కామ :—విజయవిలాసమండీ నాన్నగారూ.

లక్ష్మ :—(వ్రాసుకుంటూనే) ఆహా.....

కామ :—ఈ విజయవిలాసంలో—చూశారూ నాన్నగారూ—పద్యాలు మాంచి సొగసుగా—రసవత్తరంగా—రక్తిగా ఉన్నాయి సుమండీ....కాని...అక్కడక్కడ లక్షణ విరుద్ధ పదాలు కనబడుతున్నాయి.

లక్ష్మ :—(చిరునవ్వు నవ్వుతూ) నాటికి పూర్వ ప్రయోగాలున్నాయేమో. ఇదేం వింతకాదు. మనమూ పూర్వ ప్రసిద్ధ కవుల ప్రయోగాలు చేస్తూనే ఉన్నాం. 'గతానుగతికోలోకః' అని ఉండనేఉందిగదూ.

కామ :—అయితే.....పూర్వ కవుల్లోనూ ఇప్పటి వారిలోనూ భిన్నాభిప్రాయాలు మాత్రమున్నాయి.

లక్ష్మ :—అది సహజమేకదా!

కామ :—నిజమే. కవిత అద్యంత రహితమైన జీవ ప్రవాహంగదా. కాలం మారినట్టే అభిప్రాయాలు కూడా మారడంలో ఆశ్చర్యంలేదు.

లక్ష్మ :—ఏదెలాగున్నా, లక్షణానికీ రసోజ్జృంభణానికీ సంబంధం లేదు.

కామ : చేమకూర వెంకటకవి—

లక్ష్మ :—అవును. అతడి విజయవిలాసమేగదూ ఇప్పుడు చూస్తున్నావు? ఇందులో కొన్ని లక్షణ విరుద్ధాలుండడం నిజమే. అయితే అమృతరసం చిమ్ముతున్న పద్యాల ముందర లక్షణ విరుద్ధంమాటే మరిచిపోతాం.

కామ :—అంతదూరమెందుకండీ నాన్నగారూ—మీ కవిత్వంలో కూడా కొన్ని అభిప్రాయ భేదాలు రాలేదా?

లక్ష్మ :—(చిన్న నవ్వు నవ్వుతూ) రావడమేమిటి—తీవ్ర వాదోపవాదాలు చెలరేగితే!

కామ :—వస్తే రానివ్వండి. ముద్దులు మూట కడుతున్న మీ కవిత్వంముందు అందరి నోళ్ళూ కట్టిపోయాయి.

లక్ష్మ :—ఏమిటో!.....అన్నట్టు పెద్ద వాడేడీ—పొద్దుటినుంచీ కనబడలేదు?

కామ :—పొద్దూటే గ్రామ చావిడివేపు వెళిపోయాడు.

లక్ష్మ :—వాడికి రాజుగారి కోటలోవీ వూళ్ళోవీ భోగట్టాలు కావాలి. ఇంత చదువుకున్నాడుగాని ఇంటి విద్యబ్బలేదు. కవిత్వం వాసనంటే కిట్టదు. నువ్వే నయం. చిన్నప్పటి నించీ ఏవో పద్యాలల్లుతూనే ఉన్నావు.

కామ :—అన్నయ్యకి పెద్ద ఉద్యోగమేదేనా చెయ్యాలని ఉందండీ. (వీధిలో పెద్ద కలకలం. పెద్ద చప్పుడుతో వీధి తలుపు తోసుకుంటూ రామశాస్త్రి గాభరాగా లోపలికివస్తాడు. అతనివెంటే వెనక ఒకరివెంట ఒకరుగా అనేకులు అగ్రహారీకులూ పాటక జనంతోసుకు వస్తారు. అందరూ ఒక్కసారే గోలగా మాట్లాడుతూ ఉంటారు. ఎవరేమంటున్నదీ స్పష్టంకాదు)

లక్ష్మ :—ఏమిట్రా ఇదంతా, పెద్దవాడా?

రామ :—(కష్టంగా) అయి — పోయింది — మనపని అయి—పోయింది!

లక్ష్మ :—ఏమిటంటున్నార్రా ?—సోమన్నా! ఏమిట్రా ఈ హడావిడంతా?

శరభయ్య :—(ముందుకు వస్తూ) మీరందరూ ఉండండి—నేను చెప్తాను—మామా! దివాంజీవారి దగ్గిర్నుండి ఇప్పుడే

తాఖీదొచ్చింది. దివాంజీగారూ మహారాజులుంగారూ మన గ్రామం వేంచేస్తున్నారట.

కామ :—ఓ! మరీ మంచిది. నాన్నగారు మహారాజు దర్శనం మరో మారు చేసుకుంటారు.

శర :—అంతటితో సరిపోతే బాగానేవుణ్ను.

కామ :—ఏమిటీ? మరెందుకీ రావడం వాళ్ళు?

రామా :—శరభయ్యా! నన్ను చెప్పనీ! వినవోయ్ కామశాస్త్రీ—రేగులపాడు ముఠా గ్రామాల శ్రోత్రియాలన్నీ బకాయిలతో సహా అగ్రహారీకులందరూ మీనాన్నగారికి చెల్లించి వేసినట్టూ—ఆ డబ్బు దివాణంకి చెల్లించకుండా—మీ నాన్నగారూ—

రామ :—ఏమిటేమిటి! మా నాన్నగారు తినేశారనా నువ్వనేది?

శర :—మే మనడ మేమిటి? దివాంజీవారు తణిఖీకి వచ్చినప్పుడు అగ్రహారీకులే అలా మహజర్లు పెట్టుకున్నారట.

రామ :—మన గ్రామం వాళ్ళూ పెట్టారా?

శర :—ఏమో!

లక్ష్మ :—ఎంత స్వామి ద్రోహం!

రామ :—నేను మొదటినించీ మొత్తుకుంటూనే ఉన్నాను. ప్రతివాడూ ఏదో బంధువరస పెట్టుకుంటూ నాన్నగారి దగ్గరికి వచ్చి, ఆకలితో మలమలమాడిపోతున్నామంటూ కల్లి మాటలు చెప్పి, దొంగేడ్పులేడ్చి, శ్రోత్రియాలు మాపు చెయ్యమని కాళ్ళా వేళ్ళాపడేసరికి నాన్నగారు కరిగిపోయారు. వాళ్ళదగ్గిర శ్రోత్రియాలు వసూలు చెయ్యడం మానేశారు. ఇప్పుడు చూశారా ఎంత అనర్థం వచ్చిందో?

లక్ష్మ :—నేను శ్రోత్రియాలు వసూలు చెయ్యకపోవడం నిజమే. కాని, నేను డబ్బు సీదాగా వసూలు చేసినట్టూ, అది సర్కారుకు జమకట్టకుండా తినివేసినట్టూ నామీద మహజర్లు పెట్టడం ఏమి న్యాయం? బ్రాహ్మణులై ఉండీ, నా బంధువులై ఉండీ అంత అధర్మానికి పూనుకుంటారా?

కామ :—అమృతంవంటిపాలు విరిగిపోతే విషయమైపోయినట్టే, బ్రాహ్మణుడు పతితుడైపోతే దుర్మార్గానికిదిగితీరుతాడు. మన ముఠాలోని బ్రాహ్మణీకం సంగతి తాలూకాతో అందరికీ తెలుసును. అప్పుడు శ్రోత్రియాలెగగొట్టారు. ఇప్పుడు తమ పీకల మీదికి రాకుండా ఈ దొంగ మహజర్లు పెడుతున్నారు.

(ఒక్కొక్కరూ నిశ్శబ్దంగా వెళ్ళిపోవడం మొదలు పెడతారు.)

లక్ష్మ :— భగవాన్! లోకంలో ధర్మమేలేదా? నా బంధువులే నన్ను నమ్మించి పీక నరుకుతారా? మహారాజు నాయందున్న గౌరవంతో నాకీ ఉద్యోగమిచ్చారు. ఇప్పుడు ప్రభువు 'స్వామిద్రోహం చేస్తావా లక్ష్మణకవీ!' అంటే నేనేం జవాబు చెప్పగలను? 'పలువురాడుమాట పాటియైధరజెల్లు' అన్నట్టు, ప ది మ ం దీ చెప్పిందే ప్రభువువింటారుగాని నా ఒక్కడి మాటావింటారా? ఈ అపనింద భరించలేను. మరింక రాజ ముఖం చూడలేను.

(క్రమంగా అందరూ బయటికి జారుకుంటారు రామశాస్త్రి, కామశాస్త్రి నిర్ఘాంతపోయి చూస్తూ ఉంటారు)

రామ :—(ఠటాలున తండ్రి పాదాలమీదపడి ఏడుస్తూ) మీరు శుద్ధ సాత్వికులు. మీ హృదయం అర్థం చేసుకోలేకపోయాను. మీరు ఉద్యోగంచేస్తే గొప్పదనం వస్తుందని భ్రమపడి ఆనాడు మిమ్మల్ని బలవంతం చేశాను. మీకు ద్రోహం చేశాను. పాపిని. నన్ను క్షమించండి. (కామశాస్త్రి చేతులు పట్టుకుంటూ) తమ్ముడూ! నువ్వు చిన్నవాడివైనా నాన్నగారి హృదయం అర్థం చేసుకున్నావు. ని ష్కార్యాయంగా కరుకు మాటలతో కష్ట పెట్టాను. నన్ను మన్నించు.

లక్ష్మ :—ఇదంతా విధి నిర్ణీతం—ఎవరు చేసిందేముందిరా?

రామ :—తమ్ముడూ పద— ఏ ఉద్యోగేనా కనబడితే ఉన్న నిజస్థితంతా అతడితో చెప్పుకుందాం. ఏమేనా లాభం ఉండొచ్చు. (కామశాస్త్రిని తీసుకొని రామశాస్త్రి వెళ్ళిపోతాడు. లక్ష్మణకవి ఒక్కడే ఉంటాడు.)

లక్ష్మ :—ఈ అపవాదు భరించడంకంటె ఆత్మహత్య చేసుకొనడమే శరణ్యమేమో! (లేచి నిలబడి ఆందోళనగా అటూ, యిటూ తిరుగుతూ) తెలిసి ఏ పాపమూ చెయ్యలేదు. ధారపోశాను. జీవితమంతా తపస్సుకే ధారబోశాను. భగవదర్పితంగా ఏవో గ్రంథాలు వ్రాశాను. రాజు బలవంతం చెయ్యగా ఈ ఉద్యోగానికి వప్పుకున్నాను. ఇదంతా చివరికి ఈ విధంగా పరిణమించింది! భగవాన్! (ఒక్కమారుగా అధైర్యం కలిగి) నా బ్రతుకింత అంధకారమైపోయిందా? చావే శరణ్యమా? చావు తప్పదా?......ఆలోచించడం దేనికి? ఎంత వేగ మంతమైపోతే అంత మంచిది. (వీధివైపు నడవడాని కుద్యుక్తుడవుతాడు.)

మంగ :—(లోపలినించి వసారాలోకి వస్తూ) ఎక్కడి కలాగవెళుతున్నారు భోజనం చెయ్యకుండా? ఇంతసేపూ పెరట్లో ఉండిపోయాను. ఏవో మాటలు వినబడ్డాయి. మీరేవో చిక్కుల్లో పడినట్టుంది. అధైర్యపడకండి. మీ యిష్టదైవం శ్రీరామచంద్రమూర్తి మీపాలనే ఉండగా మీకేమి భయం? మీ తపస్సంతా వూరికే పోతుందా? లోపలికి రండి.

లక్ష్మ :—ఇప్పుడే వస్తానుండు.

(ఆవేశంతో విసురుగా వీధిలోకి నడుస్తాడు)

తెర

4 స్థలం—రేగులపాడు గ్రామ చావడి. సమయం ఉదయం.

(శామియానా కట్టబడిన పెద్ద పందిరి చావడిముందు వేసిఉంటుంది. పందిరి నాలుగు వేపులా మామిడి కొమ్మల తోరణాలు వ్రేలాడుతూ ఉంటాయి. నేలమీద తాటాకు

చాపలు పరిచిఉంటాయి. (గ్రామ చావడి వరండాలో పరిచిన తివాసీలమీదమధ్యగా పెద్దకుర్చీ, ఇరువైపులా చిన్నకుర్చీలు అమర్చబడి ఉంటాయి. మధ్య కుర్చీమీద ముఖమల్ గుడ్డవేసి ఉంటుంది.

పాటకజనం పందిరి కవతల నిలబడి చుట్టలు కాల్చుతూ వింతగా చూస్తూఉంటారు.

శరభయ్య, రామావధాన్లు, వాళ్ళ వెనకే సోమయాజులు ఇతర అగ్రహారీకులు వచ్చి పందిట్లో నిలబడుతారు)

సోమ :—రామావధాన్లూ! ఏదీ ఓ చిత్తు! (శంకిస్తూ చెయ్యి చాపుతాడు)

రామా :—ఆరంభమైందీ? (రొంటినున్న పొడుంకాయతీసి, సోమయాజులు చేతులో ఓ పట్టుదులిపి, తన చేతులో కాస్త వేసుకుంటాడు. వెంటనే అగ్రహారీకులు చుట్టు ముట్టి 'నాకు కాస్త' అంటే 'నాకు కాస్త' అంటూ గోల చేస్తారు)

రామా :—అబ్బబ్బ! దిక్కు మాలిన సంపకం! వండుకున్నవాడి కంటె దండుకున్నవాడే మేలు! (అందరి చేతుల్లోనూ తలా కాస్త దులుపుతాడు)

శర :—(రొంటినుండి చుట్టా, చకుముకి సరంజామాపైకి తీసి, మళ్ళీ గాభరాగా దోపుకుంటూ) అన్నసచ్చామే! దివాంజీవారు వచ్చేస్తున్నారు!

(ఇద్దరు రాజ సేవకులు వెంటరాగా దివాన్ ప్రవేశిస్తాడు. అదేసమయంలో పెంటన్నా పారన్నావచ్చి పందిట్లో నిలబడ్డ జనంలో కలిసిపోతారు. దివాన్ అగ్రహారీకులు చేసిన నమస్కారాలందుకుంటూ చావిట్లోవేసిఉన్న ఒక కుర్చీమీద కూర్చుని, చేతిలోఉన్న కాగితాలతో విసురుకుంటాడు.)

దివాన్ :—ఏం శరభయ్యా—రామావధాన్లూ! ఏమైంది? ఎంతవరకూ వచ్చింది వ్యవహారం?

శర :—తమరు ఆజ్ఞ యివ్వడమూ మరోలాగ జరగడమూనా?

దివాన్ :—అంటే? ఏంజేశారో చెప్పండి.

రామా :—నువ్వు చెప్పనీరా శరభయ్యా. అందరూ ఒక్కుమ్మడిగా లక్ష్మన్న గారింటికివెళ్ళి చావు కబురు కాస్త చల్లగా చెప్పేశాం.

దివాన్ :—నిజంగానే? ఏమోలే—లక్ష్మన్న మీ కులస్థుడూ—మీ బంధువూగదా—అతడితో సంగతంతా సూటిగా చెప్పలేక—నానుస్తూ—సందిగ్ధంగా నసిగేశారేమో అని—

శర :—నిజమే. తమరన్నట్టు లక్ష్మన్న మా బంధువే. అయితే నేం. తమ నిర్ణయం ప్రకారం మేం చెయ్యకపోతే మా బతుకులకే ముప్పు తప్పదని తమరు చెప్పిన తరవాత కూడా మరోలాగ చెయ్యడానికి మాకు గుండెలున్నాయా?

దివాన్ :—బేష్! అయితే లక్ష్మన్నేమంటాడు?

రామా :—అనడం కూడానా? గుండు దెబ్బ తగిలిన బెబ్బులిలా గింజుకుంటూ కళ్ళు తేలేస్తేనూ!

దివాన్ :—(ఉత్సాహంగా అందరివేపూ చూసి, మీసం నులుపుతూ) మనం ఎత్తు వెయ్యడం పారక పోవడమూనా!.... లక్ష్మన్న దివాన్ గిరీ!......హ్హా!

(పెంటన్నా పారన్నా ముందుకు వస్తారు. వాళ్ళను దివాన్ చూస్తాడు)

,దివాన్ : (ఆశ్చర్యంగా) ఇదేమిటి...అన్నన్నా ! వీళ్ళూ ఇక్కడికే దాపురించారే !

పెంట : అది మేం మనవలసిన మాట. మీకంటే మేమే ముందర వచ్చాం.

శర : అప్పుడే ఐదారోజులైందండి వీళ్ళొచ్చి.

పార : సమంగా చెప్పవోయ్ ! నాల్రోజుల పూర్తైందను.

దివాన్ : (అయిష్టంగా) వీళ్లేం జేస్తున్నారిక్కడ ? నాటకమాడుతున్నారేమిటి ?

పెంట : నాటకమాడడం మీ వంతు, ఆడుతున్న నాటకానికీ ఆడబోయే నాటకానికీ ఇతివృత్తాలు వెతకడం మా వంతు.

శర : వీళ్ళు రోజుకో గ్రామం చొప్పున తిరుగుతూ, అందరి దగ్గిరా హాస్యపు కబుర్లు చెప్పి డబ్బూ, గుడ్డలూ దండుకుంటున్నారు.

దివాన్ : దరిద్రుగొట్లు ! రాజాశ్రయంలో ఉండి రాజుగారి డబ్బు తింటూ ముష్టెత్తుకుంటున్నారు.

పెంట : రాజాశ్రయంలో ఉండి రాజుగారి డబ్బు తింటూ కుత్తుకలు ఉత్తరించడం కంటె ముష్టెత్తుకొనడమే మేలుగదా !

దివాన్ : ఛీ ! అతివాగుడు ! మీతో మాట్లాడడం పేడమీద రాయి విసిరినట్టే !

పెంట : ఇంక మొహాని కంటుకొనడమే తరవాయి. పారన్నా ! పదరా పోదాం. ఇతడికంటె రాజే మంచివాడు. రాజుతోటే అన్ని సంగతులూ చెప్పుకుందాం.

(పెంటన్నా, పారన్నా వెళ్లిపోతారు).

దివాన్ : (కోపంగా చూస్తూ) వీళ్ల నెప్పుడో పట్టుకొని నల్లుల్ని నలిపినట్టు నలిపేస్తేనే గాని—

శర : ఉత్త వెర్రివాళ్లు బాబూ ! తలా తోకా లేకుండా మాట్లాడుతారు.

దివాన్ : వెర్రివాళ్ళు ! వెర్రివాళ్లే ఒక్కొక్కప్పుడు కొంపలంటించేస్తారు ! .... ఇదుగో—శరభయ్యా, సోమన్నా, అవధాన్లూ ! మహారాజు దగ్గిర అందరూ ఒక్క మాట మీదే నిలబడాలి—జాగర్తగా వింటున్నారా ?

శర : ఎంతమాట !

దివాన్ : ఎవడేనా ఒక్క అక్షరం మరోలాగ పలికాడంటే—వాణ్ణి చావ తన్ని చెవులు మూసి, చర్మం ఒలిపించి చెప్పులు కుట్టిస్తాం.

రాజసేవకుడు : (తొందరగా వస్తూ) మహారాజులుంగారు వేంచేస్తున్నారు.

(దూరంగా గుర్రాల డెక్కల చప్పుడై తక్కున ఆగిపోతుంది.)

దివాన్ : (గాభరాగా లేస్తూ) అందరూ పందిరి అవతలికి నడవండి. మహారాజు రాగానే అందరూ నమస్కారం చేసి లోపలికి రండి.

(కొన్ని క్షణాల్లో ఇద్దరు తురుపులు వెంట రాగా మహారాజు పందిట్లోకి వస్తారు. అందరూ వంగి నమస్కారాలు చెయ్యగా చిరునవ్వుతో స్వీకరిస్తూ రాజ సేవకుడు దారి చూపగా మహారాజు నడిచి గ్రామ చావడి మీద అమర్చిన పెద్ద కుర్చీలో ఆసీనులౌతారు.

మహా : దివాంజీ ! ఇక్కడ మనం చెయ్యవలసిన పనేమిటి ?

దివాన్ : చిత్తం చిత్తం. రేగులపాడు మొత్తం శ్రోత్రియందా ర్లందరూ వచ్చి ఉన్నారు. వాళ్ళు పెట్టుకున్న మహా జర్లు విచారణ చెయ్యవలసి ఉంది. (కాగితాలు అంది స్తాడు)

మహా : (కాగితాలవేపు చూడకుండానే, విసుగుగా) వీటి కిప్పుడేం తొందర ? లక్ష్మణకవిగారికి కబురు పంపించారా ?

దివాన్ : చిత్తం. వారికి ఉదయాన్నే కబురు పంపించాను— శ్రోత్రియాల విషయమై ప్రభువులతో స్వయంగా మనవి చేసుకుందికి గ్రామ చావడి వద్దకు హాజరు కమ్మని.

మహా : (అతి కోపంతో లేచి నిలబడి) దివాంజీ ! ఇదా—! మేమేం చెప్పాం మీరేం చేశారు ? లక్ష్మణ కవిగారితో కవితా వ్యాసంగం చెయ్యడానికి మేము వస్తున్నామని వారితో చెప్పమని మీతో మరీ మరీ చెప్పామే! పాపం అమా యకులు ! వారెంత నొచ్చుకుంటారో ! .... ఒరే— ఎవ రక్కడ ?

రాజసే : చిత్తం.

మహా : తక్షణం లక్ష్మణకవిగారి యింటికి వెళ్ళు — గుర్రంమీద వెళ్ళాలి !—వారికి మా నమస్కారాలు చెప్పి, వారి దర్శనానికి మేము వస్తున్నామని మనవి చెయ్యి. వెళ్ళు — జల్దీ !

(రాజసేవకుడు వెళ్తాడు. దూరంగా డెక్కల చప్పుడు. మహారాజు నిట్టూరుస్తారు.)

దివాన్ : ఈ మహజర్ల విచారణ దివాణం శ్రేయస్సు దృష్ట్యా అతి జరూరైందనీ—తరవాత సావకాశంగా ఇష్టా గోష్ఠులు జరుపుకోవచ్చుననీ—

మహా : (మాట్లాడకుండా తీవ్రమైన కోపంతో దివాన్‌వేపు చూసి ముఖం మరోవైపు తిప్పుకుంటారు.)

దివాన్ : ఉద్యోగులు రాజద్రవ్యం అపహరించడ మనేది తీవ్ర మైన విషయం. అది వెంట వెంటనే పరిష్కరించి దోషుల్ని శిక్షించకపోతే రాజ్యమే బలహీనం కాకతప్పదు.

మహా : ఎవరు కాదన్నారు ? దోషులను తప్పకుండా శిక్షిస్తాం.

దివాన్ : అందుకే నేను తొందరపడ్డాను. తప్పయితే క్షమించ మని మనవి.

మహా : లక్ష్మణకవిగారి కవితా ప్రతిభకీ, సౌశీల్యానికీ ముచ్చట పడి, వారు వద్దంటున్నా పిలిచి ఈ ఉద్యోగ మిచ్చాం. ఇప్పుడేదో, ఎక్కడో, ఎవరివల్లో పొరపాటు జరిగిందని మా చేతులతోనే వారిని శిక్షించాలా ? అసంభవం ! వారు నిర్దోషులు. మాకు పూర్తిగా తెలుసును. వారే నిజంగా డబ్బు కాజేసిఉంటే అది సర్కారు ఖర్చు కింద పద్దు రాసుకోవలసిందే !

దివాన్ : (తనలో) అన్నా ! కథ అడ్డం తిరిగిందే !

రాజసే : (రొజుకుంటూ ప్రవేశించి) ఘోరం ప్రభూ !— ఘోరం జరిగిపోయింది.

మహా : ఆ—ఆ— ఏమిట్రా ?

రాజసే : లక్ష్మన్నబాబుగారి యింట్లో ఆడవాళ్ళూ, పిల్లలూ అంతా ఏడుపులూ, మొర్రలూ !

మహా : (ఆందోళన పడుతూ) ఏమైందిరా ? లక్ష్మణకవిగారు కనిపించారా ?

రాజసే : అదే మహారాజా! లక్ష్మన్నగారు పొద్దుటే ఎటో వెళ్లి పోయారట. గ్రామంలో బుగత అందరూ ఆయ నింటికెళ్లి ఆయన సర్కారు డబ్బు తినేసినట్టూ, ఆయన్ని శిక్షించడానికి ప్రభువులే స్వయంగా వచ్చి నట్టూ చెప్పారట. అందుమీద ఆయన మతిపోయి, అందంట ఎటో పోయినారట.

మహా : (రౌద్రమూర్తులైపోతూ, లేచి నిలబడి, ఖడ్గంమీద చెయ్యి వేసి) దివాంజీ ! వింటున్నారా ? ఇందుకు బాధ్యులైన వాళ్ల నందరినీ సర్వ నాశనం చేస్తాం ! మా మాటకి తిరుగు లేదు ! .... ఏమిరా, లక్ష్మణ కవిగారి కుమార్లైనా కనబడ్డారా ?

రాజసే : వా ళ్లిద్దరూ తండ్రిని వెతుక్కుంటూ తిరుగు తున్నారట. లక్ష్మన్నగారు ఏ చెర్లోనో, ఏట్లోనోపడి చచ్చిపోయి ఉంటారని ఆబాలగోపాలం వూరంతా ఒకటే గోల.

మహా : (దుఃఖంగా) హరిహరీ ! ఎంతపనైపోయింది ! (తొంద రగా) ఒరే—ఎవరక్కడ ? గుర్రాలు సిద్ధం చెయ్యండి! జల్దీ—జల్దీ ! (గ్రామ చావిట్లోంచి బయటికి నడుస్తారు.) దివాంజీ ! మేము తిరిగి వచ్చిందాకా ఇక్కడే ఉండండి. అగ్రహారీకు అందరూ ఒక్కడూ బయటికి కదల కూడదు—జాగ్రత్త !

(తొందరగా బయటికు నడుస్తారు. తురుపులు వెనువెంటనే నడుస్తారు. కొద్ది క్షణాల్లో డెక్కల చప్పుడు.)

తెర

5. స్థలం—అడవి.

సమయం—మధ్యాహ్నం.

(ఆకాశం మేఘావృతమై ఉంటుంది. కనుచూపు మేర ప్రదేశమంతా ముళ్ల డొంకలతో, మధ్య మధ్య పాలచెట్లు, ఇప్ప, జొరుమామిడి, అంకుడు, ఇరిడి కొండగోగు చెట్లతో, చిక్కగా అల్లుకొన్న అడివి తీగలతో అభేద్యంగా కనబడుతుంది. మేకల మందలు, అడవి పందుల గుంపులు నడచిన కాలిత్రోవలు డొంకల లోపల అస్పష్టంగా కనబడుతూ ఉంటవి. డొంకల మీదా, చెట్ల కొమ్మలలోనూ ఎగురుతున్న పక్షుల కిలకిలారవం నిర్విరామంగా వినపడుతూ ఉంటుంది. లక్ష్మణకవి రామనామం జపం చేస్తూ కుంటుకుంటూ చేతులతో ముళ్ల డొంకలూ, తీగెలూ ప్రక్కకి నెట్టడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు. ముఖమంతా పీకుకుపోయి ఉంటుంది. శరీరమంతా ముళ్లకి చీరుకుపోయి ఉంటుంది. పైమీద బట్ట ఉండదు. కట్టుకున్న నీరుకావి ధోవతి ముళ్ళు తగిలి చిరిగిపోయి ఉంటుంది.)

లక్ష్మ : ఇస్ స్ ! రామచంద్రా ! మళ్లీ అరికాల్లో ముల్లు గుచ్చుకుంది. కాలు నేల మోపలేకుండా ఉన్నాను. కాళ్ల నిండా ముళ్లే. వొళ్లంతా యిదివరకే చీరుకుపోయింది. ప్రాణాలు వదలడానికి నేను సిద్ధమే—నన్ను మాత్రం ప్రాణాలు వదలవు. కోనేట్లో దూకుదా మనుకుంటే రేవులనిండా స్త్రీలే. నే నెవ్వరినీ ఎరుగను గాని న న్నందరూ ఎరుగుదురు. ఏట్లో పడి ప్రాణత్యాగం చేతామనుకున్నాను. ఏట్లోనూ గట్ల నిండా జనం—జనం!—ప్రతి మనిషీ పలకరించడం, దండం పెట్టడం, ఎక్కడికని అడగడం ! కాలాతీతమై పోతూంది. గత్యంతరం తోచక అడవితోవ పట్టాను. ఈ అడవి నెలాగో దాటిపోతే—కొండ చేరుకొని, కొండమీది కెక్కి, కిందికి దొర్లితేపో .... (నడవడానికి ప్రయత్నిస్తూ) రామరామా ! అడుగు ముందుకు వెయ్యలేకుండా ఉన్నాను—ఈ అడవి దాటి కొండ చేరుకొనడ మెలాగు ? కొండ ఎక్కడ మెలాగు ? ...(కష్టంగా దేకిరి, ఒక రాతి పణుకుమీద కూర్చుంటూ.) ఇక్కడ .... ఇలాగు .... ప్రాయోపవేశం చేస్తే .... ప్రాణాలు పోక మానవు .... కృష్ణా ! వాసుదేవా !

* * *

మహా : (డొంకల మధ్య చిక్కుకొని, ఎటూ కదలలేక) ఎంత దట్టంగా ఉందీ, అడవీ ! గుర్రాన్ని ఎగువనే విడవడం మంచిదైంది. ఈ ముళ్లలో మనిషి నడవడానికే కష్టంగా ఉంది. ముందుకు వెళ్లడ మెలాగ ?

(దూరం నించి 'మహాప్రభూ ! మహారాజా ! అన్న కేకలు) అదుగో ! తురుపులే కాబోలు ! (బిగ్గరగా) ఆ— ఆ— ఇక్కడే—ఇక్కడే ఉన్నాం. ఈవైపు రండి.

(తురుపులు డొంకల్లోంచి మహారాజు సమీపంగా వస్తారు.)

1 వ తురుపు : ప్రభూ ! ఇంతదూరం ఒంటరిగా ముళ్ల మధ్యకి తమరు రావచ్చునా ?

2 వ తు : ప్రభువులకేం ప్రమాదం జరిగినా—ఈ అడివిలో ఏమేనా జరగవచ్చు.

మహా : మా మాటకేం—మీరేం చేసుకువచ్చారు ?

1 వ తు : వూరుచుట్టూ ఉన్న చెరువులూ, బావులూ గాలించేశాం. ఏటి ప్రాంతమంతా వెతికాం. ఎక్కడా లక్ష్మన్న గారి జాడ లేదు.

2 వ తు : అడవిలోంచి ఎండు పుల్లలు తెస్తున్న ఒక చాకలి మాత్రం—ఎవరో ఓ ముసలాయన అడివిలో తిరగడం చూశా నన్నాడు. ఆయన్ని వాడు పోల్చలేదట. వాడు చెప్పిన గుర్తులనుబట్టి మే మీ అడవిలోకి వచ్చాం. మా గుర్రాల అలికిడికి ప్రభువుల గుర్రం సకిలించింది. వెంటనే మే మక్కడికి వచ్చి, అక్కడే మా గుర్రాలూ కట్టేసి, ప్రభువులను వెతుక్కుంటూ ఇక్కడ కలిశాం.

మహా : చిత్రం ! మేమూ ఈ ప్రాంతానికే రావడం ఆశ్చర్యంగా ఉంది. ఇది నిజంగా దైవ ప్రేరేపణే ! .... ఈ ప్రాంతం వచ్చారేమో—లక్ష్మణ కవిగారిని బిగ్గరగా పిలవండి.

తురుపులు : (బిగ్గరగా) లక్ష్మన్నబాబూ ! లక్ష్మన్నగారూ (దూరంగా కొండలనించి వరుసగా లక్ష్మన్నగారూ! అన్న ప్రతిధ్వనులు వినబడుతవి.)

మహా : (ఒకవైపు పరీక్షగా చూస్తూ) అదుగో—అటు చూశారా—ఒక తుప్పమీద పక్షు లెగురుతూ గోలగా అరుస్తున్నాయి .... లోపలేదో జంతు వుండాలి ... అదుగో చూడండి—చూడండి. నక్క అదే తుప్పలోంచి బయటికి వస్తూ, వెనుదిరిగి పసి పడుతున్నది.

1 వ తు : చూస్తున్నామండి. తప్పకుండా లోపలేదో ఉంది.

2 వ తు : నేను చూసివస్తా నుండండి. (వెళతాడు).

మహా : లక్ష్మణకవి దుస్థితి తలుచుకుంటే మనస్సు వికలమై పోతున్నది. దైవనిర్ణయ మెలాగుందో !

2 వ తు : (తిరిగివస్తూ) డొంకల మధ్య ఏదో అస్పష్టంగా కనబడుతూంది ప్రభూ.

మహా : పదండి వెళ్లి చూదాం. (ముగ్గురూ నడుస్తారు.)

మహా : (వంగిచూస్తూ) నిజమే. అక్కడేదో ఉంది. కాని— ఈ ముళ్ల డొంకలలోంచి అక్కడికి వెళ్లడ మెలాగు ?

తురుపులు : ముళ్లు నరికి తోవ చేస్తా ముండండి. (ఇద్దరు తురుపులూ ఖడ్గాలతో ముళ్లు నరికి తోవ చేస్తారు. ముగ్గురూ శ్రమతో ఆ స్థలం చేరుకొని లక్ష్మణ

కవిని చూస్తారు. లక్ష్మణకవి రాతి పణుకుమీద పద్మాసనంవేసి కూర్చొని ధ్యాన నిమగ్నుడై ఉంటాడు)

మహా : ష్‌ష్‌ష్ ! చప్పుడు చెయ్యకండి .... ఇక్కడే కొద్ది క్షణాలు కూర్చొని వారిని కనిపెడదాం.

(ముగ్గురూ ఒక ప్రక్కగా కూర్చుంటారు.)

లక్ష్మ : (కళ్లు మూసుకొనే—ధ్యానస్థితిలో)

శా. రామో రక్షతి రామమాత్మని భజే రామేణ రక్షోవ్యస్మ గ్రహం
రామాయాస్తు మదీయ వందనశతం రామాన్న కించిత్పరం
రామస్యాంఘ్రి యుగంస్మరామి సతతం రామే విలీయేతతో
రామత్రాహి యటంచు నమ్మితిఁ జుమీ రామా రమానాయకా !

మహా : (కళ్లలో చిమ్ముతున్న నీరు తుడుచుకుంటూ, గద్గద స్వరంతో) ఆహాహా ! ప్రాణాలు పోతున్నా ఆ ముఖం లోంచి కవితామృతధార పైకి పెల్లుబుకుతునే ఉంది ! (ఆవేశంగా) అభయం ! .... లక్ష్మణకవీ ! మేము మహా రాజులం పిలుస్తున్నాం. కళ్లు తెరవండి. మీకు అభయ మిస్తున్నాం. ఇటు చూడండి.

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

మహా : (బిగ్గరగా) మీకు పూర్తిగా అభయ మిస్తున్నాం— లక్ష్మణకవీ ! కళ్లుతెరిచి ఇటు చూడండి.

(లక్ష్మణకవి శరీరమంతా ఒక్కసారిగా కంపిస్తుంది. క్రమంగా అతడు కళ్లుతెరిచి మహారాజును చూస్తాడు.)

మహా : (ముందుకు వస్తూ) లక్ష్మణకవీ ! మీరు నిర్దోషులు. మీ కభయ మిస్తున్నాం. ధైర్యం వహించండి.

లక్ష్మ : (ఆశ్చర్యంగా, కళ్లు పెద్దవిచేసి చూస్తూ) మహారాజా ! మీరా ! నాకోసం ఇక్కడికి వచ్చారా !

మహా : మాతో చెప్పకుండా మీ రిలాగు చెయ్యడం ధర్మమేనా ?

లక్ష్మ : నేను దోషినని నలుగురూ అన్నారు. మీ ముఖం చూడ లేకపోయాను. మా పవిత్ర వంశానికి కళంకం తేవడంకంటె ప్రాణత్యాగమే మేలని నిశ్చయించాను.

మహా : మే ముండగా మీ కెందుకు భయం ? మీరు పూర్తిగా నిర్దోషులని మాకు ముందే తెలిసిపోయింది. మీతో కవితా వ్యాసంగం కోసం మీవూరు వచ్చాం గాని మరే కారణంచేతా కాదు. మీరు కేవలం అమాయకులు. రాజ రికంలో జరిగే కుట్రలూ, కుతంత్రాలూ మీకు తెలియవు. మేము మీకిచ్చిన హోదాకు మత్సరపడి కొందరు మీపై కుట్ర పన్నారు. మీ అగ్రహారికులు కూడా ఇందులో కలిశారు. మే మిప్పుడే, మీ ఎదుటే విచారణచేసి దోషులను శిక్షిస్తాం ....

ఒరే—ఒకడు తక్షణం గుర్రంమీద వెళ్లి సవారీ, బోయీలను వెంటనే తోడ్కుకురా. (తురుపు వెళతాడు.)

లక్ష్మ : (ఆవేశంతో మహారాజు చేతులు పట్టుకుంటూ) ప్రభూ ! మీరు మానవమాత్రులు కారు—మహా రాజులూ కారు ! దయ, క్షమ, కరుణ వంటి సద్గుణా లన్నీ కలిసి మీరూపంగా మూర్తిభవించినవి. మీరు దైవాంశసంభూతులు — సాక్షాద్దైవస్వరూపులని నా పూర్తి విశ్వాసం. నా వందన సహస్రం స్వీకరించండి

మహా : వద్దు వద్దు లక్ష్మణకవీ, మీరు మహానుభావులు—మమ్మా శీర్వదించండి, అంతే చాలు. మీ విషయంలో మా విధ్యుక్త ధర్మం నెరవేర్చాం గాని అధికం చెయ్యలేదు .... మీరు మాకు నిత్యమూ సన్నిహితులై ఉంటారనీ, మీకు తగిన గౌరవ మివ్వాలనీ ఈ ఉద్యోగ మిచ్చాం. మీ కవి హృదయం మేము గ్రహించలేక పోయాం. మేము చేసినది పొరపాటే. ఈ ఉద్యోగం మీకు మేలుకు బదులు కీడే చేసింది. 'కమలములు నీటబాసిన కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిని' నాటి మీ ఆప్తులే నేడు మీకు శత్రువులై పోయారు. మిమ్మును రాచ కార్యాలలో ఇరికించడం, స్వేచ్ఛగా కొండ కోనలలో కూసే గండు కోయిలను బంగరు పంజరంలో బంధించడమే. మీరింక స్వేచ్ఛగా, నిశ్చింతగా తపస్సు చేసుకుంటూ, కవిత నారాధిస్తూ జీవితశేషం గడపండి. మీ పెద్దకుమారుడు రామశాస్త్రి ఈ ఉద్యోగం స్వీకరిస్తాడు. మీకు మా అండదండలు ఎప్పుడూ ఉంటూనే ఉంటవి.

(సవారీ బోయీల అరుపులు వినబడుతవి.)

అదుగో ! సవారీ వస్తూంది. మనమింక లేద్దాం. అందరూ లేస్తారు.

తెర

# విశ్వగుణాదర్శం నాటి సంఘస్థితి

శ్రీ పి. వి. రమణ

సంఘ ప్రతిఫలనమే కావ్యపరమార్థమను దృష్టి ప్రబలిన ఈ దినముల దృష్టిలో విశ్వగుణాదర్శ మొక గొప్ప కావ్యమని చెప్పవచ్చును. సంఘ గుణదోషముల సమ్యగ్వ్యక్తీకరణమే ఏతద్గ్రంథరచనా సముద్దేశము. నాటి సంఘ వ్యవస్థకు యాకృతి కల్పించుటే దీని పరమ లక్ష్యము. అవ్యవస్థపాలై పోవుచున్న సంఘమును గూర్చిన ఆరాటము గ్రంథ మంతట కన్పట్టును. ప్రాచీన సాంఘిక వ్యవస్థయందు నడుమంత్రముగ చేరిన దురాచారముల నిర్మూలనకు అనేక మార్గముల సూచించినాడు కవి. ఆ మార్గముల సామంజస్య మెట్లున్నను సంఘ సంస్కరణమునకై అతడు పడిన బాధ, తదనుగుణమైన నిశితవిమర్శ గ్రంథ ప్రాముఖ్యము తెలియజేయుచున్నవి.

సంఘదోషోద్ఘాటన పారీణుడైన కృశానుడు విశ్వగుణ గ్రహణ కౌతుకియైన విశ్వావసువు అను గంధర్వుల పేరిట నాడు సంఘమున పాదుకొనిఉన్న దురాచారములను విమర్శించి, సకలజనుల స్వభావములను వర్ణించినాడు (సకల జనానా మిర యంతే స్వభావాన్). ఈవిశ్వగుణాదర్శకావ్యమున విశ్వమన్న భారత దేశమని పరిమితార్థము. వేంకటాధ్వరి కవి 17 వ శతాబ్దివాడు. వాసము కాంచీపట్టణము. కవి దాక్షిణాత్యు డగుటనేమో ప్రత్యక్ష పరిజ్ఞానము గల తమిళదేశమును ప్రత్యేకముగ విపులముగ వర్ణించినాడు. నిశిత పరశ్వథప్రాయమైన ఆ సంఘ విమర్శ ఆతని స్వతంత్ర ప్రకృతిని వ్యక్తీకరించును. ఆ విమర్శ ధోరణిని పరామర్శించుట కాక తన్మూలమైన సంఘస్థితి తెలుసు కొనుట ప్రస్తుతాంశము. సంఘపురోభివృద్ధికి చీడ పురుగులైన వారి దుర్వర్తనమును దూషించినాడు కవి. వివిధ వర్ణములవారి విపరీతాచారములు, తురకలు, హూణులు, సన్యాసులు, మత గురువులు, పాషండులు, జ్యోతిషకులు, వైద్యులు మొదలైనవారి వంచనమును ఖండించినాడు.

నాడు నేడు సంఘమున విభిన్న దృక్పథము లేర్పడుటకు కారణభూతమైనది వర్ణవ్యవస్థ. ఈ కవి వర్ణ వ్యవస్థను నిరసించుటకు నడుము కట్టలేదు గాని వివిధవర్ణములవారి దురాచారముల విమర్శించుటకు జంకలేదు. ఆ దురాచారములే సంఘ దుస్థితికి కారణములని కాబోలాతని అభిప్రాయము. ముఖ్యముగ నాతని విమర్శకు లక్ష్యభూతమైన కులము బ్రాహ్మణ కులము. అది బ్రాహ్మణ నిరసనము గాదు. వారి పురోభివృద్ధికి మార్గదర్శకము. కాశీ నగరవాసులైన బ్రాహ్మణులు కొందరు వారి బ్రాహ్మణ్యము వదలి ఆయుధములచే జీవించుచున్నారట. బ్రాహ్మణులకు రక్ష లేకపోవుటే దీనికి కారణము. కాలానుగతమైన విజ్ఞానార్జన విడిచి స్వజీవికా సంపాదనార్థము వారు ఆయుధముల నాశ్రయించిరి. సంస్కార ప్రియులు కొందరు శూద్రతురుష్కులతోను, కడజాతి వారితోను సంపర్కము కలిగి యుండిరట !

"శస్త్రైర్జీవతి శాస్త్రముజ్ఝతి పరం శూద్రాహృతై రమ్బుభి:
స్నాత్వాచామతి దేవతా స్స్నపయతి స్వైరం పచ త్యోదనమ్
ఉచ్ఛిష్టా న్న బిభేతి యాతి యవనై రుచ్చావచై స్సంగతిం
మాతర్జాహ్నవికటాగతా నగణయన్మార్గాన్ముహుర్గాహతే."
—శ్లో : 121

మరియు

" .... మ్లేచ్ఛముఖాశుచీన్ స్పృశతిచ స్పృష్ట్వాపి న స్నాత్యహో
నస్నాంతో పృథ భుంక్త ఏష చపలో భుక్త్వాపి న వ్రీడతే."
—శ్లో : 122.

ఇక మహారాష్ట్ర దేశవాసులైన బ్రాహ్మణులు కొందరు ఉపనయన వివాహాదులను కేవలము ఉత్సవమునకై చేసికొనుచుండిరి. వారు వేద పాఠములకు స్వస్తిచెప్పి మహమ్మదీయుల విద్య నభ్యసించుచున్నారట.

"ఉపనయన వివాహో వుత్స వైక ప్రధానౌ
కలి విభవత ఏషాం కాలభేదానభిజ్ఞా
విజహతి న కదాచి ద్వేదపాఠైక యోగ్యే
వయసి చ యవనానీ వచనాభ్యాస మేతే."
—శ్లో : 178.

కాయస్థుడైన బ్రాహ్మణుడు కడుపుకొరకు జీవితమును అమ్ముకొనుచు దొంగలెక్కలు చూపి యజమానుని ధనమును దొంగిలించుచున్నాడట.

"కుక్షే: పూర్త్యై యవన నృపతేర్భృత్య కృత్యాణి కర్తుమ్
విక్రీణీతే వపురపి నిజం వేతనై రేత దాస్తామ్
విప్రోభూత్వాప్యహహ ! గణనా నైపుణ్యే ర్వంచయిత్వా
స్వర్ణస్తేయం రచయతి పున: స్వామినాం పోషకాణామ్.
—శ్లో : 180.

ఆ దేశమునందలి క్షత్రియాదులు లంపటులై పరుల ధనమును హరించుచు బ్రాహ్మణులను కొట్టి తిరుగుచు పొట్ట బోసికొనుచున్నారని వర్ణించినాడు. మరికొంతమంది నానాజాతివారేకమై వైరాగ్యము నభినయించుచు ప్రజలను మోసపుచ్చుచు వర్ణాశ్రమధర్మముల త్యజించి పొట్ట నింపు కొను చున్నారట.

'నానాజాతి భవాఃఇమే కలిబలా దేకీభవంతో నరాః
వైరాగ్యాభినయం చిరాద్విదధతో వర్ణాశ్రమత్యాగినః
నిర్ధూతానఘ వైదిక ప్రణమనా నిష్కించనా వంచనా
దీక్షాదిక్షు విదిక్షు కుక్షిభృతయే భిక్షాటనం కుర్వతే.'
—శ్లో : 199.

ఏ కులమువానిచే నైనను భగవంతునకు నివేదితమైన యన్నమును భక్తితో భుజించిన మహాపాపములు పోవునని ఒక నమ్మక మున్నది జగన్నాథమున. అట కులవివక్షతతో ప్రసక్తి లేదు. భక్తిప్రధానము, వైష్ణవ క్షేత్రము కదా మరి. ఇది చాలకాలమునుండీ ఆచారములో నున్న నమ్మకము. ఘూర్జర దేశమును వర్ణించుచు అక్కడ పురుషులు దేశాంతరములలో రత్నాలవ్యాపార మెక్కువగ చేయుచున్నారని తెలిపినాడు. అక్కడ స్త్రీలు కూడ అన్యాదృశ సౌందర్యవతులట.

## ఆంధ్రదేశ స్థితి

ఇక ఆంధ్రదేశ పరిస్థితి. దేశము ఛిన్నాభిన్నమై, సరియైన పాలకుడు లేక నియమరహితముగ సాగుచుండిన రోజులవి. అటు తురకల ధాటి, ఇటు ఐకమత్యము సాధింపగల సమ్రాట్టు లేకపోవుటవలన ప్రజారథ మొక తెన్నున బోలేదు. అతః పూర్వ సంఘ పరిస్థితికంటె విప్లవాత్మక విపరీతాచారములు కొన్ని పొడసూపినవి. శూద్రుని యాజమాన్యమున బ్రాహ్మణుడు భృత్యుడై గణకవృత్తి చేయుచున్నాడట. అట్టి కరణము పనిచేయునియోగుల నబ్రాహ్మణులనుగ పరిగణించినాడు. (గ్రామాయవ్యయలేఖినేన నయతాం కాలాన శేషానహో పారంపర్యత ఈదృశామిహ నృణాం బ్రాహ్మణ్యమన్యాదృశమ్—179). ఇక వేదాధ్యాయి ఒకడున్నను ఆతడు (అమత్ర ప్రకరణకరణో —మురికి పాత్రలు తోమెడు పని యందు). ఏ వంట పనియందో నియుక్తుడగు చుండెనట. నేడును తదనుయాయులు వంటలుజేసి జీవితము గడపువారు గలరు. వారు యజ్ఞములను జేయరు. వేదవచనములను చదువరు. కృష్ణా గోదావరీ మధ్య దేశవాసులు మాత్రము యజ్ఞయాగాదులు చేయుచుండిరట. ఇక్కడి రాజులు దాతృత్వమున పేరుపడిరి. హిందువుల పతనము మహమ్మదీయుల ప్రాబల్యము ఎక్కువగు చుండిన కాల మది. వారి అశ్వధాటికి ఉత్తర హిందూదేశము బీటలు వారినది. ఆ దాడికి శిథిలమైన గడ్డలలో ఆంధ్ర మొక్కటి. ఉన్నత శిల్పకళాఖండములు కరిగి కన్నీరు కార్చినవి. నాటి గ్రంథములలో నిది స్పష్టముగ కన్పట్టును. ఆసేతు హిమాచల పర్యంతము వా రాక్రమించి అనేక ఘోరములను చేయుచుండిరి. (ఆక్రాన్తాసు వసుంధరాసు యవనై రాసేతు హైమాచలమ్—131) వారి విద్యలనే ఈ దేశమువారికి కరపుచు వారి పద్ధతులను వీరి నెత్తిపై రుద్దుచు ప్రభుత సాగింపజొచ్చిరి. వారికి భయపడి వారి విద్యనే అభ్యసించుచు వారి కనుకూలురై అనేకులు హిందువులు వంతబాడిరి. (యేకాయస్థ జనాశ్చ యే నృపసుతా యే చ ద్విజాః శస్త్రిణః, తేయత్నా దనుసృత్య నిర్దయతయా శుష్కాంస్తురుష్కాధిపాన్ — 129), కుక్షేః పూర్త్యై యవన నృపతే ర్భృత్య కృత్యాణి కర్తుమ్, విక్రీణీతే వపురపి నిజం వేతనై రేత దాస్తామ్ విప్రోభూత్యాఽప్యహహ! —180.)

అప్పటికే విజయనగరరాజ్యము పతనమైనది. ఆ పతనముతో చెలరేగిన మహమ్మదీయ తురంగముల స్వైర విహారముల నాప శక్తిగల నరపతులు కరవైరి. ఆలయముల ధ్వంసము చేయుచు, అనేక దేశముల పాడుచేయుచు, పర స్త్రీల నపహరించుచు వర్ణాశ్రమధర్మములను నిరసించి నిర్మూలించుచు, కల్లు త్రాపుచు విచ్చలవిడిగ తిరుగుచుండిరట తురకలు.

అవనావలీత పవనాశ్వ శోభినో
భవనాగశాయి భవనావమర్దినః
సవనాది ధర్మ లవనాయ దీక్షితా
యవనా శ్చరంతి భువనాతి భీషణాః."
—శ్లో : 223.

వా రీ దేశవాసులకన్న బలవంతులు. వారి ఖడ్గ నైపుణ్యము, యుద్ధతంత్రము, ఐక్యము, చొరవ మనవారి యందు తక్కువగుటయే ఓటమికి కారణము. ఒక్క తురుష్కుడు గుర్రము నెక్కి ఖడ్గము త్రిప్పుచు వచ్చిన ముందరి భటు లందరు భయభ్రాంతులై పారెడివారట!

"యుద్ధాయ ప్రమిలంతు హంత! పటవో యోధాః
స్పృహాసాధికా
యద్యేకోఽపి బలాత్తురుష్కయవనే ష్వారూఢఘోటోభటః
నిస్త్రింశం పరికంపయన్ స్వకటకా న్నిష్క్రామతి క్రోధత
స్సర్వేతే కృపణాస్త్వరణా న్య శరణాః ఖాదంతి సీదంతి చ."
—శ్లో : 225.

వేంకటాధ్వరి కాలము నాటికే పాశ్చాత్య ప్రాబల్యమధికము కాజొచ్చినది దక్షిణ దేశమున. ధనసంపాద నైక దృష్టితో వ్యాపారులై ఈ దేశమున అడుగిడి ఐశ్వర్యవంతులైనవారు హూణులు. వారిలో మద్రాసు ఆంగ్లేయుల కేంద్ర స్థానము. క్రీ. శ. 1639 ప్రాంతమున వా రక్కడ కోట కట్టుకొని వ్యాపారము నభివృద్ధి చేసికొనసాగిరి. వ్యాపారాభివృద్ధితోపాటు రాజ్యకాంక్ష మొలకెత్తి తదనుగుణముగ బలమును చేకూర్చుకొనుటకు పాటుబడుచుండిరి. దానికి ప్రజలనుండి సహకారము సానుభూతి యవసరము. వారి యాదరాభిమానములను చూరగొనవలయునన్న వారియెడ మంచిగా ప్రవర్తింపవలెను. కనుకనే వారు—

'ప్రసహ్య నహరంత్యమీ, పరధనాఘ మన్యాయతో
వదంతి నమృషావచో, విరచయంతి వస్త్వద్భుతమ్
యథావిధి కృతాగసాం విదధతి స్వయం దండనమ్
గుణా నవగుణాకరేష్వపి గృహాణ హూణేష్వమూన్.
—శ్లో : 400.

ఇతరుల ధనమును నన్యాయముగ హరింపక, అబద్ధము లాడక, అద్భుత వస్తువుల విక్రయించుచు శిక్షణీయుల శిక్షించుచుండిరట. ఇటు ప్రజల సానుభూతిని పొందు చున్నప్పటికిని వారి ప్రాబల్యమును సూచించుచున్నాడు కవి.

'హూణాః కరుణాహీనా స్తృణవద్బ్రాహ్మణగణం న
గణయంతి
తేషాందోషః పాపేవాహం యేనాచరంతి శౌచమపి.

—శ్లో : 396.

హూణులు కరుణాహీనులై ఉండిరి. ఆచారపరులైన బ్రాహ్మణులను తృణముగ చూచుచుండిరి. నేడు కుల ద్వేషము లీ స్థాయినందు కొనుటకు పుణ్యాత్ములు హూణుల స్వార్థమే కారణము. సంఘమున భేదబుద్ధి పురికొల్పిన కార్య సాధనము సులువగును గదా! అల్పసంఖ్యాకులైన బ్రాహ్మణ నిరసనతో చూచిన వారి కంకిరాలదు. అది వారి ధీమా. వారు కుత్సితు లనినాడు కవి. వారు శౌచము కూడ చేయరు. "శౌచత్యాగిషు హూణకాదిషు ధనం" అట్టి శౌచము త్యజించిన హూణులను సంపన్నుల జేసిన హతవిధిని తలచినాడు.

అటు ఉత్తర భారతమున, ఆంధ్రదేశమున తురకల దుండగము లెట్లు దేశము నట్టుడికించిన ట్లుడికించినవో ఇటు దక్షిణదేశమున మతగురువుల వంచనము ప్రజల పీడించి పిప్పి చేసినది. మతము పేరు చెప్పి మాయచేసి మర్మ మెరుగని ప్రజలవలన ధనము సంపాదించి కుక్షింభరులైన మన మతగురువుల వాలకములను వర్ణించినాడు కవి.

"గాయత్రీం సహసా జహద్గపవలీం యజ్ఞోపవీతంత్యజన్
ముంచన్ కించ శిఖాంవిరక్త ఇవయస్సంప్రాప్తతుర్యాశ్రమః
ఆరూఢ శ్చతురంగయాన మథరాహో హాహంత! దేశాంతరే
ష్వర్థానా ముపసంగ్రహాయ విచరత్యేషో వ్య మీషాంగురుః.

—శ్లో : 247.

ఇది మాధ్వగురువుగారి సద్వర్తనము. విరాగివలె గాయత్రిని శిఖాయజ్ఞోపవీతములను విడిచి పల్లకి నెక్కి ద్రవ్య సంపాదన మునకై దేశములు తిరుగుచున్నాడట. మాధ్వగురువుల ప్రాబల్యము కన్నడ దేశమున నెక్కువ. అక్కడ గృహస్థులకంటె సన్యాసులే భోగము ననుభవించుచున్నారట.

'భిక్షాం కష్ట మటంతి కుక్షిభృతయే పాదౌ గతైః క్లేశయుం
త్యాచ్ఛన్నాశ్ఛిదితైః పటైశ్చ గృహిణో జీర్ణే గృహే శేరతే
రాజత్సూక్ష్మపటాః ప్రశస్త శిబికా రూఢోగృహిభ్యో న్నదా
గ్రావన్యూహ దృఢో మతేస్థితి భుజో ధన్యాహి సన్యాసినః'.

గృహస్థుల ఉదర పోషణకై బిచ్చమెత్తుటకు కష్టముతో తిరుగుచు, చినిగిన గుడ్డలు కట్టుకొని శిథిలమైన ఇండ్లలో ఉన్నారట గాని, సన్యాసులు సన్నని వస్త్రములు కట్టుకొని పల్లకుల నెక్కి తిరుగుచు, చక్కని రాతి కట్టడపు గట్టి మఠములలో నివసించుచున్నారట. ఈ మాధ్వులు వేదముల చదువుట మాని శాస్త్రములను చదువుచు, నిష్ఫలమైన పశువధహింస యని ప్రత్యామ్నాయముగ పిష్ట పశువుతో (పిండితో చేసిన పశువు) యాగాదుల చేయుచుండిరి. కొంతమంది మాధ్వగురువులు మంచివారు లేకపోలేదు. కేవలము భగవంతునియందే దృష్టి నిలిపి వేదశాస్త్ర విచారముతో తమ యావజ్జీవితమును గడుపుకొనుచున్నారట. కొంతమంది సన్యాసులు.

"సన్యాసాశ్రమ మాశ్రితోపి సకల వ్యాపారలోపాత్మకవ్
కైంకర్యం చపలో హరేరపదిశన్ ద్రాగాజధానీం విశన్
అర్థానార్జయతి శ్రితోఽర్జిత వశో న్నృష్టాన్న మశ్నాత్య సౌ
కో మృష్యేదిహ రామరామ తదిదం కష్టం యతే శ్చేష్టితమ్."

—శ్లో : 800

చపలతచే భగవంతుని పేరుపెట్టి పల్లెపట్టులందు ధనము సేకరించుకొనుచున్నాడట సన్యాసి. మఠాధిపతి మృష్టాన్నమును భుజించుచున్నాడట. యతిని చూచిన మాత్రమున సచేలస్నానము, అతని అన్నము తిన్నచో చాంద్రాయణవ్రతము చేయుట వైష్ణవులకు విధింపబడిన ధర్మములు. అట్లుకాక ఆ కాలముననే యతిని చూచిన, అతని యన్నమును తినిన మోక్షప్రదమని పండితులు సైతము భ్రమపడుచున్నారనినాడు కవి. మాధ్వగురువు శిఖాయజ్ఞోపవీతములను వదలి సన్యసించును. అతని పూజించి అతనిచేత ప్రసాదమును భుజించు పండితులను విమర్శించుట ఇది. మాధ్వప్రచారము కన్నడమున, రామానుజీయుల ప్రచారను తమిళదేశమున నధికము. వారి ప్రాబల్యమును అట నెక్కువగ నుండినది.

ఇక రామానుజీయుల మాట :

శ్రీ రామానుజ దర్శనైకరసితః శ్శిష్టః ప్రక్ళప్తైర్గృహైః
పూర్ణానాం విదుషాం మతాంతరజుషాం పంక్తౌ నభుంక్తేక్వచిత్
హోహంతౌదన మంతత శ్శుచితమం తద్దృష్ట్వ మాశుత్యజ
త్యాస్తాం తత్స్వమత స్థితైరపి సమం ప్రాయేణనాశ్నాత్యసౌ

—శ్లో : 331

వీరు మతాంతరుల పంక్తియందు భుజింపరు. వారు చూచిన యన్నము శుచితమమైనను విడుతురు. ఒక్కొక్కప్పుడు తమ వైష్ణవమతములోని వారితో కూడ భుజింపరట. వారికి మతాంతరుల పంక్తిభోజనము నిషిద్ధముగాని ఇతర కులముల వారితో భుజించుట కాక్షేపణ లేదు. కాని వారు విష్ణుభక్తులయి యుండవలయును. ఇట్టి సంస్కార దృష్టి ప్రాచీన కాలమున వైష్ణవులయం దధికము. పుట్టుకచే నెట్టికులమైనను విష్ణుభక్తి పరిపూరితుడైనచో సంపర్కమునకు యోగ్యుడే అని వారి నమ్మకము. పుట్టుకచే విభిన్నకులములవారే కాక విభిన్న మతముల వారును వైష్ణవులై ఒక గురువునకు శిష్యులై సంపర్కము గలిగియుండినవా రనేకులు కలరు. (వ్యతిహతా వర్ణాశ్రమ

# విశ్వగుణాదర్శం నాటి సంఘస్థితి

ప్రక్రియా—338. ఉజ్ఝింత్యసత్సంగతిం—344 కేవలము భక్తియే ప్రధానము (భక్తిర్భాగవతీతి స్పృహమమూ నర్చంతి. —359).

వీరు పంచయజ్ఞముల విడిచి, అజ్ఞులను ద్రవిడ వేదములతో భ్రమింపజేయుచు కామ్యకర్మలని జ్యోతిష్టో మాదియజ్ఞములను దూషించి, హరికైనను పలుమారు నమస్కరింపక, సన్యాసి నైనను గృహస్థునకు నమస్కరింప జేయుచు శ్రాద్ధ కర్మలను వదలి వేదోక్తముకాని కర్మల తోనే తిరుగుచుండిరట. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్న స్మృతివచనమును చక్కగ ఆచరణలో పెట్టుచుండిరట. త్రైలోక్యమాతయైన లక్ష్మియొక్క వైభవమునే (స్వాతంత్ర్యరూపమైన వైభవమని అనువాదకులు) ఖండించుచుండి రట. తిరువారాధన మప్పుడు ఘంట వాయించుట, తమ మత స్థుల గోష్ఠియందే తమ పాదతీర్థమును పానముచేయుచు, తాము చేసిన దోషముల ఆ భగవంతుడే యనుభవించునని లోకమునే విశ్వసపరుచుచున్నారట. లేనిపోని యైతిహ్యము లను చెప్పి తమయందు లేని వినయమును ప్రదర్శించి తమ మతమున జేర్చుకొనుచున్నారట. ఇక కొందరు గురువాత్త ములు ధనమిచ్చిన ప్రతికన్యయ్యకు చక్రాంకనములు వేయుచు శరీరపోషణము సుష్ఠుగా జరుపుకొనుచుండిరి. జార చోర కిరాతులను, దేశధ్వంసకులైన అధమ రాజులను శిష్యులనుగా జేసికొని వారితోడి సంపర్కమునైన కోరుచున్నా రట గాని బ్రహ్మజ్ఞులైన వైదికులతోనైన భుజించుట లేదట. అట్టి సంస్కారప్రియత నాటి రామానుజులది. జితేంద్రియులైన జ్ఞానులు కూడ, ఆచారదూరులై ధనాశ కలిగి వేదమార్గము తెలియక మదనవికారముచే కలుషిత మనస్కులైన ఆచార్యులకు శిష్యులగుచున్నారని వాపోయి నాడు. ఇక ఆ గురువులును వినయవిదూరులైన శిష్యుల ఎడల ఆదరము కనపరచి వారి యిష్టములను తీర్చుచు బలాత్కారముగ శిష్యకోటిలో చేర్చుకొనుచున్నారట. నాడు గురువులకు బుద్ధిబలముకంటె శిష్యబలమే హంగు నిచ్చి నది. తత్సాధనమందే వారి శక్తి వినియుక్త మగుచుండెను. గురువు ఎంత శుంఠ యైనను పదిమంది శిష్యులు ప్రక్క జేరి వంత పలికిన అతడు మహావిద్వాంసుడు. అతః పూర్వము నకు అప్పటికి శ్రీవైష్ణవోపాధ్యాయికలోని తారతమ్యమును జూడుడు.

"సమ్యక్శిష్యజనం పరీక్ష్య బహుభి స్సంపత్సరై రుత్సుకం
శుశ్రూషాభిరుపాదిశన్ ప్రముదితాః పూర్వేభువీత్రిశుతం
ఆరాధ్యేష్ట సమర్పకై రవినతా నాచార్య ఏవాదరాత్
అబ్దై ర్భూరితమైః ప్రసహ్య లభతే శిష్యాన్ క్రమేణాధునా."

—శ్లో : 383.

ఇక గుడిలో పూజారి విషయము. శ్రీరంగక్షేత్ర ములో దేవున కారాధనము చేసి దేవతల కర్పించినట్టి యన్న మును ద్రవ్యాశచేత నమ్ముకొనుచున్నారట. ఇది నేడును అనేక దేవాలయములందు కన్పట్టు విశేషము.

శ్రీరంగమున దొంగభయ మెక్కువ. అని తెలిపినాడు.

చోళదేశ స్త్రీల వేషభాషలను, స్థితిగతులను చక్కగా వర్ణించినాడు. ఆ దేశపు స్త్రీలు రైకలు తొడుగుకొనరట. వారి కోడరికమును చూడుడు.

"నకేశేషు స్నేహో నచ నయనయో రంజనకథా
నవా వీటీ వక్త్రే నచ కుచతటే చందనరసః
నచాల్పో ప్యా కల్పో నచ సువచనం నైవ కుసుమం
స్నుషాత్వం పాపానాం ఫలముత బతాత్రత్యసుదృశామ్ ?"

—శ్లో : 725.

కేశములకు చమురు లేదు. కంటికి కాటుక లేదు. కుచములకు గంధము లేదు. నోటియందు తాంబూలము లేదు. కోడలని పేరేగాని కోర్కెన సరియైనది లేదట. వారికి కేవలము కోడ లగుటయే ఫలము. ఇప్పటికిని పల్లెపట్టులలో నిట్టివా రనేకు లున్నారు. నాగరకత ముందుకు పోయిన రోజు లివి. కష్టించి పనిచేయుచున్న ఇంటి కోడండ్ర దుస్సహ స్థితిని వర్ణించినాడు. నీటి కుండలు మోయుటచే భుజ ములు కాయలు కాచిపోయినవి. పేడత్రొక్కుటచేత కాళ్ళు మురికి యైనవి. పచ్చిక పెరుకుటచేత చేతులు మొద్దు బారినవి. వంట చేయుచుండుటవలన పొగ తగిలి కన్నులు నీరు కారుచున్నవారి స్థితి దుర్భరమని బాధపడినాడు.

అంసౌచే దుదకుంభభారకిణితౌ వంఘ్రీ పునర్గోమయ
స్థాయన్నాట్యమలీమసౌ కరతలం ఘాసచ్ఛిదా కర్కశమ్
పాకాగ్ని వ్యత్థిత ధూమమేలన గలద్బాష్పావిలే లోచనే
కష్టం రిక్త గృహిస్నుషాత్వ నరకః స్త్రీణా మహోదుస్సహః.

—శ్లో : 726.

చోళదేశ పూజారుల నిష్ఠను చక్కగ వర్ణించినాడు. వారస్త్రీకుచమర్దన ప్రవణములైన పవిత్రహస్తముల తోడనే దేవునకు అర్ఘ్యాదుల సమర్పించుచు, వారస్త్రీ ఉచ్ఛిష్ట మైన తమలమును నమిలిన నోటితోనే మంత్రములన్న చదువుచున్నారట. దైవకైంకర్యమునకై భక్తులు తెచ్చి యిచ్చిన ద్రవ్యము నపహరించుచున్నారట.

'వారస్త్రీ కుచమర్ద్దిభి ర్విరచయం త్యర్ఘ్యాదీ దానంకరై:
తద్వీటీరసవాసితై శ్చ వదనై ర్జల్పంతి మంత్రానమీ
ద్రవ్యం దేవలకా హరంత్యచకితా దేవస్య తత్పూజితా
స్వేతాస్వప్రతి మాసు హంత ? భవితా కిందేవతా సన్నిధిః.

—శ్లో : 741.

ఇంక స్త్రీసంపర్కమేగాని సంధ్యావందనము లేదు. కపట వచనములే గాని వేదాక్షర మొక్కటి యైన రాదు. దేవాన్న మును గూడ దొంగిలించెడివారట. ఆ పూజారులు శిష్యుల యిండ్లలో ఆచార ప్రకారము చేసిన యన్నమును భుజించుట కిష్టపడరట గాని సంస్కారహీనులు సమర్పించిన అన్నమును భయములేక తినుచున్నారట. ఇది కొందరి విషయము. మరి

కొందరు దేవునకు భయపడి బాగుపడినవారు, యజమాను లకు జంకి పరిశుద్ధులైనవారు గలరు.

తుదకు కొందరు సంఘద్రోహుల స్వభావోన్మీలనముతో కథ కంచికి పోయినది. విపరీత ప్రవర్తనులైన పాషండులను జగద్వంచనతో నారితేరిన కొందరు జ్యోతిషకులను, వైద్యులను నిరసించినాడు. సదాచారు లెప్పుడు ఈ విమర్శ కతీతులే.

పాషండులు :

దీర్ఘ వక్రనఖరాః ఖరకల్పా
ఉద్ధరంత ఇవ బాహుయుగం తే
శౌచమాచరితు మప్యసమర్థా
నీచబుద్ధిహృదయం భ్రమయంతి.

—శ్లో : 836.

గాడిదలవంటి వారైన పాషండులు గోళ్లను పెంచు కొని శౌచమును గూడ చేయక నీచులను భ్రమింపచేయు చున్నారట.

జ్యోతిషకులు ఏవో పాడి ముక్కలు రెండు నేర్చుకొని విద్వాంసులైనట్లు భావించి ధనవంతులకడ చేరి

'దీర్ఘాయుస్సుత సంపదాది కథనైర్దైవజ్ఞ పాశాఇమే
గేహంగేహ మనుప్రవిశ్య ధనినాం మోహం ముహుఃకుర్వతే

—శ్లో : 840.

అని చెప్పి ధనము గుంజుచున్నారట. తాము వ్రాసిన జాతకము ఫలించినది తమ ప్రజ్ఞ యనియు ఫలింపనిచో అది లగ్నమడిగిన వాని దోషమని చెప్పి ధన మార్జించు చున్నారట. ఇక వైద్యులు మృత్యువు భృత్యులవలె మిథ్యౌష ధము లిచ్చి వ్యాధిగ్రస్తుల వంచించి కడుపు నింపుకొను చున్నారట.

మిథ్యౌషధైర్ధ్వాంత ! మృషాకషాయై
రసహ్యలేహ్యై రయథార్థ తైలైః
వైద్యాఇమే వంచిత రుగ్ణవర్గైః
పిచండభాండం పరిపూరయంతి —శ్లో : 853.

ధనాశవలన '(శీనాథేస్తవనానురూపమై' న కవిత్వ మును నీచరాజుల పాల్చేయు కవులను, మాసగ్రాసము తీసికొని అధ్యయనము చేయించు వైదికులను విమర్శించినాడు. నాటి రాజసేవకులు.

'నక్తందివౌ నియతమశనం నాపి నిద్రావకాశః
నద్వౌ లోకావపి తనుభృతాం రాజసేవా పరాణామ్.

—శ్లో : 918.

ఆకలివేళకు అన్నము, నిద్రవేళ కవకాశము లేక కేవ లము రాజసేవయే ముఖ్యమని ఇహపరలోక సుఖదూరులగు చున్నారు. ఇతరులను కాపాడుటే పరమధర్మముగ పెద్దల కుప కృతి చేయుటకై తమ సుఖములను త్యజించుచున్నారట.

'అశుభపుషి కిలా వప్యప్రమత్తా స్వధర్మా
దనుదిన ముపకారా నాచరంతో బుధానామ్
బహుజన పరిపుష్టౌ బద్ధదీక్షాస్త ఏతే
తనుసుఖ మపి హిత్వా తన్వతే రాజసేవామ్.

—శ్లో : 920.

ఎన్నదగిన కవిత కరవైనను కమ్మని శ్లోకరచన సంఘ స్వభావ సమ్మిశ్రితమై మూర్తి కట్టినది. కేవలము నాటిసంఘ విమర్శనమే ప్రధానముగ వెలసిన ఇట్టి సంస్కృతకృతులు మృగ్యవ ములు. సంఘమునందలి ఏ దురాచారమునో లేక ఒక దుర్మార్గుడైన వ్యక్తిని గూర్చియో విమర్శించుచు రచింపబడినవి కాని, లేక, తమ కావ్యములం దానుషంగికముగ తమనాటి సంఘమును జూపించుట కలదుగాని—కేవలము సాంఘిక విషయములతో వ్రాయబడినవి లేవు. ప్రాచీనసంఘమును, అక్కడక్కడ కావ్య ములలో 'భూతద్దములు' పెట్టుకొని వెతికి పట్టుకొనవలసిన పరిస్థితి అంధ్రులది. అట్టియెడ విశ్వగుణాదర్శము వంటి కృతులు సాంఘికచరిత్ర రచనకు మహోపకృతులు.

# ప్రతీకారం

## శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

రైలు మెల్లిగా బ్రేకులు చప్పుడు చేసుకుంటూ ఆగింది. గోపాలం కిటికీలోనుంచి తల బయటకుపెట్టి స్టేషను పేరు మళ్ళా ఒకసారి చదువుకున్నాడు. జేబులోనుంచి టిక్కెట్టుతీసి చూశాడు. అదే వూరు. గబగబా బెర్తుమీద పెట్టిన సంచీ తీశాడు.

రైలు కూత కూసింది. అటూ ఇటూ చూస్తూ జారిపోతున్న చెప్పు సరి చేసుకుని ఆదుర్దాగా కిందికి దిగాడు.

గేటులో టిక్కెట్టు వసూలు చెయ్యటానికి ఎవ్వరూ లేరు. పక్కనే గంట కొట్టేచోట నిలబడిన వ్యక్తికి అంతా టిక్కట్లిచ్చి వెళ్ళిపోతున్నారు.

జట్కా వాళ్ళంతా ప్లాటుఫారంమీదికివచ్చి సామాన్లు అందు కుంటున్నారు.

'అయ్యగారూ......బండీ కట్టమంటారా.....!

'ఊళ్ళోకి ఎంతదూరం.....'

'రథం దగ్గరకేనా.....'

'ఆ.....ఆ....'

'పావలా డబ్బు లిప్పించండి.....'

'బండీ వద్దులే.....వూరికేనే అడిగాను.....'అన్నాడు గోపాలం. బండివాడు నిరుత్సాహంగా ముఖంపెట్టి 'జట్కా జట్కా.....' అంటూ అరుచుకుంటూ పోయాడు.

గోపాలం కళ్ళు ఎవరికోసమో వెదుకుతున్నాయి. చేతిలో సంచీ భద్రంగా పెట్టుకుని పెద్దగా అడుగులు వేసుకుంటూ బయలుదేరాడు.

'రథం పక్కన గూడెంలో......' తలఎత్తి పైకి చూశాడు. ఆ మాటేపునశ్చరణ చేసుకున్నాడు.

స్టేషనుదాటి కొద్ది దూరం పోగానే దారిలో కాలవ ఒకటి అడ్డం వచ్చింది. వంతెన కొద్ది దూరంలోనే ఉంది. అక్కడి నుంచి చూస్తే రథం......దాని పక్కన గుడి, గాలి గోపురం కనపడ్డాయి.

అతనిలో రక్తం ఉరకలు వేసింది. 'అక్కడే అక్కడే......' అంటూ గొణుక్కున్నాడు.

కాలవ ఎండిపోయింది. అక్కడక్కడ నీరు గుంటలల్లో నిలిచింది. అదలునా బాగా మురుగుపట్టిపోయింది. ఒకటి రెండు కప్పులు మురుగులోంచి బయటకువచ్చి బెకబెకమంటు న్నాయి. మెల్లిగా నడుస్తూ పోతున్నాడు. గాలి చల్లగానే ఉంది. కాని అతని వంటికి వెచ్చగా తగులుతోంది. గుండె కొంచెం దడదడలాడింది. 'ఇంకెంత సేపు' అనుకున్నాడు.

ఈ క్షణంకోసం ఎదురు చూస్తున్నాడు తాను. మధుర క్షణంకాదు. అతనికి మనశ్శాంతి దొరకబోయే క్షణం.

శంకరయ్యది ఈ వూరని తెలుసుకోవటమే కష్టం అయింది. అతని ఆచూకీ తీయటంకోసం పోలీసులతోపాటు తనూ తిరిగాడు. ఎందరినో అడిగాడు. ఎన్ని వూళ్ళో గాలించాడు.

అతన్ని తాను బాగా గుర్తు పట్టగలడు.....పెద్ద నుదురు నుదుటిపై ఎడమపక్క నల్లటి మచ్చ.....అణుచుకుపోయిన ముక్కు.....అన్నిటిమించి ఆ కళ్ళను తాను ఎన్నటికి మరచి పోలేదు.

వంతెన వచ్చింది. రథం ఇంకెంతో దూరంలేదు.

ఒక్కక్షణం ఆగాడు. అడుగుల చప్పుడవుతే వెనక్కి తిరిగి చూశాడు. ఎవరో తన నెరగని వాళ్ళు.

వంతెనకింద నిలిచిన నీళ్ళలో ఎవరో చేపలు పట్టుకుంటు న్నారు. గట్టుమీద కొద్ది దూరంలో సరివితోపుంది. అక్కడి నుంచి వస్తున్న గాలి హోరుమని చప్పుడు చేస్తోంది.

ఆకాశం నిర్మలంగా ఉంది. తన మనసు నిర్మలంగా లేదు.

గోపాలం చకచకా నడవ సాగాడు.

ఇంటి దగ్గర తమ్ముడు పొలం పనిలోకివెళ్ళి ఉంటాడు. తను ఆ పని వదిలి ఇక్కడకు వచ్చాడు. ఆపొలం......గోపాలం కళ్ళల్లో నీళ్ళు తిరిగి ఎత్తైన చెక్కిళ్ళమీదికి జారినాయి. కళ్ళు జేవురు రంగు పూసుకున్నాయి. ఆ పొలం....అక్కడ నెత్తురు చిందింది. తను మరిచిపోలేదు.....అమ్మ ఎంత ఏడ్చింది. తను వోదార్చలేకపోయాడు. తనంటే ఎంత ప్రేమ చెల్లెలికి. అన్నం గిన్నె తట్టలోనుంచి తీసి తనకిస్తే.....తాడిచెట్టుకింది ఆ కొద్ది నీడలో ఇద్దరూ కూర్చుని తినేవాళ్ళు. ఆ చల్లని రోజులు మళ్ళీ ఎలా వస్తాయి!

గోపాలం గొంతులో ఏదో మాట పెనగులాడింది. మళ్ళా దుఃఖం పొర్లివచ్చింది. ఆవేశం పొంగిపొర్లింది. రథంవంక మళ్ళా చూశాడు. ఇంకెంతసేపు......

రేపు ఇంటికి వెళతాడు. తమ్ముడు ఎదురు వస్తాడు. 'వెళ్ళిన పనయిందిరా' అని అడుగుతుంది అమ్మ. తను 'అయిం దంటాడు.....కాని అమ్మకు తెలియదు. నేనింకా పొలం బేరా నికి వెళ్ళాననుకుంటుంది. తను అప్పుడు నిజంచెప్పాలి. రక్త సిక్తమైన కత్తి తీసి ఆమె పాదాలముందు పెడతాడు అమ్మ నంతో షిస్తుందా....ఏమో అమ్మకు చెప్పకూడదు. మళ్ళా అమ్మకు చెల్లెలిమాట జ్ఞాపకం చెయ్యటం ఎందుకు!

ఆనాడు చెల్లెలు పెట్టిన కేక ఈనాటికీ చెవుల్లో గింగురు మంటోంది. గడ్డివాము నీడలో కూర్చున్న చెల్లెలికి ఇంత దురా గతం తలపెడతాడా......వాడికి చేతులెట్లా వచ్చినాయి. అసలు అవి చేతులేనా......

గోపాలం శరీరం భగ్గున మండిపోయింది.

వంతెన దాటగానే రోడ్డు రెండుగా చీలింది. రథం వైపుపోయే రోడ్డుకు తిరిగాడు. రోడ్డు మొదట్లోనే కాఫీ హోటలు కనబడింది. ముందు ఆకలిబాధ తీర్చుకుందామను కున్నాడు. లోపలకువెళ్ళి నాలుగు వైపులా కలయచూశాడు. బీరువాలో ఏవో తినుబండారాలున్నాయి. గదిలో మధ్య తడికె ఉంది. తడికె వెనకాల ఎవరోపిండి రుబ్బుతున్న చప్పుడవు తోంది. దొడ్లో కుక్కలు పోట్లాడుకుంటున్నాయి. కోడివకటి పిల్లల్ని వెంటబెట్టుకుని గదిలో కిందపడ్డ గింజలను ఏరుకు తింటోంది. గోపాలం వక పక్కగాపోయి కూర్చున్నాడు. అక్కడ మట్టి గోడలో వానం కర్రలతో ఏర్పాటు చేసిన కిటికీలో నుంచి రథం కనబడుతోంది.

ఎవరో వచ్చారు. 'ఏం కావాలయ్యా....' అన్నాడు.

'ఇడ్డెన్లున్నాయా.....!

'ఉన్నాయి.....!

'ఒక ప్లేటు రానీ.....!

రథంమీద పావురాలు ఎగురుతున్నాయి.

బల్లమీద ఈగలు ముసురుతున్నాయి.

అతని దృష్టి అటూ ఇటూ వూగిసలాడుతోంది.

ఆ శంకరయ్య చేతిలో ఆనాడు కత్తి ఉంది. తన చేతిలో కనీసం కర్రయినా అందుబాటులోలేదు.....లేకపోతే ఇంతదాకా వచ్చేదిగాదు. ఆరోజునే తేలిపోయేదివ్యవహారం.

ఇడ్లీ పొగలు కక్కుతోంది.

'అట్టు వేయించమంటావా.....' అంటున్నాడు హోటలు వాడు.

తను కూర్చున్న బల్ల ముందుకూ వెనక్కూ ఊగు తోంది.

అట్లతద్దినాడు దొడ్లో చింతచెట్టుకు ఉయ్యాల వేశాడు. చెల్లెల్ని కూర్చోపెట్టి ఊపాడు. పెద్ద ఊపు రాగానే చెల్లెలు పళ్ళు బిగపెట్టి తాడు గట్టిగా పట్టుకుంది. ఊపు ఆగగానే 'అంత ఊపు వేస్తావెందుకు.....నాకెంత భయంవేసిందో తెలుసా! అన్నది.

'అంత వేసిందా....' అన్నాడు తాను చేతులు బార జాపుతూ.

తాను గూడా ఉయ్యాలమీద నుంచుని పెద్ద పెద్ద ఊపులు ఊగాడు. చెల్లెలు తన కాళ్ళ మధ్య కూర్చుని కాళ్ళు రెండు గట్టిగా పట్టుకుంది. తను పక్కనేఉంటే ఎంత ధైర్యం తన చెల్లెలికి. కాని.......ఆనాడు తను ఏంచెయ్యగలిగాడు.

పొలంలో తను, తన చెల్లెలు. మెళ్లో రెండు పేటల బంగారు గొలుసు మెరుస్తోంది. కనుచూపు మేరలో ఎవరూ లేరు. చెల్లెలు పొలం గట్టున పడిఉన్న నత్త గుల్లల్ని ఏర్చు కుంటోంది. ఒక్కసారి అరవటం వినిపించింది. పరుగెత్తాడు. అటువైపు. ఎవరో చెల్లెలితో పెనుగులాడుతున్నాడు. తను ఇంకా పరుగెత్తాడు. అతని చేతిలో ఏదో తళతళలాడింది. చెల్లెలు గావుకేకపెట్టి పడిపోయింది. తను వెళ్ళాడు. అతని చేతిలో కత్తి ఉంది. తను ఎదిరించాడు. తనను గూడా పొడవ బోయాడు. తనచేతిలో కర్రయినాలేదు. తను పోలికపెట్టాడు. నలుగురూ చేరేలోపునవాడు పారిపోయాడు. గొలుసు పోయింది. చెల్లెలు పోయింది. గోపాలం సర్వస్వము పోయినట్లయింది.

అతన్ని చూశాడు. ఆ నుదురు.....ఆ మచ్చ.....ఆకళ్ళు లన్నీ చూశాడు. ఆ చెల్లెలికి పెళ్ళి చెయ్యాలని....ఆ పొలం ఆమెకు రాసి యివ్వాలనీ అనుకున్న గోపాలం పళ్ళు పటపట లాడించాడు.

'ఇడ్డెన్లో రాయి వచ్చిందా....' అన్నాడు హోటలులో పక్కనే కూర్చున్నవాడు.

గోపాలం సంచీ దగ్గరకు తీసుకున్నాడు. బరువుగా లేచి డబ్బు లిచ్చేసి బయటకు వచ్చాడు.

రథం పక్కగా ఒక సైకిలు దుకాణం ఉంది. ఒకబ్బాయి అతి ప్రయాసతో సైకిలుకు గాలి కొడుతున్నాడు.

'శంకరయ్య ఉండేదెక్కడ.....' గోపాలం అతన్ని మెల్లగా అడిగాడు.

సైకిలు కుర్రాడు పంపు పక్కనపెట్టి చొక్కాతో ముఖం తుడుచుకొని 'ఎవరూ...' అంటూ అనుమానంగా అడిగాడు.

'శంకరయ్య....గూడెంలో ఉంటాడుట....!

'మా నాన్న సంగతేనా....!

గోపాలం నిశ్చేష్టు డయ్యాడు.

# ప్ర తీ కా ర ం

'చింతచెట్టుంది చూశావా.....అదే.....ఇంటికి సున్నం చారలు గూడా ఉన్నాయి...' అన్నాడు ఆ అబ్బాయి.

గోపాలం అక్కడ ఒక్క క్షణం గూడా ఉండలేక పోయాడు. గబగబా అడుగులు వేసుకుంటూ గుడి మండపం మీదికి చేరాడు. అక్కడినుంచి చింతచెట్టు కనపడుతోంది. దొడ్లో వరల్లేనిబావిముందు నిలబడి నీళ్ళు తోడిపోసుకుంటు న్నారు.

సంచీలో కత్తిని తడిమి చూశాడు. చల్లగా తగిలింది. అతని శరీరం వెచ్చబడింది. పెదిమలు వణికినాయి. శరీరం గగుర్పాటు చెందింది.

'ఏపూరు మీది.....' పక్కనే కూర్చున్నాయన అడి గాడు.

ఎవరో పిల్లలు రావిఆకులు తుంచి బూరలు చుట్టుకుంటు న్నారు.

'ఎవరింటికి వచ్చారు.....'ఆయన మళ్ళా అడిగాడు.

గోపాలం అతని వంక తీవ్రంగా చూసి అక్కడినుంచి వచ్చేశాడు. బయటకువచ్చి చూసేటప్పటికి ఎక్కడెక్కడినుంచో పావురాలు ఎగురుకుంటూవచ్చి రథంమీద వాలుతున్నాయి. తెల్లటి పావురాలు రెక్కలు టపటప లాడిస్తూ రథం చుట్టూ తిరుగుతుంటే ఎక్కడినుంచో తనకు శాంతి సందేశం తీసుకు వస్తున్నట్లుంది. తన హృదయం శాంతించదు. తనలో చెల రేగే అశాంతి స్వరూపం వాటికేం తెలుసు అనుకున్నాడు.

శంకరయ్య ఆ రాత్రికి ఇంటికి వస్తాడని తెలిసింది. అతన్ని పట్టుకోవటానికి పోలీసువాళ్ళు గూడా వచ్చారు. గూఢ చారుల్లాగా తిరుగుతున్నారు వాళ్ళు.

గోపాలం సరివితోపుముందు నిలబడ్డాడు. హోరుమని గాలి శబ్దం చేస్తోంది. కీచు రాళ్ళు గీ పెట్టుతున్నాయి.

కాలవ గట్టువెంబడి నడుస్తున్నారు.

రోడ్డుమీద కెవ్వున కేక వినిపించింది. ఉలిక్కిపడ్డాడు గోపాలం.

గోపాలానికి వెళ్లెలు పిలిచినట్లు అనిపించింది. అటువైపు పరుగెత్తాడు.

అక్కడ నిలబడ్డ లారీ ఒకటి ఇతన్ని చూడగానే రివ్వుమని బయలుదేరి వెళ్ళిపోయింది. రోడ్డుమీద ఎవరో పడిపోయాడు. గోపాలం అదుర్దాగా వెళ్ళిచూశాడు. ముఖమంతా రక్తసిక్తమై ఉంది. మాట లేకుండా పడిపోయాడు.

గోపాలం ధర్మ సంకటంలో పడ్డాడు. ఆపదలో ఉన్న వాడిని రక్షించటం అంటే గోపాలం ఎప్పుడూ ముందుకు తూగే వాడే. కాని ఈ రోజున తను వచ్చిన పని వేరు.

శంకరయ్య ఏక్షణాన్నైనా అటువైపుకు రావచ్చును. తనిక్కడ ఉండిపోతే అతను తన చేతికి చిక్కడు. మళ్ళా అవ కాశం దొరకదు. తనలో రేగుతున్న దావానలం మళ్ళా అవకాశం కోసం ఆగుతుందా.....గోపాలం సంకటపడిపోయాడు. లారీకింద పడ్డ వ్యక్తి గిలగిలలాడిపోతున్నాడు. తన మనస్సు శంకరయ్య ప్రాణంకోసం తహతహ లాడిపోతోంది.

గోపాలం నుదుటిమీద చెమట పట్టింది.

ఒకొక్కక్షణం ఒక్కొక్క యుగంగా గడుస్తోంది.

ఏ క్షణంలోనైనా శంకరయ్య తన దృష్టిలో పడకుండా తప్పించుకుని పోవచ్చును.

ఒక్క క్షణం ఆలస్యం అయినా ప్రమాదంలో చిక్కుకున్న వ్యక్తికి ప్రాణాపాయం సంభవించవచ్చు.

గోపాలం కిందపడ్డ వ్యక్తిని నడుంమీదకు బియ్యం బస్తాలా ఎత్తుకున్నాడు. అడుగులు చకచక వెయ్యటం మొదలుపెట్టాడు. గమ్యం తెలియదు. ఆ వూళ్లో ఆసుపత్రి ఎక్కడవుందో డాక్టరు ఎక్కడ వున్నాడో. చూపు మేరలో నరసంచారంలేదు. తొందరగా నడవలేకపోతున్నాడు. ఆయాసం వస్తోంది. వళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి. లోపల ఆదుర్దా. ఆవేదన లేకపోతే ఆ బరువు మొయ్యటం ఏమంత కష్టమైన పని కాదు.

వంతెన దాటాడు.

రథం దాటాడు.

అక్కడ వరండాలో ఎవరో మిషను కుట్టుతున్నాడు. అతన్ని అడిగాడు వైద్యుని సంగతి. అతను మిషను వదిలిపెట్టి పరుగు పరుగున వచ్చాడు. రథం పక్క సందులో డాక్టరిల్లు చూపిం చాడు.

డాక్టరుగారు కంగారుపడుతూ వచ్చాడు.

గోపాలం అలాగే లోపలకువెళ్ళి బల్లమీద పడుకోపెట్టి బయటకు వచ్చాడు.

'ఏమయింది.....' మిషనువాడు అడిగాడు.

'లారీకిందపడ్డాడు.....' గోపాలం రొప్పుతూ ఒక్కొక్క అక్షరమే పలికాడు.

'పాపం......'

గోపాలం మనసు తేలికయింది.

లారీవాడు తప్పించుకుపారిపోయాడు. వాడు దొరికితేనా? గోపాలం ఏంచేశాడు?....

ఆరోజు శంకరయ్యను ఏం చెయ్యగలిగాడు. అతనూ తప్పిం చుకుని పారిపోయాడు.

'దుర్మార్గులకి శిక్ష నివ్వటంలేదు భగవంతుడు.....' అను కున్నాడు గోపాలం.

గోడ గడియారం గంటలు కొట్టింది.

ఉలిక్కిపడ్డాడు గోపాలం. ఎవరో అతని వెన్ను చరిచి నట్లయింది. ఇక్కడెందుకు కూర్చున్నావు.....పో....సరివితోపు దగ్గరకు పో..... మళ్ళా శంకరయ్య దొరకడు......పోలీసుల చేతు ల్లోకి చిక్కిన తర్వాత నువ్వేం చేయలేవు.....ఇప్పుడే....తొంద రగా....లే....' అంటూ గోపాలాన్ని మనస్సు ఉత్తేజపరుస్తోంది. లేచాడు. అడుగులు వెయ్యలేకపోయాడు.

వాకిట్లో జనం చేరారు.

డాక్టరు ఎవరినీ లోపలకు రానియ్యటంలేదు.

'ఎవరు పడింది.....'

'మన వూరివాడేనా....'

'ఎవరు ఆయన్ని తీసుకువచ్చింది.....'

'ఈయనేనా....నీతల్లి కడుపు చల్లగా పది కాలాలపాటు వర్ధిల్లు నాయనా....'

'మా నాయనే....ఎంతమంచి మనస్సు ఇచ్చాడు' నాయనా దేవుడు నీకు.....'

'ఏవూరు నాయనా.....నీది....'

'ఒక ప్రాణాన్ని రక్షించావు......నీవి మామూలు చేతులు కావు నాయనా'

'ఏం పనిమీదవచ్చావో.....ఒక ప్రాణం నిలబెట్టావు....'

అంతా తలొకమాట అంటున్నారు.

గోపాలం ఆ మాటల్ని మింగలేక పోతున్నాడు. తను ఆ మాట లకి తగినవాడుకాదు. తను ఈ వూరు ఎందుకు వచ్చాడు. శివుని ఆజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు. ఆ లారీ ఎందుకు రావాలి. ఆ ప్రమాదం ఎందుకు జరగాలి. తన తలచినపని ఎందుకు భగ్నం కావాలి. ఈశ్వరేచ్ఛ ఇలాగేఉందా. గోపాలం మనసు పరిపరి విధాల పోతోంది.

అతన్ని అంతా పొగుడుతున్నారు. అవి భరించలేకుండా ఉన్నాడు. అక్కడినుంచి వెళ్ళిపోలేకుండా ఉన్నాడు. తను రక్షిం చిన వ్యక్తినుంచి తను కృతజ్ఞత కోరుతున్నాడా? అక్కడ ఎందు కాగినట్టు. అతని తాలూకు మనుష్యులంతా వస్తారు'' నువ్వు మా కుటుంబం నిలబెట్టావు. అంటూ అతని వేనోళ్ళ పొగుడు తారు. తను అక్కడినుంచి వెళ్ళి....శంకరయ్య తన చేతికి దొరి కినా హాని చెయ్యగలడా....తన చెయ్యి పైకి లేస్తుందా....గోపాలం కళ్ళు మండుతున్నాయి.

తను ఇటువంటి పరిస్థితుల్లో చిక్కుకుంటాడని వూహిం చాడా.....తను శంకరయ్యను కత్తితో పొడుస్తాడు. వీలయితే పారిపోతాడు. పదిమంది లో చిక్కితే తనకు జరిగిన అన్యాయం చెపుతాడు. కావాలనే చేశానంటాడు. ఎవరూ హర్షించరు. తనకు లెక్కలేదు. అందరూ కలిసి తనను చావకొడతారు. తనకు భయంలేదు. నిండుగుండెతో అన్నీ భరించగలడు. కాని.....విపరీతమైన పరిస్థితుల్లో ఇరుక్కున్నాడు. తన చేతికి సంకెళ్ళు బదులు పూలహారాలు చుట్టుకుంటున్నాయి. దూష ణలకు బదులు భూషణలు తన మనసును నింపుతున్నాయి.

ఇవన్నీ భరించలేకపోతున్నాడు.

గోడగడియారం అరగంట కొట్టింది.

డాక్టరు బయటకు వచ్చాడు. అందరి కళ్ళు అతనివంక తిరిగినాయి. అతని ముఖంలో సంతోషరేఖ కనబడింది.

'భయంలేదు.....బతుకుతాడు....' అన్నాడు.

గ్రీష్మంలో నిప్పులు చెరుగుతుండే రోజున చల్లని గాలిలా వచ్చింది ఆమాట అందరికీను.

'ఇంతకీ మనవూరివాడేనా...ఎవరాయన.....' చాలామంది ఆదుర్దాగా అడిగారు.

'మన గూడెం శంకరయ్య.....' అన్నాడు డాక్టరు.

గోపాలం గుండెల్లో ఎవరో దేవినట్లయింది. ముఖం వివర్ణ మయింది. చేతిలో సంచీ జారిపోయింది. యాంత్రికంగా ఒక్కసారి లేచాడు. డాక్టరుగారింట్లోకి డాక్టరుతోపాటు బయలుదేరాడు. ఎందుకు?

తను వెంటాడుతున్న శంకరయ్య చేతికి దొరికాడనా?

తను రక్షించిన వ్యక్తి గండంనుంచి బయటపడ్డాడనా? ఏమో! బహుశా గోపాలానికి గూడా తెలియదేమో! తనేం చేస్తు న్నాడో ఎక్కడికి పోతుడో తెలియకుండా అలాగే సాగిపోయాడు గోపాలం!

# అపరిష్కృతమైన యోగదర్శనము

## శ్రీ ఆర్థర్ కోస్లర్

గత సంచిక తరవాయి

వైన పేర్కొన్న అత్యద్భుత కృత్యములకును, యోగ సిద్ధులకును సంబంధమేమియు లేదు. వీనిలో సజీవభూతల సమాధి యను అత్యద్భుతసిద్ధి విషయమై లోనవాలా యోగ పరిశోధనశాలలో నామూలాగ్రముగ బరిశీలించినారు. నా కచ్చట లోతుగా దవ్విన గోయి యొకటి చూపించినారు. అది ఇంచుమించుగ నారడుగుల లోతును, మూ డడుగుల వెడల్పును పొడవును గల అఖాతము. దానిని గట్టిగ నతికించిన కాంక్రీటు మూతతో గప్పిరి. దానిపై తిరిగి మూడడుగుల వరకు నెత్తుగ మన్ను పోసిరి. కువలయానందస్వామి ఈ పరిశోధన ఫలించలేదని నాతో నన్నారు. ఇందువల్ల నే నీ విషయమై వివరముల జోలికి బోవుటలేదు. ఆ అఖాతమువైపు చూచిన సామాన్యగ్రామీణుల కెవ్వరి కయినను, అందించుకైనను గాలి ప్రవేశించుట కవకాశము లేదనియు, అందువల్ల దానిలో ప్రవేశించిన కొలది నిమిషములకే ఊపి రాడక మానిసి మరణింపగలడనియు తప్పక సువ్యక్తము కావచ్చును. కాని ఆ గోతికి చుట్టు నున్న భూమి రంధ్రములలో నుండి గాలి లోనికి చొచ్చుకొని వచ్చుట కవకాశము కలదన్న విషయ మెవ్వరు నొకించుకయినను గురుతించి యుండలేదు. కొన్ని పరిశోధనము లొనర్చిన పిమ్మటనే వారి కీ లోపము సాక్షాత్కరించినది. వా రఖాతములో గల మారుత మంతయు పైకి లాగివేయవలెనని ప్రయత్నించిరి. ఎంతగ ప్రయత్నించినను వాయు పీడనము 0.5 వరకే పడిపోయెనన్న విషయము గుర్తించి వారాశ్చర్యపడిరి. పరిశోధన సమయమున గోతిలో ఆక్సిజన్ కర్బనాక్సైడుల పరిమాణ మొకింతవరకు మాత్రమే గురుతింపగలిగిరి. అఖాతమునుండి వానిని పూర్తిగ తొలగించివేయవలెనని ప్రయత్నించినప్పుడే మరల కొత్త ఆక్సిజను లోనికి చొచ్చుకొని వచ్చినదని వారికి విస్పష్టముగ వెల్లడి అయినది.

కువలయానందస్వామి ఈ పరిశోధన సర్వాంగ సమగ్రముగ కొనసాగించినారు. అయినను తమ యత్నము ఫలించలేదని నిస్సంకోచముగ వెల్లడించినారు. మన మీ విషయమున స్వామి నెంతయు అభినందించవలసి యున్నది. సిద్ధుల విషయమున నాయన విశ్వాస మచంచలము. కాని భూతల సమాధి విషయమున జరిగిన పరిశోధన లన్నియు వ్యర్థములై వ్యతిరేక ఫలితముల నిచ్చినవని విస్పష్టముగ నంగీకరించిరి. కాని ఈ పరిశోధనములవలన వారు కొన్ని ముఖ్యవిషయములు కనుగొనిరి. భూతలిలో ప్రవేశించిన సమాధియందున్న వ్యక్తి 'ఎలక్ట్రో ఎన్‌సిఫలోగ్రావ్‌ు రేఖలన్నియు సామాన్యస్థితిలోనే కానుపించినవి. వానిలో వైపరీత్య మేమియు పొడకట్టలేదు. కాని సైకోగాల్వనిక్ మీటరులో కనుపించిన పరిణామము లన్నియు సాధారణ స్థితికంటె బాగుగ క్రిందికి దిగజారి నట్లే కానుపించినవి.[1]

భూతల సమాధి పరిశోధన బెంగుళూరులో మానసి కారోగ్యసంస్థయం దయిదుగురు పరిశోధకులు కొనసాగించిరి.

ఈ గోయి పొడవు నాలు గడుగులు. వెడల్పు మూ డడుగులు లోతు రెండున్నర అడుగులు. ఇది ఇంచుమించుగ నొక క్యూబిక్ గజము మేర విస్తరించినదని చెప్పవచ్చును. దీని క్రిందిభాగ మొక రబ్బరు గుడ్డతో కప్పి, గోతిపై ఒక యంగుళము మందము గల బల్ల పెట్టి దానిపై నారంగుళముల ఎత్తు వరకును మన్నువేసి కప్పిరి. యోగిని దాని యందు వేర్వేరు సమయములలో మూడుమారు లుంచిరి.[2] మొదటిమా రతడు రెండు గంటలు, రెండవమారు ఎనిమిదిన్నర గంటలు, మూడవమారు తొమ్మిది గంటలు ఆ అఖాతమునం దున్నాడు. వానియం దమర్చిన యంత్రములు, హృదయమందును, మెదడునందును ఏర్పడిన విద్యుచ్ఛక్తి విపరిణామములును, అఖాతవాతావరణపు ఉష్ణమానము మొదలుగా గల వివరములును గుండె ఉచ్ఛ్వాస నిశ్వాసముల పరిస్థితులును యథాతథముగ నెరిగించినవి. ఈ పరిశోధన కుప

---

1. ఎలక్ట్రోఎన్‌సిఫిలోగ్రావ్‌ు యంత్రము. మెదడున నేర్పడిన విద్యుచ్ఛక్తి పరిణామములన్నియు యథాతథముగ గురుతించును. సైకోగాల్వనిక్ మీటరు భావోద్రేకమువలన శరీరము పై భాగమున నేర్పడిన చెమట పట్టుట, మొదలగు పరిణామములలో విద్యుచ్ఛక్తి భాగముల స్వభావము వివరించును.

2. 'ఒకయోగిపై కొన్ని పరిశోధనలు' అన్న ఈవ్యాసము రచించినవారు శ్రీ హెచ్. వి. గుండురావు, ఎన్. కృష స్వామి, ఆర్. ఎల్. నరసింహయ్య, జి. హామొయిర్, ఎన్. వి. గోవిందస్వామి. ఇది ఆలిండియా మెంటల్ ఇన్‌స్టిట్యూట్‌పత్రిక 1958 జులై సంచికలో వెలువడినది.

వీరిలో ఐరోపీయ శాస్త్ర పరిశోధకు డొక డున్నాడు. వారిలో ముగ్గురితో సంభాషించగల సదవకాశము నాకు లభించినది. ఆపైన వా రేర్పరచిన అఖాతము కూడ పరిశీలించితిని. వా రందరును కలిసి ప్రచురించిన వ్యాసము కూడ చదివితిని.

యుక్తుడయిన యోగి పేరు శ్రీ కృష్ణ అయ్యంగారు. ఆయన కేవల మంగవస్త్రము మాత్రమే ధరించినాడు. వేర్వేరు యంత్రములు అమర్చిన పిమ్మట ఆ యభూతమున శయనించినాడు. అగరువత్తి వెలిగించి సమాధిలో ప్రవేశించినాడు. అటుపిమ్మట వెనుక పేర్కొన్న వేర్వేరు కాలముల పర్యంతమును అతని నా గోతిలోనుంచి మంటితో పూడ్చిరి. ప్రథమ ద్వితీయ పరిశోధనల మధ్య గల అవకాశ మొక నెల. రెండవ మూడవ పరిశోధనల నడుమ గడచిన కాల మొక పక్షము. ఈ పరిశోధనల ఫలితము లివి :

మెదడు విద్యుచ్ఛక్తిపరిణామములు గోతిలో పాతి పెట్టినప్పుడు కూడ సామాన్యముగ నితర సమయములం దున్నట్లే యున్నవి. భూతలమున యోగి మేలుకొని యున్నట్లును, విశ్రమావస్థయం దున్నట్లును, విద్యుచ్ఛక్తి గురుతు లుల్లేఖించినవి. అంతేగాని ఆతడు నిద్రలో నున్నట్లు సూచించలేదు. దీనివలన నాతడు సుషుప్తిస్థితిలో లేనట్లు గాని, ఒకవేళ సమాధిస్థితు డయినను, మెదడు విద్యుచ్ఛలనమున మార్పేమియు లేదని గాని చెప్పవలసి యున్నది.

ఉచ్ఛ్వాస నిశ్వాసములలో ప్రత్యేకించి పేర్కొనదగిన ఫలితము లగుపడినవి. కాని ఈ పరిశోధనమున గూడ గోతి గోడలనుండి గాలి లోనికి చొచ్చుకొని వచ్చినదా ? లేదా? అన్న ముఖ్యవిషయము తిన్నగ పరిశీలింపబడలేదనియు, ఇది ఒక పెద్ద తప్పిదమనియు ఈ విషయమున వెలువడిన నివేదిక పేర్కొనుచున్నది. అయినను అంతగ చెప్పదగిన విశేషమేమియు గోచరించలేదు. హృదయస్పందనము లొకే విధముగ నున్నని. నిమిషమునకు 40, 60 చొప్పున మారినవి. ఇయ్యది సాధారణమే. గాలి పీల్చుట గూడ సహజముగ నిమిషమునకు 16 నుండి నిమిషమున కొకటి వరకు మందగించినది. ఒక్కొక్కప్పుడు రెండు నిమిషముల కొక్కొక్కటి చొప్పున గూడ క్షీణించినది. అయినను ఊపిరితిత్తులగుండ ప్రవహించిన వాయుసంచారము మూలమున నీ సమయమున నేర్పడిన కొరత తీరినది[3]. ఈ వాయు సంచారము 0.5 లిట్టర్లనుండి 1 లిట్టర్ వరకును బెరిగి రెండు రెట్లయినది. అయినను ప్రధానమగు రసాయనిక పరిణతిక్రమము చాలవరకు తగ్గినది. శరీరావయవముల సంచారమొకవిధముగ మందగించినదని మాత్రమే పై ప్రాణవాయువు పరివర్తన క్రమమువలన స్పష్టపడినది. ఇది ప్రత్యేకముగ పేర్కొనదగిన విషయము కావచ్చును. కాని దీనియం దతి లౌకికత ఏమియు లేదు. గోతిలో పాతిపెట్టిన యోగు లేమాత్రమును గాలి పీల్చుకొన కుండనే జీవించుచున్నారను విషయము బుజువుపరచుటలేదు.

## హృదయసంస్తంభనము

దీనికి సంబంధించిన మరియొక వ్యవహార మున్నది. యోగి తన యిచ్ఛామాత్రముగ స్వకీయ హృదయ మాపివేయ గలడని సర్వసాధారణముగ విశ్వసింపబడు చున్నది. ఈ వ్యవహారము విశాఖపట్టణమున గల ఆంధ్ర విశ్వవిద్యాలయ వైద్య కళాశాలయందు కూలంకషముగ బరిశోధించిరి. ఈ పరిశోధన కుపకరించిన వ్యక్తి పేరు రామానంద. ఈయన యోగాభ్యాసమున మిగుల నారితేరిన వ్యక్తి. నాలుక క్రింద నుండు మాంసము ఖండించి ఖేచరీ ముద్రయం దసాధారణాధికారము సంపాదించుటయే గాక, శస్త్ర చికిత్సద్వారా నాలుక నతడు నిలువుగ రెండు చీలికలుగా విభజించినాడు. ఈ శస్త్ర చికిత్సకు బూర్వము జిహ్వాగ్రముతో నొకేనాసారంధ్రము మాత్రమే పూడ్చుట సాధ్యపడినది. ఇప్పుడన్ననో రెండు రంధ్రములు నొకేసారి మూయుట సాధ్యపడినది.

పైన పేర్కొన్న పరిశోధనము 1957 వ సంవత్సరమున జరిగినది. అప్పటికి రామానందుని వయస్సు 37 వత్సరములు. ఆత డంతకు పూర్వము 16 వత్సరములనుండి హఠయోగ మభ్యసించుచున్నాడు. మలమూత్ర ద్వారముల నుండి నీరు లోపలికి లాగుట, ఉదరములోనిరసములు, ముఖమునుండిగాని, నాసికనుండిగాని వెడలగ్రక్కుట మొదలగు సాధన లన్నియు నవలీలగ ప్రదర్శించెను. వివిధ పరిమాణముల వేళలలో నాతడు భూతలసమాధియం దున్నాడు. ఒకప్పుడు 28 రోజుల వరకును నిరంతరముగ భూతలియం దుండగలిగితినని ఆత డన్నాడట ! కాని యీ విషయమున వెలువడిన నివేదిక ఇది పరిశోధింపబడలేదని నుడువుచున్నది.[4]

హృదయస్పందనము, నాడీచలనము స్వచ్ఛందముగ నాపవచ్చునా ? అన్నదే ఈ పరిశోధన లక్ష్యము. 20 లేక 30 సెకండ్ల వరకు రామానంద వీనిని రెండింటిని చాలా వరకు మందగింపజేయ గలిగినాడని మాత్రమే ఈ పరిశోధనల వలన స్పష్టపడినది. మణికట్టు పైవేళ్ళుంచి పరీక్షించు సామాన్యపరిశీలనద్వారా నాడీ హృదయస్పందనము లేమాత్రమును వ్యక్తము కాలేదు. కాని రక్తపుపోటు కొలుచు యంత్రము మాత్రము నాతిస్పష్టమును, నిరుద్ధమును, వక్రమును నగు నాడీ స్పందనము వ్యక్తీకరించినది. నాడీ స్పందనక్షీణత, స్వతంత్రములగు రెండు పద్ధతుల వలన సాధింపబడినది. గుండె కండరములు లోనగువాని సంకోచము మొదటిది. ఊపిరి ఆపిన పిమ్మట రక్తప్రసార నిగ్రహము రెండవది. ఇవి రెండును సాధారణమానవు లెవ్వరయినను

3. ఈ వాయు సంచారము ప్రత్యక్షముగ గొలుచుట సాధ్యపడదు. పరోక్షముగనే దీనిని కనుగొనవలసి యున్నది. గోతిలో ఆద్యంత సమయములం దున్న బొగ్గుపులుసుగాలి భాగమును బట్టి ఈ పరోక్ష పరీక్ష కొనసాగించవచ్చును. ప్రస్తుతపరిశోధమున ప్రారంభమున నిది నూటికి 0—04 వంతు లున్నది. రెండుగంట లయిన పిదప నూటికి 1.34 వంతు లున్నది. 9 గంటల కాలము గడిచిన పిదప నూరులో 3—8 వంతు లున్నది.

4. జి. వి. సత్యనారాయణమూర్తి, ఎం. డి. పి. బ్రహ్మయ్యశాస్త్రి, ఎం. బి. బి. ఎస్, ఎం. ఎస్. సి., పి. హెచ్. డి. అనువారు ప్రకటించిన జర్మన్ పత్రికలో వ్యాసము.

# అపరిష్కృతమైన యోగదర్శనము

సాధించవచ్చును. ఊపిరి బిగబట్టినప్పుడు, సామాన్య మానవునితో సరిపోల్చి చూచినప్పుడు రామానందునిలో చాల స్వల్పమగు వ్యత్యాసము మాత్రమే పొడకట్టినది.

హృదయ సంస్తంభన సమయమున జరిపిన పరిశోధనమువలన హృదయపరిస్థితిలో గొన్ని ఎన్నదగిన ఫలితము లగపడినవి. సామాన్యపద్ధతులవలన హృదయసంచలనమేమాత్రము వినబడలేదు. టేపురికార్డులో నివి యొకప్పుడు స్పష్టముగ నున్నవి. మరియొకప్పు డేమాత్రము దాని స్పందనము గోచరించలేదు.

ఇక హృదయ విద్యుచ్ఛక్తి పరిశీలకయంత్రము పరిశోధన సమయమునం దంతటను సామాన్య వైద్యుత సంచలనము సమగ్రముగ నున్నట్లు స్పష్టపరిచినది. ఇక ఫ్లూరోస్కోపు యంత్రమున గనుపించిన తీరు రేడియో శాస్త్రజ్ఞుని నివేదికలో నిట్లున్నది.

"యోగి గాలి లోని కాకించుక పీల్చుకొన్న పిమ్మటను, అది ఆపివేసిన అనంతరమును వామ జఠరికలో నొక ప్రత్యేక భాగములో రవంత పరిస్ఫురణము తక్క మిగిలిన హృదయ స్పందన మంతయు నాగిపోయినది. మిగిలిన హృదయ భాగములలో నెచ్చటను స్పందనము గోచరించలేదు. ఈ పరిస్థితి ముప్పది సెకండ్లకాలము వరకును నిలిచినది. యోగి తిరిగి ఊపిరి పీల్చుకొనుట ప్రారంభించగనే ఊపిరితిత్తుల స్పందనము యథాతథముగ గోచరించినది."

ఒకవిధమగు ప్రాణాయామశక్తితో స్వయముగ రామానంద హృదయస్పందనము చాలవరకు క్షీణింపజేసిన విషయము నిస్సందేహముగ ఋజువయినది. కాని సామాన్యమానవు లనేకులు ఇచ్ఛాశక్తితో తమ హృదయమును మంధరగతితో సంచలింపజేసి కాని, లేక హృదయ నిగ్రహమువలనగాని హృదయ వ్యాపారమున మార్పు కలిగింపగలరు. కాని రామానందవలె నాశ్చర్యకరముగ వా రిది నిర్వర్తించలేకపోవచ్చును. దీనికి వైద్యశాస్త్రపరిభాషలో వాల్సాల్వా ప్రక్రియ అన్న పే రేర్పడినది[5]. వేర్వేరు వ్యక్తులలో నీ హృదయస్పందన నిగ్రహశక్తి అనేక విధములుగ గానవచ్చును. రామానందచేసినదాని కన్న మిన్నగ నొక వ్యక్తి, ఇంతకన్న నత్యధిక సామర్థ్యముతో హృదయస్పందనము నిగ్రహింప గలిగెనని అమెరికాలో నొక వైద్య పత్రిక పేర్కొనుచున్నది. ఆ పత్రిక పేరు 'కాలిఫోర్నియా మెడిసిన్'. డాక్టరు చార్లెస్ ఎం. మాక్క్లూర్ ఈ విషయ మా పత్రికలో నుల్లేఖించిరి[6]. ఇది కాలిఫోర్నియా వైద్య సంఘము పక్షమున వెలువడు పత్రిక.

అది నలుబదియేండ్ల విమానయాంత్రికోద్యోగిని గూర్చిన నివేదిక. అతని పూర్వులు డెన్మార్కుదేశీయులు. పేరు వెర్నాన్ డబ్ల్యు. హాన్‌సేన్. అతడు ఇచ్ఛాశక్తితో ఐదు సెకండ్ల వరకును తన హృదయస్పందనము క్షీణింపజేయుటకును, ఆపివేయుటకును తగిన శక్తిసంపాదించినాడు. ఇంతేకాదు. హృదయమున వైద్యుత సంచలనము కూడ అతడు నిరోధింపగలడు. 7 వ సంవత్సరమున హాన్‌సెన్ కీళ్లవాత జ్వరమువలన బాధపడినాడు. పదియేండ్ల ప్రాయమువరకును జీవించజాలడని గృహవైద్యు డన్నమాట లాతడతిరహస్యముగ నాలకించినాడు. ఆ రోగమువలన నాతనిలో నొకింత హృద్రోగము స్థిరపడినది. దానితోబాటు నిద్రలో నెప్పుడో ఒకప్పు డకస్మాత్తుగ గుండె ఆగిపోగలదన్న భావము కూడ నాతనిలో కుదురుకొన్నది. ఆ విపత్తినుండి తప్పించుకొనుట కాతడు ఇచ్ఛాశక్తితో హృదయవ్యాపారముల నదుపులో నుంచగల సామర్థ్యము సంపాదించుకొన్నాడు.

దీనికొర కాతడు సమగ్రవిశ్రాంతితో సుఖముగ నొకచోట గూరుచున్నాడు. తన లోపలి యవయవము లన్నింటిని స్వచ్ఛందముగా నాగిపోనిచ్చినాడు. నాడీచలనము కూడ క్రమక్రమముగ నిరోధించి హృదయమును సంస్తంభించినాడు. అప్పైన శరీరచైతన్యము పోవుచున్న ట్లనుభూతి కలిగినది. ఈ యనుభూతి కలిగినపిదప కొన్నిలిప్తల అనంతరము హాన్‌సెన్ గుండెనిండ గాలి పీల్చినాడు. తిరిగి హృదయసంచలన మారంభ మయినది.

హృదయసంచలన మాగిపోయినప్పుడు రక్తప్రసారమున కడ్డంకి యేర్పడినందువలన ముఖము బూడిదవలె వెలవెలబోయినది. హృదయ విద్యుచ్ఛక్తి పరిశీలక యంత్రమీ విషయమున నతిస్పష్టముగ నిస్సందేహముగ అయిదు సెకనులవరకును హృదయ సంస్తంభనమే కాక హృదయగతి క్షీణతకూడ నిర్దేశించినది. 'దీనికి సంబంధించిన విధానమంతయు నేదో యొక శారీరక యాంత్రికగతి వలన నేర్పడినది. ఇది హాన్‌సెన్ ఇచ్ఛాశక్తివలన కొనసాగినను ఆ శారీరక యాంత్రికగతి ఆతని కజ్ఞాతముగనే ఉండిపోయినది. హృదయస్తంభన మెంతో జాగ్రత్తగ పరిశీలించినను నిశ్వాస నిగ్రహముగాని, వాల్‌సాల్వా ప్రక్రియగాని దాని కాధారభూతముగ గానుపించలేదు.' హాన్‌సెన్ హృదయ సంస్తంభనమునకై ప్రాణాయామము కూడ నాచరించలేదు. వైమానికోద్యోగి హాన్‌సెన్ వాస్తవముగ యోగుల నీ విషయమున నధః పాతాళమున కణగద్రొక్కినాడని చెప్పవలసి యున్నది.

గడచిన అయిదు సంవత్సరములనుండియు డాక్టరు మాక్క్లూరున కాతనితో పరిచయమేర్పడినది. ఎప్పుడు కావలసిననప్పు డేవిధమగు ప్రయత్నమును లేకయే హాన్‌సెన్ తన హృదయసంచలన మాపివేయగలడు. ఇది ఎట్లు సాధ్యపడినదో ఆతనికే తెలియదని నివేదిక నుడువుచున్నది. కీళ్లవాతపు జ్వరమువలన క్షీణించిన హృదయమునుగూర్చి అతనిలో నెల్లప్పుడును మానసికాందోళన చెలరేగినది. ఇందువల్లనే శరీరాంతరాళమున నొకభాగముపై ఆతడు తన

---

5. వాల్‌సాల్వా ప్రక్రియవలన హృదయమున కెడమ భాగమున నున్న నెత్తుటి నాళములో ఒత్తిడి యేర్పడును. ఇది రక్తప్రసారము నుచితపద్ధతిలో కొనసాగించును.

6. వాల్యూము 90 6 వ సంచిక 1959 జూన్.

దృష్టి కేంద్రీకరింపగలిగినాడు. దానిపై తన యధికారము నసాధారణముగ నినుమడింపజేసుకొన్నాడు. శరీరాంతరాళమున నవయవములపై సహజాధికారమునకును, కల్పితాధికారమునకునుగల సరిహద్దు విస్పష్టముగ నిర్ణయించుట కవకాశము లేదని దీనివలన నిస్సందేహముగ నిర్ణయించవచ్చును. క్రమసాధనతో నేకాగ్రలక్ష్యముతో శరీరమున నేభాగమునయిన నదుపులో నుంచుకోవచ్చునని కూడ దీనివలన తేలినది. సముచితసాధన మాత్రమే అత్యావశ్యకమని స్పష్టపడినది.

ఇక అలౌకికసిద్ధులమాట: భూతలినుండి యకస్మాత్తుగ మామిడిమొక్క నుద్భవింపజేయుట, త్రాటితో జేయు నద్భుతకృత్యము నే నెచ్చటను చూడలేదు. అవి చూచిన విశ్వసనీయులయినవారితో నయిన ప్రస్తావించలేదు. ఇక నిప్పులగుండము తొక్కుట యొక దుష్కరమయిన అగ్ని పరీక్ష యనిగాని, గారడీ యనిగాని భావింపవచ్చును. కాని దీనిలో నంతగ విడ్డూర మేమియు లేదు. ఇది మన నాగరికత వలె అత్యంత ప్రాచీన మయినది. ఒక్క భారతదేశమునందే కాక తదితరదేశములందు కూడ నిది కానవచ్చుచున్నది. దీనిలో ననేక విషయము లెంతో జాగరూకతతో పరిశీలింపవలెను. ఈ నిప్పులగుండము రూపొందించుట కుపయోగించిన ఇంధనము లెట్టివి ? ఎంతకాల మీ గుండముపై నడచుట జరుగుచున్నది ? అను సాంకేతిక విషయము లెంతో మెళకువతో పరిశీలింపవలసినవి. కాని యోగపరిశోధన సంస్థ లేవియు నీ విషయములు పరిశీలించలేదు.

నీటిపై నడచుట, తేలుట కూడ యోగసిద్ధుల జాబితాలో జేరిననే. నే నింతకుమునుపు యువ భౌతిక శాస్త్రవేత్త నొకనిని బేర్కొన్నాను. చిన్ననాట అతడొక యోగి గాలిలో తేలిపోవుట చూచినాడు. అట్లే ఇరువదవ యేట దిగుడుబావిపై దేలిపోవుచున్న యోగి నొకనిని చూచినాడు. యోగి యా సమయమున నొకించుక పండుకొన్నాడో లేక శీర్షాసనమున మీద నున్నాడో ఆతడు విస్పష్టముగ జెప్పలేకపోయినాడు. గాలిలో తేలిపోవు వ్యవహారమాతని కంతగ విస్పష్టముగ జ్ఞప్తిలో లేదు. పైన పేర్కొన్న విషయ మొక్కటితక్క యోగి నీటిపై తేలుటయంతయు నాతని కామూలాగ్రముగ జ్ఞాపక మున్నది. చాలమంది భారతీయులవలె నీ యువకుడీద నేర్చినవాడు కాడు. ఇందుచేత నేవిధముగ నయిన నీటిపై దేలుట యీతని కొక అత్యద్భుత కృత్యముగ గన్పట్టినది. నీటిపై వెల్లకిలగ బరుండిగాని ఊపిరి సలుపునంతవరకు శరీరము మునుగనిచ్చిగాని నీటిపై తేలుట యీతవచ్చినవారి దృష్టిలో చాల స్వల్పవిషయము. యోగాసనములతో సుశిక్షితమగు శరీరము ప్రాణాయామసాధనతో సులభముగ నీటిపై తేలగలదు. సుశిక్షితుడగు యోగి యీ విషయమున నెంతటి యద్భుతకృత్యములయిన జేయగలడు. యోగి కాళ్ళు ముడుచుకొన్నట్టు చూచినానని యువకు డన్నాడు. కాని యీతని శరీరము నిలువుగ నున్నదో, లేక యోగి వెల్లకిల బరున్నాడో చెప్పలేకపోయినాడు. కొంతసేపాలోచించి యోగ నేత్రము లాకసమునే పవలోకించుచున్నవనియు, అందువలన నాతడు వెల్లకిల బరున్నాడని తన కిప్పుడు జ్ఞప్తికివచ్చినదని నాతోనన్నాడు. కాళ్ళు ముడుచుకొనిగాని, ముడుచుకొనకగాని, వెల్లకిలబరుండి నీటిపై తేలుట యీతరానివారికి మాత్రమే పరమాశ్చర్యకరమగు విషయము. చాలమంది దైవభక్తులగు హైందవులు దేవాలయ తటాకమునగాని, నదిలోగాని కన్నులు, ముక్కు మూసుకొని నీటిలో మునుగుచుందురు. ఇట్టివారికీ విషయ మెంతో విడ్డూరముగా గనిపింపగలదు.

ఇదంతయు బరిశీలింపగ నాకు నీటిపై తేలు యోగులందరు నమాయికులగు ప్రేక్షకుల నెంతో మెళకువతో మోసగించుచున్నారని అనిపించినది. అటుపిమ్మట నీటిపై దేలిపోవుటపై 'International Journal of the science of Yoga' అను పత్రికలో నొక వ్యాసము చదివితిని. ఇది శాంతాక్రజ్ సంస్థ ప్రచురించుచున్నది. ఆ వ్యాసములోని విషయ మిది. ప్లావినీ ప్రాణాయామసాధనచే పరమప్రఖ్యాతులగు గురువరేణ్యునికై కొన్ని నెలలనుండి శ్రీ యోగీంద్రు లన్వేషించుచుండిరట. ఆ గురువర్యుడు కాశ్మీర పర్వతములలో నెచ్చటనో ప్రచ్ఛన్నులై యున్నారట! ఎట్టకేలకు శ్రీ యోగీంద్రు లాయనను బట్టుకొన్నారట! ఆ గురువర్యుడు ప్లావినీ ప్రాణాయామమున పరమాధికారము గడించుకొని నీటిపై అవలీలగ తేలగల శక్తి అలవరచుకొన్నాడట! ఆత డా అద్భుతశక్తి శ్రీ యోగీంద్రుని సమక్షమున ప్రదర్శించినాడట. షక్కపుటలోనే ఆ యోగి నీటిపై తేలుచున్న టొక ఛాయాచిత్రము ముద్రించిరి. ఆ వ్యాసము చదివి ఆ చిత్రము చూచినతరువాత నా కీ విషయమున ఇంతకుమును పేర్పడిన అభిప్రాయము బాగుగ స్థిరపడినది. అంతగ లోతులేని నీటిలో నా యోగి వెల్లకిల బరుండి హాయిగ దేలుచున్నాడు. కేల్దోయి శిరస్సు వెనుక ముడుచుకొన్నాడు. ఆ ఛాయాచిత్రముపైగల శీర్షిక యిది. 'ప్లావినీ యోగసాధనమువలన నీ చిత్రమున జూపబడినట్లు సాధకుండనాయాసముగ నీటిపై దేలగల సామర్థ్యము గడించుకొనుచున్నాడు. దీని కీ చిత్రమే తార్కాణ. యోగి దీనియందు మత్స్యాసనమున నున్నారు.'

నే నటుపిమ్మట ప్లావినీ ప్రాణాయామమును గూర్చి పరిశీలించితిని: గాలి పుష్కలముగ లోనికి బీల్చి భ్రూమధ్యమున నేకాగ్రదృష్టి నిలుపవలెను. ప్లావినీ ప్రాణాయామ సాధన పద్ధతి ఇది. యోగాభ్యాసమున ప్రారంభావస్థలోనున్నవారే ప్లావినీ జోలికి బోరాదని డాక్టరు బెర్నార్డ్ ప్రత్యేకముగ హెచ్చరించినాడు. ఈ ప్రాణాయామసాధనకు హఠయోగ ప్రదీపిక ఈ క్రింది ఫలితము బహూకరించుచున్నది. 'శరీరమందంతటను సంచరించు ప్రాణముతో ఉదరము పూరింపబడినప్పుడు గభీరజలప్రవాహమున కూడ నీటిమీద తామరాకువలె శరీర మవలీలగా తేలుతున్నది.' ఇది ఇంతకంటె తేలికగ సాధించవచ్చును.

ఇందుమూలమున దేలిన దిది : వాతలతో, గాయములతో, అపస్మారకౌషధములతో, మనోవిభ్రమములతో, సమ్మోహనపద్ధతితో ఇదేవిధములయిన ఫలితము లుదయించుచున్నవి. హఠయోగాభ్యాసఫలితము లింతకన్న నెక్కువగ గాని, దక్కువగగాని ఆశ్చర్యకరములయినవని వక్కాణింప వీలుపడదు. భంగు మొదలగు మాదకద్రవ్యముల సాహాయ్యముతో బాహ్యాంతరశరీరావయవముల నిగ్రహములతో ఆత్మ సమ్మోహనప్రభావమువలన హఠయోగ మిట్టి యద్భుతానుభూతు లుద్భవింపజేయుచున్నది. వీనియందలి యాధ్యాత్మిక లక్ష్యమువలనను, ఈ ఫలితములకై యవలంబించు నిరంతరములగు ఆసనాదుల పద్ధతులవలనను మిక్కిలి ఆశ్చర్యపడిన పాశ్చాత్య పరిశీలకు లౌనౌనని తల లూచుచున్నారు. ఈఆసనాదుల వలన శరీరములోలోపలనున్న అవయవములపై మానసమున కెట్టి యధికార మేర్పడుచున్నదో విస్పష్టముగ వ్యక్తమగుచున్నమాట యథార్థమే. పాశ్చాత్యపద్ధతు లేవి ఇట్టి యత్యద్భుత పరిణామముల గలిగింపలేవన్న మాట కూడ సత్యమే. కాని దీనికొర కెన్నెన్నో వంకరటింకరపద్ధతులు, ఆత్మ వినాశకరములగు సాధనలు అవలంబించవలసిన యావశ్యకత కలుగుచున్నదన్నమాట మరువకూడదు. ఇక హఠయోగ లక్ష్యమును అత్యంతముఖ్యమును నగు నాసధ్యాత్మికముఖ్యమును గూర్చి యొకించుక చర్చింతును.

## ఆధ్యాత్మికత

యోగసాధన పరమలక్ష్యము సమాధి; పరమాత్మతో నేకీభావ మందుట. ఉప్పు నీటిలో గలిసినట్టు మానస మాత్మతో నేకీభావమొందిన యవస్థయే సమాధి యనబడుచున్నది. కాని సమాధియను పదమునకు వేర్వేరు ప్రకరణములలో భిన్నభిన్నార్థములున్న ట్టగపడుచున్నది. ఘేరండసంహిత సమాధులారు విధములని పేర్కొనుచున్నది. వీనిని ప్రత్యేకముగ వేర్వేరు మార్గములలో నధిగమించవచ్చును. కొంద రనువాదకులు సమాధి పదమునకు ధ్యానమనియు, మరికొందరు మనన మనియు, తదితరులు లయీభావ మనియు వేరువే రర్థములు వక్కాణించుచున్నారు. ఇంకను గొంద రానందతన్మయత యనియు, పరాచైతన్యమనియు లేక స్వప్నవిహీన గాఢసుషుప్తి యనియు వివరించుచున్నారు. ఇంత వైవిధ్యమున్నను వ్యాఖ్యాత లందరు నంగీకరించు ప్రాథమిక విశాలవ్యాఖ్యాన మొకటి కానవచ్చుచున్నది. మనస్తత్వశాస్త్రదృష్టితో బరిశీలించినయెడల సమాధిలో శారీరిక ప్రాథమిక సంచలనములన్నియు చాలవరకు సంక్షీణములగునని చెప్పవచ్చును. హృదయస్పందనము, నాడీచలనము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, శరీర పోషణ, అన్నియు చాలవరకు మందగించును. శరీరము సర్వము నొకవిధమగు ప్రసుప్త్యవస్థలో ప్రవేశించును. మానసికముగ సమాధి శుద్ధచైతన్యరూపమని వివరించుచున్నారు. స్వచ్ఛచైతన్యమేగాని దానియం దెచ్చట విషయవాసన భాసించదట. ఈవిధముగ విషయనిర్ముక్తమగు జీవచైతన్యము పరమాత్మచైతన్యముతో నైక్యమందుచున్నది. జీవాత్మ స్వరూప మధిగమించినప్పుడే పరమాత్మానుభూతి సాక్షాత్కరించగలదు. జీవాత్మ నశ్వరము. కాని పరమాత్మ చలనరహితము. వ్యావహారికజగతి కతీతము. పరమబ్రహ్మ స్వరూపమదియే. భావావేశదృష్టితో పరిశీలించినయెడల సమాధి పరమానంద స్థితి. దాని ప్రారంభమున జాజ్వల్యమానమగు కాంతిపుంజ మావిర్భవించి జగత్తు యావత్తు గ్రహించివేయును.

సమాధి కొన్ని నిమిషములవరకుగాని కొన్ని దివసముల వరకుగాని అచంచలమై నిలువవచ్చును. మహాసమాధియన్నస్థితి ఇంకొకటి. యోగి యథేచ్ఛగా దానిలో ప్రవేశించగలడు. దానితో శరీరమును దానియాధారమున నుద్భవించిన జీవాత్మయు నశించిపోవుచున్నవి. కాని వాస్తవాత్మ జననమరణ బంధవినిర్ముక్తమై శాశ్వతవిశ్వాత్మలో లీనమగుచున్నది. ఒక్క మహాసమాధిలోతక్క తదితర సమాధులయందన్నిటియందును మానసము లిరిగి జీవాత్మవైపు మరలుచున్నది. ఈ వాస్తవాత్మకును ఫ్రాయిడ్ దృక్పథమున నిశ్చైతన్యమునకును, యూంగ్ మతమున సామూహికనిశ్చైతన్యమునకును నెట్టి సంబంధమును లేదు. మనకు తెలిసినంతవరకును ఈ నిశ్చైతన్యము స్వప్నస్థితియం దభివ్యక్తమగుచున్నది. కాని హైందవవేదాంతమున స్వప్నము జీవాత్మ వ్యాపారము. సత్యాత్మ వ్యాపారముకాదు. సహజముగా స్వప్నరహితమగు స్థితియందే సత్యాత్మ సాయుజ్యము లభ్యమగును. అయిన సుషుప్తి, సమాధి ఒక్కటే అనవచ్చునా? అయినచో నద్దానిని పరాచైతన్యమనిగాని, మనన స్థితి అనిగాని పేర్కొనుటయెట్లు? అది యొక విధమగు నిశ్చైతన్యస్థితికాదా? భారతీయ వేదాంత మీ పదముల కే మాత్రము వైరుధ్యములేదనిగాని, లేక ఈ వైరుధ్యమేమియు బట్టించుకొనదనికాని పై ప్రశ్నల కుత్తరము తీయవలసియున్నది. పరబ్రహ్మ పరిపూర్ణుడు, శూన్య స్వరూపుడు. ఆ పరబ్రహ్మ యన్నియు గావచ్చును. ఏదియు గాకపోవచ్చును. కైవల్యమూర్తి. విశ్వవ్యాపి. ఇవియన్నియు నొకేకాలమున సంభవించవచ్చును. కాలాతీతములై కూడ సంభవించవచ్చును. విషయము లన్నింటి నుండియు మరలి స్వతః శూన్యమై, మననవస్తుశూన్యమైన మానసిక స్థితి పాశ్చాత్య మనస్తత్వశాస్త్రమున నిశ్చైతన్యస్థితి యని పేర్కొనబడుచున్నది. ప్రాచ్య వేదాంతు లీ విధముగ్గున్న

అధివర్ణన పరబ్రహ్మ విరుద్ధమని వివరించరు. కాని ఆ నిశ్చైతన్య స్థితిలోకూడ స్వచ్ఛ చైతన్య మున్నదని నొక్కివక్కాణించు చున్నారు. ఈ విషయమున వాదోపవాదము లించుమించుగ నీ విధముగ కొనసాగును.

ప్రశ్న : మీరు స్వచ్ఛ చైతన్యమనుచున్నారు. ఆ చైతన్యమున కాధారభూతమయిన విషయముండవలెనుగదా? అది ఏది?

ప్రత్యుత్తరము : తానే చైతన్యమున కాధారభూతమగు విషయము. అంతేగాని వేరొకటి ఏదియు నద్దానికి విషయముకాదు.

ప్రశ్న : పరమాత్మ చైతన్యము గురుతించిన వ్యక్తి ఎవ్వరు? సమాధినిష్ఠుడేనా?

ప్రత్యుత్తరము : కాదు. సమాధిలో సామాన్య జీవాత్మలేదు. అహంకార నిరహితమయిన వాస్తవికాత్మయే యథార్థాత్మ చైతన్యమును గురుతించుచున్నది.

ప్రశ్న : వ్యక్తి సామాన్యజీవాత్మ నశించినప్పుడు అతనికిక ఒక వస్తువును గురుతించు శక్తి యుండదు. అత డప్పుడ నిశ్చైతన్య స్థితియందున్నాడని చెప్పవలసి యున్నది.

ప్రత్యుత్తరము : అయ్యది యథార్థమే. కాని అతడప్పుడు పరాచైతన్య స్థితియందున్నాడని చెప్పవలసియున్నది. అయ్యదియే సమాధియని చెప్పబడుచున్నది. లేక నిశ్చల మనన విలీనుడయినాడనిగాని, సత్యస్వరూపమగు పరమాత్మతో తాదాత్మ్యమందినాడని గాని చెప్పవలసియున్నది.

ఈ ప్రశ్నోత్తరము లిదేవిధముగ చక్రనేమిక్రమమున దిరుగుచుండును. సమాధి సుషుప్తులొకటే యనుభావము ఉపనిషత్తులలో ప్రారంభించి ఆధునికాధ్యాత్మికవాది కృష్ణమీనన్ వరకు ననుస్యూతముగ వచ్చుచున్నది. ఆధునిక హైందవ విద్వాంసులు కొందరీవిషయ మేదో విధముగ సమన్వయముచేయ ప్రయత్నించుచున్నను ఇది యెవ్వరును కాదనజాలరు. పాశ్చాత్య విద్వాంసులలో కొందరికి హైందవాధ్యాత్మిక విషయమున గలిగిన భ్రమప్రమాదము లొకించుక తొలగించవలసియున్నది. కాన ప్రసిద్ధములగు కొన్ని యుపనిషత్తుల ముఖ్య భాగములు కొన్ని ఇచ్చట నుదాహరించుచున్నాను.

## ప్రశ్నోపనిషత్తు

చతుర్థ ప్రశ్నము : సౌర్యాయణి గార్గ్యుడప్పు డీవిధముగ ప్రశ్నించెను: మహర్షీ! జీవునియందు నిదురించునదేది? మేలుకొనున దెయ్యది? స్వప్నమునవలోకించు గ్రహణశక్తి యెయ్యది? ఇంద్రియము లనుభవించు ఆనంద మెవ్వనియందున్నది? సర్వము నెవ్వనియందు సుప్రతిష్ఠితమై యున్నది? పిప్పలాదు డా ప్రశ్న కివ్విధముగ ప్రత్యుత్తర మొసగెను: 'గార్గ్య! అస్తమించుచున్న సూర్యుదేవుని కిరణావళి తిరిగి ఆ ప్రభామూర్తి మండలమున లీనమగుచున్నది. అతడుదయించునప్పుడు కిరణము లన్నియు మరల నావిర్భవించుచున్నవి. అట్లే సర్వమును నవలోకించు హృదయమున సర్వము నణగిపోవుచున్నది. జీవుని యందప్పుడు వినుట, చూచుట, ఆఘ్రాణించుట మొదలుగాగల క్రియాజాల మంతరించుచున్నది. ఆ సమయమున ప్రాణాగ్ని మాత్రమే శరీరమున ప్రజ్వలించుచున్నది. ద్రష్టయగుమానస మప్పుడు స్వప్నమున తన మహిమ గురుతించుచున్నది. కాని మానసమున నాంతరజ్యోతి వెలిగినప్పుడు దాని స్వప్నసంచారమాగిపోవుచున్నది. అప్పుడీ దేహమున సుషుప్తి పరమానందమావిర్భవించుచున్నది. నాయనా! విహంగములన్నియు తమతమ కులాయములలో విశ్రమించినట్లే సమస్తమును పరబ్రహ్మయందంతర్లీనమగుచున్నది.....''

## మాండూక్యోపనిషత్తు

దీనిలో ప్రధానశ్లోకము పరబ్రహ్మసూచకమగు నోంకారోచ్చారణ చర్చతో ప్రారంభమగుచున్నది. ఆపైన ఆ చర్చ ఈ విధముగ కొనసాగుచున్నది. 'ఆత్మయే పరబ్రహ్మ. ఇయ్యది పాదచతుష్టయాత్మకము. బాహ్య ప్రపంచ విజ్ఞానాత్మకము జాగ్రదవస్థ ప్రథమపాదము. స్థూల విషయ విహీనమై లోలోపల సూక్ష్మానందమయమగు స్వప్నావస్థ ద్వితీయ పాదము. నిద్రితుడగు జీవుడు కాంక్షిత మేదియు సంకల్పించక స్వప్నమేదియు సందర్శించనట్టి స్థితియే సుషుప్తియనబడుచున్నది.ఇయ్యది స్వచ్ఛ ప్రజ్ఞానానందఘనము.దీనియందానందము మాత్రమే యనుభూతమగుచున్నది. ఇయ్యది తృతీయ పాదము. ఇక తురీయావస్థయందు ఆంతర బహిర్వస్తు జ్ఞానముండదు. ఇయ్యది అజ్ఞేయము. అనిర్వర్ణనీయము. అనిర్వాచ్యము. ఇయ్యది ప్రపంచోపరమస్వరూపము. పరమప్రశాంతము. ఆనందమయము. అద్వైతము. ఇయ్యదియే చతుర్థ పాదము. ఇదియే పరబ్రహ్మ. దీని సాక్షాత్కారమే పరమ ప్రాప్యము''

## ఛాందోగ్యోపనిషత్తు

6. 8. 1—7 ఆరుణి ఉద్దాలకుడు తన తనూజుడు శ్వేతకేతువున కివ్విధముగ నుపదేశించెను : 'నాయనా! నీ కిప్పుడు సుషుప్తిస్వరూప ముపదేశించుచున్నాను. పూరుషుడొకడు నిద్రించుచున్నాడన్నప్పుడు అతడాత్మతో నైక్యమందుచున్నాడు. అప్పు డాతనికి సత్యాత్మ సాక్షాత్కరించుచున్నది. కనుకనే యాతడు స్వస్వరూపమున ప్రవేశించినాడని విజ్ఞులనుచున్నారు. వాస్తవముగ నాతడాసమయమున తన యథార్థాత్మస్వరూపముతో నైక్యమందుచున్నాడు.

81.4 శరీరమున ప్రగాఢ సుషుప్తి సమయమున నుద యించిన ఆనందము సత్యాత్మజ్యోతీరూపమగు స్వస్వరూపమందు కొనుచున్నది. ఇయ్యదియే పరమాత్మ. ఈ పరబ్రహ్మ మృత్యువిహీనము. భయ విరహితము.

8.11 స్వప్నశూన్యమగు ప్రగాఢ సుషుప్తియే పరమాత్మ. అయ్యది మృత్యు విహీనము. భయరహితము. అదేపరబ్రహ్మ.

## బృహదారణ్యకోపనిషత్తు

14—20 అజాతశత్రువు గార్గ్యుని కరతలి కేల గీలించెను. వారుభయులు నొక నిద్రితుని సమీపించిరి. అజాత శత్రు వటుపిమ్మట 'శ్వేతాంబరధారీ! మహారాజా! సోమా!' అని యాతని పేరుపెట్టి పిలిచెను. అనంతర మజాతశత్రు వీ విధముగ బ్రశ్నించెను. "గార్గ్య! నిద్రించుచున్నప్పు డీత డెచ్చట కేగెనో మరల నెచ్చటనుండి తిరిగివచ్చెనో కనుగొంటివా?' కాని గార్గ్యునికది తెలియలేదు. ఆపైన అజాత శత్రువాతని కీవిధ ముగ నుపదేశించెను. 'గార్గ్య! అతడు గాఢసుషుప్తిసమయమున ఇంద్రియవ్యాపారమంతయు, జ్ఞానమంతయు దనలోని కుప సంహరించుకొని హృదయాకాశ గహ్వరమున నిద్రించెను. పురు షుడు నిద్రించునప్పుడు ఘ్రాణాదీంద్రియములతోబాటు మాన సముకూడ నంతరాకృష్టమగుచున్నది. స్వప్నమున విహరించు నప్పుడు ఆ యా లోకములన్నియు నాతని కధీనము లగు చున్నవి. ఆతడొక మ హ నీ య నృపతి కావచ్చును. పరమ పూజ్యుడగు బ్రాహ్మణోత్తముడు కావచ్చును. ఇంకను నత్యున్నతమగు స్థితి యధిగమించవచ్చును. అధమాధమ స్థితిలో పడిపోవచ్చును. ఒకమహారాజు తన వాహినులతో తన దేశమున యథేచ్ఛగ విహరించుచున్నాడు. అట్లే నిద్రితుడగు పూరుషుడు తన ఇంద్రియావళితో యథేచ్ఛగ పరిభ్రమించుచు న్నాడు. కాని సుషుప్తిలో ప్రవేశించిన పూరుషుని కెవ్విధమయిన ఎరుకయు నుండదు. హృదయమునుండి బయలువెడలిన డెబ్బదిరెండువేల నాడులు శరీరమునందంతను నలముకొని యున్నవి. పూరుషుడు వానిద్వారా తిరిగి శరీరమున ప్రవే శించుచున్నాడు. పసిబాలకునివలె, సార్వభౌమునివలె నమందా నంద భరితుడై స్వశరీరమున నిద్రించుచున్నాడు. ఇయ్యది పరమ రహస్య వివరణము. ఆ పూరుషుడే సత్యస్వరూపుడని గురుతించుకొనుము.

4—3—2—7 నిద్రితుడయిన పూరుషుడీ ప్రపంచము నధిగమించుచున్నాడు. సమస్తమృత్యుభూమికలను అతిక్ర మించుచున్నాడు. అనగా ఐహిక క్రియాకలాపములన్నియు పరిత్యజించుచున్నాడని యర్థము. 9 పూరుషుడా స్థితియందు స్వయముగానే నాత్మ విజ్ఞానము గలవాడగుచున్నాడు. 21 సుషుప్త్యవస్థయందు కామనలుగాని, గుణదోష సంపర్కలేశము గాని భయావేశముగాని తలయెత్తనేరవు. ప్రియాలింగనమున మైమరచిన పూరుషుడు బాహ్యజగత్తంతయు విస్మరించు చున్నాడు. ఇదేవిధముగ సుషుప్తిలో నాత్మజ్యోతి రాలింగితు డగు పూరుషుడు బాహ్యాభ్యంతర విషయములన్నియు విస్మ రించుచున్నాడు. ఆ స్థితియందు కాంక్షితములన్నియు సమగ్ర ముగ నెరవేరును. అచ్చట మరి సుఖదుఃఖ ప్రసక్తియేలేను. కేవలము ఆత్మప్రాప్తి పరమానంద మొక్కటేసాక్షాత్కరించును.

ఇక ఆధునికాధ్యాత్మికవాది కృష్ణమీనన్ మాట: 'ప్రగాఢ సుషుప్తియందొక అనిర్వచనీయానందము సాక్షాత్కరించును. 'నే'ననునది అద్దాని కుపస్ఫోరకము. ఆస్థితిలో మానసమునశించు చున్నది. అందువలన ఆ యానందస్థితి అది యాకళించుకొన నేరదు. మనస్సును దానివైపు మరలించినప్పు డది స్వకీయ స్వభావమును గోలుపోయి పరమానందస్వరూపముతో తాదా త్మ్యమందును. ఇదియే సమాధి.'

ఇదియంతయు నొక మృత్యుసూక్తముగ బ్రతిధ్వనించు చున్నది! దీని గభీరార్థమిదియేయని నా అభిప్రాయము. స్వప్న రహితమగు ప్రగాఢ సుషుప్తిరూపమగు సమాధి తుది మృత్యు ప్రయత్నమేగాని వేరొకటి కానేరదు. చిట్టచివరి కీసమాధి దాని యందే పర్యవసితమగుచున్నది. కేవల మిచ్ఛాశక్తివలన నిద్ర అసాధ్యము. ప్రగాఢ సుషుప్తి యంతకన్న దుస్సాధ్యమని వేరుగా జెప్పనక్కరలేదు. కాని సమాధి ప్రయత్నపూర్వకముగ సాధింప వచ్చును. అదియే అద్దాని ప్రత్యేకత. వైదిక కాలమునుండి నేటి వరకును అధ్యాత్మిక సంయోగ రూపమగు నీ సమాధి యొక్కటే యోగలక్ష్యము. పైపైకి మిక్కిలి యసభ్యములుగ, నసహ్య ములుగ గానుపించు నాసాధన లన్నింటికిని వెనుకనున్న పరమార్థ మేమియో మనకిప్పు డామూలాగ్రముగ నవగతమయినది. క్రమక్రమముగ నిచ్ఛాశక్తితో ఆ యా సాధనలతో శరీరవినా శనమే ఈ సాధనల పరమ లక్ష్యము. ఇయ్యది ప్రాణాయామ ముతో నారంభమై చైతన్య సంస్తంభనమున బర్యవసితమగు చున్నది. ఇదియే దీని తుది మెట్టు.

శరీరములపై సర్వాధికారము, దీనికి సంబంధించిన సమస్త సంచలనముపై సమగ్ర ప్రాభవము గడించుకొన్నప్పుడే ఇయ్యది సుసాధ్యమగుచున్నది. కామప్రవృత్తికున్ముఖములగు శారీరక ప్రవృ త్తుల నన్నింటిని వానిలక్ష్యములనుండి బలాత్కారముగ సమా కర్షింపవలయును. మృత్యుముఖమున వానిని బ్రసరింపజేయ వలయును. లోలోపలి శరీరావయముల ప్రవృత్తుల నూర్ధ్వముఖ ముగ ద్రిప్పినయెడల ఇయ్యది సులభ సాధ్యమగును. శారీరములోని

మలినపదార్థములను బయటికి వెడలఁగక్కుటకు ఉద్దేశించిన యవయవములన్నిటిని ఊర్ధ్వముఖముగ నాకర్షణకై వినియోగింపవలయును. ఆ హారాది స్వీకరణ కుపయోగించుచున్న ముఖాది ద్వారము లన్నింటిని మన బాహ్యప్రపంచముతో సంబంధము లేకుండ బంధించివేయవలయును. ఒకవేళ నిది సమగ్రముగ సాధ్యపడకపోయినను కొంతవరకయిన వాని ప్రవృత్తి అరికట్ట వలయును. ఉచ్ఛ్వాస నిశ్వాసములు, నాడీ చలనము, హృదయ సంచలనము నిలిపివేయవలయును. నేత్రములను లోనికిని పైకిని బలవంతముగ గిరిగిర త్రిప్పి కనుపాపలేని వాని విశదస్వరూపము మాత్రమే ప్రపంచమువైపు మరలింపవలయును.

శరీరావయవములయెడల నొక యోగి వైఖరి సైనికుల యెడల, తదితరాధికారులయెడల నొక సర్వసేనాధిపతి దృష్టితో సరిపోల్చవచ్చును. సంపూర్ణ క్రమశిక్షణకై సైనికులపటాల మెల్లప్పుడు సర్వ సంసిద్ధముగ నుండవలయును. ఎంతటి యపాయకర కృత్యములకయిన నయ్యది వెనుదీయరాదు. ఆవశ్యక మయిన ఆత్మప్రాణార్పణకయిన నయ్యది సిద్ధపడవలయును. అదే విధముగ శరీరము కూడ యోగి ఆజ్ఞానుసారము, సంపూర్ణ వినాశనమునకుగాని, అర్ధవినాశనమునకుగాని సర్వదా సంసిద్ధమై యుండవలయును. ఇందువల్లనే మూలాధారమున నిద్రించు చున్న కుండలినీశక్తి నుద్బోధింపవలసిన యావశ్యకత కలుగు చున్నది. క్రమక్రమముగా దానిని భ్రూమధ్యముననున్న నాజ్ఞా చక్ర సమీపమున కాకర్షించవలయును. అటుపిమ్మట సర్వ సంహారకుడగు పరమశివుని తుది యాలింగనమునకై దానిని ప్రేరింపవలయును.

శరీరము తిరిగి ధూళిలో గలిసిపోవుటకై క్రైస్తవ సన్యాసి శరీరమత్యంతము శుష్కింపజేయుచున్నాడు. అయ్యది మిగుల తిన్న నయినమార్గము. కాని హైందవయోగి ఈవిషయమున మిక్కిలి వక్రమార్గ మవలంబించుచున్నాడు. సంపూర్ణవినాశమునకై యోగి శరీరమును సర్వసమర్థముగ, సంపూర్ణ చైతన్యవంతముగ దయారు చేయుచున్నాడు. ఆ సంపూర్ణ శరీరవినాశనమే సమాధి. ఆపైన స్వర్గీయపితగాని, మందస్మితవదనయగు మేరీ కన్యగాని పరమ ప్రాణేశ్వరుడుగాని కానరారు! ఆపైన నున్నది కేవలము సత్యాత్మస్వరూపము మాత్రమే. కాని దాని గుణ గణములన్నియు నేతి నేతి పదవాచ్యములు! అది పరమ శూన్య స్వరూపము! ఓమ్ అను నేకాక్షరమున దాని స్వరూపమంతయు నిమిడియున్నది.

ఈ భయంకర శిఖరాగ్రము చుట్టును సిద్ధులను ముండ్లపొదలుండుటలో నాశ్చర్యమేమియులేదు. మృత్యువుపై సంపూర్ణాధికారము చేజిక్కించుకొన్నామనుకొన్నవారికి మిగుల నాశ్చర్యకరములగు సిద్ధులు కరతలామలకములయిన నాశ్చర్య మేమి ఉన్నది! ఇంద్రియ ప్రపంచము మాయామయమని యు, దేశ కాల భూమ్యాకర్షణశక్తులుగూడ నట్టివేయని నిరూపింపకతప్పదుకదా!

కాలక్రమమున నీ భయంకరశిఖరాగ్రమున ముండ్లపొద లెక్కువయినవి. ఈ బీభత్స శిఖరాగ్రమును జేరగోరు వారి ఆసన బంధనాదులన్నియుగూడ మిక్కిలి భయంకరములుగ బర్యవసించినవి. చిట్టచివర కవి సాధనమే సాధ్యముగ రూపొందించు మానవ దుంఖాంతమారణగాథ కుపస్ఫోరకములుగ శేషించినవి!

పతంజలి యోగసూత్ర మించుమించుగ 'ఆరిస్టోటల్ లాజిక్' గ్రంథము కాలముననే ఒకటి రెండు శతాబ్దము లావలగనో, ఈవలగనో ఉద్భవించినదని చెప్పవచ్చును. హఠయోగప్రదీపికకూడ నిదేవిధముగ నారిస్టోటిల్ సిద్ధాంతములపై నాధారపడిన శుష్కతార్కికుల కాలములో బయలుదేరినది. ఈ రెండు విధములగు సంప్రదాయములను మహనీయ మానవ మేధ పరిక్షీణస్వరూపమునుండి సముద్భవించినవే. ఆరిస్టోటలీయ శుష్కతార్కికులు అర్థములేని వ్యర్థపదముల గారడీలతో సంతృప్తిపడిరి. కాని స్వాములవారలందరును నీగారడీ వ్యవహారము తమ జీర్ణకోశములతో కొనసాగించిరి! ఆ శుష్కతార్కికుల నీనాడందరు బూర్తిగ విస్మరించిరి. కాని యోగ వ్యవహారము దీనికి కేవలము వ్యతిరేకముగ నున్నది!

ఈ సందర్భమున శుష్క తార్కికుల విషయమై ఇరాస్మన్‌సూక్తి స్ఫురించుచున్నది. 'అస్తిత్వ మసలే లేనిదానికై ఈశుష్కతార్కికులందరు గాఢాంధకారమున నన్వేషించు చున్నారు!' కాని భారతీయాధ్యాత్మికవాది కీవాక్యమున నిందార్థ కమేమాత్రము స్ఫురించనే స్ఫురించదు. కేవల మిది యథార్థ కథనమని యాతడామోదించుచున్నాడు! యోగమత్యున్నతా దర్శమని ఆ మార్గము ననుసరించుచున్నాడు!

అసిధారా మార్గమగు యోగపద్ధతి నెంతయు నిజాయితీతో ననుసరించిన పాశ్చాత్యులలో బహుశః డాక్టర్ బెర్నార్డు అతి వినీతవైఖరితో నిరంతర కృషి సాగించిన శ్రద్ధాళువు. చిరకాలసాధన కొనసాగించిన పిమ్మట ఆతడు యోగ ముపై తన కట్టకడపటి గ్రంథము రచించెను. ఆ సంగ్రహ గ్రంథ విషయసూచికలో హృదయము ద్రవింపజేయగల శీర్షికలు రెండు కానవచ్చుచున్నవి!

అత్యద్భుతము లెవ్వియు నావిర్భవించలేదు!
అతిలౌకికమేదియు సాక్షాత్కరించలేదు!

ఎన్‌కౌంటర్ పత్రిక సౌజన్యంతో

# విషణ్ణ వైదేహి

## శ్రీ బాలగంగాధర తిలక్

ఆ మున్యాశ్రమ వాటికా మధుర కుల్యాజీవనోజ్జీవన
శ్రీ మందారమహీజ మూలమున ఓ సీతమ్మ! ఆసీనవై
ఏ మాలోచనలా దృగంచలములం దేవార్ద్ర మేఘావళీ
శ్యామాకాశము లోసరిల్లినవొ ఆశాహీన కాళచ్ఛవిన్.

ఏదో శూన్యము హృద్గతంబయిన భాతిన్ దోచు నెమ్మోము బా
ధాదైన్యమ్మున కొక్క దర్పణము కాదా తల్లి! రాజ్ఞీత్వ మ
ర్యాదాలంకృతమైన రాఘవుని యిల్లాలిల్లు చింతాజ్వలా
నైక దాఘాగ్నుల గాత్రవల్లి పసివాళ్వాడించునే నిర్దయన్.

అల్లిన నారచీర బిరుసై సుకుమార వపుర్నిపీడనా
వేల్లనమైన లెక్కగొన; వించుకదోహదమేని లేని నీ
నల్లని కైశికమ్ము జఘనమ్మునఁ బర్వె సుదీర్ఘదుఃఖమే
వెల్లువమైనయట్లు రఘువీరుడు మోపిన నిందయట్లుగా.

నిన్ను స్వయంవరారచిత నిస్తులమూర్తిని, పూర్ణచంద్రికా
స్విన్న విలాసగాత్రరస సేవధిగాంచి, హఠాదధిజ్య బా
ణోన్నత కోటిమన్మథు లెదుర్కొన నెంత చలించినాడు శ్రీ
మన్నలినాక్షు డంబ! పవమాన విధూత వినీల మేఘమై.

ఊరుపు నూరుపేర్పరుప నొల్లని మీ ప్రణయైక జీవన
ప్రేరితమై ద్విధాహృదయ భేదమెరుంగని స్పందనక్రియా
కోరకితమ్మునై అవధి గొన్నది కాలము పుండరీక మా
లారమణీయమై విరిసెనందురు కాదటె మీ గళమ్ములన్.

ఏవిధిచేత నీవిటుల నేచువియోగపు సీతు కందువన్
పూవయి వాడివత్తలయి పోతివొ; అల్ల రఘూద్వహుండు సీ
తావిరహార్చిలో తనకుదానె సమిత్తుగ మౌనవేదనా
జీవము వేల్చు, భీకరము చిత్రము వక్రము జీవితాధ్వమున్.

నీకథ నన్ను నవ్య నవనీతముఁబోలె కరంచె, భారతా
స్తోకచరిత్రలో విషమసుందరమున్ కరుణాప్రపుల్లమున్
ప్రేకదనమ్ము దుస్సహపు వేదనయుఙ్ మిళితమ్మునొంది ఏ
కైక విషాదనాయికవుగా జగదీడితవైతి వమ్మరో.

పాండవపత్ని జీవితపుబాట యగమ్యము నిత్యనూతనా
చండిమమున్; తదన్యగుణశాలిను లున్నను, తల్లి నీవు మా
గుండెల రక్తనాళములఁ గోసిన జాలివి, నిర్మలాత్మ మే
నిండుగ వెల్గు నీకనులు నిల్చుచు జాతికి వెల్గు మిన్నలై

అడుగులోన అడుగులై నడచెడి నిన్ను
నిడుము లొరసి ముంచె కడలివోలె;
కడలులేచి రేఁగు కటికి చీకటిలోన
మొగిలు కూడ క్రమ్మి మూసె నభము.
కాని గాఢదుఃఖ కర్దమహ్రదమున
విరిసెనో హో ధ్యాన సరసిజమ్ము
రామనామ సూర్యరశ్మి సోకినయంత
దళము దళముపాడు గళము నెత్తి.

నీవు సన్నిహితవు నిఖిలాంధ్రజాతికి
నీదు పేరు విన్న నిలిచి మ్రొక్కు—
బాధనోర్చి బ్రతుకు పడతిని సీతమ్మ
యీమెయంచు పిలుతు రింటనింట.

ఏ శరదిందురేఖ స్పృశియింపగ నవ్విన సన్నజాజి, ఆ
శా సికతాతలాల చిగుసవ్వడి దొర్లెడి పాలనుర్వు, ఏ
మూసిన కొండకోన కొస మ్రోగిన వేకువ వెల్గు మువ్వ, నీ
తో సరిరావుగా వికసితోత్పల నేత్రి! మైథిలీ!

# సాహిత్య అకాడమీ: సాహిత్య సమావేశాలు

శ్రీ కుల్వంత్ సింగ్

ఇతరు లెవ్వరితోను సంబంధంలేకుండా నా మానాన్న నే నుండగలను. కాని తోటి రచయితలతో సహవాసాలు, సమావేశాలు లభించాలని అభిలషిస్తాను. ఒకరొకరి రచనలు పరిశీలిస్తూ విమర్శనలు, సలహాలు ఆహ్వానిస్తే నూతనరచనలు రేకెత్తించే ఉత్సాహం పెంపొందింపజేస్తాయని ఆశించాను. కాని ఈ సమావేశా లటువంటి ప్రోత్సాహం కలిగించలేదు. పైగా మొదటికే మోసం వచ్చింది. మనదేశంలో రచయిత లొకచోట కలుసుకోవా లనుకుంటే కొన్ని సారస్వతసంఘాల మీద ఆధారపడాలి.

పి. ఇ. ఎన్., అభ్యుదయ రచయితల సంఘం, ఆసియా రచయితల సంఘము మొదలయినవి రచయితల కొకవిధమైన నైపుణి అలవరచుకొన్న కార్మికుల క్రింద జమకడుతున్నాయి. వాటికి ట్రేడ్ యూనియన్ ఉద్యమం వాసన వచ్చింది. రచయితల పరస్పర స్నేహ సామరస్యాల కివి తోడ్పడడంలేదు. పైగా పోటీధోరణి, ఈర్ష్యాసూయా తత్వాలు పెంపొందిస్తున్నాయి. నిరంతర రచనావ్యాసంగానికి బదులుగా వట్టి ఊకదంపు ఉపన్యాసాల హంగామా ప్రోత్సహిస్తున్నాయి. ఇందువల్ల రచయితలు ప్రథమశ్రేణి సాహిత్యస్రష్టలుగా రూపొందక, వట్టి రెండవరకం రాజకీయవేత్తలుగా తయారవుతున్నారు.

ఇతరు లెవ్వరి సారస్వతమయినా చక్కగా ఉన్నదంటే మనదేశంలో సాహితీపరులు భరించలేనంత ఓర్వలేనితనంతో మగ్గిపోతారు. ఈ విపరీతవైఖరి మరి ఏ దేశంలోను కనబడదు. రచయితలు సౌహార్దదృష్టితో తమకుతామై ఒండొరులతో సమావేశాలలో పాల్గొన్ననాడు ఇటువంటి పరిస్థితి ఏర్పడిఉండేది కాదు. ఆయా సారస్వతసంఘాలీసమావేశాలు ఏర్పరచడంతో ఇలాంటి దుస్సహపరిస్థితి ఏర్పడుతున్నదని నా నిశ్చితాభిప్రాయము.

## ప్రసంగ గోష్ఠుల ఆవశ్యకత

నాకే కనక అధికారం హస్తగతమయితే ప్రస్తుత సారస్వత సంఘాలన్నీ రద్దుచేస్తాను. రచయితల సమావేశా లెక్కడా జరగకూడదని నిషేధిస్తాను. వీటికిబదులు రెస్టారెంటులు కొన్ని స్థాపిస్తాను. సాహితీపరులకు కూడ పరస్పర పరిచయావకాశాలు, ప్రసంగ గోష్ఠులు ఏర్పాటు చేస్తాను. ఫ్రాన్సులో నెలకొన్న ఇటువంటి చక్కని సంప్రదాయం భారతదేశంలో మాత్రం ఎందుకు సాధ్యపడదు ? పరులు పోషించాలన్న ప్రతీక్ష కళలకెన్నడు మంచిదికాదు. పూర్వం మహారాజులు, శ్రీమంతులు కళల నాదరించి పోషించి ఉండవచ్చును. కానివారు తాము ప్రోదిచేసిన సాహిత్యసృష్టి సగౌరవంగా స్వీకరించారు. అంతేగాని వా రెన్నడు తమ హద్దు లతిక్రమించలేదు. కాని నిరంకుశప్రభుత్వాల కిటువంటి సత్సంప్రదాయాలు లేవు. ఇటువంటి ఏలుబడుల అధికారులలో కొద్దో గొప్పో చదువుకొన్నవారుమాత్రమే కనిపిస్తారుగాని విజ్ఞు లెక్కడో సకృత్తుగాగాని కనబడరు. వీరు తమక్రింది ఉద్యోగులవని పరిశీలించినట్లే కళావ్యాసంగం పరిశీలిస్తారు. తమ పై అధికారుల అడుగులకు మడుగులొగ్గి ఉద్యోగాభివృద్ధి సాధించినట్లే, గడసరిదుకాణదారుడు, చేతిబండివ్యాపారి తమ తమ వస్తువు లంటగట్టినట్లే వ్యవహరిస్తారు. అంతేగావి సారస్వతంలోని విలువల లోతులమాటే పట్టించుకోరు.

సహజంగా కళాశీలి ఎల్లప్పుడు ఏకాంతమే అభిలషించాలి. అప్పుడుగాని చెప్పుకోదగిన కళాసృష్టి సాధ్యపడదు. ఇటువంటి సాహితీపరు లంతగా నలుగురితో కలిసి మెలిసి తిరగలేరు. ఆపైన ఇటువంటివారి కనేకవిధాలయిన పైత్యా లుంటాయి. అయినా కళాకారు లందరు సముచితమయిన ఆదరణ ఆశిస్తారు. కాని వట్టి అనర్హుల కిట్టి ఆదరణ లభించినప్పుడు వారి దృక్పథం కలుషితమై సృజనశక్తి స్వచ్ఛమార్గంలో రూపొందకపోవచ్చును.

## ప్రభుత్వ శాఖ

ఎవ రెన్నివిధాల కాదన్నా సాహిత్యఅకాడమీ ప్రభుత్వంలో ఒక శాఖ అని చెప్పక తప్పదు. ఇందువల్ల ఇంచు

మించుగా గడిచిన ఆరు సంవత్సరాలనించి దీనివల్ల మేలుకన్న కీడే ఎక్కువ జరిగినదని వాస్తవపరిస్థితులనుబట్టి అంగీకరించక తప్పదు. అకాడమీ సభ్యత్వం ఏదో ఒక గొప్ప ప్రతిఫలితం ప్రసాదించే పదవి అన్న అభిప్రాయం బాగా స్థిరపడింది. ఇది చేజిక్కించుకోవడం కోసం ఉద్యోగం కోసం ప్రాకులాడినట్టు తంటాలుపడడం జరుగుతున్నది. అనువాదాల పని అప్పగించడంలోను, ఆయా పుస్తకాలు వ్రాయించే వ్యవహారంలోను ప్రభుత్వశాఖల్లో జరిగే అక్రమాలన్నీ యథాతథంగా ప్రత్యక్ష మవుతున్నాయి. ప్రభుత్వం ప్రసాదించే అయిదువేల రూపాయల బహూకృతి సంపాయించడంకోసం మునిసిపల్ ఎన్నికల్లో అభ్యర్థులు, వోట్లకోసం కాన్వాస్‌చేసుకొన్నట్టు రచయిత లనేకవిధాల ప్రయత్నిస్తున్నారు.

నే నొకప్పుడు సాహిత్య అకాడమీ సభ్యుడను. అప్పటి అనుభవాలనుబట్టే ఇది వ్రాస్తున్నాను. అకాడమీలో జరుగుతున్న అవకతవకలన్నీ చూసి, అసహ్యంవేసి నా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాను. రచయితల కర్తవ్యనిర్వహణ కట్టుపడాలన్నా, వారిని లొంగదీసుకోవాలన్నా ప్రభుత్వాని కనేక మార్గాలున్నాయి. ఒక కవికిగాని, నవలారచయితకుగాని పార్లమెంటు సభ్యత్వమో, అసెంబ్లీ సభ్యత్వమో బహూకరించవలసినంత ఆవశ్యకత ఏమి ఉన్నది ? షేక్స్‌పియరుగాని, బెర్నార్డుషా గాని బ్రిటిషు పార్లమెంటు సభ్యత్వం కావాలని తాపత్రయపడ్డారా ? ప్రస్తుతం ప్రభుత్వం తమ కనుకూలురయిన రచయితలను కొంతమందిని ఎన్నుకొని సాంస్కృతిక ప్రతినిధివర్గా లేర్పరచి ఇతరదేశాలకు పంపిస్తున్నది. దీనివల్ల ప్రభుత్వం సాధిస్తున్న ప్రయోజనం ఏమయినా ఉన్నదా ? ఇలాగ పంపించే సాంస్కృతిక ప్రతినిధులను గురించి ఆయా దేశాలవా రెన్నడు విననయినా విని ఉండరు ! మన ప్రభుత్వం తనకు తాన్తై అయినవారిని, కానివారిని ఇంతరదేశాలకు పంపించడంకంటె ఆయా ప్రభుత్వాలు కోరుకున్నవారినే పంపించడం మంచిది. ప్రతిభావంతులని పరాయిదేశాలవా రనుకొన్న వారినే సాంస్కృతికప్రతినిధులుగా ఎన్నుకొన్నప్పుడు ఆ పద్ధతి ఉభయదేశాల సౌహార్ధము చక్కగా పెంపొందించగలదు. ఆ మార్గం ఇంతకన్న బాగా నయం కదా ?

'ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో

# కృత్యాద్యవస్థ

శ్రీ సూరంపూడి భాస్కరరావు

ఆరుణ్యము పొడసూపని
యహర్ముఖాకాశమువలె
వికసింపని పసిపాపని
యంతరంగ ముకురమువలె

ఈ క్షణమున నెమ్మనమున
ఈ శూన్యత వింతదోచు
శుభాశుభోన్ముఖమై చం
చలమై యుజ్జ్వలమై!

గర్భము ధరియించు కాంత
గఱుపారిన మేనువోలె
విలిఖింపని కవికరతల
నవనిర్మల పత్రమువలె

ఈ క్షణమున నా మనమున
ఈ శూన్యత వింతదోచు
శుభాశుభోన్ముఖమై చం
చలమై యుజ్జ్వలమై!

# విశ్వనాథ విశ్వామిత్రసృష్టి

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

'పూర్వకావ్యాలలో కొన్ని కొన్ని ఘట్టాలలో మాత్రమే అందరికి అందుపాటులో ఉన్నాయి. ఈ కావ్యంలో అలా కాదు; ఒక విశిష్టమైన శిల్పమార్గంతో రచన చేస్తున్నాను. మన మనోవృత్తులనుబట్టి మన అభిరుచులుంటవి. నేను వాల్మీకి రామాయణం భాష్యం వ్రాశాను. నా రామాయణం అనువాదం కాదు. పూర్వ సంస్కృత సాహితిలో నాకంత ప్రగాఢ పరిచయముంది కాబట్టి ఆ లోతుపాతులు నాకు తెలుసు'—అని 'విశ్వనాథ'వారు సెలవిచ్చిన బహిరంగ సూక్తులు.

పూర్వకావ్యములలో కొన్ని కొన్ని ఘట్టములు మాత్రమే అందుపాటులో నుండగా అన్ని ఘట్టములు అందుపాటులో నుండునట్లు నేనీ రామాయణకావ్యము వ్రాసితి నన్నట్టు విశ్వనాథవారి మాటల కర్థమగుచున్నది. ఇది తెలుగు వచ్చిన వాడు తెలుగు సాహిత్యములో అభిరుచిగలవాడు రామాయణ కల్పవృక్షమును చిత్తగించినవాడు ఎవ్వడుగాని అంగీకరింప దగిన మాట కాదు. ఈ మాటను మరొక తీరులో మార్చుకొన్నచో వాటముగా సరిపోవచ్చును. ఏమని? పూర్వ కావ్యములలో అన్ని ఘట్టములు అందుబాటులో నుండగా నా యీ రామాయణము మాత్రము కొన్ని ఘట్టములు మాత్రమే ఒక కొందరకు మాత్రమే—అందును అంతర్దృష్టికలవారికి మాత్రమే అందుపాటులో నుండును. ఇది ప్రాచీనమును—ప్రకృతమును లెస్సగా గుర్తించు సహృదయులకు స్ఫురించు తీర్పని చెప్పవచ్చును. కల్పము అనువాదముకాదు; భాష్యమన్నమాట మధ్యవర్తులు నిర్ణయింపవలసిన బాట. ఆధ్యాత్మికభావాలతో—పండబారి, పరిణతబుద్ధులై రామభక్తులై సర్వవ్యాఖ్యలు సమన్వయించి తత్సారము జీర్ణించుకొని ఇంతకుముందే రామాయణములు వ్రాసి యిచ్చిన మహామహులు మనకు గలరు. పూర్వ సంస్కృత సాహితిలో నా కంత ప్రగాఢ పరిచయ మున్నదని విశ్వనాథవా రనిరి. సంతోషమే. కాని ఈ మాటవలన పూర్వ రామాయణ కర్తలకు సంస్కృత పరిచయము లేదన్న భావము రాదు గదా కొంతతీసి? కాశీ పరీక్షలలో నవ ద్వీప ఘట్టము లలో విద్వత్కవి పరిషత్తులలో ఆరితేరి సర్వ శాస్త్రములు క్షుణ్ణముగా ఆకళింతకు తెచ్చుకొని ఉభయభాషలలో వశ్యవాక్కులై మహా మహులైన తెలుగు కవులే పెద్ద పెద్ద రామాయణ సంపుటము లిచ్చిపోయిరి. రచనలో—తళుకు మెఱుగులు చూచి తీర్పు చెప్పవలసినది పాఠకులుగాని—తత్కర్తలే స్వోత్కర్షగా చెప్పుకొన్నంత మాత్రాన తత్కావ్యములు సర్వజన శిరోధార్యములుకావు. మన మనోవృత్తులనుబట్టి మన యభిరుచు లుండునన్నమాట మాత్రము—అక్షరాల నిజము. ఈ కల్ప వృక్షములో 'ఆడ—మగ' పాత్రములు ముప్పాతికముప్వీసము 'విశ్వనాథ' మనోవృత్తికి సూటిగా సరిపడియున్న మాట మాత్రము వాస్తవమే. తెలుగులో 'తిక్కన ద్రౌపది. తిక్కన సీత' ఇత్యాదిగ ప్రత్యేకము పేరుపడ్డ రచనలు చదివితిమి. అట్లే ఈ వైశ్వనాథములో స్పైతము ప్రత్యేక ముద్ర పడినవి గ్రంథకర్త అభిరుచిలో పదనుగా మెదపబడి సృష్టింపబడినవి యగు పాత్రలు బహుళముగా గానవచ్చుచున్నవి. వానిలో విశ్వామిత్ర పాత్ర మొకటి. అదియే ప్రకృతవ్యాసమునకు పాత్రమైన వస్తువుగా—పరిశీలింతము.

బాలురైన శ్రీరామాదులు సర్వవిద్యలలో ప్రవీణులై తల్లిదండ్రుల కానందము గూర్చు తరుణములో విశ్వామిత్రుడు దయచేయును. మర్యాదలు మన్ననలు ముగిసిన వెనుక యాగ సంరక్షణార్థమై రామచంద్రుని నావెంట బంపవయ్యాయని విశ్వామిత్రుడు దశరథుని గోరెను. ఇదే వాల్మీకములో విశ్వామిత్రుడు మున్మొదట కోరిన కోరిక, ఈ కల్ప వృక్షములో కథ—అదిగాదు. కోటకు విశ్వామిత్రులు వచ్చిరి. మర్యాదలు జరిగినవి. లేకలేక కలిగిన నీ సంతానమును జూడవలె బిలిపింపవయ్యాయని మహర్షి పలుకగా వెంటనే దశరథుడు బిడ్డలను రావించి పరిచయము చేసెను. అప్పుడు విశ్వామిత్రుడు శ్రీరాముని సాదరముగా జూచి 'ఎవరయ్యా రామచంద్రులకు అస్త్రవిద్యాగురువులుగా నున్నవారు? నా వద్ద శిష్యత్వ మొప్పిననాడే రాముని బాహుపటిమ ప్రశస్తము కాగలదు. మహాస్త్రములు నావద్ద మూల్గుచున్నవి. అవి యెల్ల నిచ్చెదను. మనుజమహేంద్ర! నీ కుమారుని నావెంట బంపవయ్యా' అని పల్కినాడట. చిత్తము చిత్తమంచునే దశరథుడు విషణ్ణచిత్తుడై ప్రభు ! ప్రభు! నా బ్రదుకంత వాచి వేచి ఈ బిడ్డలను గన్నది. వీరిని నేను విడువనేను, అని తన పిరికితనమును వెడలగ్రక్కెనట. మునీశ్వరునకు కోపము వచ్చినది. ఈ మార్పులో అందమేమో తెలియదు. వచ్చినది యాగసంరక్షణార్థమయియుండగా మహాస్త్రములు ప్రసాదింతుననుటలో అంచమేమైన రుచి చూపెనా? ఇది భాష్యప్రవచనమా! సంస్కృత సాహితీ ప్రగాఢ పరిచయ ఫలితమా!

వాల్మీకములో ఈ సంభాషణము జరుగునపుడు వశిష్ఠుడు జోక్యము తీసికొని శ్రీరామమహిమ వివరించి విశ్వామిత్రుని కోరిక మన్నించి యాగసంరక్షణార్థమయి తప్పక

నీ బిడ్డను బంపవలెననియు, ఆ మహర్షివద్ద విలువగల మహా స్త్రములు శ్రైతమున్నవి. అవి రామునకు ప్రసాదించును. నీ కేమియు భయపడవలసినపనిలేదు. శ్రీరాముడు మహామహుడు—అనియు జెప్పగా దశరథుడు ప్రసన్నచిత్తుడై భాస్వరాంగుడై బిడ్డలను మహర్షివెంట బంపినట్లు కథను జదివెదము. ఆ కథను ఈ 'సథకములో' మార్చి నాది అనువాదముకాదు; ఒకా నొక భాష్యమని అన్నచో సహృదయులు సమ్మతింతురా? ఈ 'కల్పము'లో ఈ ఘట్టములో దశరథ విశ్వామిత్రుల సంభాషణ ధోరణి విన్నచో ఈ దశరథుడు ఇక్ష్వాకులనాటి ఆ దశరథుడు కాడు. ఈ విశ్వామిత్రుడు వశిష్ఠులవారినాటి విశ్వామిత్రుడుకాడు. ఇరువదవ శతాబ్దిలో ఎవ్వరో ఇర్వురు మాట పట్టింపు వచ్చి ఏదో ఇంత 'రభసగా' అసభ్యముగా వాదనలో దిగినట్లే ఈ రచనలో స్ఫురించును. శ్రీరాముని నావెంట బంపుమని విశ్వామిత్రుడన్న వెంటనే దశరథుడు నిర్విణ్ణుడయి, రాముడు కుఱ్ఱవాడు స్వామీ! రాక్షసులలో పోరాడగలడా? సర్వ సైన్యమును దీసికొని ఇదిగో నేనే వత్తును. వచ్చి అపని నేనే చేసెదను—అని బతిమాలినట్లు భంగపడినట్లు వాల్మీకములో ఉన్నది. 'కల్పము'లో ఏవేవో ఒయ్యారములు ఆకున కందనివి పోకను పొందనివి ఒలకబోసిరి. కొంగ్రొత్త సృష్టియు జేసిరి :—

'రాముడు నాకు స్నానమగు రాముడు నాకు జపంబు ధ్యానమున్
రాముడె యెల్ల నా బ్రతుకు రాముడు నన్నును గన్నతండ్రి యీ
రాము వినా నిమేష మవురా మనఁజాలను గాదయేని నీ
రాముని వీడి యీ యఖిల రాజ్యము గాధిసుతా! గ్రహింపవే!'

బాల—154

అస్త్ర విద్యను నేర్పెదను బంపవయ్యా అన్న ధోరణిలో విశ్వామిత్రుడు లంచము చూపినట్లే 'కాదయేని ఈ యఖిల రాజ్యము గ్రహింపవయ్యా' అని దశరథుడు పై యెత్తు ప్రయోగించుటలో 'అంతర్దృష్టి' యేదో యుండవలెను. రాముడు దశరథునకు స్నానమట. అఘమర్షణ స్నానమా? అవభృథ స్నానమా! శిరఃస్నానమా? కటిస్నానమా! గంగాస్నానమా! కుల్యామాస్నానమా? రాముడు జపమేమిటి? ధ్యానమేమిటి? స్నానము ధ్యానము జపము తపము లేనినాడు మనుష్యుడు బ్రదుకడా. రాముడు లేనిచో దశరథుడు నిజముగా బ్రదుకడు. తుద కాతడడవులకు బోయె నన్నమాట వినియేకదా ఆతడు ప్రాణములు విడిచినది. అది మమకారము కావచ్చు. శాపకారణము కావచ్చు. బాహ్యచిహ్నములైన ఏకదేశములైన ఈ స్నానాదులతో లేకలేక కలిగిన శ్రీరామునకు ఔపమ్యము కూర్చుటలో అందమేగాదు. అర్థమేలేదు. పైగా 'న్యూనోపమ' యనక తప్పదు. రాముడు నన్నును గన్న తండ్రియట. ఏమి కవనము స్వామీ! సముచ్చయ సౌరభము గుబాళించుచున్నది. ఈ ధోరణి పోలికలే ప్రారంభములో 'తినుచున్నయన్నమే తినుట—చేసిన సంసారమే సేయుట' ఇత్యాదులలో శ్రైతము కూర్చిరి. సంసారములు—అన్నములు భౌతికములు, రామభక్తి—రామాయణపారాయణము ఆధ్యాత్మికములు. మొదటివి సర్వజీవులకు సామాన్యములు. ఆధ్యాత్మికతత్త్వము అందరకు అందని ఒకానొక పరమ భాగ్యము. ఈ ఘట్టములో ఆ 'న్యూనోపమలు' తగిలించి విశిష్టమైన శిల్పమని బల్లగుద్దిన లాభములేదు. లోతుపాతులు నాకుఁ దెలియునని అనిదం పూర్వములు అనుచితములు కల్పించినచో సరసులు మెత్తురా! విద్వత్కవు లంగీకరింతురా? పరమార్థము లేని మాట చెప్పి భాష్యమున్నదని బూకరించినంతమాత్రాన లోకము మోసపోవదు.

ఇంత తపస్వివి గదా! నీ తపోమహిమచే నీవే ఆ రాక్షసులను జంపి యాగము పూర్తిచేసికొనవచ్చునుగదా! అని తానే ప్రశ్న వేసికొని సమాధానము చెప్పినట్లు, వాల్మీకి విశ్వామిత్రు డీ ఘట్టములో అన్న మాటలు వినవలెను :—

'నచ మే క్రోధముత్స్రష్టుం బుద్ధిర్భవతి పార్థివ!
తథాభూతా హి సా చర్యా న శాప స్తత్ర ముచ్యతే'

సాచర్యా—ఆ యజ్ఞాచారము, తథాభూతాహి—శాపానర్హ కాలాహి, అతః—తత్ర మారీచ సుబాహ్వోః—శాపో న ముచ్యతే. యజ్ఞాచారమునుబట్టి ఆ సమయములో శపించుట మంచిది కాదు కావున, నీ బిడ్డను బంపవయ్యా పని జరుగును అని. దీనికి 'కల్పము'

'కాదని శపింతునన్నన్
గాదా జన్నంబు కోపకలుషిత మగుటన్
'అమరగ నదిగాకయుఁగో
పము వచ్చుట లేదు తొంటివలె నాకు నృపా!
కమలప్రసూకుమారుడు

ప్రమాణము వశిష్ఠమౌని వాక్యనయందున్. బాల—155

ఆ సంస్కృత రచనకు ఈ తెలుగు ముక్కలు ఎంత చక్కగా అతికినవో, వాల్మీకి విశ్వామిత్రునకు వైశ్వనాథ విశ్వామిత్రునకు ప్రకృతిలో ఎంత అంతరమున్నదో ఊహింపవలెను.

యాగ సంరక్షణము—రాక్షస సంహారము—అస్త్ర విద్యోపదేశము, ఇవి మొదటి విశ్వామిత్రుని కోరికలు. ఆ సంకల్పమును వికల్పముచేసి రాజును మోసపెట్టవలెనని వైశ్వనాథము భావించుటలో అది విశిష్టత యగునా! బ్రహ్మాండమైన భాష్యమగునా? బజారులో మనము సంచరించినట్లే ఆ పురాణ పురుషులు శ్రైతము సంచరింతురని యూహించి భావించి 'పిచ్చినృపా!' మేము నీ కొడుకును దిందుమా! మాకడ చదువు లున్నవి. అవి నేర్పి పంపెదము' ఇత్యాదిగ 'బంగరు బయలుగ' లొల్లిగ కవనము వ్రాసినచో—ఆ పుణ్యపురుషుల మాట యెట్లున్నను మన మానసికతత్త్వము మన నిత్య దినచర్య మన ప్రకృతి వికృతులు వ్యక్తములు కావచ్చును. ఆ పాత్రలలో కవీశ్వరుడే లీనమై, నేడు 'ఏకపాత్రాభినయములు' చూపినట్లు తదౌచిత పోషించుచు కావ్యము నడపింపవలసియుండగా, తన లోనే ఆ పాత్రములను లీనముచేసి తన యభిరుచులనే వారి

కంటగట్టి వారి 'భావచిత్రము' లేకిగా జూపించుట సహింప రాని క్షమింపరాని అపచారము.

మూలకథలో ఏమున్నదో అనువాదములో ఏమి జరిగెనో చూడవలసిన బాధ్యత చూడవలసిన యక్కఱ పాఠకు లందఱికు బట్టదు. ఇదే నిజమైన రామాయణమని కొంద రైన భ్రాంతిపడి, ఈ దశరథ విశ్వామిత్రుల తత్త్వమింతే గదా యని ఈసడించుటయు గద్దు. నీ పిల్లవానికి విద్య నేర్పుటకే తీసికొని వెళ్లెదనయ్యా! యని మాటి మాటికి ఈ విశ్వామిత్రుని కిదే ధోరణి.అక్కడ నాకొక చిన్నపని యున్నదని గౌణ వాక్యము. ఈ విశ్వామిత్రుడు వట్టి మోసగాడుగా మనకు దర్శనమిచ్చును.వాల్మీకి విశ్వామిత్రునిగూర్చి వశిష్ఠు డేమనెనో ఇదిగో చిత్తగింపవలెను:

'అపూర్వాణాంచ జననే శక్తో భూయ స్స ధర్మవిత్
ఏవం వీర్యో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః
నరాముగమనే రాజన్ సంశయం కర్తు మర్హసి
తేషాం నిగ్రహ శేశక్తః స్వయం చ కుశికాత్మజః
తవ పుత్రహితార్థాయత్వాము పేత్యాభియాచతే'

ఇత్యాది. వాల్మి బాల 264

మహాతేజస్వి మహాయశస్వియైన కౌశికుడు నీ బిడ్డ మేలు కోసమే నీ వద్దకువచ్చి ఈ తీరుగ గోరుచున్నాడని వశిష్ఠుడు చెప్పిన వెంటనే వల్లెయని దశరథుడు పిల్లలను సాగనంపెనట.

ఈ కల్పములో అది కాదే. ఇది ఒక పెద్ద తగాదాలో దిగి 'రగడ' యైనది.

'అవునయ్యా! యువు నిత్తునంటి మొద లీయంతంబునం దీయనం టివి, పోనీ! రఘు వంశయోగ్యముగునో నీచేత! నీకున్ సుఖం బవు నీ బంధులు నీవునున్ సుఖము పెల్లెయుండు డే బోదు మా నవనాథా! సుఖమౌత నీకును ప్రతిజ్ఞాభంగపుణ్యాబ్ధికిన్'

బాల—158

ఇదియే ఇచ్చటి సొగసు. ఈ 'దెప్పిళ్ళు' దెప్పి ఈ విశ్వామిత్రుడు విధుర గమనమున నేగి ప్రథమ కక్ష్యాంతరమున గూర్చుండి, వెనుకగా నెవరైనవత్తురో లేదోఅన్న దొంగచూపుతో నెదురు చూచుచుండ ప్రతిమాలుటకై మంత్రి రానే వచ్చెను. వానిని జూచి మౌనియు పెడమోమై యుండెనట! అచ్చట సభలో దశరథుడు ఈ వచ్చిపడిన బెడదకు ఏమి చేయవలెనో స్వామి! విశ్వామిత్రుడు ప్రథమ కక్ష్యాంతరముగూడ దాటి పోవకుండ దారి చూపవయ్యా యని వశిష్ఠులతో మొత్తు కొనెను. వెంటనే—అన్న మాట తప్పక అతని వెంట పిల్లవానిని బంపవయ్యాయని వశిష్ఠులు తీర్పు చెప్పిరి. విశ్వామిత్రుని సమక్షములో పదిమందిలో సభలో వశిష్ఠు డీ మాట చెప్పి, తేనికి సంతోషము కలిగించెనని మూలములో నుండగా—ఈ క్రొత్త విశ్వామిత్రునికీ తిప్పలు తెచ్చిపెట్టుటలో ఏదో 'కుంభకోణ' మున్నది. ఈ విశ్వనాథుని విశ్వామిత్రు డొక దొంగ సన్యాసి. ఆ చూపులు—ఆ నవ్వులు, ఆ దెప్పిళ్ళ—ఆ దాగుడు మూతలు ఆ వెకలి నవ్వులు రోత వేయుచున్నవి. ఇక్కడ అక్షరాల కవీశ్వ రుని తత్త్వమే విశ్వామిత్రపాత్రలో దూరి యింత పని చేసె నేమోయని స్ఫురించుచున్నది. ఈ కవీశ్వరునికీ 'విధుర' శబ్దము మీద అత్యంత ప్రీతియున్నదనవలెను. లేనిచో మాటి మాటి కదే పాటగా ఈ మాట వాడుకొనునా! ఆరు పంక్తుల వచన ములో రెండు సారులు 'విధుర' శబ్దము రావలసిన కర్మమేమి! అదేమైన అందమైన పదమనియా? ఆ యర్థములో సంస్కృ తాంధ్రములలో ఈ కవి సమ్రాట్టునకు పదమే దొరకలేదా! ధవుడులేనిదానిని 'విధవ' యనియు కళత్ర వియోగము వచ్చిన వానిని 'విధురుడ'నియు సంస్కృతమురానివారే వాడుకొనుట సంస్కృతసాహితిలో లోతుపాతులు తెలిసిన వీరికే తెలియ దందువా! 'అక్షుద్రుడ' వన్నట్లు దీనినిగూడ ప్రేమించి యుండె నందువా!

రోషపరీతుడైన విశ్వామిత్రుడు, పలికిన 'మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ! సుఖీభవ సబాంధవః' అను ఒక్క ముక్కలో చక్కగ వాల్మీకి వ్యంగ్యోక్తిని సూచించెను. ఈ యనువాదములో 'నీకున్ సుఖంబవు నీ బంధువులు నీవునున్ సుఖము పెల్లె యుండు డే బోదు మా నవనాథా! సుఖమౌతనీకును ప్రతిజ్ఞాభంగ పుణ్యాబ్ధికిన్'

బాల—158.

'నీకును—నీవులు' ఒక నాలుగును, 'సుఖములు' ఒక మూడును ప్రసాదించిరి. నీ బంధులు నీవునున్ సుఖముపెల్లె యుండు డన్న తరువాత, ఆద్యంతములలోని రెండు సుఖము లెందులకు స్వామీ! ఆ దెప్పిళ్ళలో సారస్యమును ఈ యామ్రే డితములో ఈ చర్వితచర్వణములో ఈపిష్టపేషణములో ఈ రూపముగ జూపింపదలచితిరా? రెండు ముక్కల వ్యంగ్యో క్తిని బగ్గముపొడుచేసిన ఈ రామాయణకర్త వాల్మీకమునకు భాష్యమే వ్రాయునట! ఔరా! ఎంతటి ఘటికులు? గోవింద రాజ ప్రభృతుల వ్యాఖ్యలు 'మణిమంజీర'లు 'తత్త్వ దీపికల'వంటివే సుష్ఠుగా జదివి మూలార్థము చెడ నీయక విశేషములు తెలుగులో వ్రాయనేర్చిన వారి రామా యణములకే తెలుగు భారతమునకున్న పేరుపెంపులు రాలేదని మనము విచారించుచుండ, వికారానువాదములో విల క్షణ ధోరణిలో వెలసిన ఈ కల్పవృక్షము 'భవిష్యత్తు' ఎట్లుం డునో వేఱుగా జెప్పవలసిన యక్కరలేదు. ఉపన్యాసములలో ఉవ్వెత్తుగ ఉట్టిపడు దంభోక్తులు ఆరిపోయిన పెసరట్ల వంటివి. మనిషియగువాని 'సత్తా' నిరూపింపగలవి నాలుగు కాలాలు నిలువ గలిగినవి కావ్యాలు మాత్రమే. ఆ కావ్యాలలో దాచిన 'సరకు' వేఱొక విధముగా నుండగా మన గంభీరోప న్యాసములు—మన శిష్య ప్రశిష్య సంచారప్రబోధములు ఎన్నా ళ్ళని లోకమును భ్రమింపజేయుగలవు? నిజము నిలుకడమీద తెలిసి తీరును.

'కల్పము' లో కోపించి లేచిపోయిన కౌశికుడు తొలి ఏనుగుగుమ్మమును దాకొని యుండగా, ఆ వార్త విని వశిష్ఠులవారి యుపదేశము పొంది దశరథుడు వెంటనే బిడ్డ

లను దీసికొని వచ్చి మౌనికి సమర్పించెనట. వెంటనే యీ విశ్వామిత్రుడు వాండ్రను వెంట వైచుకొని వెనుదిరిగి చూడకయే అదే పోకగా బోయెనట. కారణమేమో మనకు దెలియదు. ఇట్టి ఘట్టములలో 'వెనుకచూపు' లేనివాడు ఒక్క దూర్వాసోమునియే కథలలో గానవచ్చును. తేలుకూడ—చిటుక్కున గుట్టి ఇట్లే పోవునట. ఇది వీరి క్రొత్త సృష్టి. ఈ తీరు సృష్టివలన ఈ కావ్యమునకు విశిష్టత మాట ఎట్లున్నను, బంగారు వంటి బ్రహ్మర్షి, మహామేధావి, మహాతేజస్వి అయిన విశ్వామిత్రుడు, వట్టి భ్రష్టుడై వెకిలియై, టక్కరియై అసభ్యప్రవర్తనముచే నవ్వులపాలయ్యెనని చెప్పక తప్పదు.

## 2

ఈ కాండములోనే విశ్వామిత్రుని రెండవ ఘట్టము చూతము. అహల్యాపుత్రుడైన శతానందుడు, రామలక్ష్మణుల కేవేవో చెప్పి— 'ఈ విశ్వామిత్రు డెవరో యెరుగుదు వటవే' అని రామునకు ఈ మహర్షి కథ వినిపించును. కథ వినువారు శిశువులైన రామలక్ష్మణులు. వినిపించువాడు, అహల్యకు ఇంద్రునకు బుట్టి గౌతమపుత్రు డనిపించుకొని విదేహ నరనాథుల యిండ్ల పౌరోహిత్యముతో బ్రదుకు శతానందుడు, కథానాయకుడు సైతము ఈ కథను వినుచున్నాడని గ్రంథకర్త మరచినను మనము మరువరాదు.

రాజర్షియైన విశ్వామిత్రు డొకనాడు 'మందిమార్బలముతో' వశిష్ఠాశ్రమమునకు వెళ్లెను. అతిథిసత్కార సందర్భములో 'ఆతిథ్యశ్రీ' నెరపుదు నుండుమని వశిష్ఠు డనగా 'తానును గాధేయు డిదియు దగునటవె ప్రభూ !' అని వైశ్వనాథ విశ్వామిత్రు డన్నాడట., 'చస్తే' అత డీతనిని 'ప్రభూ' అని పిలుచునా ? ఏమి ప్రభువు స్వామి ? యేసుప్రభువు వోలె ! ఒకవేళ ఈ 'ప్రభువును' కవిసమ్రాట్టులే వాడిరి కావున 'అంతరార్థమే'దో యున్నదని ఊహింతు మన్నను వైశ్వనాథ విశ్వామిత్రునకు అంతమాత్రము 'అంతర్దృష్టి' లేక పోయెను. ఆ దృష్టియే అతని కున్నచో 'మా సైన్యము పెద్దది. మే మందఱము విందులకు సిద్ధమైనచో నీ యాశ్రమములో ఒక్క పచ్చని ఆకు గూడ మిగులదయ్యా' అని సామాన్య మానవునివోలె అనగలుగునా ! ఈ 'ప్రభువు' లు అర్థములేని ప్రభువులై కల్పవృక్షము నిండ 'తిష్ఠ' వేసి యున్నారనియే తేలుచున్నది. 'తానును గాధేయుడుట' ఈ తాను—ఆపై సముచ్చయము ప్రాస కక్కుర్తికై వచ్చిపడిన సైతాను. దానికి దోడు ఆ ప్రక్కనే 'ఇదియు' మఱొక్కటి.

ఓయి యోయి విశ్వామిత్ర ! అని వశిష్ఠులవారు పిలుచుటగాని, 'ఏమి ప్రభూ' అని విశ్వామిత్రు డనుటగానీ కలలోనైన నవ్వులకైన ఊహింపనైన వీలులేని మాట. ఇరువదవ శతాబ్దిలోని ఈ గ్రంథకర్త తన సమాజములో తా నూహించుకొన్న మనఃప్రవృత్తి ఈ మహర్షుల కిర్వురకు అంటగట్టినా డనవలెను.

'శబళ శబళ గాదు సద్రత్నముగా గద !
రాజు గాని యెందు రత్నహారి
యొక్క వేయియాల నొసగెద గైకొని,
ప్రభువ ! నా కొసంగవలయు శబళ. బాల—246.

పద్యము లన్నిటిలో సులువుగా సాగిపోవునది గీతము గదా ! చేయి తిరిగిన కవి ఎట్టి భావములనైన గీతములలో అలవోకగా నడపించుట మన మెరుగుదుము. 'రత్నహారీతు ప్రార్థివః' అన్న సూక్తికి ఇందలి రెండవచరణము అనువాదము. సంస్కృతములోని యా సూక్తి వినియుండని తెలుగువానికి ఈ చరణము ఎన్ని పునశ్చరణములు చేసినను అర్థము సూటిగా గుదురదు. 'కాని' తో గూడిన ఈ ప్రయోగము పూర్వులు వాడిన గ్రాంథికము గాదు; వ్యావహారికమైన పలుకుబడియు గాదు. ఇట్టివి నడుమంతరముగా స్వయంభువులుగా దర్శనమిచ్చు వైశ్వనాథ నవ్యసృష్టి. నాథమౌని నవ్వుచునే నృపసంతానమును బూది చేయించెనట. 'ప్రభువుల' శ్రేణిలోని మఱొక అణిముత్తమే 'నాథమౌని' యన్న మధురపదము. మునినాథుని యవతారమే ఈ 'నాథమౌని' గాడు.

శబళకోసమై ఇరువురి బలగము తారసిల్లినప్పుడు వశిష్ఠుడు విశ్వామిత్రుని 'నీవు లేవు కుటిలా ! ఉదరుపోటా! ములుచ ! నిర్చినాడనుర సీ ! కుటిలోద్ధత ! క్షత్రబంధు !' ఇత్యాదిగ పిలుపు పిలిచి బ్రహ్మబలము చూపినాడట. అది నిజము కావచ్చు. కాని ఈ కథ వినిపించునది విశ్వామిత్రుని కన్న వేయి మడుంగుల చిన్నవా డయిన ఒక పిల్లగున్న శతానందుడు. వినువారు శిశువులైన రామలక్ష్మణులు. ఆపై ఆ బ్రహ్మర్షి తలయూపుచు తాడిచెట్టువోలె తత్కథాశ్రవణములో బాగము పంచుకొనుచు నిలిచియున్నాడు. వెనుక జరిగినది వినిపించునపుడు కథానాయకు డక్కడనే నిలిచి విన్నచున్నప్పుడు ఈ 'కూతలలో' కొంచెము సౌమ్యత చూపవలదా!

జరిగిన కథలో పలికిన పలుకులలో అప్పటి కవి తగియున్నను వినిపించు ఘట్టములో పాత్రౌచితినిబట్టి మెలకువ చూపుట మహాకవుల లక్షణము. ఈ యౌచిత, సంస్కృత రూపకములలో ఒకరి మాటలు మఱొకరికి మఱొకడు వినిపించు సందర్భములో మిక్కిలిగా పాటింతురు.

కులగురువువలన దెబ్బతిన్న త్రిశంకుడు, యజ్ఞము చేయుదలచి విశ్వామిత్రు నాశ్రయించెను. తప్పక నీచేత యజ్ఞము చేయింతునని బ్రహ్మర్షి విశ్వామిత్రుడు—ఆతని కభయహస్త మిచ్చెను. యాగము ప్రారంభమాయె. పిలిచిన వెంటనే ఋషులును త్రయీవదనులగు బ్రాహ్మణులును వచ్చిరి. మహోదయవాశిష్ఠులవారు వారి పుత్త్రులు వంద

మందియు మాత్రము రాలేదు. ఇక్కడ వశిష్ఠులవారి పాత్ర విశ్వనాథుల వారిలో దూరి ఏమి చెప్పెనో చిత్తగించుడు:—

'సీ. క్షత్త్రియ యాజక చండాల యజమాన
క్రతువున భోక్తలు గారు సురలు
ఈ తిండి తినబోవు ఋషులు పాంక్తేయులో
యా ఋషులకు స్వర్గమెత్తు సడదొ
షే యంచు గోపరంజితనేత్రులై యని
రా మహోదయుడును నల వశిష్ఠ
పుత్త్రులు నని నిల్వ'—బాల. 257 పు.

ఈ క్రతువున క్షత్త్రియుడు యాజకుడట. చండాలుడు యజమానుడట. కావున సురలు భోక్తలుగారారట. ఈ తిండితిన్న ఋషులు అపాంక్తేయు లగుదురట. చచ్చినమ వాండ్రకు స్వర్గము రానేరాదట. ఇదిమహోదయులైన వశిష్ఠులవారి సిద్ధాంతమని వైశ్వనాథము మనకు బోధించుచున్నది. 'మా నాయనమ్మ సత్యవతి విశ్వామిత్రుని యప్పగారు క్షత్త్రియ, మా యమ్మ రేణుకయు క్షత్త్రియయే.'

'నే నచ్చముగా బాఱుడ
గాను సుమీ క్షత్త్రరక్తకాండమ్ములు నా
మై నరముల బ్రవహించున్' — బాల. 309 పు.

విశ్వామిత్రుని కుదురు పరశురాముని కోవ ఇదమిత్థమని ఏ నోటితో ఈ కవీశ్వరుడు మనకు వినిపించెనో ఆ నోటితోనే విశ్వామిత్రుడు క్షత్త్రియుడు కావున ఆతని ఆధ్వర్యవములోని యాగము అశాస్త్రీయ మన్నట్లు భంగ్యతరేణ బోధించిరి. వీరి వ్రాతలలోనే పురాణపురుషుల కుల గోత్రముల కథలు వెల్లడి యగుచుండగా—సంకరజాతులు లేని ఆ రోజులలోని గాథలను మడిగట్టుకొని వర్ణించుచు నేడీ పాపిష్ఠకాలము కలియుగము దాపరించెనని వాపోవుట అత్యంత శోచనీయము.

విశ్వామిత్రుడు వేయి యేండ్లు ధర్మాత్ముడై తపస్సు చేయగా దేవతలును, బ్రహ్మయు వచ్చి 'ఋషి' వైతివని చెప్పిరట. ఇన్నాళ్లు ఈ తపస్సు నేను జేసినది 'ఋషి' ననెడి మాత్రమునకా యని విశ్వామిత్రుడు మరల గన్నులు మూసి తపస్సు ప్రారంభించెనట. ఇక శృంగార రంగములోనికి బోదము.

అది వసంతఋతువు, మేనక ప్రత్యక్షము, కథను వినువారు శిశువులన్నమాట, కథానాయకుడు కట్టెదుట ఉన్నాడన్నమాట, శతానందులవారు మరచినను విశ్వనాథవారు మరచినను మనము మరువరాదని ఔొక్కమారు జ్ఞప్తి చేయుచున్నాను. ఇట్టి శృంగారఘట్టములో కాళిదాసు ఎట్టు ఔచిత్యమును బోషించునో ఒక్కముక్క చూచి మన కథలోనికి వత్తము.

శకుంతలా జన్మవృత్తాంతము వినవలెనని దుష్యంతుడు కుతూహలపడును. భారతములో శకుంతలయే వినిపించిన ఈ కథను కాళిదాసు అనసూయచే జెప్పించును. ఇది యొక రమ్యమైన మార్పు. అందును విందుగూర్చు వ్యంగ్యోక్తిలో. "శృణోత్వార్యః గౌతమీతీరే పురాకిల తస్య రాజర్షే రుగ్రే తపసి వర్తమానస్య కిమపి జాతశంకైః దేవైః మేనకానామ అప్సరాః ప్రేషితా నియమ విఘ్నకారిణీ—తతో వసంతోదారసమయే తస్యా ఉన్మాదయిత్ర రూపం ప్రేక్ష్య —(ఇత్యర్ధోక్తే లజ్జయా విరమతి).

ఈమాట వినగానే దుష్యంతుడు, "పరస్తాత్ జ్ఞాయత ఏవ. సర్వథా అప్సరః సంభవైషా' అనును. ఇది మహాకవుల ధోరణి. కథానాయిక అక్కడనే ఉన్నప్పుడు ఆమె ప్రియసఖి కథానాయకునితో చెప్పవలసినది 'సభ్యత' గా జెప్పినది—వాల్మీకములో ఈ కథనే తొమ్మిది శ్లోకాలతో ముగించెను. ఇక మన వైశ్వనాథమో ఈ ఘట్టమును సరిగా ముప్పది పద్యములకు బెంచినది. ఈ పెంచిన ఈ భాగములోని పద్యములే కొన్ని కొంచెము కొంచెము మార్పుచేసి సీతారాముల శృంగార వర్ణనములో సైతము అప్పు తెచ్చుకొనిరి. అనగా తాను వ్రాసెడి కావ్యములలో ఎక్కడ శృంగారము కావలెనన్నను పెండ్లి పద్యముల వోలె కొంచెము పేరులు మార్చి చటుక్కున వీనినే దింపవచ్చునని కాబోలు! ఆ పాత్ర లెవరో! వారి వయఃప్రాభవ మెట్టిదో! వారి సంప్రదాయము లేవో! ఇట్టివి చూడవలసిన పనియే లేదు. హవ్యమునకు కవ్యమునకు ఒకటే మంత్రమాయె. విశ్వామిత్రుని తపస్సును భంగము చేయవలెనని వచ్చిన మేనక శృంగార మిచ్చట, పరబ్రహ్మ స్వరూపులుగ చిత్రించుకొన్న సీతారాముల ప్రణయగాథ అచ్చట.

తపస్సులో నిశితమైన చూడ్కి నిలుపుచున్న విశ్వామిత్రునకు పుష్కరతీర్థములో స్నానమాడి ఒడ్డున కెక్కిన మేనక కన్పించును. కాంచినదే తడవుగా ఈతడు అమాంతము దగ్గర జేరి తన బొమ్మ విరిచి నిలిచి మీసము, గడ్డము పాయలుగా దూసి ఆబిడవంక అదే చూపుగా చూడ సాగెను. ఇద్దరు నవ్వుకొనిరట. వెంటనే యా తపస్వి 'అయ్యో! నానిపోవుచున్నావే పాపము! వెంట్రుకలు పిడుపు పెట్టుదునా ?' అనుచు, చెంగున ఉత్తరీయపు చెంగుతో ఆమె శిరోరుహములు పెనవెట్టి చుట్టుచు పిండెనట. ఒడలు సైతము తుడువనా యని ఆతడు తివురగా కాదు, కాదని ఆమె వారించి తుడుచుకొన బ్రయత్నించు సమయములో తుదకు ఇరువురకు 'తడి కౌగిలింతలు' లభించినవట. ఎవ్వరు తుడిచిరో తోచదు గాని, తుదకాబిడ పొడిచీర దాలిచి మౌని యొడిలో శయనించెనట.

ఇది శిశువులైన రామలక్ష్మణులు వినుచున్న 'తాత' గారి సరసమైన శృంగార గాథ. ఈ పాతమే చక్కగా నేర్చుకొని

శ్రీరాముడు సీతమ్మతో ఇదేరీతిగ కులికినట్లు వైశ్వనాథము చిత్రించినది. మేనక చెక్కిలిపై ఈ మొరటు మౌని ఒక్క చిటికను చిటుక్కున వేసెనట. ఆ దెబ్బతో 'క్రిందట్లు మీదట్లు' అయి, వా రిరువురి కేళీనైభవము పట్టరాని దైన దట. రామా! జగన్మోహనా! విన్నావయ్యా! అని 'మధ్య' లో శతానందులవారి హెచ్చరిక. వీరి 'మోహ కథలు' వినిపించుచు 'జగన్మోహనా! రామా!' అనుటలో పెద్ద భాష్యమే ఉండి యుండవచ్చును. ఎప్పుడో బహిరంగోపన్యాసములలో మనము వినను వచ్చును. ఇచ్చట ఏదైన పర్ణశాల కలదా! ఇద్ద రము వసింతమని అత డడుగగా 'ఇచ్చట నీవు నుందువును నేనును నుందు ననెన్ లతాంగియున్' అన్నదట. 'ఉందువును నేనును' వీనుల విందైన సారస్యపు తునుకలన్నమాట మరువ వలదు సుమా!

'రాజితమైన మోహము నిరంకుశమై కుశికాత్మజుండు'
బాల. 265.

ఈ పాదమే 'రాజితమైన మోహము నిరంకుశమై రఘురామమూర్తి' అని 367 లో దర్శన మిచ్చును. రాజిత మనగా ప్రకాశితము. రాజృదీప్తౌ. ప్రకాశించు మోహమట. లక్షణయా తా ననుకొన్న అర్థము రావలె గాబోలు! సంస్కృత సాహితిలో నున్న ప్రగాఢ పరిచయమే ఇంత వింతలు ప్రయో గములు మనకు ప్రసాదించుచుండును.

ఇచ్చట—'వెదురు గొట్టాల నింపిన యిప్పపువు కల్లు తెచ్చి యచ్చరకు' మౌని అందించెనట.

అక్కడ—'కనకపాత్రికల నింపిన యిరా రసముల దెచ్చి' రాముడు మైథిలికి అందించెనట.

ఇచ్చట—'కోకిల కొమ్మలో గూసిన నీవటే నన్ను బిల్చితి వంచు' మౌని నవ్వెనట.

అక్కడ—'కోకిల దూరాన గూసిన నీవటే నన్ను బిల్చితి వంచు' సామి నవ్వెనట.

'తన పాద మామె పాదము జతగా బెట్టి యస్మత్పదంబు మోటని వచించు'

ఇచ్చట గురుశిష్యు లొకే త్రోవలోనే నడచిరట— సినిమాలోని జంటల వలె ఈ శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహా కావ్యములో ఈ రెండు జంటలు ఒకే 'పోజు'లో నడచుట కవిసమ్రాట్టు ఘనత యని అగ్గించువారు లేక పోలేదు.

'తుమ్మెద పొదలోన ఝుమ్మన నిదియేమి మణితమే యని' మౌని మేలమాడెనట.

ఔరా! రాచబిడ్డలకు ధనుర్విద్యా విశేషములు నేర్పెదనని చెప్పి తీసుకొని వచ్చినది ఈ 'మణితము' లు రుచి చూపు టకా? మణిత మనగా రామాయణకర్త భావము రతికాల మందలి గళరవమే గదా! మేనక ప్రక్కగా నిలిచి, నా బుజము దాక వచ్చితివే యని మౌని పలువరించును. అక్కడ రామయ్య ఆమె ప్రక్కన నిలిచి యానుకొమ్మని చెప్పి నన్ను విడిపోకవే అనును. 'నన్ను పెండ్లాడవే చెంచీత!' అన్నట్లు ఉన్నది ఈ సొగసు. చెక్కిలి చెక్కిలిఁ జేర్చి గడ్డము గ్రుచ్చుకొన్నదా యని ఈ గాధేయుడు గ్రుచ్చి గ్రుచ్చి యడుగును. ఇరువదవ శతాబ్దిలో వ్రాయదగిన శృంగారమా స్వామీ! యిది? తోలు బొమ్మలాటల శృంగారము!! ఈ కథలో ఈ శృంగారము విని పించుచు హాతాత్తుగా,

'శ్రీసతి పుల్లగల్ల పరిచిహ్నిత కుంకుమపత్ర భంగ వి
న్యాసిత రమ్యవక్ష! రఘునాయక బాలక! రామచంద్ర!'
267.

అని మరొక శృంగారమును ఆవిష్కరించు సంబోధ నము. ఈ 'లక్ష్మీనారాయణ' శృంగారములో సైతము కవి సమ్రాట్టుల కభిప్రేతమైన 'గల్ల' శబ్దము పడవలసినదే. రఘునాయక బాలకుడట. అర్థములేని 'క' ప్రత్యయములు ఈ రచనలో జాస్తిగదా! ప్రపంచకములు పాత్రికలు, ఫక్కికలు, అదికలు, పుత్త్రకులు, పహ్నికలు, బిందుకములు—ఇత్యాదులు ఈ కవీశ్వరునకు హృద్యములైన పదములు.

గుర్విణియైన మేనకను విశ్వామిత్రుడు గాంచి అప్పుడు మేల్కొనెనట.—

'పది యేండ్లా! బళి! మేన తాలిచిన గర్భం బేమి చేయున్ ననున్ బోదుగం జేయునా యాడపక్షి వలె? నే మూఢుండ' అనుచు పెద్ద యుపన్యాస మిచ్చును. మూల ములో ముచ్చటగా ఇరువురు విడుదలయైన ఈ భాగము నకు 'గర్భములు,—పొదుగుటలు—ఆడపక్షులు' మున్నగునవి తెచ్చి వట్టి మొరటుగా లేకిగా కొనరులు గలిపెను. పశ్చాత్తాపముచే దుఃఖితుడై విశ్వామిత్రుడు, గడగడలాడు మేన కను జూచి 'మధురై ర్వాక్యైః విసృజ్య, ఉత్తరం పర్వతం రామ విశ్వామిత్రో జగామహ' అని మాత్రమే వాల్మీకములో ఉన్నది. ఈ వైశ్వనాథములో 'నీ గర్భములో నా దోస మున్నది. దానిని కణ్వు డన్నాని వన్య సీమలో విడుపుమని మౌని, సల హాలు సైత మిచ్చును. ఇదియొక నవ్యసృష్టి, లేదా, ఇది యొక మహాభాష్యము. (పతంజలి వారిది కాదు) పది యేండ్లుగా పడుగుపేకలుగా పడియున్న ఆ మేనకను తుదకు ఈ విశ్వనాథ విశ్వామిత్రు డేమని పలుకరించెనో ఆ తీరు గమ నింపుడు :—

'లంజియా! యెంత క్రిందికి గుంజినావో'

ఇది ఈ కవీశ్వరుని శృంగార భండారము. ఇది ఈ 'విశ్వనాథ' విశ్వామిత్రుని పాత్ర చిత్రణము!!

# జీవితం నవ్వింది

శ్రీ అరిపిరాల విశ్వం

నీకు—

జీవితం నన్నుచూచి నవ్వినప్పుడు—నేను చేరుకోవాలిసిన మజిలీ నా మనస్సులో మాత్రమే కన్పించినప్పుడు—బహుశా నేను నీకు జ్ఞాపకంగానైనా, మనసులో మిగలలేదని నాకు తెలిసినప్పుడు—నాకు అనుభవాలు నేర్పిందొక్కటే. నమ్మల్ని చూసి నవ్వేయ్యమని.

అప్పటికీ, ఇప్పటికీ నాలో వచ్చిన మార్పొక్కటే. కొడిగట్టని దీపంలాంటి బ్రతుకు నాకు చెప్పింది జీవితం బ్రదకటానికని. బ్రతుకులో రుచి పుట్టించుకో అని.

నీకు బ్రతుకంటే తెలీదు. బ్రతకటమే తెలుసు. నాకు బ్రతుకంటే వెయ్యి రకాల అర్థాలు తెలుసు. పోతే బ్రతకటమే తెలీదు. అందుకే నాకు బ్రతుకులో మిగిలింది విషాదం. మరి నీకో ఉన్నది కాస్తయినా ఆనందమే.

నీకు మనస్సెలా ఉంటుందో తెలీదు. మరి నేను గంటల తరబడి మనస్సును గురించి ఉపన్యసిస్తున్నప్పుడు—చట్టున నవ్వేసి నీవన్న మాటలు ఎప్పటికీ దాచుకొంటాను. 'అనుభవంకంటె వేదాంతం నాకు లేదు. దాన్నిగూర్చి చెప్పేస్తే అది సిద్ధాంతమై కూర్చుంటుంది. సిద్ధాంతం నాకొద్దు' అన్నావు.

వికారాబాద్ ఆస్పత్రిలో—అర్ధరాత్రి — కిటికీప్రక్కన దూరంగా తలవిరబోసుకున్న చెట్లనీడలు—మీదబడుతున్న మృత్యు దేవతలా భయపెట్టినప్పుడు—మంచంకింద దాక్కొంటూ గుండెను తినేసే క్షయ వ్యాధికైనా భయపడలేదుగాని, ఏమిటో యీ చెట్లనీడలు పిచ్చిగా నన్ను మింగేస్తాయేమోనని భయమేస్తోందన్నప్పుడు—నీవు నన్ను లేపి మంచంపై పడుకోబెట్టి గుండెను తినేసే క్షయవ్యాధికన్నా మనసును తినేసే భయవ్యాధి మరీ ఘోరం. మనసునుగూర్చి ఉపన్యాసాలిచ్చే నీకీ మాత్రం తెలీదా?' అని మందలించావు.

ఆరేళ్ళ తర్వాత యివ్వేళ ఆల్మోరా కొండల్లోకి ఒంటరిగావస్తూ—అందరికీ తుదిసారి ఉత్తరాలు వ్రాశాను. నీకు మాత్రమే రాయలేకపోయాను. చచ్చిపోదామని ఎందుకనుకొన్నానో ఇప్పుడు చెప్పమంటే నాచేతకాదు. ఆల్మోరా కొండల్లో అంతమవుదామనే యింతదూరం వచ్చాను. మనస్సులో ఎందుకనిపించిందో చెప్పలేను—నా ఆఖరిప్రయాణం రాత్రితో మొదలు కావాలని. ఇవ్వేళకిది ముప్పైనాలుగోసారి—మనస్సును మోసపుచ్చి—మనస్తత్వాన్ని మధించాననుకున్న నేను కొండకొమ్ముమంచి క్రిందికి దూకాలని వ్యర్థప్రయత్నం చెయ్యటం. ప్రతిసారీ దూరంగా అస్తమించే సూర్యుడు చివరికి కన్పించకుండా పోయినప్పుడు, భూదేవిగుండెలో గడ్డకట్టిన దుఃఖంలా యీ మంచు నాకు కన్పిస్తోంది. మరి నేనుపోతే దుఃఖించేవాళ్లెవరూ లేరని నాకు నేను ధైర్యం చెప్పుకోలేక—నా చివరి ప్రయాణం యిన్నాళ్ళాగింది.

చావటానికీ, బ్రతకటానికీ మధ్య నీవన్నట్లు ఉన్నదూరం బహుకొద్దే. కొండకొమ్మున బండమీదికెక్కి, క్రింద లోతైన లోయలోకిచూస్తూ, రాబోయే క్షణంనుంచి నేనికఉండనుకాబోలు ననుకుంటూ ఏమైనా యిక మటుకు యీ క్షణమే బ్రతుక్కు ఆఖరిది అని నిర్ధారణచేసిన నన్నుచూసి ముందుగా నవ్వింది మా గుర్రం, పెద్ద సకిలింపుతో. ఈఆల్మోరా కొండకోనల్లో వాహ్యాళికి పోయేందుకు సుఖమైన వాహనం యిదొక్కటే! వెనక్కి తిరిగి చూద్దునుగదా అమాంతం కళ్లెం వదుల్చుకొన్న గుర్రం శివమెత్తి నా వైపే వస్తోంది పరుగెత్తుకుంటూ. బండమీదినుంచి దిగి బండకింద ఒదిగి దాక్కున్నాను భయంతో. గుర్రం రానూ వచ్చింది. మళ్ళీ పోనూ పోయింది. అన్నింటికీ అంపకాలు పలికేసిన నేను గుర్రండెక్కలక్రింద నలిగిపోతేనేం? లేదా నా అంత నేనే భయంతో లోయలోకి పడిపోతే కాగలకార్యం గంధర్వులే తీర్చగలరన్నట్లు కాకపోయేదా? బండకింద దాక్కోటానికీ, ఒకవేళ లోయలోకి అమాంతం పడ్డానైనా చెప్పుకొనే కారణం ఒక్కటే భయం! అని. చూశావ్? భయపడ్డానన్నమాట చెడ్డ నిజం. లోయలోకి పడదామనుకున్న నేను భయపడ్డవాణ్ణయి బండకింద దాక్కోటంఅనే అనుభవంలోనే గొప్ప రహస్యం లేదూ? నిజంగా చనిపోదామనుకుంటే భయంతో లోయలోకి పడవలసిన నేను, బండకింద తలదాచుకోవటం దేనికి?

ఆవేశం నన్ను చచ్చిపొమ్మంది. దానివెనుక దాక్కున్న మనస్సు ఎందుకు పోయేవు? అని ఉంటే అని ఉండొచ్చు. ఆవేశంచేత నరాలు వయొలిన్‌తీగల్లా మ్రోగి సాగుతున్న చప్పుడులో మనసుచెప్పిన మాట మాటుమణిగింది.

ఒక్కోసారి మనిషిచేసే ప్రతిపనికీ వెనుక వెతికితే, కారణం ఒక్కటే అయికూర్చుంటుంది. లోయలోకి దూకలేకపోవటనికి, లేదా బండకింద దాక్కోటానికీ మధ్య కారణం ఒక్కటే. అదే భయం! భయం అనేది అవతలేమిటో? తెలుసుకోలేని మనిషి దాచుకొనే కారణం, లేదా సాకు. కొండకొమ్ముకెక్కిన నన్ను జూచి కొంతమంది అనకపోరు, 'ఎంత భయం లేదో!' అని, మరి నాలో భయం ఉందో లేదో తెలుసుకోకుండానే అవతలవాళ్ళు చేసేసిన నిర్ణయాలు ఎంత నిజాలో నాకు తెలిసినట్లు మరింకోరి కెలా సాధ్యం? ఆవేశం చేసిన నిర్ణయం,

మనస్సు ఒప్పుకున్నట్టుగా నాకు నేనే అనుకుంటే మధ్యలో 'భయం' అంటూ ఒక తగలాటం ఏమిటీ?

బ్రతకటంలోగల భయం చచ్చిపొమ్మంది. చచ్చిపోవ టంలోగల భయం బండకింద దాక్కోమ్మంది. ఈరెండూ చేస్తున్న (లేదా చేద్దామనుకున్న) మనిషి ఖర్చులో పడదామనుకున్నా పరి స్థితులఖాతా తిరిగి ఖర్చులోంచి జమలోపడి కూర్చుంది. అపడ్డ జమ (శ్రమ అనుకో!) జీవితానికి బ్రాటోవర్తైంది.

అసలు చావటం ఎందుకు? చావటానికి అల్మోరా కొండలు తప్ప మరోచోటు దొరక్కపోయిందా? అని నీవు ప్రశ్నించ గలవు. అల్మోరాకొండలదాకా వచ్చింతర్వాత యీ దుర్బుద్ధి పుట్టిందంటే—నీవు నమ్ముతావా? ఈ రకం ఆత్మహత్యలకి కార ణాలు రెండే. ఎక్కువగా ప్రేమించటం. ఎక్కువగా బాధపడటం. అయితే నన్ని శ్రేణిలోకి లాగవద్దు. నాకీ ప్రాణాంతప్రణాళిక వేసుకోనేందుకు ముందేర్పడ్డ పరిస్థితులు నీకు చెప్తే—నా బాధ తీరుతుంది. (నీ వప్పుడైనా క్షమించనని తెలుసనుకో!) నీవు వెంటనే నన్ను ఒక్క ప్రశ్నతోనే ఉరితీయగలవు. వికారా బాద్ ఆస్పత్రిలో నిన్ను మ్రింగే జబ్బుతో పీడింపబడేటప్పుడు బ్రతుకుమీద ఆశలు రాశులు పోసికొన్న నీవేనా యివ్వాళ దాన్ని చేజేతులా ఆఖరు చేదామని భ్రమించింది? నీకు మనస్సుందేమో గాని గుండె లేదులే. అంటావు.

ప్రేమించలేక పోతున్నానే అని చనిపోదామనుకుంటే బండకింద దాక్కోవటం ఎందుకు? అన్ని అడిగేస్తే వెంటనే జవాబు చెప్పలేకపోవచ్చుగాని, నెమ్మదిగా మాత్రం చెబుతాను. —విను.

పంజాగుట్టదగ్గరో చిన్నయింట్లో రెండో వాటాలో చేరటం జరిగి రెణ్ణెల్లు గడిచింది. ఒకనాటి సాయంత్రం ఏం జరుగుతుందో తెలీనంత పెద్దగుంపు పోగయింది యింటి ముందు. సంగతివింటే ఎవరో పాగరుపోతువచ్చి ప్రక్కవాటాలో వాళ్ళమ్మాయిని తిడుతున్నాడట. వాలకం చూస్తే తాగే వచ్చా డని జనం అంటోంది. గుంపును తోసుకుంటూ, పోయి చూస్తే అతడికి నెత్తిపై గాయమైంది. పడిఉన్నాడు. తర్వాత. ఎవరు పిల్చుకొచ్చారో తెలీదు పోలీసుల్ని. చూస్తుండగానే వాన్‌లో అతడిని తీసుకుపోవటం జరిగింది.

ఆరాత్రి గదిలో ఏదో ఆలోచిస్తూ కూర్చున్న నన్నె వరో పిల్చినట్లయింది.

'క్షమించాలి. మీ ఆలోచనల్ని పాడుచేసినందుకు' అంటూ వచ్చి నిలబడింది ప్రక్కవాటాలో ఉండేవాళ్ళమ్మాయి.

'ఒక్కొక్కప్పుడు ఆలోచనల్తో పాడయ్యేకంటే, ఆలోచ నల్నే పాడుచేయటం మంచిది. అలాంటి స్థితిలో మీరొచ్చారు!' అన్నాను.

'మీరు నాకో సాయం చేసిపెట్తారా?'అంది ఆ అమ్మాయి.

'మీ కీపాటికే నాపైన కొన్ని అభిప్రాయా లేర్పడి ఉండొ చ్చు' అంది మళ్ళీ.

'ఆ భయంలేదులెండి. నాపై నాకే ఒక అభిప్రాయం ఇంకా ఏర్పడనప్పుడు ఎదుటివాళ్ళపైన అభిప్రాయాలేర్పర చటం ఎలా?' అన్నా.

'అదేమిటి? బహువింతగా ఉందే?' అంది.

'మనంతట మనం నమ్మలేక, ఎవరన్నా నమ్మిస్తే నమ్మే దానికి వింత అని నా నిర్వచనం' అన్నాను.

'మీరోసారి పోలీసు స్టేషన్‌వరకు నాతో రావాలి' అంది.

'ఏమిటిది ఒకరితోపాటు తోడుగా......' అన్నా.

'అంటే నేను జైలుకు పోతాననా మీ రనటం. మరి యిదే నన్నమాట మీ అభిప్రాయం. ఇందాక ఎవర్నిగురించీ అభిప్రాయలేర్పర్చుకోనన్నారు!' అంది.

'ఇది నాదిగా భావిస్తున్న మీ అభిప్రాయం. జైలులో వేయించనని ఖచ్చితంగా చెబితే, పోలీస్ స్టేషన్‌కు రావటా నికి నాకేమీ అభ్యంతరంలేదు' అన్నా నవ్వుతూ.

'ఈ వీధిలో గిట్టనిమూక ఆయన్ని బాధించారు. త్వరగా రండి. ఆయన్ని విడిపించుకోవాలి' అంది.

సబ్ ఇనస్పెక్టర్ అడిగే ప్రశ్నల కన్నిటికీ ఆ అమ్మాయి జవాబిస్తోంది.

బయటి గుమ్మందగ్గరే నిలబడ్డనా కిలా విన్పిస్తోంది. 'ఆయన మా బంధువు. ఆయన తాగిరాలేదు. తలపైన గాయంపై సారా పులిమారు, ఆవీధిలో నన్ను పరువుగా బ్రతకనివ్వ టం యిష్టంలేని మూకలు. ఆయన్ని వదిలెయ్యండి. మీకేదైనా ఫిర్యాదువస్తే ఆయన మా యింటిపై దండువచ్చాడనేగా. ఫిర్యాదు చేయవలసిన నేనే ఆయన నిరపరాధి అని చెప్తున్నా' అంది.

'సరే. ఇప్పుడెలాగో హాస్పిటల్‌లో చేర్చాం కాబట్టి నయం కాగానే వదిలేస్తాం!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

మౌనంగా ఆ అమ్మాయి నన్ననుసరించి వస్తోంది. ఇంటికి చేరాం. నేను నా గదితలుపు తెరుస్తుంటే మళ్ళీ ఆ అమ్మాయి వచ్చింది.

'ఏమిటిలా వచ్చారు మళ్ళీ. ప్రశాంతంగాపోయి నిద్రపోండి' అన్నాను.

'నిద్ర పట్టటంలేదు' అంది.

'కళ్ళు' మూసుకుంటే నిద్ర అదే వస్తుంది. నిద్ర రాక పోవటం ఒక జబ్బు' అన్నాను.

'కళ్ళు మూస్తే బొత్తిగా కటికి చీకటి నన్ను తినేస్తు నంటోంది. అంతకన్నా బయటి చీకటే బాగుంది. మధ్యలో దీపాల వెలుగన్నా ఉంది' అంది ఆవులిస్తూ.

'నిద్రపోవటం అంటే మార్పును కోరటం. మార్పు ఒక రకమైన మరపు. మరపు బ్రతికేందుకు మత్తుమందు. దాన్నే మీ రెందుకు వద్దంటున్నారు?' అన్నాను.

'నేను దేన్నీ వద్దనికానీ, కావాలనికానీ చెప్పలేదు. నాకు కావలసింది నా కెప్పుడూ దొరకదని అనుభవం ఇంతవరకూ చెప్పింది.'

'ఇంతకీ అసలు సంగతి మరిచాను. మీ రాయనెవరని అడుగుతారనుకున్నా. కాని అడిగారుకాదు' అంది.

'మీకు కావలసినవాళ్ళు. అంతకన్నా నా కనవసరం' అన్నాను.

'ఆయన నాకేమీకాడు. మా సంగీతం మాష్టరు. ఇద్దరు పిల్లలు. లోకమంతా మా కిద్దరికీ మధ్య చాలా కథలల్లింది. మనిషిపై జాలిపడటం కూడా తప్పే. సంగీత పాఠశాలకు వెళ్ళటం మానేశాను. నిన్ననే ఆయనతో చెప్పేశా మన పెండ్లికి ఏర్పాటు చేయమని. తాళి కట్టించుకొని చనిపోదామని. ఇలా అపవాదులో చావటం యిష్టంలేదు' అంది.

'అసలింత పూరిబయట ఒక్కళ్ళే ఎందుకుంటున్నారు?' అన్నాను.

'మొన్నటివరకూ మా చెల్లెలూ, దొడ్డమ్మా వాతోనే ఉండేవాళ్ళు. నేను చెడిపోయానని, నన్నొదిలి వెళ్ళిపోయారు' అంది.

'ఇంకెవరూ లేరా? మీ కెలా గడుస్తోంది?' అన్నాను.

'బి. యస్. సి. చదువుతున్నాను ట్యూషన్లు చెబుతూ' అంది.

'మీవాళ్ళు నిన్నుగురించి శ్రద్ధతీసుకోరా?' అన్నాను.

'అన్నయ్యలు, అమ్మనీ, నాన్ననే వదిలేశారు. వాళ్ళిద్దరూ పెద్దతనాన ఉన్న వూళ్ళోనే కాలక్షేపం. దొడ్డమ్మ నన్ను పెంచింది. ఇప్పుడు నన్ను కావాలనుకునేవాళ్ళుగాని, నేను కావాలనుకునేవాళ్ళుగాని లేరు. నెలైంది చదువుకు స్వస్తిచెప్పి. ట్యూషన్లు పోతే నిన్ననే ఓ చిన్న ఉద్యోగం సంపాయించాను' అంది.

'నేను రేపే వెళ్ళిపోతున్నాను' అన్నాను.

'ఎందుకు?' అంది.

'గాలి మార్పుకోసం. బహుశా మళ్ళీ యిటువైపు రావటం పడదేమో? నాకు మీరు చెప్పేదంతా అయిపోయిందనుకుంటా. పోతే నే నెవరికి ఏమీ సలహాలిచ్చేపద్ధతిని అలవాటు చేసుకోలేదు. బ్రతుక్కి ఆనందం ఎలాగా లేదని దాన్ని కాస్తా దుఃఖమయం చేసుకోవద్దని మానేస్తం చెప్పిన మాట. ఆ మాట పట్టించుకొనే యింత దూరం వచ్చాను. ఈ వూరు యింక మొహం మొత్తింది. ఎక్కడైనా త్వరగా వూరు మార్చేయాలి' అన్నాను.

'అయితే వెళ్ళిపోతారన్నమాట' అంటూ వెళ్ళిపోయింది.

* * *

బజారులో ఏవో కొనుక్కొని రిక్షాలోపడి ఇల్లు చేరే సరికి పేట మాటుమణిగింది. ప్రక్కవాటాలో మాత్రం హిందూస్తానీ సంగీతం విన్పిస్తోంది.

'నమస్తే.....సాబ్' అంటూ తలపైన కట్టుతో ఓ పెద్దమనిషి గదిగుమ్మంముందు నిలుచున్నాడు. అయిష్టంగా 'నమస్తే' అన్నాను.

'మా సంగీతం మాష్టారండీ. ఏమిటీ సామానంతా సర్దేస్తున్నారు' అం దా అమ్మాయి.

'తెల్లవారు ఝామున బండికి వెళదామని' అన్నాను.

'లలితా! నేనలాపోయి ఓ రెండు మూడు పాన్లు తెస్తా' నంటూ వెళ్ళాడా పెద్దమనిషి.

నేనేదో పరధ్యానంలో సామాను సర్దుకుంటున్నాను.

'మీ రిప్పు డెలా వెళతారు' అంది.

'చెప్పానుగా' అన్నా.

'అదికాదు' అంది.

'నా విషయంలో కానిదంటూ లేనేలేదు' అన్నాను.

'మరి నా పెళ్ళికి......ఉండరా.....మీరు?....' అంటూ భోరున ఏడ్చేస్తోంది. ఏడుస్తూనే నా చేతికో కాగితం యిచ్చింది.

'మరి యీయనేనా మీ మాష్టరంటే? నేను ఉండటం, ఉండకపోవటంకన్నా పెళ్ళి జరగటమే ముఖ్యం. ఏమంటావ్?' అన్నాను.

'పెళ్ళికన్నా మీ రుండటమే ముఖ్యం. ఇప్పుడు నన్ను ఎవ్వరూ పలకరించేవాళ్ళు కూడా లేరు. మీరు తప్ప' అంది.

'కాబోయే వధువ్వి నీవు.....' అంటూ ఏదో చెప్పబోతూంటే

'మీరు చెప్పబోయే సారాంశం నాకు తెలుసులెండి. వరుడున్నాడుకదా! అని. నే నాయన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పింది ఆయన్ని ప్రేమించానని కాదు. లోకంలో చాలమంది జీవుల ఆత్మతృప్తికోసం, మంగళసూత్రం కట్టించుకొని, సయనైడ్‌రుచితో వైవాహిక జీవితపు మొదటి క్షణాల్ని ముడివేద్దామని నా సంకల్పం. నా వైపు నెవరుంటారు? నెత్తి మీద రెండక్షంతలు వేసేందుకు మీరు తప్ప. ఓ దిక్కులేని అమ్మాయికోరినా......పెళ్ళికి ఉండకుండా.....వెళ్ళేంత తొందర పనైతే వెళ్ళండి. కనీసం ఆట్రైన్‌కు ఎక్కడున్నా.... ఇవిగో అక్షింతలు....నామీదే వేశానని....నేలమీద పారేయండి. బహుశా నేలతల్లి ఒడిలో నిద్రపోయే నాపాలిటి కవి.....లోకమిచ్చిన సానుభూతి అని దాచుకొంటాను' అంది.

ఆ అమ్మాయి మాటల్లో జీవనసంగీతంలోని జంట స్వరాలకంటె అపస్వరాలపంటే ఎక్కువనిపించింది.

'చావదలచుకొంటే సాక్షులక్కరలేదు. పెండ్లికైతే కావాలికాని. అయినా నీ పెళ్ళికీ, చావుకూ కూడా కారణాల్లేవు. చావదలచుకోవటం, పెండ్లిచేసుకోవటం అన్నవి నీకే సంబంధించిన రెండు పనులనుకో. నాకు సంబంధించినంత వరకూ, నా దృష్టిలో అవి ఒకే ఆవేశం. ఒకే అజ్ఞానం. నీవాలోచించేది నీ కోసమా? లోకం కోసమా? లోకంలో నీవెంత మంచిని చూపినా, అందరూ నిన్ను మెచ్చుకోరు. అది లోకపు తీరు. పోతే నీ చేతిలో ఉందల్లా...నీకు నీవు చెప్పుకోవటం. నూటికి నూరుపాళ్ళు అదే. నీకు నచ్చిందా? నీవు చెప్పేప్రకారం .... నీ పెళ్ళి నీ వనుకొనే చావు.....యీ రెండూ నీవు లోకం కోసమేనా చేసుకోదలచింది? లేక నీ కోసమా? నీ కోసం నీవేమీ ఆలోచించుకునేం

దుకు చోటు మిగలనంతగా నీలో లోకంమీద కసి, మసిలా పూసుకున్నావు. అందుకే నీ బ్రదుకు నీకు, గాని, ఎదుటివాళ్ళకుగాని పనికిరానిదవుతోంది. నేను చెప్పేదాంట్లో నిజముందని నీ కని పిస్తోందా?' అన్నాను.

'నేను మీకు చెప్పలేను' అంది.

'అంటే నామతం నాదేనని అర్థం!' అన్నాను.

'ఏమో....అదంతా నాకు తెలీదు' అంది.

'నన్నిక్కడ కొంతకాలం నీవు ఉండమనటంలోని ప్రయోజనం ఏమిటీ? నీవో పెళ్ళంటూ పేరెట్టి, లోకంమీద కసితో వీరవనితలాగా ప్రాణాలు విడుస్తావు? నీవు చేసే పనిలోని ప్రయోజనం గాలిలో కత్తులుతిప్పటం లాంటిది. పరిణామం నిప్పుతో చెలగాటంలాంటిది. మరి దీనికి నన్ను సాక్షిని కమ్మనా నీ ఆజ్ఞ' అన్నాను.

'ఆజ్ఞకాదు, అభ్యర్థన' అంది.

'అభ్యర్థనైతే నామీదనీకు గౌరవముందన్నమాటే!'అన్నాను.

లలిత మాట్లాడలేదు.

'ఇదిగో మిమ్మల్నేనండీ! నా చేతిలోని యీ గీత చూడండి. దీని ప్రకారం ఆత్మహత్య తప్పదు. అది కూడా పెళ్ళితో ముడిపడే.'

'ఓహో! నీవు ప్రస్తుతం చెప్పేదాన్నిబట్టి నీకు లోకుల మీద కోపం కూడా వట్టిదే. చేతిలో గీతని నిజం చేయాలని నీ కీమధ్య కుతూహలం పెరిగిందన్నమాట! ఇదంతా సాముద్రికానికి లోకంలో జయస్తంభాలు నాటించే మహత్తర ప్రణాళిక అన్నమాట! బాగుంది. కానీ మరి నేనెందుకూ మధ్యలో గొడవ' అన్నాను.

'మీరు సాముద్రికాన్ని వెక్కిరిస్తున్నారు' అంది కోపంగా.

'నీ సాముద్రికమే నీ బ్రతుకుని వెక్కిరిస్తోంది!' అన్నాను.

'అయితే సాముద్రికం వట్టిదనా?' అంది.

'కాదు. అందులో నీ జ్ఞానం వట్టిదని అంతే. నీవు చని పోదామని అనుకోటానికి నీ అజ్ఞానాన్ని కారణంగా చెప్పక, లేనిపోని మిషతో సాముద్రికాన్ని లాగుతున్నావు. సరే. నేను ఉంటున్నాను. నీ మనస్సు మార్చుకుంటే. అంటే ఏమీలేదు..... ఇందాకటి తీర్మానాలను బుట్టదాఖలు చెయ్యమని' అన్నాను.

చెప్పిన మాటప్రకారం వచ్చాడు సంగీతం మాష్టారు లకడీకాపూల్ దగ్గరకి. అక్కడినుంచి సందులూ గొందులూ త్రిప్పించి ఒక పాడుబడ్డ యింట్లోకి తీసుకువెళ్ళాడు.

'కూర్చోండి' అన్నాడు. ఎవరో పిల్లాణ్ణిపిల్చి రెండు 'చా'లు తెమ్మన్నాడు.

'ఏమీ అనుకోకండి. ఇంట్లో ఎవరూ లేరు' అన్నాడాయన.

'అసలిక్కడదాకా ఎందుకు తెచ్చారు నన్ను' అన్నాను.

'ఓసారి మా యిల్లు చూపిద్దామని' అన్నాడు.

నవ్వాను.

'మీరు నాకెందు కన్యాయం చేస్తున్నారు. లలిత నన్ను పెళ్ళి చేసుకోదట. దానికి మీరే కారణం' అన్నాడు.

'మీకు పిల్లలెందరు?' అన్నాను ముభావంగా.

'ఇద్దరు. నా భార్య జబ్బుమనిషి. వదిలేశాను. అప్పుడే రెండేళ్ళయింది. ఇప్పుడు సంగతివింటే క్షయ అని. చివరి దశల్లో

---

పడ్డట్లు వినికిడి. ఇదే నా అదృష్టం' అన్నాడు ఆవేశాన్నణచుకుంటూ.

'జబ్బంటూ వచ్చిందికనుక వదిలేశారు. రేపు చనిపోతుంది కనుక దుఃఖిస్తారు. ఇవ్వాళో అమ్మాయి మధ్యలో కన్పించింది కనుక పెళ్ళి చేసుకుంటారు. ఆ అమ్మాయి యెందుకోవద్దంది కనుక మానేస్తారు. ఇందులో మీరు చెప్పే ప్రకారం దేనికీ ప్రాముఖ్యం లేదు' అన్నాను బయటికి వచ్చేస్తూ. మాష్టారు దిగాలుపడి చూస్తున్నాడు.

'మీకేదో ఉత్తరం వచ్చిందండీ!' అంది యింటికి రాగానే లలిత. చించి చూచి నిర్ఘాంతపోయాను.

'ఏమిటండీ సంగతి' అంది మౌనంగా కవరు, కాగితం చేతుల్లోపెట్టాను.

'ఏమిటండీ యీ ఎర్ర సిరా పిచ్చి గీతలు' అంది.

'అది మా పాప ఉత్తరం. దాని భాష రంగుల్లోనే ఉంటుంది. జబ్బుగా ఉంది. రమ్మని వాళ్ళమామయ్యని పిలుస్తోంది' అన్నాను.

*  *  *

'ఏమండీ! పాప మీకోసం కలవరిస్తూ ఉండదా? మరి మీరు వెళ్ళరా?' అంది లలిత మంచంపై మరో ప్రక్కకు మళ్ళుతూ.

'నీ కెందుకూ! నీకు కాస్త నయంకానీ, సీసపుపెంకులు పొడికొట్టి మింగినంత తేలికగా నా నిర్ణయాలు ఉండవు' అన్నాను.

'ఉష్!' అంది వారిస్తూ టెంపరేచర్ చూడటానికి వచ్చిన నర్సు.

సంగీతంమాష్టర్‌పైన కోపమో, లోకంపై ప్రతీకారమో తెలీదు. లలిత ఓ రోజు ఉదయం సీసపు పెంకులు మింగింది. ఇప్పుడే బ్రతికే ఆశ యిచ్చాడు డాక్టర్. నర్సు వెళ్ళిపోయింది.

'నేను బ్రతుకుతానండీ! చావను. మీరు వెళ్ళి పాపనో మాటు చూచిరారూ? నామీద ఒట్టు. పాపిష్ఠిదాన్ని' అని కళ్ళనీరు పెట్టుకుంది.

మర్నాడు ప్రొద్దున్న పాపను చూడటానికి బయలుదేరక తప్పిందికాదు. 'మళ్ళీ చూస్తానుగదూ. పాపను మీతో తెండి' అంటూ కళ్ళతోనే సాగనంపింది.

'మామా! ఈ స్పెక్టర్ ఎక్కడిదీ? నీకు అల్లిక చేతనవునా?' బలే' అంటూ వెక్కిరించింది పాప. అక్కయ్య పట్టలేని మోదాన్ని చిరునవ్వులో తేల్చివేసింది.

'తమ్ముా! నీకోసం పాప తపించిపోతోందిరా! ఇక నీవు వచ్చావు. నాకు వెయ్యేనుగుల బలం వచ్చింది?'

నాలుగు రోజులు తగ్గినట్టే తగ్గి మళ్ళీ పాప జబ్బు తిరగబెట్టింది. అక్కయ్యకు మళ్ళీ మూర్ఛలు ప్రారంభించినయ్. పాప అందరికీ వీడ్కోలుపులిచ్చి వెళ్ళిపోతుందని ఎవరనుకున్నారు?

పాపను తేలేని నేను బరువుగుండెతో బండెక్కాను. పాపతోనే ఈ వూరు మళ్ళీ రండనచెప్పిన లలిత మాటలు పదే పదే జ్ఞాపకానికి వస్తున్నయ్. ఎందుకు మళ్ళీ ఆ వూరు? అనిపించింది. అయినా టిక్కట్టుకొని, బండిలోపడ్డ తర్వాత వచ్చిన ఆలోచనయొక్క స్వరూపాన్ని ఇలా తెచ్చుకోవటం ఓరకమైన బలహీనత అని నీకు తెలీదా? అని నీవు ప్రశ్నవేస్తావులే? పంజాగుట్ట యింట్లో అవతలివాటా ఇంకా నాకిందే ఉంది. వచ్చీరాగానే సంగీతంమాష్టరు ఎదురైనాడు.

'ఎలా ఉంది లలితకు' అన్నాను.

'అదెప్పుడో రెండు నెలల కిందటి మాట. అయినా చావదలచుకొన్న వాళ్ళని దైవమైనా ఆపలేడని సామెత ఉందిగా? ఆల్మోరా కొండల్లోకో, ఎక్కడికో వెళ్ళి పోతున్నానని వ్రాసి ఒక నెల జీతం తీసుకుని వెళ్ళిపోయింది' అన్నాడు.

'మరి నీవా అమ్మాయిని ప్రేమించావుగా? వెళ్ళలేకపోయావ్? వెతుక్కుంటూ' అన్నాను.

సంగీతం మాష్టర్ ముఖం ముడుచుకుపోయింది.

*  *  *

తర్వాత కథ అంతా తెలుసుగా. ఇప్పుడు చావంటే భయంపోయింది. అయినా చావాలని లేదు

ఉంటా.

"____"

ఆల్మోరాకి జవాబిలా వచ్చింది.

'తెలివిలేని ఉద్వేగపరులు' అని.

జీవితం ఎన్నోసార్లు నన్ను చూచి నవ్విందని అవమానపడ్డాను. ఇదే మొదటిసారి నన్ను చూచుకొని, జీవితాన్ని చూచుకొని నవ్వుకోగలగటం.

మనస్సును గురించి ఆలోచించగలిగిన నేను, మనస్సుయొక్క ఆలోచనల్నిగూర్చి మొదటి సారిగా ఆలోచించటం నేర్చుకున్నా.

ఇన్నేళ్ళు గడిచిపోయిన జీవితం వ్యర్థమని నేను నవ్వాను. ఇన్నేళ్ళు వ్యర్థంగా నన్ను తినేశావా అన్నట్లు జీవితం నన్నుచూచి నవ్వింది!

# కతిపయ పాఠగ్రంథుల

శ్రీ వి. రామకృష్ణరావు

మహా భారతంలో వ్యాసమహర్షి యెనిమిదివేల యెనిమిది వందల గ్రంథ గ్రంథులు చెప్పి లేఖకుడైన విఘ్నేశ్వరుని 'దీని భావమేమి తిరుమలేశ' అనుకొనేటట్లు చేసినాడు. విఘ్నేశ్వరుడు వాటిని విప్పుకోవడంతోనే సరిపోయిందిగాని తాను ఎలాంటి గ్రంథులను తయారు చేయలేదు. ఆ లోటు తీర్చడానికో అన్నట్లు తాళపత్రమాతృకాలేఖకులు బయల్దేరి యెన్నో పాఠగ్రంథులను తయారుచేసినారు. కొన్ని పాఠగ్రంథులను ఈ వ్యాసంలో విప్పడానికి ప్రయత్నిస్తాను.

## తే నె త ల

జైమిని భారతములో శ్రీరాముని పరిపాలన గురించి ప్రశంసిస్తూ చెప్పిన సీసపద్యపు ఎత్తుగీతి యిలా ముద్రితమైయున్నది.

"తేనెతలవడఁ బండె ధాత్రీతలంబు
పొదలి ధారణపోఁకకుఁ బుట్టెడయ్యె
నన్ని వంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ
బ్రస్తుతింపఁగఁ దగు రామరాజ్యముననుు జై.భా.6–9.

ఈ పద్యములోని 'తేనె తలవడఁబండె' అన్నది వ్యాసఘట్టంవలె దుర్భేద్యముగా ఉన్నది. దీనికి పాఠాంతరం ఏదీ చూపబడలేదు. సంస్కృత జైమిని భారతంలో దీనికి మూలమేమైనా వున్నదేమో తెలియదు. "తేనెతల=సస్య విశేషము అని సూర్యరాయ నిఘంటువు వ్రాసి యీ పద్యమునే ప్రమాణముగా చూపింది.

బ్రౌణ్యములో "తలపడుట...Come into season... ఇప్పుడు మామిడిపండ్లు తలపడ్డవి Mangoes havc now Coming to season అని యున్నది. దీనినిబట్టి "తేమ తలపడ బండె ధాత్రీతలంబు" కవి పాఠం కావచ్చునని తోచుచున్నది. తేమ తలపడితే చాలు పంటలు పండుతున్నాయన్నమాట. పినవీరన జైమిని భారతము ననుసరించి వచన కావ్యము వ్రాసిన సముఖ వెంకట కృష్ణప్పనాయకుడు ఈసందర్భంలో యిలా వ్రాసినాడు. "ధాత్రీతలంబు దున్నకయె పండె. ధారణపోఁకకుఁ బుట్టెడయ్యె. ఈతిబాధ లొక్కటొక్కటి లేవయ్యె" (3 ఆ) "తేమ తలవడఁ బండె" అన్న భావమునే "ధాత్రీతలంబు దున్నకయె పండె" అని సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు భంగ్యంతరముగా చెప్పినాడని తోచుచున్నది. కాగా "తేమ తలవడ బండె ధాత్రీతలంబు" కవిప్రయుక్త పాఠమని నా యభిప్రాయం.

## అలఁచివపుర

కాశీ ఖండములో ధ్రువపదవర్ణన సందర్భంలో క్రింది ఎత్తుగీతి రచింపబడింది.

గీ. తారకా శింశుమారకాకారుడైన
యాదినారాయణుని తోఁకయలఁచి(వ)పుర
తప్పకీక్షింపు ధరణి బృందారక కేంద్ర
వివిధ కల్పపరంపరా ధ్రువుని ధ్రువుని.

ఇందులో "అలఁచివ(పు)ర" అంటే యేమో తెలియలేదు. "తారకా శింశుమారకాకారుడైన యాది నారాయణుడు" అంటే ఖగోళ విషయం తెలిస్తేగాని బోధపడదు. ఆ శింశుమారపు తోకకు ఏ భాగంలో ధ్రువుడున్నాడో తేలితేగాని పాఠ నిర్ణయం సాధ్యపడదు. జ్యోతిర్వేదము అనే గ్రంథంలో "జ్యోతిషాం చక్రం భ్రామయన్ తారకామయస్య శింశుమారస్య పుచ్ఛదేశే వ్యవస్థితో ధ్రువః తస్య శింశుమారస్య హృదయే జ్యోతిశ్చక్రనేమి వర్ణనేవత్ ప్రవర్తకస్థితో విష్ణురితి నక్షత్రనేమీ శింశుమారస్య హృదయ విష్ణుర్ద్రష్టా హృదయమ్" అని వ్రాయబడివున్నది. ఈ ప్రమాణం స్వాధ్యాయ బ్రాహ్మణములోనిదట. ఇదో యిలాంటి యితర ప్రమాణాలు శ్రీనాథుని రచనకు ఆధారములై వుంటాయి. "తారకామయస్య శింశుమారస్య, పుచ్ఛదేశే వ్యవస్థితో ధ్రువః" అని ఉండడంవల్ల "అలఁచివపుర" అన్న చోట "అలంతి చివర" కవి ప్రయుక్తపాఠం అయివుంటుంది. అని "ఊహించవచ్చును. 'అలంతి చివర దప్పకీక్షింపు' అనే రీతిని గ్రహించవలసి ఉంటుందని తోచుతున్నది.

జ్యోతిశ్శాస్త్ర విషయాలు తెలుస్తేనేగాని యిలాంటి వెన్నో స్పష్టపడవు. హరవిలాసములో శ్రీనాథుడు 'సలిల నక్షత్రము' (2.20) అన్నాడు. 'నీటిరిక్క=పూర్వాషాఢా నక్షత్రము' శ. ర 'పూర్వాషాఢ' అనడానికి ప్రమాణం చూపబడలేదు. కాన శంకకు అవకాశం ఇస్తుంది. 'పూర్వాషాఢా జలం తోయ ముదకం చాప ఏవచ' అనే ముహూర్తదర్పణంబట్టి పూర్వాషాఢకు జలము, తోయము, ఉదకము పర్యాయపదాలని స్పష్టపడుతుంది. సలిల శబ్దం వీటికి పర్యాయమే కాబట్టి పూర్వాషాఢను సలిల నక్షత్రమని శ్రీ నాథుడు అనివుంటాడు. ఇది విషయాంతరం.

## ధి క్క రిం చు

"వీరి నోరులు, ధిక్కరించుట లోకహితంబుగాదు' అని భారతంలో ముద్రితం (కర్ణ 3—253) యతి భంగం పరిష్కర్త గమనించలేదు. అన్ని ప్రతులలోను ఇలాగే ఉన్నదేమో! పాఠాంతరమైనా చూపబడలేదు. అసలు పాఠ నిర్ణయ విషయంలో ఎక్కువ ప్రతులలో వుండడం అన్ని ప్రతులలోన్న

ఒకే రీతిగా వుండడం సర్వత్ర గ్రాహ్యలుకావు. "వీరి నోరు ల ధీకరించుట లోకహితంబుగాదు" కని పాఠం కావచ్చు.

## జ టా జూ టు

"త్రపుసీ కుసుమాభరణా

కపర్ది జటాజూట కోటిఘటిత శశాంకా. భీమ 6. 7 ఇక్కడ రెండవ పాదంలో గణభంగం—'కవిపాఠమిదే యగునా' అన్నారు. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. పాఠ నిర్ణయం చేయలేదు. 'జట' అనే అకారాంత శబ్దం ఇట కని ప్రయుక్తమేమో. "జట Jata mfn. wearing twisted locks of hair, g. Arsa Adi; m. Metrically for జటా Hariv 9551" (williams)

"అర్శ ఆదిభ్యోచ్' (సి. కౌ. తద్ధిత 1933) అర్శాం స్యస్య విద్యన్తే అర్శసః ఆ కృతి గణోయమ్" "అర్శస్ ఉరస్ తున్ద చతుర కవిత జటా ఘటా ఘాటా అభ్ర అభ కర్దమ అమ్ల లవణ.....ఇత్యర్శ ఆదిరాకృతి గణః" (గణపాఠః 193) 'జట' ధాతువుపై అర్శ ఆద్యచ్ ప్రత్యయము విధించిన 'జట' అను, అకారాంతము సిద్ధించును. కాన "కపర్ది! జట జూట కోటి ఘటిత శశాంకా" అను రీతిని కవిపాఠముండునని తోచుచున్నది. ఈ సందర్భంలోనే శ్రీ శాస్త్రిగారు శ్రీనాధుడు 'అ'కారాంతమైన 'త్రపుసా' శబ్దమును అకారాంతముగా ప్రయోగించినాడన్నారు. "త్రపుసః అ. పు (1) త్రపుకర్కటీ (2) ఇంద్రవారుణీ తె (1) ములుదోస (2) పెద్ద పాపర చెట్టు" అని సర్వశబ్దసంబోధినిలో 'అ' కారాంతత్రపున శబ్దం చూపబడి వున్నది. సూ. ని. లో ఇదే కాక త్రపుసమ్, త్రపుసీ అనేవి కూడా లేవు!

## వా ణి య త్త ను

ఎఱ్ఱన హరివంశములో తిక్కనను ప్రశంసిస్తూ వ్రాసిన "తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదునా" అనే పద్యంలో "వాణియ, త్తను నీతం డొకరుండునా జను మహాత్వాప్తిన్ గవి బ్రహ్మనా" అని యున్నది. 'వాణియత్తను' అంటే అర్థం ఏమీ లేదు. ఇది "వాణి భర్తను" అయివుంటుంది. "భర్తయును= భర్తను" కావడం అనగా 'యు' వర్ణంలోపింపజేయడం ఎఱ్ఱన కును సమ్మతమే. 'నీ వేమిని వేగిరపడక' (హరి. పూ 8—110 ప్రౌఢ శబ్ద 116 సూ.) అని హరివంశంలోనే ప్రయోగించి నాడు. తిక్కనాదులు కూడా ప్రయోగించినారు. కాన "వాణి భర్తను" కవిప్రయుక్తం కానోపును. ఈ పద్యంలో "మహాత్వాప్తిన్' అనే చోట 'మహత్వ+ఆప్తిన్' అని పదచ్ఛేదంచేస్తే అఖండయతి అవుతుంది. మహత్ +వాప్తిన్, కవ్యభిమతమేమో "అవ +ఆప్తి=అవాప్తి" అనే చోట 'అవ' అనే ఉపసర్గంలోని 'అ' లోపించి 'వాప్తి' కావచ్చు.

## పుంగలపిండము

"మలమయపుంగలపిండము కలజలధుల నీళ్ళ నెల్లఁ గడిగినఁదాని నిర్మల మగునే" ప్రబో 3—14. ఇట 'పుంగల పిండము' దుర్గ్రాహ్యముగా వున్నది. ప్రబోధ చంద్రోదయము 1900 లో ప్రథమ ముద్రణం పొందింది. పునర్ముద్రణ భాగ్యం లభించినట్లు లేదు. మూలంలో "మలమయపుద్గల పిండే సకలజలైరపి కీదృశీ శుద్ధిః" అని యున్నది. కాన "మలమయ పుద్గల పిండము" సరియైన పాఠమని నిర్ణయించవచ్చు.

## ఎడమ—తము

క. దీవన కెడమయుఁ గాతయుఁ
గావుతమును దెలుఁగులందుఁ గలవండ్రు మహిన్
శ్రీ వెలుగోడ మధిపుఁడు మే
ల్గావించుంగాత మేలు గావుత మనఁగన్

('ఆంధ్ర భాషా భూషణము) ఇది శ్రీ మల్లాది సూర్య నారాయణశాస్త్రిగారు వ్రాతప్రతులలో వున్నట్లు ప్రకటించిన పాఠములతోడి పద్యం. ఈ కేతన పద్యం ముద్రణంలో మారి పోయిందని శ్రీ మల్లాదివారన్నారు. "ముద్రణములోనేకాదు వ్రాతప్రతులలోను మారిపోయినది. అట్లు మారిన పాఠమే అది" అని చెప్పి శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'ఎడమయు వెలుఁగోడము' అప పాఠాలనీ ఎడుమును, వెలిఁగోడుము' సాధు పాఠాలనీ అన్నారు. 'ఎడుమును' అన్నకంటె 'ఎడుమయు' సరియైన దనడం ఉచిత తరం. ఏమైనా దీనిలో 'మ'కారస్థితి సర్వ సమ్మతముగా కనబడుతున్నది. 'తము' ప్రత్యయవిషయంలో సూత్రం అభిప్రాయ భేదం వున్నది. ఈ పద్యం వావిళ్ళముద్రణంలో యిలా వున్నది.

క. దీవెన కెడమయుఁ గాతయుఁ
గావుతయున్ దెలుగు కవుల కబ్బంబులలో
శ్రీ వెలిఁగోడ మధిపుఁడు మే
ల్గావించుంగాత మేలుగావుత యనగన్.

ఇందులో 'కాత కావుత'అని కళలుగా ముద్రితం. 'కావుతము' అని లేకపోవడం విశేషం. 'కావుతము' అన్న దానిలోని మకార స్థితి ముద్రణాలలోను తాళపత్రాలలోను ఉన్నది. ఇది సామ్యభ్రమవల్ల వచ్చినదని ఒక మతం. 'ఎడుమ'లోని 'మ'కారస్థితి డుమకాతే' అనే ఆథర్వణమునుబట్టి చూచినా 'ఆశిషికావుత' అనే చింతామణి సూత్రంబట్టి ఆలోచించినా అంగీకరింపదగినదిగా వున్నది. తాళపత్రమాతృకలు ముద్రణములు దీనిని బలపరుస్తున్నాయి. పై కేతన పద్యంలో కూడా నిర్వివాదముగా 'మ' కారస్థితి దీనితో కనబడుతుంది. ఇక 'కావుతము' విషయంలో తాళపత్రమాతృకలు ముద్రణములు సాక్ష్యమిస్తున్నాయి. కానీ యీ రెండు సాక్ష్యములు సాకల్యముగా యథాస్థితముగా అంగీకరింపదగ్గవి కావు. శాసనాలు అలాంటివే. కాబట్టి యివి సామ్యభ్రమవల్ల యేర్పడ్డవే అనడం సముచితం. "ఉనుదురులకు మీఁద నొగి కాత యున్న" అని కావ్యాలంకారచూడామణిలో ఉన్నట్లు ఉభయ పక్షాలవారు వ్రాస్తున్నారు. 'కావుతము' అతడు కూడా చెప్పలేదు. 'కాత'అనే కళారూపం ఆంధ్రభాషాభూషణముతోపాటు కావ్యాలంకారచూడామణిలోను పేర్కొనబడిఉన్నదన్నమాట. "డుమకాతే" అనే ఆథర్వణంలోగాని 'ఆశిషికావుత' అనే చింతామణిలోగాని 'కావుతము' పేర్కొబడిలేదు. ఆఖరికి ఆంధ్ర భాషార్ణవంలో కూడా "పోచుఁగాత యనంగ" ఇత్యాదిగానే ఉన్నట్లు ఉదాహరింపబడింది. కాగా "కావుతము" అన్నది అపపాఠం.

క. దీవెన కెడుమయుఁ గొతయుఁ
గావుతయున్ దెలుగుఁ బందుఁ గలవం డ్రు మహిన్
శ్రీ వెలిఁగెడు మధిపుఁడు మే
ల్గా వించుంగొత మేలుగావుత యనగన్''

అని కేతనపాఠం అయివుంటుందని నా యభిప్రాయం. ఎడున్ కొతన్ కావుతన్ అనేవే కాకుండా ఎడుమ, కొత, కావుత అనేవి కూడా వున్నాయని కేతన ఆశయం కానోపును.

## ప్రేక్షచ్ఛాత్రులు

భీమఖండములో 'ప్రేక్షచ్ఛాత్రులు భీతిబొందఁ గడు సుద్రేకించి హట్టంబునన్' (భీమ 2—102) అని అన్ని ముద్రణాల లోను వున్నది. పాఠాంతరం చూపబడలేదు. ఏ పరిష్కర్తకు 'ప్రేక్షత్' అనే శత్రంతం అసాధువనీ అందుచేత అది కవిప్రయుక్తం కాదనీ స్ఫురించనేలేదు. విలియమ్సులోను సూర్యరాయ నిఘంటువులోను 'ప్రేక్షి' శబ్దం చూపబడి వున్నది. కాన 'ప్రేక్షిచ్ఛాత్రులు' కవి పాఠం కావచ్చు. కానీ 'ప్రేక్షా' శబ్దానికి ఇన్ ప్రత్యయం విధించబడలేదు. "వ్రీహ్యాదిభ్యశ్చ (సి. కౌ. తద్ధిత (1923).....శిఖామాలా సంజ్ఞాదిభ్యఇనిః...." ధాతు పాఠములో "వ్రీహిమాయాశాలా శిఖా......ఇతివ్రీహ్యాది" అని ఉన్నది. కాబట్టి ప్రేక్షాశబ్దాన్ని యిందులో చేర్చవచ్చునా? అని సందేహించడానికి అవకాశం ఉన్నది. ఐతే విలియమ్సులో "ప్రేక్షిన్ mfn looking at...MBH; R. ctc..." అనిమహాభారత రామాయణాదులలో ఇది ప్రయుక్తమైనట్లు సూచితం కావడం వల్ల దీనిని సమ్మతించవచ్చు. లేదా ప్రేక్షాచ్ఛాత్రులు" కవి పాఠం కావచ్చు. "ప్రేక్షా = ప్రేక్షతో కూడిన, ఛాత్రులు" అని మధ్యమపదలోపి సమాసముగా గ్రాహ్యం.

ఈ పాఠగ్రంథులను విప్పడంలో నాకు తోచిన అభిప్రాయాలు వెల్లడించినాను. పాఠనిర్ణయం అసిధారావ్రతం. ఇందులోని గుణదోషాలకు ప్రాజ్ఞలోకమే ప్రమాణం.

# కేయూర బాహుచరిత్రలో ఆశ్వాసాద్యంతపద్యములు

శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

ఏప్రిలునెల భారతియందు కేయూరబాహు చరిత్రము అను వ్యాసములో విశేషములు అను శీర్షిక క్రింద శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు కేయూరబాహుచరిత్రలోని ఆశ్వాసాద్యంతపద్యములు కొన్ని సంబోధనాంతములుగా మార్చవలయునని సూచింపగా మేనెల భారతియందు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మార్పనవసరము లేదని సోపపత్తికముగా సమాధానము చెప్పిరి. ఈ విషయమున నాకును కొంత చెప్పవలసియున్నది. దానిని మనవి చేయుదును.

ఈనాడు సామాన్యముగా మనకు కావ్యములలో నాశ్వాసాద్యంతపద్యములు సంబోధన విభక్తులతో కనుపట్టినను కుమారసంభవ, నిర్వచనోత్తరరామాయణము లందును దశకుమార చరిత్ర కేయూరచరిత్ర లందును నట్లుకాక అవి భిన్న విభక్తులతో కనుపట్టుచున్నవి. ఈ విభక్తులలోని ప్రణాళిక కూడ కొంత భిన్న మార్గముననే నడచినది. ఆశ్వాసాది పద్యము వెంటనే తరువాతిపదము ఏ విభక్తియం దుండునో ఆ విభక్తియందే యా యాశ్వాసాది పద్యమును దాని ముందరి యాశ్వాసాంతపద్యములును నుండును. దీనిని శ్రీ కోదండరామయ్యగారును జెప్పియేయున్నారు. నేనును దీనినిగురించి మే భారతిలో "షష్ఠ్యంతముల పుట్టుపూర్వోత్తరములు" అను వ్యాసములో చర్చించియున్నాను. కాని యొక విషయము.

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు పేర్కొన్న నాలుగు కావ్యములలోనే కాదు, మరియొకదానియందును నీభిన్న విభక్తులతో నాశ్వాసాద్యంత పద్యముల రచించు విధానము కలదు. అది పింగళి సూర్యనార్యుని ప్రభావతీప్రద్యుమ్నము దానిలోని ప్రణాళికయు సరిగా పై రచనముల వంటిదే. దీనిని గూడ నా వ్యాసమునం దిదివఱకే నేనిచ్చియున్నాను.

పై గ్రంథములలోని యీ ప్రణాళికను చూచి నప్పుడు కృతిపతులు కృతిశ్రోతలుగాగూడ గ్రహింపబడని కావ్యములలో నిట్టివిధమున నాశ్వాసాద్యంత పద్యముల గూర్చుట ప్రాచీన సంప్రదాయమై యుండునని నేను నా వ్యాసమున నిదివఱ కూహించియుంటిని. దానిని గుఱించి విమర్శకులు ఆలోచింపవలయునని వేడుచున్నాను.

లాక్షణికులలో నాశ్వాసాద్యంతపద్యము లీ విభక్తులలో నిట్లుండవలెనని చెప్పినవారెవరు నున్నట్లు నాకు కనుపట్టలేదు. కాని చిన్నయసూరి తన సూత్రాంధ్రవ్యాకరణమును నొక అసమగ్రరచనలో నీ యాశ్వాసాద్యంత పద్యరచనమును గుఱించి రెండు సూత్రముల రచించినట్లు ఆంధ్ర సాహిత్య పరిషన్ముద్రిత ప్రతినిబట్టి తెలియుచున్నది. అందలి సూత్రము లివి: "ఆశ్వాసాన్తే వివక్షితైకవిభక్త్యా విశేషణైర్మంగళం కుర్యాత్" ఇది యాశ్వాసాంతములను గుఱించిన సూత్రము. "తదుప ర్యాదౌ విశేషంతైః" ఇది యాశ్వాసాది పద్యమును గుఱించినది.

చిన్నయసూరిగారు సూత్రములలో సంబోధనాంతము లని స్పష్టముగా జెప్పక పోవుటకు గారణము ఆశ్వాసాద్యంత పద్యములు కొన్ని భిన్నవిభక్త్యంతములతో నుండుటయే యనుట స్పష్టము. కాని సూరిగా రివి యీ విభక్తులలో నిట్లుండవలయునని కాని యివి యిట్లుండుటకు కారణ మిది యని కాని వచింపక యస్పష్టముగా నొకేవిభక్తియందు మాత్రమే యుండవలయునని వ్రాయుటచే నాయన దానిలోని కంతకన్న లోతుగా వెళ్ళలేదని చెప్పవలసియున్నది.

ఏమయినను నిట్లీ యాశ్వాసాద్యంత పద్యములు సంబోధనాంతములతోకాక భిన్నవిభక్తులతో వ్రాసినవారు చాల కొద్దిమంది మాత్రమే యుండుటకు గారణము ఆ విధానములోని డొంకతిరుగుడుతనమే యనుటలో సందేహము లేదు. ఇట్టివానిలో కుమారసంభవ మొక్కదానియందు తక్కినవానికి సమన్వయము కుదుర్చుట కష్టకార్యము. కనుకనే యీ విధానము రాను రాను అంతరించిపోయినది.

# గ్రంథవిమర్శనము

## శ్రీడాభిరామము

శ్రీనాథుని వీధి నాటకము—వినుకొండ వల్లభరాయకృతిగా రచితము. పరిష్కర్త : శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. ప్రకాశకులు : మేనేజరు, మణిమంజరి, హైదరాబాదు—20. డబులు క్రౌను పుటలు 97+195+23 వెల వెల సాదాప్రతి ఎనిమిది రూపాయులు. లైబ్రరీ ప్రతి పది రూపాయులు.

ఆంధ్రుల సాంఘిక చరిత్రకు పనికివచ్చు కొలది గ్రంథములలో శ్రీనాథుని క్రీడాభిరామము పేర్కొనదగినది. దీనిని తొలుత శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు క్రీ. శ. 1909లో ప్రకటించి యాంధ్రులకు మహోపకారము గావించిరి. తరువాత శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తంజాపూరులోని సరస్వతీ మహల్ పుస్తక భాండాగారమున నప్పటికే తునాతునకలై యుండిన తాళపత్ర ప్రతిని జాగ్రత్తగా పరిశీలించి చక్కని పాఠములతో విపులమగు పీఠికతో నీ గ్రంథమును శృంగార గ్రంథమాల పక్షమున క్రీ. శ. 1928 లో మరల ప్రకటించిరి. పునర్ముద్రణము కొరకై శ్రీ శాస్త్రిగారే స్వయముగా సంస్కరించుకొని యుండిన ప్రతి ననుసరించి శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారు క్రీ. శ. 1952లో తిరిగి దీనిని ముద్రించిరి. తదుపరి శ్రీ బండారు తమ్మయ్యగారిచే పరిష్కరింపించి శ్రీ వావిళ్లవారు క్రీ. శ. 1953 లో దీనిని ప్రకటించిరి. ఇట్లీ యుత్తమ గ్రంథ మింతవరకు నాలుగు ముద్రణముల నందినది. ఇప్పుడు వెలువడిన యీ ముద్రణ అయిదవది. శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారు ప్రకటించిన గ్రంథమున కిది రెండవ ముద్రణము.

ఇందు పూర్వ ముద్రణములో చేరని—శ్రీ శాస్త్రిగారు గుర్తించుకొని యుండిన సంస్కరణములును, విశేషములును చేర్పబడినవి. 'పండితులకు పనికివచ్చు రీతిని సమగ్రముగా' వెలయింపబడిన యీ ముద్రణము పెక్కు తెరగుల పూర్వ ముద్రణముల కన్న మిన్నయై యొప్పుచున్నది.



సులువుగా సంప్రతించుట కనువగునట్లు విషయసూచిక యందు గ్రంథమున కనవచ్చు రీతిని ఒక విషయక్రమమును అక్షరక్రమము ననుసరించి మరియొక విషయానుక్రమణికయు నొసగబడినవి. ఓరుగల్లు కోట పునాదుల ప్రణాళిక నొకదానిని ఇందు గ్రంథమున కిరువైపులను అట్ట లోపలి భాగమున ప్రకటించి యందు కథానాయకులు పర్యటించిన ప్రాంతమును గుర్తించుటలో ప్రకాశకులు తీసుకొనిన శ్రద్ధ మిక్కిలి ప్రశంసింపదగి యున్నది. గ్రంథము చివర ఆధునిక పద్ధతి ననుసరించి పెక్కు సూచికలు పొందుపరుపబడినవి. క్రీడాభిరామములోని పద్యముల కొక యకారాది సూచికయు, పీఠికలోను, అనుబంధములలోను గల గద్య పద్యముల సూచికయు, శబ్దానుక్రమణికయు, పరిష్కర్తలు పాఠభేదములు అను పేర నాయా పరిష్కర్తలు పద్య పాఠముల విషయమున చేసిన నిర్ణయములతోడి సూచికయు నిందు క్రొత్తగా సంతరింపబడినవి.

శ్రీ శాస్త్రిగా రీ మేలి గ్రంథమునకు వెలయించిన వెలలేని పీఠికకనుబంధములుగా వారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధనాలయ పత్రికయందు ప్రకటించిన 'కాకతి'రిఅను వ్యాసము—దవనపున్నమను గూర్చిన వివరమునకు ఆకరములు—శ్రీ శాస్త్రిగారు 'భారతి' లో ప్రకటించిన 'అవీ, యివీ' యను వ్యాసములో క్రీడాభిరామమునకు సంబంధించిన భాగములతోడి వ్యాసము నిందు ప్రకటింపబడినవి. ఇవి పూర్వ ముద్రణములో కూడ కలవు.

ఇందు నూతనముగా శ్రీ శాస్త్రిగారి పుత్రులగు శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు ప్రధానముగా శ్రీ బండారు తమ్మయ్యగారు శ్రీ శాస్త్రిగారి క్రీడాభిరామ పీఠికకు సంబంధించి చేసిన యాక్షేపములకు సమాధానముగా పొందుపరచిన వ్యాస మొకటి పీఠికానుబంధముగా చేర్పబడినది. వంశక్రమము, కాలము, కర్తృత్వము, ఇది వీధి నాటకమా ? ప్రబంధమా ? పరిష్కర్తలు—పాఠభేదములు, కాకతమ్మ యను శీర్షికల క్రింద నాయా విషయములు విపులముగా చర్చింపబడినవి. వల్లభరాయనికి క్రీడాభిరామముతో గల సంబంధ మెట్టిదో వివరించుచు శ్రీ ఆనందమూర్తిగారు 'వల్లభరాయ డా వీథిని (ప్రేమాభిరామమును) ప్రదర్శన యోగ్యమగు రూపకముగా దెలిగించి యుండు ననుకొందును .... వీధిని వీధిగానే మూలము ననుసరించి 'తెనుంగుబాస' లో కవితలో కాక ప్రదర్శన కనుకూలముగా వచనమున గాబోలును వల్లభరాయుడు రచియించి బహుశః మోపూర్రు భైరవుని

తిరునాళ్ల సందర్భమున ప్రదర్శింపించి యుండును..... వల్లభరాయడు కవి యశోలోభమున విభవ మొసగి కోరగా నాతడుద్యమించి యనుసరించిన క్రీడాభిరామ వీథినాటకమును ప్రబంధీకరించి యుండును అని వ్రాసిరి. ఇందు కుపబలకముగా శ్రీనాథుడు కాటమరాజు కథ, పలనాటి వీర చరిత్రలను ప్రబంధీకరించుటను దృష్టాంతీకరించిరి. ఇది కేవల మొక యభ్యూహము మాత్రమే. వల్లభరాయని యనుసరణము 'వచనము' లో నని యనుకొనవలసిన పని యేమి? సంస్కృతమున వీథి నాటకములో శ్లోకములు గూడ నుండును గదా! గద్యపద్య మయములగు చంపూ నాటకములను గూడ ప్రబంధీకరించుచుండిన కాల మది. కేవల వచన నాటకము లానాడు ప్రదర్శింపబడుచుండినవని నిశ్చయముగా—ప్రామాణికముగా తెలియవచ్చునంతవర కీయూహ నిజము కాజాలదు. అట్లుగా నూహించుట సాహసమే యనుకొందును.

ఇది వీథినాటకమా? ప్రబంధమా? యని చర్చించుచు శ్రీనాథుడు వల్లభరాయని నాటకానుసరణమును అతని పేరున ప్రబంధీకరించినాడని చెప్పి యందులకు కొన్ని యుపపత్తులను చూపిరి. రావిపాటి త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామ వీధి నాటకమునకు శ్రీనాథుడో—వల్లభరాయడో మరికొన్ని విషయములు చేర్చి చేసిన ప్రబంధానుసరణ మీ క్రీడాభిరామ మనుకొనినచో ఇది వీధి నాటకమా? ప్రబంధమా? యను సందేహమునకే తావుండదు. సంస్కృత నాటకమును చదివి యర్థము చేసుకొని దానిని తెలుగులో ననుసరింపగల పాటి పరిజ్ఞానము కల వల్లభరాయడు వచనములోనే తప్ప పద్యములుగా వ్రాయజాల డనుకొనుట నమ్మదగి యుండలేదు.

'పటు ఝంఝాపవనోత్థప్రదాలయములో' అను పద్యమున శ్రీ తమ్మయ్యగారు చేసిన 'తటి దుద్ద్యోతత' ధారాధర శ్రేణికల్' అను సవరణలు అనవసరములే. మేఘము లా పాంథవనితను బయటివారి కెవరికో చూపెనని యర్థము చేసి కొనుటతో నన్వయము కుదుర్చుకొనుటకై వా రా సవరణలు చేసుకొనవలసి వచ్చినది. శ్రీ ప్రభాకరశాస్త్రిగా రా పద్యము నర్థము చేసుకొనిన తీ రిందు వివరింపబడినది. మెరపుకాంతి (తటి దుద్ద్యోతము) పాంథవనితను మేఘమాలికకు చూపిన దనుట—మూల శ్లోకమునందు లేని—శ్రీనాథు డధికముగా చేర్చిన 'గర్జావచః ప్రౌఢిమన్' అను మాట సరిగా నర్థమున కతుకక యింకను చిక్కు గొలుపుచునే యున్నది. శ్రీనాథుడు చాపల్యముచే పద్యమును సాగదీయుటవలన నేర్పడిన యవస్థ యిది! 'వారణసేయ' పద్యానువాదము కూడ నిట్టిదే యయినది.

'తమ్మడిసాని (కూతుం) గూర్పు నేర్పు అనుచో శ్రీ తమ్మయ్యగారు చేర్చిన 'కూతు' అనవసరమే. 'తమ్మడిసాని కూతు' అని కాక స్పష్టార్థమై వా రచ్చట 'కూతు' పదమును జేర్చి యుండినచో తప్పు లేదు. కాని పూజరిసాని తల్లి యన్నట్లు తమ్మడి సాని కూతురన్నట్లు ప్రయోగింపబడిన దనుట సరికాదు. అవి రెండును పర్యాయములుగానే ప్రయోగింప బడినవి. పూజరిసాని యన్నను—తమ్మడిసాని యన్నను నర్థ మొక్కటే. ఆ ఘట్టము కొంత చిక్కునే గొలుపుచున్నది. కొంత వివరింతును. గోవింద శర్మయు, టిట్టిభసెట్టియు 'గూఢ వివిక్తంబును, బూర్వ పరిచితంబునుం, బురుష శూన్యంబును, వివాహకాలోచిత వృత్త స్తనభార వివిధ విలాస విప్రవాస కన్యా సనాథంబును, విశ్రమ స్థలంబును నైన యొక్క తమ్మడిసాని మందిరంబున విడిసిరి. (273) ఇట తమ్మడిసాని పూజరిసానియే. కూతురే యని చెప్పుటకు బలము చాలదు. ఆ పూజరివిధవ చేత గోవిందశర్మ కామమంజరికి కబురంపెను. (273) కామమంజరి వీరభద్రేశ్వరరార్చనావిధి నెపమున తమ్మడిసాని మందిరమునకు వచ్చినది. (281) అజారదంపతులు (కామ మంజరీ గోవిందశర్మలు) పూజరివారి యింట ముంగిట వెన్నెల బైట నుండి టిట్టిభునకు తమ్మడిసాని కూర్పు నేర్పు విచారించిరి. ఈ తమ్మడిసాని కన్నెరికము చెడని కూతురు. ఈమెయే 287, 288 పద్యములలో వర్ణింపబడినది. వారు పూజరి సానిని సన్నపు టెలుగున బిలిచిరి. కనకనిష్కముతోడ 'గర్భాగారంబు వీడియం బచ్చేడియ చేతిలోనం బెట్టిరి. ఇక్కడ నచ్చేడియ' తల్లియే. ఆమె ప్రక్కనే కూతురు నిలబడి యున్నది. కాబోలు! ఆమె నాపాదమస్తకము చూచి వర్ణించిరి (286) తరువాత సన్న చూపులతో పూజరిసానిని పిలిచిరి. పరిరంభ పణముగా పసిడిటంకము నిచ్చి 'టిట్టిభుని తోడ నేడు కూడింపు కూతు' అనిరి. కన్నెరిక ముడుప ప్రత్యేకముగా మరి రెండు పొన్నాటంకము లిప్పింతు మనిరి. పూజరిసాని బిడ్డను వెడ్డువెట్టి టిట్టిభుని చేతి కిచ్చిరి. 'టిట్టిభుండు విన నిట్లనియె (291)—'మొక్కి రనురాగ సంపద మూరి బోవ, జార జాయాపతులు నిండు జందురునట' అన్వయము కుదురుటలేదు. 291 వచనము తరువాత గ్రంథపాతమో మరి ఏదో యుండున ట్లున్నది. ప్రత్యంతరము దొరికినగాని యీ సందేహములు తీరవు.

'కీసిన వెదురుసలాకల'—'గీసిన' అని మార్ప నక్కర లేదు. తమిళమున కీయు, కీత్ పరుషాదిగానే యున్నవి. కాని యది పరుషాది యనుటకు శ్రీ ఆనందమూర్తిగారు నవనాథ

చరిత్రమునుండి యొసగిన ప్రయోగము మాత్రము దాని నిశ్చాయకము కాజాలదు.

''బసవుగా ముసుగిడ యొర దొంగడియు గీసిన గుదియయు''

ఇది కీసిన యని గాని, గీసిన యని కాని రెండు విధములుగాను నుండవచ్చును.

'చెట్టులు చేమలు నేమి గల్గినన్ బతిచెడి సంచరించెదవు' అనుచో శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పాఠమే సరసము. కాని యిచట కొంత వివరించి యుండవలసినది. 'చెట్టులు జేమలు నేమి గల్గినన్' అని యుండవలెను. పదము 'పతిచెడి' యనియా ? 'బతిచెడి' యనియా ? అర్థమెట్లు ? ఇంకను విచార్యము. సందర్భమును బట్టి విచ్చలవిడిగా, స్వేచ్ఛగా ఒక యర్థము వచ్చుచున్నది.

గొరగపడుచు గావించిన విశేషములను గూర్చి వర్ణించు పద్యమున 'రసనా ప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పేరనుపమలీల' అనుచో శ్రీ వేలటూరి వెంకటరమణయ్యగారు చెప్పిన యర్థమును, శ్రీ ఆనందమూర్తిగారు చెప్పిన యర్థమును రెండును కుదురుటలేదు. గొరగపడుచు తొల్త నీళ్లలో—పళ్లెములో నీరుపోసి యుంచి యందు ముంగరను పడవేయగా మొగ్గ వ్రాలి యా నీళ్లలోని ముంగరను ముక్కున గ్రుచ్చుకొని లేచినది. పిదప ప్రవాళము (పగడము) వలె నెర్రనయిన తన నాలుకను ముందునకు చాచి దానిపై నల్లపూస నుంచి దాని రంధ్రములో దారము గ్రుచ్చినది. ఇది తొలుతటి కార్యమువలెనే మిక్కిలి కష్టతరమైనది. నల్లపూస— పేరనుపమలీల యనియా ? నల్లపూసపేరనియే కాదగును. ఇచ్చట శ్రీ ఆనందమూర్తిగారు చెప్పినట్లు పగడములను, నల్లపూసలను కలిపి గ్రుచ్చుట యొక పెద్ద విశేషముకాదు. అందులో నద్భుతావహకృత్య మే మున్నది ?

కాకతమ్మను గూర్చి వ్రాయుచు 'కాకతమ్మ విగ్రహము క్రింది వాహనము శ్రీ శాస్త్రిగారు వ్రాసినట్లు వరాహమునే తోపించుచున్నదని వ్రాసిరి. ఈ సందర్భమున పూజ్యులు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు 'కాకతమ్మ స్వరూపం' అన్న పేరుతో నిటీవల భారతిలో ప్రచురించిన వ్యాసములోని యీ వాక్యములు గమనింపదగి యున్నవి.

''పీఠమునకు దిగువ వరాహ మున్నదని వా రన్నది కూడా మొదటిచూపుతోనే. మొదటి చూపున కది వరాహంగా కనిపించినా పరిశీలించిచూస్తే నక్కని చెప్పడానికి కూడా సావకాశం లేకపోలేదు. పీఠం క్రింద స్థలాభావంవల్ల శిల్పి కాళ్ళు కురుచ చేశాడని భావిస్తున్నాను. మొదటిస్ఫూర్తితో శ్రీ శాస్త్రిగారు కాకతీయరాజుల లాంఛనమైన వరాహాన్ని పేర్కొని యుండవచ్చును. మూతి పొడుగు, కాళ్ళు కురుచ, కాయము స్థూలము, నడుము లావు వరాహాన్ని తలపిస్తున్నది. తోక పొడుగు వంకర, మూతి చివర ఎత్తు సృగాలాన్ని తలపిస్తున్నవి.''

181, 182 పద్యములలో పిల్లికూట మనుదానికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'పెండ్లికూట'మని సవరింపగా శ్రీ తమ్మయ్యగారు దానినే యనువదించిరి. కాని యచట పెండ్లికూటమనుట కెట్టి సందర్భమును కానరాదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు దానిని పెండ్లికూటమని యేల మార్చిరో! 'పచ్చని పిల్లి కూట'మని యుండుటచే నట్లు మార్చిరి కాబోలు! అది 'పల్లికూట'మయి యుండవచ్చునని నా యభిప్రాయము. 'పళ్ళి' యనగా జైన మఠము. అవి ప్రాచీన కాలమున విద్యాలయము లగుటచే నా పదము తరువాత విద్యాలయమునకు పేరయినది. చిత్రశాలలోనే 'పళ్ళికూట' మొకటి యుండెను కాబోలు. అప్పుడైనను 'పచ్చని' యను విశేషణమునకు సార్థక్యమేమి! లేదా—అందరును కలిసి యొకచోట కూడు స్థలమును 'పల్లికూట' మనే పేరుతో పేర్కొనిరేమో! ఇంకను విచార్యము.

వివాదాస్పదములగు నిట్టి స్వల్ప విషయములందు కొన్నిటగల యభిప్రాయ భేదములమాట యెట్లున్నను మొత్తముమీద నీ యుత్తమ గ్రంథమునకు సర్వ విషయ సంపన్నమయిన, సమగ్రమయిన ప్రామాణిక ముద్రణము నిట్లు సర్వాంగసుందరముగా వెలయించిన ప్రకాశకులును, వారి కీ విషయమున నెంతగానో తోడ్పడిన శ్రీ ఆనందమూర్తిగారును మిక్కిలి అభినందనీయులు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సంపాదించి ప్రకటించిన 'ప్రబంధ రత్నావళి' యను సంకలన గ్రంథము కూడ పునర్ముద్రణము నపేక్షించుచున్నది. దానికి కూడ నిట్లే ప్రామాణిక ముద్రణము నొకగాని నచిర కాలమున వెలయించి ప్రకాశకులు భాషావిద్వాంసుల కృతజ్ఞతను చూరగొందురుగాకని కోరుచున్నాను.

'కోదండ'

నృత్యమంజరి రచన: — శ్రీ నటరాజ రామకృష్ణ. ప్రకాశకులు : ఆంధ్ర బుక్‌హౌస్, సుల్తాన్‌బజారు, హైదరాబాద్. డబులు క్రౌను పుటలు 172 + 8 వెల రెండున్నర రూపాయ.

నర్తకులుగా, నాట్యకళా ప్రచారకులుగా, నాట్యశాస్త్ర రచయితగా ప్రసిద్ధిగాంచిన శ్రీ నటరాజ రామకృష్ణ రచించిన గ్రంథ మిది. భారతీయ నృత్య కళను గురించియు, అలంకార శాస్త్రములలోని వివిధ శాస్త్రీయ విషయములను గురించియు ముచ్చటయిన కథల రూపముతో నాంధ్ర ప్రజానీకమునకు తెలియజేయవలెననెడి పవిత్రాశయములో శ్రీ రామకృష్ణగా రిదివరకే నృత్యాంజలి, నృత్యరేఖ, నర్తన మురళి, నర్తన రాణి యను గ్రంథములను ప్రచురించియున్నారు. ఆ కోవకు చెందిన మరొక గ్రంథ మీ 'నృత్యమంజరి. అష్ట విధ శృంగార నాయికలకు సంబంధించిన శాస్త్రీయ విజ్ఞానము కథానికల రూపమున ఈ గ్రంథములో పరిచయము చేయబడినది. ఇవి కేవల మూహాచిత్రలుమాత్రమేకావు. ఉత్తరభారతమంతా పర్యటించి అనేక సంస్థానాలలో ప్రదర్శనలిచ్చి యాంధ్రుల కళా ప్రతిభను వ్యాపింపజేసిన వీరు తమ భారతదేశ పర్యటనలో తను యనుభవమునకు వచ్చిన స్మృతి చిహ్నము లివి. ఇందు రాధిక, సుందరసూాలలో విన్యాసము, కలహాంతరిత, స్వాధీనపతిత, ప్రోషితభర్తృక, భరతనాట్యము—భాగవతము, దరువు, శబ్దము, ఆశించని ఆశ, వకుళాభరణ యను పది యంశములు కలవు. ఇవి కథానికలని పేర్కొనబడినను దరువు, శబ్దము అను శీర్షికలు కలవి శాస్త్రీయ వ్యాసములే కాని కథానికలు కావు. ఆ యా శృంగారనాయికలను గూర్చిన లక్షణాది శాస్త్రీయ విషయము లా యాశీర్షికల

తుదిని ఉదాహరణపూర్వకముగా . నొసగబడినవి. అడవిబాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణవంటి రచయితల యడుగుజాడలలో నభిగమించుచు శాస్త్రీయ విషయములలోని తమ పాండిత్యమును, అనుభవమును కథానికల రూపములో పాఠకలోకమునకు సమర్పించి సాధారణ ప్రజలు కూడ కుతూహలముతో పఠించి నాట్య శాస్త్రజ్ఞానమును సంపాదించునట్లు చేయవలయు ననెడి రచయిత ప్రయత్నము శ్లాఘనీయము. 'కోదండ'

## శ్రీరామకృష్ణ సూక్తి సుధ

ఆంధ్రీకర్త. శ్రీ నేలటూరి—భక్తవత్సలము. డెమ్మీ సైజు 12 × 150 × 590. వెల రు. 7—50. ప్రకాశకులు శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు—4.

మానవజీవితంలో ప్రధానలక్ష్యం పరమార్థ విచారము, ముక్తి మార్గము అని అన్నిమతాలవారూ అంగీకరిస్తారు. దానికి మతమే ప్రధాన సాధనంగా నమ్మతిస్తారు. వివిధ మతాలవారు విభిన్న నామాలతో సంబోధించినా, దేవుడు ఒక్కడే అనిన్నీ, ఏవిధంగా నయినా సరే, భగవద్ధ్యానంవల్లనే ముక్తి లభ్యమవుతుందనీ తత్త్వజ్ఞుల అభిప్రాయం.

మానవులకు ఆత్మీయుల యెడల ఎట్టి అభిమానం ఉంటుందో, మత విషయంలోనూ అభిమానం ఉండడం సహజం! అభిమానమే కాదు. దానితోబాటు ఆదరమూ, పట్టుదలా కూడా ఎక్కువగానే ఉంటాయి. మతాలకు సంబంధించిన వాదవివాదాల్లోను, కలహాలలోనూ ఆత్మత్యాగం చేసినవారూ ఎందరో ఉన్నారు. మత వ్యాప్తికోసం మతాంతరులను భయపెట్టి గాని, ఆశలు చూపి గాని తమ మతంలో కలుపుకొనుటకు ప్రయత్నించడం జరుగుతూ ఉండినది.

భారతదేశంలో అతి ప్రాచీనమైనది వైదిక హిందూమతం. మతాంతరులైన మహమ్మదీయుల ప్రభుత్వ కాలంలో అది బాగా దెబ్బతిన్నది. ఆంగ్లేయ ప్రభుత్వ కాలంలో విదేశీయులైన క్రైస్తవ ఫాదిరీలు మన దేశం వచ్చి, హిందూమతంలోని విషయాలను తమకు తోచినట్లు విమర్శిస్తూ, జనులను తమ మతంలో కలుపుకొనుటకు ప్రారంభించినారు. అట్టి సమయంలో బ్రహ్మసమాజమూ, ఆర్య సమాజమూ ఏర్పడి క్రైస్తవమత స్వీకారం కోసం ఉబలాటపడే జన ప్రవాహాన్ని కొంతవరకూ అడ్డగలిగినవి. కాని సనాతన వైదిక ధర్మం, తత్త్వం మాత్రం జనసామాన్యానికి దురవగాహంగానే ఉండిపోయినది. అట్టి స్థితిలోనే అవతారమూర్తి అయిన శ్రీరామకృష్ణ పరమహంస జన్మించి, స్వయంప్రతిభవల్లనే గొప్ప జ్ఞానియై, ప్రాచీన మహామునుల పద్ధతినే తపశ్చర్యలోను, యోగసమాధిలోను నిమగ్నుడై భగవత్సాక్షాత్కారం పొంది, హిందూమతతత్త్వాన్ని తన శిష్యులైన వివేకానందాదుల మూలంగా ప్రపంచం అంతటా వ్యాపింపజేసినాడు.

సామాన్యంగా ఒక మతంవారికి మరొక మతం అంటే మొదటనే ఒక నిరసనభావం ఏర్పడుతుంది. ఆ మతంలోని తత్త్వాన్ని తెలుసుకోవాలనే ఆసక్తి గాని, ఎవరైనా చెప్పితే వినే ఓపిక గాని ఉండడం అరుదు. శ్రీ రామకృష్ణ పరమహంస సర్వ మతసహనబుద్ధితో అన్ని మతాల తత్త్వాలనూ ఆకళించుకొని, ఆయా మతపద్ధతులలోనే సాధన సాగించి కృతకృత్యుడైనాడు. భగవత్సాక్షాత్కారం కోసం తహతహపడే శిష్యకోటికి తన్మార్గాన్ని బోధించాడు. సంసారంలో ఉండే తరించడానికి అనుకూలమైన మార్గాలను గృహస్థ శిష్యులకు ఉపదేశించాడు. అన్ని మతాల తత్త్వాలు హిందూమతంలో ఇమిడియున్న సంగతి వివరించాడు. సంసారసంబంధంలేని ఇతర యోగులవలె కాకుండా దేశంలోని ప్రజలకు కూడూ, గుడ్డా ఉన్నప్పుడే—వారికి జీవితం దుర్భరమైనదని తోచని స్థితిలోనే మతాన్నిగురించి తెలియజేస్తే తెలుసుకునే అవకాశం ఉంటుందని, మానవ సేవయే మాధవసేవ అనీ చాటిన అనుభవయోగి శ్రీరామకృష్ణుడు! నిర్గుణోపాసననే కాకుండా సగుణోపాసననూ, ఏకదేవతారాధననే కాకుండా అనేక దేవతారాధననూ సమర్థించి విభిన్నదృక్పథం కలవారిని అందరినీ సంతృప్తిపరచే సామర్థ్యంతో అఖండ విజయం సాధించి, ఆ మహామహుడు క్షీణదశలో ఉన్న హిందూమతమును పునరుద్ధరించెను.

ఈవిధంగా తాను, తరించి, లోకం తరించేటందుకు అనుకూలమార్గాలను కూర్చిన పరమహంస జీవిత చరిత్రయూ, ఆయన ఆయా సమయాల్లో ప్రసంగవశమున తెల్పిన మహా వాక్యములూ "శ్రీ రామకృష్ణ సూక్తి సుధ" అనే పేరుతో ఈ గ్రంథంలో వివరంగా ఇయ్యబడినవి.

ఇది అనువాదమయినా, పఠితలకు సులభగ్రాహ్యమయ్యేటట్లు సరళ శైలిలో చక్కగా రచింపబడుటవలన స్వతంత్రగ్రంథంగానే కానవస్తున్నది. విషయావగతికయి వాక్యాలు విసంధులుగా కూర్చబడినవి. ఇందులోని అమృతమయసూక్తులన్నీ చక్కని ఉదాహరణలతోనూ, కథలతోనూ జతపరుపబడుటచే సామాన్యజనులకు కూడా సులభగ్రాహ్యం అగుచున్నది. సనాతన హిందూధర్మ తత్త్వమునూ, ముఖ్యంగా శ్రీరామకృష్ణ పరమహంస బోధించిన మతాన్నీ తెలిసికొనుటకు ఈ గ్రంథం మిక్కిలి ఉపయోగించగలదు. శ్రీ నిఖిలానందస్వామివారి ఆంగ్లగ్రంథాన్ని, చక్కగా తెలుగులోనికి మార్చిన శ్రీ నేలటూరి భక్తవత్సలంగారు, దీన్ని ప్రకటించి ఆంధ్రులకు అమితోపకారం చేసిన మదరాసు—శ్రీ రామకృష్ణ మఠంవారున్నూ మిక్కిలి అభినందనీయులు. వివిధ మతాలనుగురించీ, సనాతన హిందూధర్మాన్ని గురించీ తెలియగోరినవా రందరును ఈ గ్రంథాన్ని తప్పక చదువవలసి ఉన్నది.

"అంగీరస"

# వార్తలు

## కాంగ్రెసువాదులకు నిర్బంధ శిక్షణ

కాంగ్రెసువాదుల విద్యాబోధన శిక్షణలను గురించిన నివేదిక ఒకటి అఖిలభారత కాంగ్రెసు సంఘం మే 29 వ తేదీన కార్యవర్గ పరిశీలనకు నివేదించినది.

18 లక్షల రూపాయల వ్యయంతో 7500 మంది పార్లమెంటు కాంగ్రెసు సభ్యులకు, శాసన సభ్యులకు, ప్రదేశ్ కాంగ్రెసు సభ్యులకు నిర్బంధంగా శిక్షణ ఇవ్వాలని ఈ పథకం సూచిస్తున్నది.

అఖిలభారత కాంగ్రెసు సంఘం ఈ నివేదిక ఆమోదించిన మీదట వెంటనే ఇది అమలుపరచాలని శ్రీ రాజగోపాలన్, కేంద్ర ప్రణాళికా శాఖ ఉపమంత్రి శ్రీ ఎస్. ఎన్. మిశ్రాలు కోరారు

## భారతదేశంలో అమూల్యవృక్షసంపద

భారతదేశంలో అమూల్యమయిన వృక్షసంపద కలదనీ, వృక్షశాస్త్రానికి సంబంధించిన అనేకమయిన కొత్త విషయాలు తాము భారతదేశపర్యటనవల్ల అవగాహన చేసుకొన్నామనీ, రష్యానుండి మనదేశం వచ్చిన వృక్షశాస్త్రజ్ఞులు వెల్లడించారు.

ఈ ప్రతినిధివర్గంలో ఆరుగురు సభ్యులున్నారు. వీరి ఉపనాయకులు డాక్టరు పెట్రలపిన్ ఈ సందర్భంలో ప్రసంగిస్తూ అస్సాంలో, దక్షిణ భారతంలో, కొన్ని హిమాలయ ప్రాంతాలలో అరుదైన మొక్కలు కొన్ని కనిపించాయని అన్నారు. తమవెంట 6 వేల రకాల మొక్కలు, వెయ్యి రకాల విత్తనాలు తీసుకు వెడుతున్నామనీ, వానితో నూతన పరిశోధనలు కొనసాగించగలమనీ డాక్టరు పెట్రలపిన్ అన్నారు. వానికి బదులుగా రష్యానుండి భారతదేశానికి అరుదయిన కొన్ని మొక్కలు పంపగలమని అన్నారు.

## చిన్నకారు ఉత్పత్తి

ప్రభుత్వం యాజమాన్యంలో ఉత్పత్తి చేయదలచిన చిన్నకారు ఫ్రాన్స్‌దేశపు 'డాఫీన్' వంటిది అయితే లాభదాయకంగా ఉండగలదని ఈ విషయమై పరిశీలన కొనసాగించడానికి ఏర్పరచిన సంఘం ప్రభుత్వానికి సిఫారసు చేసింది. ఈ కారు గాలన్ పెట్రోలుతో 50 మైళ్ల దూరం ప్రయాణించగలదు. దీనికి నాలుగు తలుపులు ఉంటాయి. ఖరీదు ఆయా సుంకాలు మినహాయిస్తే రు. 5100 ఉంటుంది. ఈ రకం కారులు సాలీనా 50 వేల వరకు ఉత్పత్తి చేయవచ్చును.

## వరకట్నం నిషేధం బిల్లు

ఇటీవల పార్లమెంటు సంయుక్త సమావేశంలో ఆమోదించిన వరకట్ననిషేధం బిల్లుకు మే 24 వ తేదీన రాష్ట్రపతి ఆమోదం లభించింది. ఈ చట్టం అమలులోకి వచ్చే తేదీ గెజెట్ ప్రకటనద్వారా తెలియజేస్తారు. వరకట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం, కట్నం కోరడం ఈ మూడు కూడా ఈ చట్టాన్ని బట్టి శిక్షార్హా లవుతున్నాయి.

1956 వ సంవత్సరపు హిందూ వారసత్వం చట్టం ద్వారా స్త్రీల ఆస్తి హక్కు పెంపొందింప జేయడంవల్ల వరకట్న నిషేధశాసనం కొంత సుకరమయినది.

## అంగోలాలో ఆఫ్రికన్ల దారుణవధ

అంగోలాలో పోర్చుగీసు అధికారుల ఘాతుకాలకు బలి అయిన ఆఫ్రికనుల సంఖ్య 20–30 వేల మధ్య ఉంటుందని బ్రిటిష్ రాజకీయ వారపత్రికలు అంచనావేస్తున్నాయి.

ఈ విషయమై న్యూ స్టేట్స్‌మన్ అన్న వామపక్ష పత్రిక ఇలాగ వ్రాస్తున్నది :

'అంగోలాలో అప్పుడే సుమారు 35 వేల మంది నిరాయుధులయిన ఆఫ్రికనులు మరతుపాకులకు. కార్చిచ్చు బాంబులకు గురి అయి ప్రాణాలు కోలుపోయారు.

మితవాద ధోరణిలో నడిచే 'స్పెక్టేటర్' లో ఒక రచయిత ఇలాగ వ్రాశాడు : 'అంగోలాలో హతులయిన ఆఫ్రికనుల సంఖ్య 20 వేలు అంటే ఇది ఎవ్వరు కాదనజాలరు. అయితే ఆ దేశంలో అమలులో ఉన్న సెన్సారు నిబంధనలను బట్టి ఇదే అత్యధికమయిన సంఖ్య అనడానికి మాత్రం ఎంతమాత్రము వీలులేదు.

స్వతంత్రపంథాలో నడిచే ఎకనామిస్టు ఇలాగ వ్రాసింది: 'అంగోలాలో ఆఫ్రికనుల హత్యాకాండ యథేచ్ఛగా కొనసాగుతున్నది. వేలకువేలు ఆఫ్రికనులు మరణిస్తున్నారు.'

ఈ మూడు పత్రికలలోను సంపాదకీయాలు, తదితర వార్తలు డాక్టరు సాలజార్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించాయి.

---

**Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.**

Bharathi 7th June 1961 Regd. No M. 1856

# భారతి

## ప్రకటన రేట్లు

| వివరము పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | | | |
| 2 రంగులు | ... | రు. 125/- | రు. 100/- |
| ఒకే రంగు | ... | రు. 100/- | రు. 90/ |
| 2 లేక 3 కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 90/- | 75/- |
| లోపలి పేజీలు | ... | | |
| పూర్తి పేజి | ... | 70/- | 60/- |
| అర్థ పేజి | ... | 35/- | 30/- |
| పావు పేజి | ... | 20/- | 15/- |

ప్రత్యేక, స్థానములకు 25% అదనం.

సం|| నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒకకాలం ఇంచికి లేకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-00 |
| 6 మాసముల చందా | ... | రు. 6-00 |
| విడి ప్రతి | ... | రు. 1-00 |

మేనేజరు, భారతి,
మద్రాసు-1.